Tarjumanul Hadees - Part-1
(Telugu)

# హదీసు ప్రబోధిని

(మొదటి భాగం)

సంకలనం

సయ్యద్ మహ్మూద్ హసన్ ఫాజిల్ దేవ్‌బంద్

అనువాదం

యస్.యమ్. ఖాద్రి

## విషయసూచిక

# తొలిపలుకులు

హదీసు ప్రబోధిని గ్రంథాన్ని ప్రచురిస్తున్నందుకు మా ఆనందాన్ని ప్రకటిస్తున్నాం. తర్జుమానుల్ హదీస్ మొదటి భాగం గ్రంథాన్ని సుప్రసిద్ధ ఇస్లామీ ధార్మికవేత్త మౌలానా సయ్యద్ మహమూద్ హసన్ రాసిన గ్రంథానికి తెలుగు అనువాదమే ఇస్లాం ప్రబోధిని. ఈ గ్రంథంలో సాధారణంగా ఒక ముస్లిం ప్రాపంచిక జీవితంలో, ధర్మసంస్థాపనలో ఎదురయ్యే అనేక సమస్యలకు హదీసుల ద్వారా వివరణ ఇవ్వబడింది. హదీసు పరిజ్ఞానం పొందదలిచిన ప్రతి వ్యక్తికి ఈగ్రంథం ఎంతో తోడ్పడుతుంది. ప్రతివ్యక్తి మహాప్రవక్త(స) ప్రబోధనలు అనుసరించి జీవితం ధన్యం చేసుకోగలడు, తోటి ప్రజల జీవితాలను కూడా మెరుగుపరచగలడని మా విశ్వాసం.

- ప్రకాశకులు

بِسۡمِ اللّٰہِ الرَّحۡمٰنِ الرَّحِیۡمِ

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# హదీసు ప్రబోధిని

## ఇహలోకం ఓ చెరసాల

(۱) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَلدُّنْيَا سِجْنُ الْمُؤْمِنِ وَجَنَّةُ الْكَافِرِ۔ (مسلم عن ابی ہریرۃ کتاب الزھد۔ ترمذی ابواب الزھد)

1. దైవసందేశహరులు హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రవచించారు:

"ఈ లోకం 'మోమిన్' (విశ్వాసి) కోసం ఓ చెరసాల. (అదే) కాఫిర్ (అవిశ్వాసి) కోసం ఓ స్వర్గం." (అబూ హురైరా – ముస్లిం, తిర్మిజి)

**సంగ్రహణం:**

దేవుడు దైవప్రవక్త (సఅసం) నిర్దేశించిన ఆంక్షల్ని ఏ మాత్రం జవదాటకుండా మనిషి తన జీవితాంతం వాటికి కట్టుబడి నడుచుకోవడమే ఈమాన్ (విశ్వాసం). అక్రమ సంపాదన, లంచగొండితనం, వ్యభిచారం, అశ్లీలం, అత్యాచారం, అన్యాయం, అసత్యం, దగా, మోసం, దోపిడి, దొంగతనాలు వగైరాలకు దూరంగా ఉండాలి విశ్వాసి. ఇవే అతనికి విధించిన ఆంక్షలు. దైవధర్మం నిర్దేశించిన ఈ మహోన్నత నైతిక విలువల్ని ఆచరించినప్పుడు అతడు సహజంగానే అనేక కష్టనష్టాలకు గురి అవుతాడు. కాబట్టే ఇహలోక జీవితాన్ని మోమిన్ కోసం చెరసాల జీవితంగా చెప్పడం జరిగింది. అతడు ప్రపంచంలో ఓ కళ్ళెం లేని గుర్రంలా ప్రవర్తించడు. ప్రతి పనికి ఉపక్రమించే ముందు, తను ప్రారంభించబోయే పని దైవాన్ని సంతోషపరుస్తుందా లేక ఆయన ఆగ్రహానికి కారణభూతమవుతుందా అని ఆలోచించి మరీ ప్రారంభిస్తాడు.

దీనికి భిన్నంగా, దైవం ఎడల విశ్వాసమే లేని సత్య తిరస్కారి, సర్వ స్వతంత్రుడయి తన ఇచ్ఛవచ్చినట్లు నడుచుకుంటాడు, ప్రవర్తిస్తాడు. పరలోక భావనగాని, సృష్టికర్త ఎదుట

ఓ నాడు నిలబడి తన కర్మలకు జవాబు చెప్పుకోవలసి ఉంది అన్న విశ్వాసం గాని ఉండవు అతనికి. ఈ కారణంగా అతడు ధర్మాధర్మాలను వీడి, నిషిద్ధానిషిద్ధాలతో నిమిత్తం లేకుండా, ముకుతాడు లేని ఆంబోతులా విచ్చలవిడిగా ప్రవర్తిస్తూ తన కోరికలన్నిటినీ తీర్చుకుంటాడు. ఈ ప్రవర్తనే అతనికి ప్రపంచంలో స్వర్గం పొందినంత సుఖాన్నిస్తుంది. కాబట్టే అతడికి (తిరస్కారికి) ఈ లోకం ఓ స్వర్గం లాంటిది అని చెప్పడం జరిగింది.

## ధన పిపాస వినాశకారి

(۲) اِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ بَعَثَ اَبَا عُبَيْدَةَ ابْنَ
الْجَرَّاحِ اِلَى الْبَحْرَيْنِ يَأْتِىْ بِجِزْيَتِهَا وَكَانَ رَسُوْلُ اللهِ
صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ هُوَ صَالَحَ اَهْلَ الْبَحْرَيْنِ وَاَمَّرَ
عَلَيْهِمُ الْعَلَاءَ بْنَ الْحَضْرَمِيِّ فَقَدِمَ اَبُوْ عُبَيْدَةَ بِمَالٍ
مِّنَ الْبَحْرَيْنِ فَسَمِعَتِ الْاَنْصَارُ بِقُدُوْمِ اَبِىْ عُبَيْدَةَ
فَوَافَوْا صَلٰوةَ الْفَجْرِ مَعَ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَ
سَلَّمَ فَلَمَّا صَلَّى رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ انْصَرَفَ
فَتَعَرَّضُوْا لَهٗ فَتَبَسَّمَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
حِيْنَ رَاٰهُمْ ثُمَّ قَالَ اَظُنُّكُمْ سَمِعْتُمْ اَنَّ اَبَا عُبَيْدَةَ
قَدِمَ بِشَىْءٍ مِّنَ الْبَحْرَيْنِ فَقَالُوْا اَجَلْ يَا رَسُوْلَ
اللهِ قَالَ فَاَبْشِرُوْا وَاَمِّلُوْا مَا يَسُرُّكُمْ فَوَاللهِ مَا
الْفَقْرَ اَخْشٰى عَلَيْكُمْ وَلٰكِنِّىْ اَخْشٰى عَلَيْكُمْ اَنْ تُبْسَطَ
الدُّنْيَا عَلَيْكُمْ كَمَا بُسِطَتْ عَلٰى مَنْ كَانَ قَبْلَكُمْ
فَتَنَافَسُوْهَا كَمَا تَنَافَسُوْهَا وَتُهْلِكَكُمْ كَمَا اَهْلَكَتْهُمْ.

(مسلم عن عمرو بن عوف كتاب الزهد- بخاري كتاب المغازي. كتاب الرقاق
كتاب الجهاد- ترمذي ابواب القيامه)

2. దైవప్రవక్త (సఅసం) ఓసారి హ్రజత్ అబూ ఉబైదా బిన్ జర్రాహ్ (రజిఅన్)ను జిజియా వసూలు చేయడానికి బహ్రైన్‌కు పంపారు. ఆయన

బహ్రైన్ నుండి (జిజియాధనం లక్షా ఎనభైవేల దిర్‌హంలు) ధనంతో తిరుగొచ్చినట్లు అన్సార్‌లకు తెలిసింది. వాళ్ళు (తమ సొంత తెగల మసీదుల్లో నమాజుకు హాజరయ్యేబదులు) వచ్చి ఫజ్ర్ నమాజు దైవప్రవక్త (సఅసం) వెంట (మస్జిదె నబవీలో) చేశారు. నమాజు పూర్తి అయిన వెంటనే వారు దైవప్రవక్త (సఅసం) ముందు హాజరయ్యారు. వారిని చూసి ఆయన చిరునవ్వుతో,

“అబూ ఉబైదా కొంత డబ్బుతో వచ్చారని మీరు విన్నారను కుంటాను?” అని అడిగారు. “అవును” అని పలికారు.

“అయితే మీరు ఆనందించే కాలం త్వరలోనే రానుంది అని సంబరపడండి, దైవసాక్షి! మీరు నిరుపేదలుగా మార్తారని నేను భయపడ్డం లేదు. నా భయమల్లా ఒక్కటే. ఐహిక సంపదలు గత ప్రవక్తల సమాజాలకు విస్తృతంగా లభించినట్లు మీకు కూడా విస్తృతంగా లభించవచ్చు. అప్పుడు వారిలాగే మీరూ ధన పిపాసకు లోనై దాన్ని పొందడానికి ఒకరితో నొకరు పోటీపడతారు. విస్తృతమైన ఐహికసంపద, దానిపట్ల అమితమైన ఆకర్షణ మీకు పూర్వం గతించిన వారిని సర్వనాశనం చేసినట్లే ఇవి మిమ్మల్ని కూడా సర్వనాశనం చేసివేస్తాయి.” *(అమ్రూ బిన్ ఔఫ్ – ముస్లిం, బుఖారి, తిర్మిజి)*

**సంగ్రహణం :**

అంటే గతించిన సమాజాలు పతనమవడానికి కారణం ప్రపంచ వ్యామోహమే. దైవప్రవక్త (సఅసం)తన అనుచర సమాజానికి ఈ విషయాన్నే గుర్తుచేస్తూ భయంకరమైన ఈ జాడ్యం మిమ్మల్ని మీ లక్ష్యం నుండి దూరం చేయకూడదు సుమా! అని హెచ్చరించారు. కనుక మీరు ధన వ్యామోహం, విలాసాలు, భోగభాగ్యాలకు దూరంగా ఉండండి. లేకుంటే మీరు మీ నిజప్రభువు, మీ అసలు ధ్యేయాన్ని మరచిపోతారు. విస్మరణ ఏమరుపాటు అనే చీకటి అగాధాలలోకి పోయి పడతారు. ప్రపంచ వ్యామోహమే మీ సర్వనాశనానికి కారణమవుతుంది. సాధారణంగా అపరిమితమైన ధనసంపద అనర్థాలకే దారితీస్తుంది. కనుక ధనవంతుడు ఈ సిరిసంపదల కీడు పట్ల ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండాలి. వాటి భయంకర పరిణామాలకు దూరంగా మసలుకోవాలి.

(۳) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يُوْشِكُ الْأُمَمُ

اَنْ تَدَاعٰى عَلَيْكُمْ كَمَا تَدَاعَى الْاَكَلَةُ اِلٰى قَصْعَتِهَا فَقَالَ
قَائِلٌ وَمِنْ قِلَّةٍ نَحْنُ يَوْمَئِذٍ؟ قَالَ بَلْ اَنْتُمْ
يَوْمَئِذٍ كَثِيْرٌ وَلٰكِنَّكُمْ غُثَاءٌ كَغُثَاءِ السَّيْلِ وَلَيَنْزِعَنَّ
اللّٰهُ مِنْ صُدُوْرِ عَدُوِّكُمُ الْمَهَابَةَ مِنْكُمْ وَلَيَقْذِفَنَّ
اللّٰهُ فِىْ قُلُوْبِكُمُ الْوَهْنَ فَقَالَ قَائِلٌ يَا رَسُوْلَ اللّٰهِ
وَمَا الْوَهْنُ؟ قَالَ حُبُّ الدُّنْيَا وَكَرَاهِيَةُ الْمَوْتِ.

(ابوداؤد عن ثوبان کتاب الملاحم)

3. ముస్లిం సమాజ పతనానికి రెండు కారణాలు : దైవ సందేశ హరులు (సఅసం) ఇలా ప్రవచించారు : "మిమ్మల్ని అణచడానికి ముస్లిమేతర జాతులు త్వరలోనే పరస్పరం ఒకదాన్ని మరొకటి పిలుచు కుంటాయి. విందు భోజనాలకు వెళ్ళేవారు పరస్పరం ఒకర్నొకరు పిలుచు కొని వెళ్ళి భోజనాలపై ఎలా ఎగబడతారో అలా; (వారంతా సంఘటితమై) మీపై దాడి చేస్తారు."

అది విని ఒకతను 'దైవప్రవక్తా! అప్పుడు మా సంఖ్యాబలం అంత తక్కువగా ఉంటుందా?' అని అడిగాడు. "లేదు, అప్పుడు మీ సంఖ్య చాలా అధికంగానే ఉంటుంది. అయితే మీ పరిస్థితి, వరదలు వచ్చినప్పుడు కొట్టుకువచ్చే చెత్తా చెదారం నురుగు కంటే మెరుగ్గా ఉండదు. అప్పుడు అల్లాహ్, శత్రుజాతుల హృదయాల్లో మీ గురించి ఉన్న భయాన్ని పోగొడతాడు. మీ హృదయాలు 'వహ్న్'కు గురి అయిపోతాయి" అన్నారు దైవప్రవక్త (సఅసం). 'వహ్న్' అంటే ఏమిటి దైవప్రవక్తా! అని ఒకరడగ్గా, "ప్రపంచ వ్యామోహం, మరణమంటే భయం" అని ప్రవచించారు దైవప్రవక్త (సఅసం). (ఉల్లేఖనం : సూబాన్ - అబూ దావూద్)

**సంగ్రహణం :**

అనేకమంది భోజనాలకు ఒకర్ని ఒకరు పిలుచుకోవడం, అందరూ కలిసి ఆ భోజన పదార్థాలపై ఎగబడడం పరిపాటి. అదేవిధంగా ముస్లిమేతర రాజ్యాలు, సంస్థలు ముస్లిమ్ సమాజాన్ని చుట్టుముట్టి తుదముట్టించడానికి ఒకదాన్నొకటి పిలుచుకొని ఉద్యమాలు లేవదీస్తాయి. పథకాలు రూపొందిస్తాయి. ముస్లిముల సామూహిక శక్తిని ఛిన్నాభిన్నం చేయడానికి, వారి రాజకీయ ప్రాబల్యాన్ని బలహీనపర్చడానికి ఒకదానితో ఒకటి సహకరిస్తాయి. పకడ్బందీగా కుట్రలు పన్నుతాయి.

ముస్లిముల్లో నెలకొని ఉన్న సోదరభావనను, వారి సమైక్యతను ఛిన్నాభిన్నం చేసేందుకు ఓ పథకం ప్రకారం అవన్నీ సమైక్యమౌతాయి. ఒకదానితో మరొకటి సంబంధాలు పెట్టుకుంటాయి. ఇదే వారి ఉద్యమానికి మూలం అవుతుంది. ఇలా ముస్లింల జీవితంలోని ప్రతిరంగంలో విచ్ఛిన్నాన్ని, అనైక్యతను, అనైతికతలను, అశ్లీలాన్ని, విశృంఖలత్వాన్ని, భావదాస్యాన్ని జొప్పిస్తాయి. ఇస్లామీయ సిద్ధాంతాలకు, సూత్రాలకు విరుద్ధంగా నడిచేటట్లు ముస్లింలను పురికొల్పుతాయి.

సత్య తిరస్కారులు ముస్లింల సభ్యతా సంస్కృతులపై వారి సిద్ధాంతాలపై వ్రేటు వేశాయి, వేస్తున్నాయి అన్నది నిర్వివాదాంశం. పాశ్చాత్య దేశాలకు చెందిన తెల్లదొరలు, కమ్యూనిస్టు బ్లాక్‌కు సంబంధించిన అరుణోద్యమకారులు ఇస్లామ్‌పై చేసిన భయంకరమైన దాడుల్లాంటివి ప్రపంచ చరిత్రలోనే కానరాదు. కోట్లాది మంది ముస్లిములు నాస్తిక వ్యవస్థ వరదల్లో పూచిక పుల్లల్లా కొట్టుకుపోయారు. అంతర్జాతీయ రాజకీయ రంగంలో వీరికి విలువ ఇవ్వడంగాని, గౌరవించడం గాని జరగడం లేదు. నేటి ముస్లిములు తమ హక్కుల్ని అయితే వదులుకుంటున్నారు గాని దౌర్జన్యకారుల నుండి తమ హక్కులను తిరిగి పొందలేకపోతున్నారు. వీరి హృదయాల్లో దైవం ఎడల ప్రేమకు బదులు ధనవ్యామోహం నిండి ఉంది. ధర్మ సంస్థాపన కోసం, దైవమార్గంలో ప్రాణాలొడ్డుదాం అనే త్యాగభావం వీరి జీవితంలోనే కానరాదు. సరికదా, సత్యాసత్యాల సమరంలో ప్రాణాలెక్కడ పోతాయోనని గడ గడలాడుతున్నారు.

## దేవుని దృష్టిలో ప్రపంచం

(٢) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ مَرَّ بِالسُّوْقِ دَاخِلًا
مِنْ بَعْضِ الْعَالِیَۃِ وَالنَّاسُ کَنَفَتَہٗ فَمَرَّ بِجَدْیٍ اَسَکَّ
مَیِّتٍ فَتَنَاوَلَہٗ فَأَخَذَ بِاُذُنِہٖ ثُمَّ قَالَ اَیُّکُمْ یُحِبُّ اَنَّ
ھٰذَا لَہٗ بِدِرْھَمٍ؟ فَقَالُوْا مَا نُحِبُّ اَنَّہٗ لَنَا بِشَیْءٍ وَمَا

نَصْنَعُ بِهٖ قَالَ تُحِبُّوْنَ اَنَّهٗ لَكُمْ قَالُوْا وَاللّٰهِ لَوْ كَانَ حَيًّا كَانَ
عَيْبًا فِيْهِ لِاَنَّهٗ اَسَكُّ فَكَيْفَ وَهُوَ مَيِّتٌ فَقَالَ وَاللّٰهِ لَلدُّنْيَا
اَهْوَنُ عَلَى اللّٰهِ مِنْ هٰذَا عَلَيْكُمْ۔ (مسلم عن جابر بن عبد الله كتاب الزهد)

4. (మదీనా నగరానికి దాపుగా ఉన్న ఎత్తైన ప్రదేశంలోని) ఓ గ్రామం నుండి దైవప్రవక్త (సఅసం) తిరిగొస్తూ (మదీనాలోని) ఓ బజారులో ప్రవేశించారు. కొందరాయన్ను అనుసరిస్తున్నారప్పుడు. ఆయన చిన్న చెవులు కలిగి ఉన్న ఓ మేక పిల్ల మృత కళేబరాన్ని చూసి దాని చెవి నొకదాన్ని పట్టుకొని అనుచరులనుద్దేశిస్తూ,

"మీలో ఎవరైనా దీన్ని 'దిర్హం'కు కొనడానికి సిద్ధంగా ఉన్నారా?" అని అడిగారు. "దైవప్రవక్తా! దీన్ని మేము ఎంత తక్కువ ధరకైనా కొనడానికి ఇష్టపడం, ఇది మాకేం పనికొస్తుంది?" అని విన్నవించుకున్నారు అనుచరులు. అప్పుడాయన (సఅసం) "(లేదు, తప్పకుండా) దీన్ని మీరు పొందాలని కోరుకుంటున్నారు" అని అనగా, దానికి వారంతా 'దైవసాక్షి! అది బ్రతికున్నా దానిలో ఉన్న లోపం కారణంగా కొనడానికి పనికి రాకుండా ఉండేది. ఇప్పుడిది చెవులకు సంబంధించిన లోపానికి తోడు మృతకళేబరం కూడాను' అని తమ అయిష్టాన్ని వ్యక్తపరిచారు. అది విన్న దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

"దైవసాక్షి! మీకు ఈ మేకపిల్ల ఎంత తుచ్ఛమైనదిగా కనబడుతుందో, అల్లాహ్ దృష్టిలో ఈ ప్రపంచం (ఇహలోకం) కూడా అంతే తుచ్ఛమైనది, విలువలేనటువంటిదీను." (జాబిర్ బిన్ అబ్దుల్లా (రజిఅన్) ఉల్లేఖనం – ముస్లిమ్)

**సంగ్రహణం:**

అల్లాహ్‌ను ప్రేమించే దైవదాసుల దృష్టిలో ప్రాపంచిక సంపదకు పూచికపుల్లంతా విలువకూడా ఉండదు. ప్రపంచ వ్యామోహంలో కొట్టుమిట్టాడుతూ ధనార్జనా ధ్యేయంలో ఉన్న ముస్లిములు దైవప్రవక్త(స)గారి ఈ ప్రవచనాన్ని ఓసారి ప్రశాంత మనస్సుతో పరిశీలించాలి. వీరు ప్రదర్శనాబుద్ధితో, తమను తాము గొప్పవారిగా చాటుకునే తలంపుతోనో లేదా తమ మనోవాంఛల పరిపూర్తికోసమో ధనాన్ని నీళ్ళప్రాయంగా

వెచ్చిస్తున్నారు. వీరి సంపాదనంటూ వీరి భౌతిక జీవితానికే పరిమితమయిపోయింది. వీరి జీవిత ధ్యేయం అంతా సాధ్యమైనంతమట్టుకు ప్రపంచంలోని భోగభాగ్యాలను తినివితీరా అనుభవించడం, జీవన ప్రమాణాల్ని రోజురోజుకు పెంచుకోవడం మాత్రమే. ఎంత సంపాదించినా వారి జీవితంలో సంతృప్తి ఉండదు. వారి పేరాశ నానాటికీ ఇంకా ఎక్కువయిపోతూనే ఉంటుంది. ఈ పేరాశే వారి మనస్సుల్ని శిలలకంటే కఠినంగా తయారుచేస్తుంది. ఈ దురాశ వారిని మానవహక్కుల గురించి ఆలోచించనివ్వదు. ఇలాంటి ధనపిపాస, ప్రపంచ వ్యామోహాలు చివరికి మనిషిని సర్వనాశనం చేసిగాని వదిలిపెట్టవు. దైవసందేశహరుని ఈ ప్రవచనంలో ఇలాంటి ప్రపంచాన్నే ఈసడించుకోవడం జరిగింది.

## ఇహలోకం- పరలోకం

(٥) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاللّٰهِ مَا الدُّنْيَا فِي
الْاٰخِرَةِ اِلَّا مِثْلُ مَا يَجْعَلُ اَحَدُكُمْ اِصْبَعَهٗ فِي الْيَمِّ
فَلْيَنْظُرْ بِمَ تَرْجِعُ ؟

(مسلم عن المستورد کتاب الجنة- ترمذی ابواب الزهد)

5. దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "దైవసాక్షి! పరలోకంతో పోల్చినప్పుడు ఇహలోకం విలువ నామమాత్రమే. ఎవరైనా సముద్రంలో తన వ్రేలిని ముంచి తీస్తే ఆ వ్రేలికి ఎంత నీరంటి వస్తుందో అంతే ఈ ప్రపంచం విలువ. (ఉల్లేఖనం అల్‌మస్తూర్(రఅన్)- ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

మహా సముద్రంలో ఉన్న నీటికి, ఆ నీటిలో వ్రేలు ముంచితే దానికి అంటుకొని వచ్చే నీటికి గల తారతమ్యం ఏమిటో మనకు తెలుసు. ఈ లోకంలో జీవిస్తున్న మనిషికి గల వయోపరిమితి ఎంతటిదో ఇక్కడ మనిషి పొందే వరాలు ఎంత బలమైనవో మనకు తెలుసు. అంటే వీటికి ఏమాత్రం విలువ లేదు అనేగదా దైవప్రవక్త (సఅసం) మనిషి వ్రేలికి అంటే నీటి విలువ ఇహలోకంతోను, మహాసంద్రంలోని నీటిని పరలోక జీవితంతోను పోల్చారు. అంటే పరలోకంలోని అనంతమైన వరాలను, విజయాలను ఉపేక్షించి హేయమైన, స్వల్పమైన ఈ ప్రాపంచిక భోగభాగ్యాలను అనుభవించడమే జీవిత ధ్యేయంగా పెట్టుకోవడం ఎంత పొరపాటో ఈ హదీసులో వివరించారు ఆయన.

## ఇహలోక ప్రాముఖ్యత

(٦) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَوْ كَانَتِ الدُّنْيَا تَعْدِلُ عِنْدَ اللهِ جَنَاحَ بَعُوْضَةٍ مَا سَقَى كَافِرًا مِنْهَا شُرْبَةَ مَاءٍ۔

(ترمذی عن سهل بن سعد ابواب الزهد)

6. "అల్లాహ్ దృష్టిలో ఈ ప్రపంచానికి (కనీసం) ఒక దోమ రెక్క అంతటి విలువ ఉన్నా, ఆయన సత్య తిరస్కారానికి ఓ గుక్కెడు మంచినీళ్ళు కూడా ఇవ్వకపోయే వాడే" అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు.

(ఉల్లేఖనం : సహల్ బిన్ సఅద్ – తిర్మిజి)

**సంగ్రహణం :**
దేవుని దృష్టిలో ఇహలోక సంపదకు ఇసుమంత కూడా విలువలేదు. దీనికి ఆ మాత్రం విలువ ఉన్నా ఆయన అవిశ్వాసులకు, నాస్తికులకు, ప్రపంచ పూజారులకు దాన్ని ఏమాత్రం ప్రసాదించేవాడు కాడు. చివరికి వారికి ఓ గుక్కెడు మంచినీరన్నా సమకూర్చకపోయేవాడు. ఇహలోక సంపదలు, భోగభాగ్యాలు సత్య తిరస్కారులకు, దైవధిక్కారులకు ఇవ్వడం జరుగుతూవుందంటే సృష్టికర్త దృష్టిలో ఈ లోకానికి ఏమాత్రం విలువ లేదన్నమాట.

## రెండు అమానతుల విషయంలో పరీక్ష

(٧) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ نِعْمَتَانِ مَغْبُوْنٌ فِيْهِمَا كَثِيْرٌ مِّنَ النَّاسِ، الصِّحَّةُ وَالْفَرَاغُ۔

(بخاری عن ابن عباس کتاب الرقاق۔ ترمذی ابواب الزهد)

7. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "అల్లాహ్ ప్రసాదించిన ఆరోగ్యం, తీరిక, అనే రెండు వరాల గురించి చాలామంది పొరబడి మోసానికి లోనౌతారు."

(ఉల్లేఖనం : ఇబ్నె మస్ఊద్ (రజిఅన్) – బుఖారి, తిర్మిజి)

**సంగ్రహణం :**

అంటే వీటి విలువ ఏమిటో తెలుసుకోకుండా నష్టపోతారని అర్థం. దైవమిచ్చిన ఈ రెండు వరాల్లో మొదటిది ఆరోగ్యం, స్వస్థత. మనిషి తన ఆయురారోగ్యాల్ని పాప కార్యకలాపాల్లో వెచ్చించే బదులు దైవవిధేయతా మార్గంలో వినియోగించాలి. రెండోది తీరిక సమయం. దీన్ని పనికిమాలిన కార్యాల్లో, సత్యతిరస్కార మార్గంలో, వినియోగించకుండా జీవితంలో లభించిన ప్రతిక్షణాన్ని అల్లాహ్ ఆదేశాల కనుగుణంగానే గడపాలి. ఆరోగ్యం వల్ల తనకు లభించిన బుద్ధికుశలతను, శక్తిసామర్థ్యాలను తనకు లభించిన తీరిక సమయాలను ఆయన్ను విధేయించకుండా మనోవాంఛ లోలత్వానికి వినియోగిస్తూ కోరికలకు దాసులయి బ్రతకడం ఎంతో అవివేకం. అలాంటి అవివేకి మోసంలో పడిపోతాడు.

నవ యవ్వనంలో ఉడుకురక్తపు ఆర్భాట కాలంలో మనోవాంఛల్ని నియంత్రించని వారు, తమ భావోద్రేకాలను అణగద్రొక్క చేతకానివారు అపమార్గం పట్టే ప్రమాదం ఉంది. అంతరాత్మ ప్రబోధాన్ని కాదని తమ మనోవాంఛల కళ్ళాలను సైతాను చేతికి ఇచ్చే వాళ్ళు జీవిత ధ్యేయాన్ని మరిచిపోతారు.

అయితే విశ్వాసి (మోమిన్) మాత్రం తనకు ప్రసాదించబడ్డ ఆయురారోగ్యాలను, యవ్వనాన్ని అల్లాహ్ అమానతుగా తలచి అడుగడుగున దైవభీతితో గడగడలాడుతూ సద్వినియోగం చేస్తాడు. అదేవిధంగా తనకు దైవం ప్రసాదించిన తీరిక సమయాన్ని జారవిడుచుకోక జీవితపు ప్రతి క్షణాన్ని దైవ విధేయతకే వినియోగిస్తాడు. అలాంటి వ్యక్తి పాపాల వరదల్లో కొట్టుకుపోడు, సరికదా ఆ పాపాల తుఫానులను అడ్డుకోవడానికి స్థాణువులా నిలబడతాడు. మొత్తానికి మోమిన్ (విశ్వాసి) తన ఆరోగ్యాన్ని, యవ్వనాన్ని, తన తీరిక సమయాన్ని పనికిమాలిన పనుల్లో వృధాచేయకుండా పరలోక సాఫల్యం కోసం వినియోగిస్తాడు.

## రెండు మానవ బలహీనతలు

(٨) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَهْرَمُ ابْنُ اٰدَمَ وَ يَشِبُّ مِنْهُ اثْنَتَانِ، اَلْحِرْصُ عَلَى الْمَالِ وَالْحِرْصُ عَلَى الْعُمُرِ۔ (مسلم عن انس کتاب الزکوۃ - بخاری کتاب الرقاق - ترمذی ابواب الزھد)

رسول اللہ صلی اللہ علیہ وسلم نے فرمایا آدمی بوڑھا ہوتا جاتا ہے اور اس کی دو خصلتیں جوان ہوتی جاتی ہیں (١) مال کی محبت اور حرص (٢) زیادہ عرصہ تک جینے کا لالچ۔

8. "మనిషి వృద్ధుడైపోతాడు (కాని) అతని రెండు గుణాలు (మాత్రం) యవ్వనాన్ని పొందుతాయి. 1. ధనాపేక్ష 2. దీర్ఘకాలం వరకు బ్రతకాలనే ఆకాంక్ష" అని ప్రవచించారు దైవప్రవక్త (సఅసం). (బుఖారి, తిర్మిజి - ఉల్లేఖనకర్త అనస్ (రజి).

**సంగ్రహణం :**

జీవిత అంతిమ దశలో మనిషి మరణం అనే ద్వారంలో ప్రవేశించి పరలోక ప్రాంగణంలో అడుగిడుతున్నాడు కాబట్టి అతను చేతనైనంతమట్టుకు తన పరలోకాన్ని చక్కదిద్దుకునే ప్రయత్నం చేయాలి.

అయితే ప్రపంచ వ్యామోహం అతని బుద్ధీవివేకాల్ని పూర్తిగా కప్పేస్తున్నందువల్లే అతడు ధనపిపాసకు లోనైపోతున్నాడు. మరణానికి ప్రచ్ఛన్న సూచనలైన తెల్లజుట్టు, శరీరావయవాల నిస్సత్తువ తన శరీరంపై ఒక్కటొక్కటిగా గోచరిస్తున్నా అతడు సాధ్యమైనంత ఎక్కువ ధనాన్ని కూడబెట్టడంలోనే మునిగిపోతాడు. తనకసలు చావు అన్నదేరాదని, ఈ లోకంలోనే శాశ్వతంగా ఉండిపోవలసి ఉంది అనే ధోరణిలోనే సుఖభోగాల్లో చిక్కుకానిపోతున్నాడు.

## సంపన్నుల పరిణామం

(۹) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ الْمُكْثِرِيْنَ هُمُ الْمُقِلُّوْنَ يَوْمَ الْقِيَامَةِ اِلَّا مَنْ اَعْطَاهُ اللّٰهُ خَيْرًا فَنَفَعَ فِيْهِ يَمِيْنَهٗ وَشِمَالَهٗ وَبَيْنَ يَدَيْهِ وَوَرَاءَهٗ وَعَمِلَ فِيْهِ خَيْرًا۔

(بخاری عن ابی ذر کتاب الرقاق)

9. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "ఈ ప్రపంచంలో ఎనలేని సంపదలు కలిగి ఉన్నవారు పరలోకంలో నిరుపేదలైపోతారు. అయితే ఇలాంటి వ్యక్తి (ఎవరైతే తన వెంట పుణ్యఫలాలను, ఉపకారాలను తీసుకొని వెళ్ళేవాడు) తప్ప. అతనికి అల్లాహ్ ఎనలేని ధన సంపదను ఇచ్చినప్పుడు అతను తన కుడి ఎడమలు, వెనకా ముందు ఖర్చుబెడతాడు. దాన్ని పుణ్యకార్యాల కొరకు వెచ్చిస్తూ ఉంటాడు."

(బుఖారి - ఉల్లేఖనకర్త హజ్రత్ అబూజర్ - రజిఅన్).

**సంగ్రహణం :**

ధన ప్రాబల్యం సాధారణంగా మనిషిని దైవం ఎడల ఏమరుపాటుకు గురిచేస్తూ ధన వ్యామోహంలో నిండా మునిగిపోయినందువల్ల అతను దైవవిధేయత, దైవాజ్ఞపాలనకు దూరంగా ఉంటాడు. ప్రళయదినం నాడు అతని పుణ్యకార్యాలు పాపాలకంటే తక్కువగా ఉంటాయి. ధనపిపాస కారణంగా అతడు ఇహలోకంలో ఎలాంటి పుణ్యకార్యాలు చేయడు. సరికదా, ఆ డబ్బుతోనే అతడు అనేక పాపాలను కొని మూటగట్టుకుంటాడు. ఈ ధన బలం ఆధారంగా చేసిన పాపాలు, అత్యాచారాలు అతణ్ణి దైవ న్యాయస్థానంలో శిక్షకు గురిచేస్తాయి. ఈ కారణంగా అతడు అక్కడ ఎనలేని కడగండ్లను ఎదుర్కోవలసి వస్తుంది. వీటినుండి విముక్తి కలిగించే ఏ మార్గం అతనికి కానరాదక్కడ. అయితే పుణ్యకార్యాలకు తన ధనాన్ని వెచ్చించే ధనవంతుడు మాత్రం ప్రళయదినంనాడు ఆ శిక్ష నుండి తప్పించుకోగలుగుతాడు. కుడి ఎడమలు వెనుకా ముందు ఖర్చుబెట్టడం అంటే పుణ్యకార్యాల్లో విశాల హృదయంతో ధనాన్ని వెచ్చించడం అన్నమాట.

చాలామంది ధనవంతులు ప్రళయదినం నాడు అక్కడి శిక్షనుండి అగౌరవం నుండి తప్పించుకోజాలరు ఈ పనులకు ఖర్చుబెడితే తప్ప.

1. ప్రతి సంవత్సరం తమ ధనానికి నియమం తప్పకుండా జకాత్ చెల్లించడం.
2. నిరుపేద బంధువులు, లేమికి గురిఅయిన పొరుగువారికి విశాల హృదయంతో సహాయపడడం. వారు ఆర్థికంగా నిలదొక్కుకునేటట్లు ఆదుకోవడం.
3. అనాధ బాలబాలికలకు విద్యాబుద్ధులు గరపడానికి, వారి ఆరోగ్యం, వస్త్రాల కోసం ఖర్చుపెట్టడం.
4. వితంతు మహిళలు, వికలాంగులకు శాశ్వత ప్రాతిపదికపై సహాయం అందచేయడం.
5. తన ఊళ్ళో, వాడలో పేదలు, అగత్యపరులు, అనాధలు అనాశ్రయులకు సహాయపడడం.
6. సంక్షేమ కార్యకలాపాల్లో పాల్గొనడం.
7. ధార్మిక విద్య, ధర్మప్రచారం దైవసద్వచనాన్ని వ్యాపింపజేయడానికి డబ్బు ఖర్చుపెట్టడం.
8. ఇవికాక ఇతర పుణ్యకార్యాలు కూడా ఉన్నాయి. వాటన్నిటిలో తన ధనాన్ని వెచ్చించవచ్చు.

## ఉత్తములకు, దుష్టులకు గల తేడా

(١٠) إنَّ رَجُلًا قَالَ يَا رَسُوْلَ اللهِ أَيُّ النَّاسِ خَيْرٌ؟ قَالَ مَنْ طَالَ
عُمُرُهُ وَحَسُنَ عَمَلُهُ، قَالَ فَأَيُّ النَّاسِ شَرٌّ؟ قَالَ مَنْ طَالَ
عُمُرُهُ وَسَاءَ عَمَلُهُ۔ (ترمذی عن ابی بکرۃ ابواب الزھد)

10. ఒక వ్యక్తి దైవప్రవక్తను అడిగాడు: "దైవప్రవక్తా! (సఅసం) అందరిలోను ఉత్తముడైన వ్యక్తి ఎవరు?" అని. దానికి ప్రవక్త (సఅసం), "సుదీర్ఘ ఆయువుతోపాటు ఉత్తమ నడవడిని కలిగిఉన్నవాడు" అని ప్రవచించారు.

ఆ తరువాత ఆ వ్యక్తి, "అందరికంటే దుష్టుడు అయిన వాడెవరూ?" అని అడగ్గా, "సుదీర్ఘ ఆయువుతో పాటు చెడునడవడి కలిగినవాడు" అని చెప్పారు దైవప్రవక్త (సఅసం).

**సంగ్రహణం :**

సుదీర్ఘ ఆయుష్షును కలిగి ఉండడం మంచిదే. అయితే జీవితమంతా దైవం, దైవప్రవక్త (సఅసం)ల విధేయతలో గడిచినప్పుడు మాత్రమే ప్రయోజనం ఉంటుంది. దైవ సంతుష్టినే ధ్యేయంగా పెట్టుకొని మసులుకుంటూ తన సుదీర్ఘ జీవిత కాలంలో సత్కార్యాలను ఆచరించి పుణ్యాలను బాగా కూడగట్టుకునే వ్యక్తికి అతని సుదీర్ఘ ఆయుష్షు ప్రమాణం వరంలాంటిదే. దీనికి భిన్నంగా దైవం ప్రసాదించిన సుదీర్ఘ జీవిత కాలాన్ని దైవధిక్కారానికి, అవిధేయతకు, తిరుగుబాటు మార్గంలోనే వెచ్చిస్తే ప్రళయదినాన తత్సంబంధిత పాప భారంతో కృంగిపోతూ దైవ సన్నిధికి చేరుకోవలసి వస్తుంది.

## ప్రపంచ వ్యామోహం వల్ల కలిగే నష్టం

(١١) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ أَحَبَّ دُنْيَاهُ
أَضَرَّ بِآخِرَتِهِ وَمَنْ أَحَبَّ آخِرَتَهُ أَضَرَّ بِدُنْيَاهُ
فَآثِرُوْا مَا يَبْقَى عَلَى مَا يَفْنَى۔

(مشکوٰۃ کتاب الرقاق عن ابی موسیٰ بحوالہ احمد)

11. "ఏ వ్యక్తి ప్రపంచాన్ని ప్రేమిస్తాడో అతడు తన పరలోకాన్ని నష్టపర్చుకుంటాడు. మరెవరైతే పరలోకాన్ని ప్రేమిస్తాడో అతడు తన ప్రపంచాన్ని తప్పక చెడగొట్టుకుంటాడు. (కాబట్టి) ప్రజలారా! తాత్కాలిక మైన దానికంటే శాశ్వతమైన దానికే విలువనివ్వండి" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

**సంగ్రహణం :**

ఈ ప్రపంచం అశాశ్వతం, క్షణభంగురం. పరలోక జీవితం అనంతం. దాని వరాలు, భోగభాగ్యాలు తరగనివి. శాశ్వతంగా ఉండేవీనూ. అక్కడ చావు అన్నదే లేదు.

ఈ ప్రపంచంలోని అతి స్వల్ప జీవితంలో అన్ని రకాల భౌతిక ప్రయోజనాలను భోగభాగ్యాలను సమకూర్చుకునేవాడు పరలోకంలో విజయం సాధించలేడు.

దీనికి భిన్నంగా దైవం కోసమే జీవించడం, పరలోక సాఫల్యం కోసమే శ్రమించడం జీవిత పరమార్థంగా పెట్టుకునేవారు ప్రపంచ పూజారుల్లా సుఖభోగాలను అనుభవించరు. వాళ్ళు అన్ని రకాల కష్టనష్టాలను భరించగలరు కాని దైవాన్ని కృద్ధునిగా చేసే పనిమాత్రం ఎన్నటికీ చేయలేరు. ఇహపరలోకాలకు సంబంధించిన ఈ రెండు రకాల వైఖరులు మనకు కానవస్తాయి ఇక్కడ.

దైవ మార్గదర్శకత్వాన్ని కాదని, ప్రాపంచిక భోగభాగ్యాల కోసం పరితపించేవారు వాటినే కూడగట్టుకునేందుకు ప్రయత్నిస్తూ దైవాదేశాలను, ధర్మాధర్మాలను లెక్కచేయకుండా ప్రవర్తించడం ఒకటైతే పరలోక జీవిత శ్రేయస్సుకోసం, అక్కడి విజయం కోసం ఇహలోకంలో దైవానికి విధేయతను పాటించడం, ఆయన ఆజ్ఞలను శిరసావహించడం రెండో ప్రవర్తన. మొదటి వైఖరిని అవలంబించే వారికి పరలోకంలో సర్వవిధాల నాశనమే మిగులుతుంది. మరణానంతరం వారు అగౌరవం పాలౌతారు. రెండో రకపు వైఖరిని అవలంబించేవారు పరలోకంలో విజయాన్ని సాధిస్తారు. వారికి అక్కడ స్వర్గం లభిస్తుంది. అయితే ఇహలోకం (ప్రాపంచిక జీవితం) మట్టుకు కష్టభూయిష్టమైనదిగా తయారౌతుంది. "అశాశ్వత జీవితంపై శాశ్వత జీవితానికే ప్రాముఖ్యత ఇవ్వబడింది" అంటే మీరు రెండో వైఖరినే అవలంబించండి అని అర్థం.

## ప్రపంచంలో అపరిచితుడు

(١٢) عَنْ عَبْدِ اللهِ بْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ اَخَذَ رَسُوْلُ
اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ بِمَنْكِبِيْ فَقَالَ كُنْ فِي الدُّنْيَا كَأَنَّكَ

غَرِيْبٌ اَوْ عَابِرُ سَبِيْلٍ وَكَانَ ابْنُ عُمَرَ يَقُوْلُ اِذَا اَمْسَيْتَ فَلَا
تَنْتَظِرِ الصَّبَاحَ وَاِذَا اَصْبَحْتَ فَلَا تَنْتَظِرِ الْمَسَاءَ وَخُذْ مِنْ
صِحَّتِكَ لِمَرَضِكَ وَمِنْ حَيَاتِكَ لِمَوْتِكَ۔

(بخاری کتاب الرقاق۔ ترمذی ابواب الزهد۔ مسند احمد ۴۷۶۴ ——— ۵۰۰۲)

12. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఇలా ఉల్లేఖిస్తున్నారు: "దైవప్రవక్త (సఅసం) నా భుజం పట్టుకొని ప్రపంచంలో నీవో అపరిచిత వ్యక్తిలా లేదా ఓ బాటసారిలా జీవితాన్ని గడుపు" అని ప్రవచించారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఈ ప్రవచనాన్ని ఇలా విశదీకరించారు.

"సాయంత్రం పూట రేపు సూర్యోదయం కానివ్వమని, ఉదయం పూట పొద్దు గ్రుంకనివ్వమని ఎదురుచూడకు. ఆరోగ్యంగా ఉన్నప్పుడు (దైవవిధేయత మరియు పుణ్యకార్యాల సంపదను) కూడబెట్టుకో. నీకు అనారోగ్యం దాపురించినప్పుడు జరిగే లోపాలను పూడ్చుకోవడానికి అవి పనికి వస్తాయి. మరణించాక నీకు ప్రయోజనం కలిగిందేటంత పుణ్యకార్యాల సంపదను బ్రతికుండగానే సమకూర్చుకో."

(బుఖారి, తిర్మిజి, ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

1. అరబ్బీ భాషలో 'గరీబ్' అనే పదాన్ని నిరుపేదకోసం కాకుండా, మాతృభూమికి దూరంగా ఓ అపరిచితమైన ప్రాంతంలో ప్రవేశించే వ్యక్తి కోసం వాడుతారు. అక్కడి భాష సమాజం, అక్కడి సంబంధాలు అన్నీ అతనికి క్రొత్తగానే ఉంటాయి. అతడు క్రొత్త వాతావరణంలో ఇమడడం కష్టం. భావం ఏమిటంటే మీరు ఈ లోకంలో పూర్తి ఆగంతకుల్లా, అపరిచిత వ్యక్తుల్లానే జీవించాలి. ప్రాపంచిక భోగభాగ్యాలకు దూరంగా, దాని అకర్షణలకు అందచందాలకు మోసపోకుండా కొన్ని రోజులు గడిపి తిరిగి వెళ్ళిపోండి. ఇక్కడి భోగవిలాసాల వైపు కన్నెత్తైనా చూడకండి. ఇక్కడి ఆకర్షణల్లో విలీనం అవకండి. ఒక నదిని దాటుతున్నప్పుడు, లేక ఒక రాజ మార్గం గుండా ప్రయాణం చేసేటప్పుడు ఎంత జాగ్రత్తగా, అప్రమత్తంగా మనిషి ఉంటాడో మీరు అలానే ఈ ప్రాపంచిక జీవితంలో పరిమిత కాలాన్ని గడపండి. తిర్మిజీ, ముస్నద్ అహ్మద్‌లలో ఈ ఉల్లేఖనంలో ఈ క్రింది వాక్యం అదనంగా ఉంది. "చనిపోయిన వాళ్ళల్లో నీవూ ఒకడివని భావించుకో."

కారణం ఏమిటంటే ఇక్కడ మరణించడానికి ఎంతో సమయం పట్టదు. నీ జీవితం నీ చేతిలో లేదు. ప్రతి ప్రాణీ ఇక్కడ మరణించడం ఖాయం.

2. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) గారి వివరణకు అర్థం, పరలోక సాఫల్యం కోసం జీవితాంతం అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసం) గారి ఆదేశాలను పాటించండి, వారి అవిధేయతకు దూరంగా ఉండండి అని. ప్రాపంచిక జీవితం పూర్తిగా పరీక్షా కాలం. మరణం ఎప్పుడాసన్నమౌతుందో తెలియదు. కాబట్టి సత్కార్యాల నాచరించడం, దుష్కార్యాలను మానివేయడంలో త్వరపడుతూ ఉండండి. ఈ సత్కార్యాన్ని వాయిదా వేయకండి. అంతకు ముందే మీరు మరణించవచ్చు కదా! పూర్తి బుద్ధి వివేకాలతో, ఇష్టపూర్వకంగా దైవాన్ని పూజించాలి. ఆయన్ను విధేయించాలి. ఈ భావానికి వ్యతిరేకమైన, భిన్నమైన ఇతర ఆలోచనల్ని, ఇతర వ్యవస్థల్ని అడ్డుకోవడానికే మనిషిని సృజించడం జరిగింది ఈ లోకంలో. దీనికోసం అలసత్వం చేయడం, వాయిదా వేసుకోవడం లాంటివి పనికిరావు. కాలం అమూల్యమైనది. కాబట్టే దైవప్రవక్త (సఅసం)"ప్రతి నమాజును నీ చివరి నమాజుగా భావించి చెయ్యి" అని ప్రవచించారు.

రోగానికి గురై ఉన్నప్పుడు మనిషి ఇటు వ్యక్తిగతంగాగాని, సమిష్టిగాగాని ఎలాంటి బాధ్యతలను నిర్వహించలేడు. అప్పుడప్పుడు ఆ బాధ్యతా నిర్వహణలు వాయిదా కూడా పడవచ్చు. కాబట్టి హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) గారు నుడివినట్లు, ఆరోగ్యంగా ఉన్నప్పుడు సాధ్యమైనంత మట్టుకు సత్కర్మల కోసం ప్రయత్నం చేస్తే, జరిగిన లోపాల్ని అనారోగ్యానికి గురైనప్పుడు పూడ్చుకోవచ్చు. మరణించాక నీకు ఒసగబడిన పనిచేసే గడువు కాస్తా అంతం అయిపోతుంది. కాబట్టి "మరణం ఆసన్నమవక పూర్వమే నీ జీవితకాలాన్ని ఒక వరంగా తలచ"మని చెప్పడం జరిగింది. నీకు వరంగా లభించిన ఈ జీవితకాలాన్ని వృధా పనులకోసం వెచ్చించకు. సత్కార్యాలు ఆచరించడం, వాటిని వ్యాపింపజేయడం, చెడు నుండి నిన్ను నీవు దూరంగా ఉంచుతూ ఆ చెడును సమూలంగా నిర్మూలించే ఏ కార్యభారమైతే నీపై మోపబడిందో దాని ఎడల అశ్రద్ధ జూపకు. సరికదా ఎంతో జాగ్రత్తగా నీకు లభించిన జీవిత కాలాన్ని ఆచితూచి సద్వినియోగపరచి సత్కార్యాల వైపుకు దృష్టిని మళ్లించు. వాటిని ప్రోవుచేసుకో. చనిపోయిన తరువాత రేపు పరలోకంలో పనికివచ్చేవి ఇవే.

ప్రతి ప్రాణికి మరణం తప్పదు. ఇది సార్వజనీనమైన చట్టం. నీ జీవితపు రైలు ఎంతో వేగంగా తన గమ్యం వైపుకు వెళుతోంది. కోట్లాది మంది మానవులు ఈ రైలు పెట్టెల్లో కూర్చొని బయటి దృశ్యాలను తిలకించడంలోనే లీనమై ఉన్నారు. ప్రతివాడు తనకు నిర్ధారించబడిన స్టేషనులో దిగిపోవలసిందే. అయితే జీవితానికి సంబంధించిన ఆ స్టేషనుల సంగతి దైవానికి తప్ప మరెవరికీ తెలియదు. అనుకున్న అనుకోకపోయినా ప్రతి వ్యక్తి తన స్టేషనులో దిగవలసిందే. ఆ స్టేషను ఏది? రైలుబండి ఏ రోజున ఏ తేదీన ఆ

స్టేషనుకు చేరుకుంటుందో అంతా పరోక్షంగానే ఉంది. ఎవరికి ఏమీ తెలియదు. కాబట్టి ప్రయాణిస్తున్న ప్రతి వ్యక్తి దిగిపోవడానికి సదా సిద్ధంగా ఉండాలి.

## ప్రపంచ పూజారులు కాకండి

(الف ۱۲) عَنْ عَلِيٍّ اِرْتَحَلَتِ الدُّنْيَا مُدْبِرَةً وَارْتَحَلَتِ الْاٰخِرَةُ مُقْبِلَةً وَلِكُلِّ وَاحِدَةٍ مِنْهُمَا بَنُوْنَ فَكُوْنُوْا مِنْ اَبْنَاءِ الْاٰخِرَةِ وَلَا تَكُوْنُوْا مِنْ اَبْنَاءِ الدُّنْيَا فَاِنَّ الْيَوْمَ عَمَلٌ وَلَا حِسَابَ وَغَدًا حِسَابٌ وَلَا عَمَلَ (بخاری کتاب الرقاق)

امیر المؤمنین سیدنا علی رضی اللہ عنہ نے فرمایا دنیا پیٹھ پھیر کر کوچ کر رہی

హజ్రత్ అలి (రజి) ఇలా సెలవిచ్చారు : ప్రపంచం వెనుతిరిగి వెళ్ళిపోతోంది, ప్రళయం వేగంగా మీకు ఎదురుగా వస్తోంది. ఈ రెంటిలో మీరు ప్రతిదానికీ సంతానం, మీరు మాత్రం పరలోకానికే పుత్రులుగా ఉండండి. ప్రపంచ పుత్రులుగా మారకండి. ఈ రోజు (ప్రపంచంలో) పని (చేసుకునే అవకాశం) ఉంది. (ఇక్కడ) ఎవరిని ప్రశ్నించడం జరగదు. రేపు (ప్రళయం రోజున) ప్రతి వ్యక్తి ప్రశ్నించబడతాడు. పనిచేసే గడువు ఏ మాత్రం ఉండదు. *(హజ్రత్ అలి (రజి) – బుఖారి)*

**సంగ్రహణం :**

అంటే మీరు పరలోక సాఫల్యం పొందడానికి కృషి చేయండి. పరలోకాన్ని మరచిపోయి మీ శక్తియుక్తులన్నిటిని ధారపోసి ప్రపంచ సుఖభోగాలకే పాటుపడడం వివేకం కాదు.

"పరలోక పుత్రులుగా ఉండండి" అంటే ప్రళయదినాన దైవ న్యాయస్థానంలో మనం చేసిన కర్మలన్నింటికీ జవాబు చెప్పుకోవలసి ఉంది అనే విశ్వాసంతో, పూర్తినమ్మకం కలిగి దైవాదేశాల మేరకు జీవితం గడపండి అని భావం. "ప్రపంచ పుత్రులుగా మారకండి" అంటే, ప్రపంచ వ్యామోహంలో పడి బ్యాంక్ బ్యాలన్స్‌లను పెంచుకోవడం, ఆస్తుల్ని కొనడం, అమితంగా సుఖభోగాల్లో చిక్కుకుని పోవడం మీ ధ్యేయం కాకూడదు అని భావం. ప్రపంచ వ్యామోహం ఒక ఇంద్రజాలం. ఇది మనిషి కళ్ళను కప్పేసి మంచి చెడు అన్న విచక్షణ లేకుండా చేస్తుంది. ఈ ఆధునిక యుగంలో దీని చెడుగు ఏమిటో

ప్రస్ఫుటంగా కనబడుతూనే ఉంది. ప్రతి మనిషి, సామూహికంగా ప్రతి జాతి ఒకరేమిటి ప్రపంచ జనాభా అంతా వినాశనానికి గురయ్యే ఉంది. ఉవ్వెత్తున లేచే ఈ ఉప్పెన కెరటాల నుండి ముస్లిం సమాజం తన నావను దరిచేర్చాల్సి ఉంది.

## మాయా విధానం

(۱۳) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ إِذَا رَأَيْتَ اللّٰهَ عَزَّ وَجَلَّ يُعْطِي الْعَبْدَ مِنَ الدُّنْيَا عَلَىٰ مَعَاصِيْهِ مَا يُحِبُّ فَإِنَّمَا هُوَ اِسْتِدْرَاجٌ ثُمَّ تَلَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَلَمَّا نَسُوْا مَا ذُكِّرُوْا بِهٖ فَتَحْنَا عَلَيْهِمْ اَبْوَابَ كُلِّ شَيْءٍ حَتّٰى إِذَا فَرِحُوْا بِمَا اُوْتُوْا اَخَذْنَاهُمْ بَغْتَةً فَإِذَا هُمْ مُبْلِسُوْنَ ○ (مشکوٰۃ عن عقبہ بن عامر کتاب الرقاق بحوالہ احمد)

13. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "పాపంలో నిండా మునిగిపోయిన తన దాసునికి అతని ఇష్టప్రకారం అల్లాహ్ ప్రపంచ సుఖాల్ని సమకూర్చుతున్నప్పుడు మీరది ఒక మాయ మాత్రమే అని నమ్మండి." ఆ తరువాత దైవప్రవక్త (సఅసం) దివ్య ఖుర్ఆన్‌లోని ఈ ఆయత్ పఠించారు:

"వారు తమకు చేయబడిన హితోపదేశాన్ని విస్మరించినప్పుడు, మేము వారికొరకు సకల భోగభాగ్యాల ద్వారాలను తెరిచాము. వారు తమకు ప్రసాదించబడిన అనుగ్రహాల ఆనందాన్ని గ్రోలుతుండగా, అకస్మాత్తుగా మేము వారిని పట్టుకున్నాము. అప్పుడు పరిస్థితి ఎలా ఉందంటే వారు ప్రతి మేలు విషయంలో హతాశులయ్యారు."

(అన్ ఆమ్ - *44*) (ఉక్బా బిన్ అమిర్ - మిష్కాత్)

**సంగ్రహణం :**

దేవుణ్ణి విశ్వసించినా లేక తిరస్కరించినా, ఆయన్ను విధేయించినా లేక తిరస్కరించినా ఆయన మాత్రం ప్రతి ప్రాణికి జీవికనిస్తున్నాడన్నది నిర్వివాదమైన అంశం. ఉపాధి పంపకం అన్నది దైవ విధేయత లేక తిరస్కార ప్రాతిపదికపై మాత్రం జరగడం

లేదు. ఈ ప్రపంచంలో ధన సంపదలిచ్చి దేవుడు తన దాసుల్ని పరీక్షిస్తున్నాడు. సంపన్నత అన్నది దైవ ప్రసన్నతకు గాని, పేదరికం ఆయన క్రోధానికిగాని చిహ్నాలు కావు. ఒకడు బాగా డబ్బున్న కారణంగా దేవునికి ప్రియమైన వాడు కానట్లే, ఓ నిరుపేద తన లేమివల్ల దేవుని దృష్టిలో చులకనైపోడు. కలిమి లేములకు దైవదృష్టిలో ఎలాంటి విలువలేక పోవడమే దీనికి కారణం.

అప్పుడప్పుడు చెడిపోయిన వ్యక్తిని అల్లాహ్ లేమికి గురిచేసి తన దైవధిక్కార వైఖరిని మార్చుకొని సన్మార్గుడౌతాడేమోనని పరీక్షిస్తాడు. ఇలాంటి సమయాల్లో ఓ సద్గుణం గలవాడు పరిస్థితిని గమనించి మేల్కొంటాడు. అయితే ఓ పాషాణ హృదయుడు మాత్రం కేవలం భౌతిక దృష్టితోనే ఆలోచిస్తాడు. తనకు దాపురించిన ఈ చెడ్డ స్థితికి భౌతికమైన కారణాలేమిటా అని ఆరాతీసే ప్రయత్నం చేస్తాడు. ఇలా అతడు తన వైఖరిని మార్చుకోవడంగాని, తన తప్పుల్ని సరిదిద్దుకోవడం గాని చేయడు. పైపెచ్చు చెడు త్రోవలు త్రొక్కడంలో మరింత సాహసం ప్రదర్శిస్తాడు.

అల్లాహ్ ఇలాంటి వక్ర ఆలోచనలు, కఠోర హృదయంగల మనిషికి ప్రపంచ సుఖభోగాలను, సిరిసంపదలను బహూకరిస్తాడు. ఈ తిరుగుబాటుదారునికి కలిగిన కలిమికి గల కారణం దేవునికి అతడంటే ఇష్టమని కాదు. అదో భ్రమమాత్రమే. ఆ మాయలో పడ్డ అతనికి ప్రపంచ భోగభాగ్యాలన్నీ తనకే ఇనుమడించాయని భ్రమ కలుగుతుంది. అయితే చూసేవాళ్ళు మాత్రం అతని వృద్ధి వికాసాలనే చూస్తారు గాని క్రమక్రమంగా అతని ఆ ప్రగతే అతణ్ణి వినాశనం అంచుకునెట్టేస్తుంది, అలాగే దేవుని అదృశ్య హస్తం, అహంతో బిర్రబిగిసిన అతని మెడను విరిచేస్తుంది అని అనుకోరు. ఈ విషయాన్నే అల్లాహ్ తన దివ్య గ్రంథంలో ఇలా సెలవిచ్చాడు : "పోతే మా ఆయత్‌లు అసత్యాలని తిరస్కరించినవారు, మేము వారిని క్రమేణా వారు అసలు తెలుసుకోలేని తీరుగా వినాశనం వైపుకు తీసుకుపోతాము. నేను నా పట్టును వదులు చేస్తున్నాను. నా వ్యూహానికి తిరుగులేదు." (అల్ ఆరాఫ్ : 182, 183)

దైవప్రవక్త (సఅసం) గారి ఈ ప్రవచనానికి, పైన చెప్పిన దివ్య ఖుర్ఆన్ వాక్యాన్ని జోడించి చూస్తే దేవుని మాయ ఏమిటో అర్థం అవుతుంది. వ్యక్తులు ఈ మాయలో చిక్కుకున్నట్లే, జాతులకు జాతులే సామూహికంగా ఇందులో చిక్కుకుపోయాయి.

ఇలా దైవ ధిక్కార వైఖరికి పాల్పడి, ఆయన్ను తిరస్కరించిన వారికి అల్లాహ్ మరింత పట్టు విడిపునిస్తూ సిరిసంపదల్ని ప్రసాదిస్తున్నాడంటే అది ఆ వ్యక్తిపైగాని, సమాజంపైగాని ప్రేమ ఉండి కాదు. ఆ వైఖరిలో విచ్చలవిడిగా వదలివేసి వారి పాపం పూర్తిగా పండాకే వారిపై పట్టును బిగించడం జరుగుతుంది.

ఇలాగే ఓ జాతి సమిష్టిగా దైవ ధిక్కార నేరాలు చేస్తూనే ప్రగతి సోపానాలనధిరోహిస్తూ ఉంటుంది. అన్ని విధాల అభివృద్ధి గాంచుతూనే ఉంటుంది. సంపన్నం

అవుతూనే ఉంటుంది. ఇలా అన్ని విధాలుగా ప్రగతిని సాధిస్తున్న జాతిని చూసి అది దైవానికి ప్రియమైన జాతి అని తలపోస్తే పొరపాటే. ఇది దేవుని తరఫున ఆ జాతికి లభించిన పట్టు విడుపు అవకాశం మాత్రమే. ఇదంతా దానికి రాబోయే శిక్షకు నాందీ వాచకం. దాని పాపాలు పూర్తిగా పండాక అనుకోకుండా దైవశిక్షకు సంబంధించిన ఓ చిన్న కుదుపే ఆ జాతిని నామరూపాల్లేకుండా చేయగలదు.

## ఈ ప్రపంచం చనిపోయిన ఓ మేక కళేబరం లాంటిది

(۱۴) مَرَّ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ بِشَاۃٍ مَیْتَۃٍ قَدْ
اَلْقَاھَا اَھْلُھَا فَقَالَ وَالَّذِیْ نَفْسِیْ بِیَدِہٖ لَلدُّنْیَا
اَھْوَنُ عَلَی اللّٰہِ مِنْ ھٰذِہٖ عَلٰی اَھْلِھَا۔

(مسند احمد بن عباس نمبر ۳۰۴۸)

14. దైవప్రవక్త (సఅసం) దారినపోతూ ఉండగా చనిపోయిన ఓ మేక కళేబరం ఆయన కంట పడింది. చనిపోయినందున మేక యజమాని దాన్ని బయటపారేశాడు. (దాన్ని చూసి) ఆయన (స)ఇలా సెలవిచ్చారు:

"నా ప్రాణాలు ఎవరి గుప్పెట్లో అయితే ఉన్నాయో ఆ దేవుని సాక్షి! ఈ మేక యజమాని దృష్టిలో ఎలా చులకనైపోయిందో అల్లాహ్ దృష్టిలో ఈ ప్రపంచం అంతకంటే విలువ లేకుండా ఉంది."

(ఇబ్నె అబ్బాస్ - ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

చనిపోయిన మేకకు దాని యజమాని ఎలాంటి విలువ నివ్వని విషయం మనకు తెలిసిందే. అంటే ఈ ప్రపంచ సిరిసంపదలు, దాని ఆర్భాటాలు అల్లాహ్ దష్టిలో చచ్చిపోయిన మేక కళేబరం కంటే హేయమైనవి అని అర్థం.

## దైవప్రవక్త (సఅసం) దృష్టిలో ఇహలోకం

(۱۵) نَامَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ عَلٰی حَصِیْرٍ فَقَامَ وَقَدْ
اَثَّرَ فِیْ جَنْبِہٖ فَقُلْنَا یَا رَسُوْلَ اللّٰہِ لَوِ اتَّخَذْنَا لَکَ وِطَاءً
فَقَالَ مَالِیْ وَلِلدُّنْیَا وَمَا اَنَا فِی الدُّنْیَا اِلَّا کَرَاکِبٍ

اِسْتَظَلَّ تَحْتَ شَجَرَةٍ ثُمَّ رَاحَ وَتَرَكَهَا.

(ترمذی عن ابن مسعود ابواب الزهد)

15. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) గారి ఉల్లేఖనం ఇలా ఉంది : "మహాప్రవక్త (సఅసం) (ఖర్జూరపు ఆకుల్తో అల్లిన) ఓ చాపపై పడుకొని లేచి నిలబడగా ఆయన వీపుపై చాప తాలూకు చారలు శరీరంపై కనిపించాయి. అప్పుడు మేము, దైవప్రవక్తా! మీ సుఖం కోసం మేమొక పరుపును తయారుచేస్తే ఎలా ఉంటుంది' అని విన్నవించుకున్నాం. అప్పుడాయన "ఈ ప్రపంచంతో నాకేమిటి పని? ఈ లోకంలో నేను కేవలం, చెట్టు నీడన కాసేపు సేద తీర్చుకొని ఆ చెట్టును, దాని నీడను వదిలేసి, తన ప్రయాణం సాగించే ఒక రౌతులాంటి వాణ్ణి మాత్రమే" అని ప్రవచించారు. (ఇబ్నె మస్ఊద్ – తిర్మిజి)

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం) దృష్టిలో ఈ ప్రపంచం ఓ చెట్టునీడ లాంటిది. అలసిపోయిన బాటసారులు ఆ నీడన కొంచెం సేపు ఆగి సేదతీర్చుకొని తిరిగి తమ గమ్యం వైపుకు వెళ్ళిపోతారు. ప్రపంచ వ్యామోహంలో చిక్కుకొని తమ ప్రాణాల్నే పణంగా పెట్టుకునే వారు ఈ యదార్థాన్ని గురించి ఆలోచించాల్సి ఉంది.

(١٦) دَخَلْتُ عَلٰى رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ مُضْطَجِعٌ عَلٰى حَصِيْرٍ فَجَلَسْتُ فَاَدْنٰى عَلَيْهِ اِزَارَهٗ وَلَيْسَ عَلَيْهِ غَيْرُهٗ وَاِذَا الْحَصِيْرُ قَدْ اَثَّرَ فِيْ جَنْبِهٖ فَنَظَرْتُ بِبَصَرِيْ فِيْ خِزَانَةِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَاِذَا اَنَا بِقُبْضَةٍ مِنْ شَعِيْرٍ نَحْوَ الصَّاعِ وَمِثْلِهَا قَرَظًا فِيْ نَاحِيَةِ الْغُرْفَةِ وَاِذَا اَفِيْقٌ مُعَلَّقٌ قَالَ فَابْتَدَرَتْ عَيْنَايَ قَالَ مَا يُبْكِيْكَ يَا ابْنَ الْخَطَّابِ؟ قُلْتُ يَا نَبِيَّ اللّٰهِ وَمَا لِيْ لَا اَبْكِيْ وَهٰذَا الْحَصِيْرُ قَدْ اَثَّرَ فِيْ جَنْبِكَ وَهٰذِهٖ خِزَانَتُكَ لَا اَرٰى فِيْهَا اِلَّا مَا اَرٰى وَذَاكَ قَيْصَرُ وَكِسْرٰى

فِي الثِّمَارِ وَالْأَنْهَارِ وَأَنْتَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَ
سَلَّمَ وَصَفْوَتُهُ وَهٰذِهٖ خِزَانَتُكَ فَقَالَ يَا ابْنَ
الْخَطَّابِ أَلَا تَرْضٰى أَنْ تَكُونَ لَنَا الْآخِرَةُ وَلَهُمُ
الدُّنْيَا قُلْتُ بَلٰى (مسلم عن عمر بن الخطاب كتاب الطلاق)

16. హజ్రత్ ఉమర్ (రజి) గారి కథనం ఇలా ఉంది : "దైవప్రవక్త (సఅసం) చాపపై పడుకొని ఉండగా నేనాయన దగ్గరికి వెళ్లి కూర్చున్నాను. (నా రాకతో) ఆయన తన లుంగీ వస్త్రాన్ని సర్దుకున్నారు. అప్పుడు ఆయనకున్న వస్త్రం ఇదొక్కటే. ఆయన వంటి పై చాప గుర్తులు కనబడ్డాయి నాకు. ఆయన సామానుల గది వైపు దృష్టిని మళ్ళించగా నా కందులో సుమారు మూడున్నర శేర్ల ఓట్లు, అంతే మోతాదులో తోలు నానబెట్టడానికి వాడే ఆకులు అగుపించాయి. గోడపై పూర్తిగా కమాయిషు చేయని ఓ చర్మం కూడా వ్రేలాడుతోంది. (ఈ దృశ్యాన్ని చూసి) నా కళ్ళు అశ్రుపూరితా లయ్యాయి."

(అది చూసి) "ఉమర్! ఎందుకు దుఃఖిస్తున్నావు? అని అడిగారు మహాప్రవక్త (సఅసం). ఇంకా నాకు ఏడ్పు రాకుండా ఉండగలదా దైవప్రవక్తా! ఆ చాప గుర్తులు మీ దేహంపై ఎలా ముద్రబడ్డాయో చూడండి. మీ సామానుల గిడ్డంగి కూడా నే చూస్తున్నాను గదా. ఎంతైనా తమరు దైవ సందేశహరులు గదా! అటు రోమ్, ఈరాన్ పాలకులు పొందే సుఖభోగాలేమిటో కూడా నాకు తెలుసు" అని విన్నవించుకున్నాను.

అప్పుడు మహాప్రవక్త (సఅసం) "ఉమర్! మనకోసం పరలోకపు వరాలున్నాయి. వాళ్ళు వాటిని ఈ ప్రపంచంలోనే అనుభవిస్తున్నారు. ఆ (పరలోక) వరాల్ని నీవు కోరుకోవా? అని అడిగారు. దానికి అవును, తప్పనిసరిగా (కోరుకుంటాను) అన్నాన్నేను." (ఉమర్ బినుల్ ఖత్తాబ్ ఉల్లేఖనం – ముస్లిమ్)

**సంగ్రహణం :**

ఈ సంఘటన బహుశా హిజ్రీ ఆరవ శకంలో జరిగింది. దైవప్రవక్త (సఅసం)

ఇస్లామీయ సామ్రాజ్యానికి పాలకులుగా ఉన్నారు అప్పుడు. శరీరంపై చొక్కాగాని, దుప్పటిగాని లేని కారణంగా చాప తాలూకు గుర్తులు ఆయన శరీరంపైన కానవచ్చాయి ఉమర్ (రజి) గారికి. ఆ పరిస్థితిని సహించలేక పోయారు. మూడున్నర శేర్ల ఓట్లు, తోలు కమాయిషుకు సంబంధించిన ఆకులు మాత్రమే కనబడ్డాయి గోదాములో. తోలు తిత్తికోసం ఓ తోలు వ్రేలాడుతూ ఉండగా చూశారాయన. అది గమనించిన ఆయనకు కళ్ళ నీళ్లు సుళ్ళు తిరిగాయి. అయితే దైవప్రవక్త (సఅసం) ప్రపంచ భోగభాగ్యాలకు బదులు పరలోక వరాలకే అధిక ప్రాధాన్యత ఇచ్చి ఆయన బాధను పోగొట్టారు. ప్రపంచ సిరిసంపదల్ని, సుఖాలను ప్రోగుచేసుకోవడం మన ధ్యేయం కాదు, పరలోక సాఫల్యమే మన లక్ష్యం అన్న యదార్థాన్ని ఆయన మనో మస్తిష్కాల్లో ముద్రవేశారు దైవప్రవక్త (సఅసం).

## ప్రపంచం పరీక్షా సదనం

(١٧) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اِنَّ الدُّنْيَا حُلْوَةٌ
خَضِرَةٌ وَاِنَّ اللهَ مُسْتَخْلِفُكُمْ فِيْهَا فَيَنْظُرُ كَيْفَ تَعْمَلُوْنَ
فَاتَّقُوا الدُّنْيَا وَاتَّقُوا النِّسَآءَ فَاِنَّ اَوَّلَ فِتْنَةَ بَنِيْ
اِسْرَائِيْلَ كَانَتْ فِي النِّسَاءِ (مسلم عن ابى سعيد الخدرى كتاب الذكر والدعاء)

17. దైవసందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు : ప్రపంచం బహుతీపైనది, అతి చక్కనైనదీను. అల్లాహ్ మిమ్మల్ని దీనికి పాలకులుగా చేసి మీ వైఖరి ఎలా ఉంటుందో చూడాలని పరీక్షించదలిచాడు. మీరు ప్రపంచ అందచందాలకు, ప్రపంచ వ్యామోహాలకు దూరంగా ఉండండి. అంతేకాకుండా స్త్రీ సంబంధమైన 'ఉపద్రవం' (ఫిత్నా) గురించి జాగ్రత్త పడండి. 'ఇస్రాయీల్ సంతతివారు స్త్రీ సంబంధమైన ఉపద్రవంలోనే చిక్కుకున్నారు ప్రప్రథమంగా." (అబూ సయీద్ ఖుద్రీ (రజి) – ముస్లిమ్)

**సంగ్రహణం :**

1. సిరిసంపదల్లోను, ప్రభుత్వ అధికారాల్లోను మనస్సు మరులుగొంటే, అవన్నీ అశాశ్వతాలే, అంతం అయిపోయేవే అన్న విషయాన్ని నమ్మండి. ఆకు పచ్చదనంతో కళకళలాడే పూదోటలు, పచ్చటి పొలాలు ఎంత అందాన్ని ఆహ్లాదాన్ని పంచిపెట్టినా తుదకు ఓ నాటికి వాడిపోయేవే.

2. అలాగే ప్రభుత్వం, అధికారం అల్లాహ్ ప్రసాదించిన అమానతులే. ఆయన ఆ అధికారాన్నిచ్చి మిమ్మల్ని పరీక్షించదలిచాడు. అలా మీకు ప్రాప్తమైన అధికారంతో నమ్రతగా ఆయనకు విధేయత చూపుతారా? మంచిని పెంచుతూ చెడును నిర్మూలిస్తారా? లేక ఆ అధికారంతో విర్రవీగుతూ ఆయన్ను ధిక్కరించి చెడుల్ని పెంచి పోషిస్తూ మంచి మార్గాలకు అడ్డుకట్టలు వేస్తారా? అదేవిధంగా పాపకార్యాల్ని భువిలో వ్యాపింపజేయడానికి మీకు లభించిన అధికారాన్ని వినియోగిస్తారా? అన్నది చూడ్డానికే ఆయన మీకు అధికారాన్నిచ్చి పరీక్షించదలచాడు.

3. ప్రపంచ అందచందాల్ని చూసి మనిషి మోసపోవచ్చు. ముఖ్యంగా దైవధిక్కార సంబంధమైన సంస్కృతి సభ్యతలు ఈ ప్రపంచపు అందచందాల్ని, వ్యామోహాల్ని మరింత పెంచేస్తున్నాయి. ప్రపంచ ఉపద్రవాల నుంచి తమను తాము రక్షించుకోవాలంటే, దృఢమైన విశ్వాసం, అచంచలమైన కార్యదీక్ష, మచ్చలేని నడవడి అవసరం. ప్రపంచ వ్యామోహం అనే ఇంద్రజాలాన్ని పటాపంచలు చేయాలంటే దేవునితో దృఢమైన సంబంధం పెట్టుకోవడం ముఖ్యం.

4. ఈ ఉపద్రవం తర్వాత ముస్లిమ్ సమాజం తనను తాను రక్షించుకోవలసింది స్త్రీ ఉపద్రవం నుండి. ఇదే హదీసులో ఇవ్వబడ్డ ఆదేశం. ఇస్రాయీలు జాతిని నట్టేట ముంచింది ఈ ఉపద్రవమే. ప్రగతిని సాధించి, శక్తిమంతమైన గొప్ప గొప్ప జాతులే ఈ స్త్రీ ఉపద్రవానికి (ఫిత్నాకు) బలైపోయినట్లు చరిత్ర చాటిచెబుతూ ఉన్న సత్యం. పాశ్చాత్య సభ్యతా సంస్కృతులు బాగా వ్యాపిస్తున్న ఈ కాలంలో ఈ ఉపద్రవం తీవ్రత మరింత హెచ్చింది. రేడియో, టీ.వీ, సినిమా లాంటి మీడియాలు స్త్రీ పురుషుల విచ్చలవిడి కలయిక, క్లబ్బులు, అశ్లీల సాహిత్యం అగ్నికి ఆజ్యం పోసినట్లు మరింత మరులుగొలుపుతున్నాయి సమాజాన్ని.

## గుణపాఠం గరిపే సంఘటన

(١٨) عَنْ اَبِیْ هُرَیْرَةَ اَنَّهٗ سَمِعَ النَّبِیَّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
یَقُوْلُ اِنَّ ثَلٰثَةً فِیْ بَنِیْ اِسْرَاءِیْلَ اَبْرَصَ وَ اَقْرَعَ وَ
اَعْمٰی فَاَرَادَ اللّٰهُ اَنْ یَّبْتَلِیَهُمْ فَبَعَثَ اِلَیْهِمْ مَلَکًا فَاَتَی
الْاَبْرَصَ فَقَالَ اَیُّ شَیْءٍ اَحَبُّ اِلَیْکَ؟ قَالَ لَوْنٌ
حَسَنٌ وَجِلْدٌ حَسَنٌ وَیَذْهَبُ عَنِّیَ الَّذِیْ قَدْ قَذِرَنِیَ
النَّاسُ قَالَ فَمَسَحَهٗ فَذَهَبَ عَنْهُ قَذَرُهٗ وَاُعْطِیَ

لَوْنًا حَسَنًا وَجِلْدًا حَسَنًا قَالَ فَأَيُّ الْمَالِ أَحَبُّ
إِلَيْكَ قَالَ الْإِبِلُ فَأُعْطِيَ نَاقَةً عُشَرَاءَ فَقَالَ بَارَكَ
اللّٰهُ لَكَ فِيْهَا قَالَ فَأَتَى الْأَقْرَعَ فَقَالَ أَيُّ شَيْءٍ أَحَبُّ
إِلَيْكَ فَقَالَ شَعْرٌ حَسَنٌ وَيَذْهَبُ عَنِّيْ هٰذَا الَّذِيْ
قَدْ قَذِرَنِيَ النَّاسُ قَالَ فَمَسَحَهُ فَذَهَبَ عَنْهُ
قَالَ وَأُعْطِيَ شَعْرًا حَسَنًا قَالَ فَأَيُّ الْمَالِ أَحَبُّ إِلَيْكَ
قَالَ الْبَقَرُ فَأُعْطِيَ بَقَرَةً حَامِلًا قَالَ بَارَكَ اللّٰهُ تَعَالٰى
لَكَ فِيْهَا قَالَ فَأَتَى الْأَعْمٰى فَقَالَ أَيُّ شَيْءٍ أَحَبُّ إِلَيْكَ؟
قَالَ أَنْ يَرُدَّ اللّٰهُ إِلَيَّ بَصَرِيْ فَأُبْصِرُ بِهِ النَّاسَ قَالَ فَمَسَحَهُ
فَرَدَّ اللّٰهُ إِلَيْهِ بَصَرَهُ قَالَ فَأَيُّ الْمَالِ أَحَبُّ إِلَيْكَ قَالَ
الْغَنَمُ فَأُعْطِيَ شَاةً وَالِدًا فَأُنْتِجَ هٰذَانِ وَوَلَّدَ هٰذَا
فَكَانَ لِهٰذَا وَادٍ مِنَ الْإِبِلِ وَلِهٰذَا وَادٍ مِنَ الْبَقَرِ وَلِهٰذَا
وَادٍ مِنَ الْغَنَمِ قَالَ ثُمَّ إِنَّهُ أَتَى الْأَبْرَصَ فِيْ صُوْرَتِهِ
وَهَيْئَتِهِ فَقَالَ رَجُلٌ مِسْكِيْنٌ قَدِ انْقَطَعَتْ بِيَ الْحِبَالُ
فِيْ سَفَرِيْ فَلَا بَلَاغَ لِيَ الْيَوْمَ إِلَّا بِاللّٰهِ ثُمَّ بِكَ، أَسْأَلُكَ
بِالَّذِيْ أَعْطَاكَ اللَّوْنَ الْحَسَنَ وَالْجِلْدَ الْحَسَنَ وَالْمَالَ
بَعِيْرًا أَتَبَلَّغُ عَلَيْهِ فِيْ سَفَرِيْ فَقَالَ الْحُقُوْقُ كَثِيْرَةٌ فَقَالَ
لَهُ كَأَنِّيْ أَعْرِفُكَ أَلَمْ تَكُنْ أَبْرَصَ يَقْذَرُكَ النَّاسُ فَقِيْرًا
فَأَعْطَاكَ اللّٰهُ فَقَالَ إِنَّمَا وَرِثْتُ هٰذَا الْمَالَ كَابِرًا عَنْ كَابِرٍ فَقَالَ
إِنْ كُنْتَ كَاذِبًا فَصَيَّرَكَ اللّٰهُ إِلٰى مَا كُنْتَ قَالَ وَأَتَى الْأَقْرَعَ
فِيْ صُوْرَتِهِ فَقَالَ لَهُ مِثْلَ مَا قَالَ لِهٰذَا وَرَدَّ عَلَيْهِ مِثْلَ
مَا رَدَّ عَلٰى هٰذَا فَقَالَ إِنْ كُنْتَ كَاذِبًا فَصَيَّرَكَ اللّٰهُ إِلٰى

مَا كُنْتَ قَالَ وَ اَتَى الْاَعْمٰى فِىْ صُوْرَتِهٖ وَهَيْئَتِهٖ فَقَالَ رَجُلٌ مِسْكِيْنٌ وَ اِبْنُ سَبِيْلٍ اِنْقَطَعَتْ بِىَ الْحِبَالُ فِىْ سَفَرِىْ فَلَا بَلَاغَ لِىَ الْيَوْمَ اِلَّا بِاللّٰهِ ثُمَّ بِكَ اَسْأَلُكَ بِالَّذِىْ رَدَّ عَلَيْكَ بَصَرَكَ شَاةً اَتَبَلَّغُ بِهَا فِىْ سَفَرِىْ فَقَالَ قَدْ كُنْتُ اَعْمٰى فَرَدَّ اللّٰهُ اِلَىَّ بَصَرِىْ فَخُذْ مَا شِئْتَ وَدَعْ مَا شِئْتَ فَوَاللّٰهِ لَا اَجْهَدُكَ الْيَوْمَ شَيْئًا اَخَذْتَهٗ لِلّٰهِ فَقَالَ اَمْسِكْ مَالَكَ فَاِنَّمَا ابْتُلِيْتُمْ فَقَدْ رُضِىَ عَنْكَ وَسُخِطَ عَلٰى صَاحِبَيْكَ۔

(مسلم کتاب الزھد۔ بخاری کتاب احادیث الانبیاء)

18. దైవప్రవక్త (సఅసం) ప్రవచించగా తాను విన్నానని హ॥జత్ అబూ హురైరా (రజి) ఇలా ఉల్లేఖించారు:

“అల్లాహ్ బనీ ఇస్రాయీలు జాతికి చెందిన ముగ్గురు వ్యక్తులను 1. కుష్ఠురోగి 2. బట్టతల గలవాడు 3. గుడ్డివాడు - పరీక్షించదలిచి ఓ దైవదూతను వారి దగ్గరికి పంపించాడు.

1. (అతడు మానవరూపంలో ప్రథమంగా) కుష్ఠురోగి దగ్గరకు వచ్చి నీకు ఇష్టమైన వస్తువేది? అని అడుగుతాడు. దానికి ఆ కుష్టురోగి, “అందమైన శరీరచ్ఛాయ, మృదువైన చర్మం, ప్రజలు నేనంటే అసహ్యం చుకునే ఈ కుష్టువ్యాధి నామరూపాల్లేకుండా పోవడం” అని బదులిస్తాడు.

దైవదూత అతని శరీరాన్ని తన చేత్తో నిమరగా అతని ఆ కుష్టు వ్యాధి మటుమాయమైపోయింది. దేవుడు అతనికి మేలైన చర్మాన్ని అందమైన శరీరచ్ఛాయను ప్రసాదించాడు. ఆ తరువాత దైవదూత అతనిని ఉద్దేశిస్తూ నీకెలాంటి సంపద అంటే ఇష్టం అని అడుగుతాడు. నాకు ఒంటె అంటే ఇష్టం అంటాడా వ్యక్తి. దేవుడు అతనికి పది నెలల నిండు చూడిగల ఒంటెను ప్రసాదిస్తాడు. నీకు దీనితో మంచి శుభం కలుగుతుంది అని వెళ్ళిపోతాడు ఆ దైవదూత.

2. తరువాత ఆ దైవదూత బట్టతలగల వ్యక్తి వద్దకు వచ్చి నీకు ఇష్టమైనదేది అని అడుగుతాడు. (నా తలపైన) అందమైన జుట్టు, ఈ బాధ నాకు దూరం కావాలి. ప్రజలు నన్ను చూసి అసహ్యించుకుంటున్నారు అన్నాడా వ్యక్తి.

దైవదూత అతని తలపై చేత్తో నిమురుతాడు. దేవుడు అతనికి అందమైన జుట్టును ప్రసాదిస్తాడు. అతని బాధంతా దూరమైపోతుంది. ఆ తరువాత, నీకు ఎలాంటి సంపద అంటే ఇష్టం అని అడుగుతాడు దైవదూత. 'ఆవు' అన్నాడా వ్యక్తి. అల్లాహ్ అతనికి ఓ చూడి ఆవును ప్రసాదిస్తాడు. ఇందులో నీకు శుభం ఉంది అని చెప్పి వెళ్ళిపోయాడు దైవదూత.

3. ఆ తరువాత దైవదూత గ్రుడ్డివాని దగ్గరికి వెళ్ళి నీకేదంటే ఇష్టం అని ప్రశ్నిస్తాడు. అల్లాహ్ నా చూపును నాకు తిరిగి ఇచ్చేస్తే ప్రజల్ని చూద్దును అని బదులిస్తాడు ఆ అంధుడు. దైవదూత అతని కళ్ళను తన చేత్తో స్పృశించగానే దేవుడు అతనికి దృష్టి ప్రసాదిస్తాడు. నీకు ఎలాంటి సంపద అంటే ఇష్టం అని మళ్ళీ అడుగుతాడు దైవదూత, "మేక అంటే నాకిష్టం" అంటాడు ఆ వ్యక్తి. దేవుడు అతనికి ఓ మేకను ప్రసాదిస్తాడు.

ఆ ముగ్గురిలో ప్రతివాడు వారికి లభించిన పశువుల్ని ఈనే వరకు జాగ్రత్తగా చూసుకుంటారు. (అల్లాహ్ వారి ఈ జంతువుల్లో ఎంతో శుభాన్ని కలిగించాడు) మొదటి వ్యక్తి ఒంటెలతో ఓ మైదానమే నిండిపోయింది. రెండో వ్యక్తి ఆవుల్తో ఓ విశాల ప్రదేశమే నిండింది. మూడో వ్యక్తి మేకలతో ఓ లోయ నిండిపోయింది.

1. అప్పుడు ఆ దైవదూత కుష్టురోగిగా మారి కుష్ఠురోగి నుంచి మార్పు చెందిన వాని దగ్గరికి అతని పరిస్థితులలో వస్తాడు. నేను ఓ పేద బాటసారిని, ప్రయాణం చేసేటప్పుడు నా ఉపాధినంతా కోల్పోయాను. నాకిప్పుడు పూట గడవడం కూడా కష్టంగా ఉంది. దైవం తలిస్తే, మీరు నాకు ఏదైనా దానం చేస్తే తప్ప నేను నిలువలేను. నీకు ఈ అందమైన శరీర ఛాయను, మృదువైన శరీరాన్ని, ఇన్ని సిరిసంపదల్ని ప్రసాదించిన

ఆ దైవం పేరుమీద ఓ ఒంటెను దానం చేయండి. నేను నా ప్రయాణాన్ని కొన సాగించుకుంటాను అని యాచించాడు.

అతడు, "ప్రజల హక్కులు (నాపై) చాలా ఉన్నాయి. (కాబట్టి నేను నీకు ఏమీ ఇచ్చే స్థితిలో లేను)" అని అన్నాడు. అప్పుడా దైవదూత నేను నిన్ను బాగా గుర్తు పట్టగలను. నీవు పూర్వం ఓ కుష్టురోగివి కాదా? నీవంటే ప్రజలు అసహ్యించుకునే వాళ్ళు కారా? అల్లాహ్ నీకు ఈ సిరిసంపదలన్నీ ప్రసాదించాడు కదూ అని అడిగాడు. దానికి ఆ వ్యక్తి (కాదు కాదు) నాకీ సంపదంతా నా తాతముత్తాతల నుండి వారసత్వంలో సంక్రమించిందే. ఇది వారికి వారి తాతముత్తాతల నుండి వచ్చింది అన్నాడు.

నీవు బొంకుతున్నావు. దేవుడు నీకు నీ మొదటి స్థితిలోనికి తీసుకొని వచ్చుగాక అని చెప్పి వెళ్ళిపోయాడు.

2. అక్కడ్నుంచి ఆ దైవదూత ఇది వరకు బట్టతల గలవాని దగ్గరకు అదే రూపంలో వెళ్ళాడు. అతనితో కూడా ఆ కుష్టు రోగితో మాట్లాడిన విధంగానే మాట్లాడాడు. ఆ బట్టతల వాడు కూడా కుష్టురోగిలా దైవమార్గంలో ఆవును ఇవ్వనిరాకరించాడు.

అప్పుడు దైవదూత, "నీవు అసత్యవాదివి. దేవుడు నిన్ను నీ మొదటి స్థితిలోనికి మార్చుగాక" అని శపించి వెళ్ళిపోయాడు.

3. నిరుపేదవాడైన అంధుని రూపంలో ఆ దైవదూత గతంలో అంధునిగా ఉన్న వ్యక్తి దగ్గరికి వెళ్ళి, "నేను నిరుపేద బాటసారిని, ఈ ప్రయాణంలో నా ఉపాధినంతా పోగొట్టుకున్నాను. పూట కూడ గడువనంత విషమ పరిస్థితి ఏర్పడింది. దైవం అనుగ్రహిస్తే, నీవు ఏదైనా దానం చేస్తే తప్ప నేను మనుగడ సాగించలేను. ఏ దేవుడు నీకు దృష్టిని ప్రసాదించాడో, ఆయన పేరుమీద నాకు ఓ మేకను దానం చెయ్యి. దాని ద్వారా నీ ప్రయాణం సాఫీగా సాగుతుంది" అని అడిగాడు.

దానికి ఆ వ్యక్తి, "నేను (గ్రుడ్డివానిగా ఉన్నప్పుడు అల్లాహ్ నాకు దృష్టిని ప్రసాదించాడు, నేను నిరుపేదగా ఉంటే నాకు సిరిసంపదలు ప్రసాదించాడు) నా మేకల మంద నుండి ఎన్ని మేకలు కావాలో తీసుకొని

వెళ్ళు మరెన్ని నా కోసం వదులుతావో వదులు. అంతా నీ ఇష్టం. దేవుని సాక్షి! ఈ రోజు నీవు అల్లాహ్ పేరుమీద నా నుండి ఏది కోరుకుంటావో అది తీసుకో. నేను మట్టుకు నీకు ఎలాంటి కష్టం కలుగనీయను. (అంటే నాకు ఏ విధంగా రుణపడి ఉండవు సుమా!)" అని అన్నాడు. అప్పుడు (అంధుని రూపంలో వచ్చి యాచించిన) ఆ దైవదూత "నీ సిరిసంపదల్ని నీ దగ్గరనే ఉంచుకో. మీ ముగ్గురిని అల్లాహ్ పరీక్షించాడు (ఈ పరీక్షలో నీవు నెగ్గావు.) దైవం నిన్ను మెచ్చాడు. నీ మిత్రులు ఇద్దరు అల్లాహ్ క్రోధాన్ని కావాలని కోరుకున్నారు" అని అన్నాడు (అబూ హురైరా (రజి) – బుఖారి, ముస్లిమ్)

**సంగ్రహణం :**

కొంతకాలానికి ఆ (ఇద్దరు స్నేహితుల) ఒంటెలు, ఆవుల్లో వ్యాధి ప్రబలింది. మొదట, ఆ ఇద్దరూ తమ సంపదనంతా కోల్పోయారు. ఆ తరువాత ఇదివరకు సంక్రమించిన వ్యాధి తిరగబెట్టింది.

ఈ హదీసు మనందరికీ మంచి గుణపాఠం. ఎవరికైతే, వారి అవసరాలకు మించి అల్లాహ్ సిరిసంపదల్ని ప్రసాదించాడో, వారు ఈ సిరి అంతా తమ వద్దనే ఉండిపోతుంది అని భావించకూడదు. ఇది ఒకరి వద్దకు చేరగలిగినప్పుడు అచటి నుండి మరో చోటికి వెళ్ళిపోనూగలదు. ఉపాధిని ప్రసాదించిన ప్రభువే దాన్ని తిరిగి లాక్కోనుగలడు.

సంపన్నులు, శ్రీమంతులు తమకు కలిగిన ఆర్థిక స్తోమత, హోదాలను గురించి విర్రవీగకూడదు. అల్లాహ్ ప్రసాదించిన వరాలను గౌరవిస్తూ, ఈ వరాలను సమకూర్చిన ఆ దైవానికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ ఉండాలి.

అదేకాకుండా ఈ సిరులన్నీ, అల్లాహ్ కేవలం ఆయన కారుణ్యం ద్వారా నాకు బహూకరించాడు అన్నది ఒప్పుకోవాలి. నేను స్వతహాగా ఆ వరాలకు అనర్హుణ్ణి అని అనుకోవాలి. సమాజంలోని బలహీనుల ఎడల, నిరుపేదల ఎడల కారుణ్యం, దయాగుణం ప్రదర్శించాలి. వారిని హేయమైన వారిగా, నీచులుగా చూడకుండా గౌరవించి సహాయపడాలి.

అల్లాహుతాలా ఈ విశ్వంలో దేన్నీ పనికిమాలినదిగా, వ్యర్థంగా, అర్థం లేనటువంటిదిగా సృజించలేదు. అనాథలు, బలహీనులు, వికలాంగులు, ఏ విధమైన ఆధారం లేనివాళ్ళను సృష్టించడంలో ఏదో మర్మం ఇమిడి ఉంది. ఓ విధంగా వీరిని సృష్టించి ఆయన ధనవంతుల్ని, శ్రీమంతుల్ని ఎందుకు పరీక్షించకూడదు?

పిసినారితనం అన్నది మానసిక వ్యాధి. ఇది మనిషిని పాషాణ హృదయునిగా,

నిర్దయునిగా చేస్తుంది. పిసినారి అయిన శ్రీమంతుడు తన సిరిసంపదల్ని దైవానుగ్రహంగా తలచకుండా తన సొంత శ్రమ, సొంత శక్తి సామర్థ్యాల ఫలితమే అనుకోవడం మనం చూస్తూనే ఉన్నాం. ఈ భావనే పిసినారితనానికి మూలకారణం.

ఆస్తి అంతా తన తాత తండ్రుల నుండి వారసత్వంగా తనకు సంక్రమించిన ఆస్తిగానే భావిస్తాడు. అందులో పేదల హక్కు కూడా ఉందన్న యదార్థాన్ని గ్రహించడు.

అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టమని చెప్పినప్పుడల్లా ఏదో సాకుచూపి, అసత్యాలాడి తప్పించుకొనే ప్రయత్నం చేస్తాడు.

దానికి భిన్నంగా తన ధనాన్ని అల్లాహ్ అమానతుగా, ఓ వరప్రసాదంగా తలచి ఆయన్ను సంతోషపెట్టడానికి విశాల హృదయంతో ఆయన మార్గంలో ఖర్చుపెట్టేవాడే అల్లాహ్ దృష్టిలో గౌరవనీయుడు, యదార్థవాదీను.

## ధన సంబంధమైన ఉపద్రవం

(١٩) عَنْ كَعْبِ بْنِ عِيَاضٍ قَالَ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اِنَّ لِكُلِّ فِتْنَةً وَفِتْنَةُ اُمَّتِيَ الْمَالُ-

(ترمذی ابواب الزھد)

19. "ప్రతి దైవప్రవక్త సమాజం (ఉమ్మత్) ఏదో ఒక ఉపద్రవం (ఫిత్నా)లో చిక్కుకున్నదే. నా సమాజం (మాత్రం) ధన సంబంధమైన ఉపద్రవంలో చిక్కుకుంటుంది" అని దైవప్రవక్త (సఅసం) తరచు అంటూ ఉండగా మేము విన్నాము అని హజ్రత్ కఅబ్ బిన్ అయాజ్ (రజి) ఉల్లేఖించారు.

*(కఅబ్ బిన్ అయాజ్ (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

ధనవ్యామోహం అన్నది ఓ ప్రమాదభరితమైన ఉపద్రవం అనడంలో ఎలాంటి సందేహం లేదు. ప్రపంచ సిరిసంపదల ప్రాబల్యం మనిషి మెదడుపై చెడు ప్రభావాన్ని వేస్తుంది. సిరి మాధుర్యం చెప్పలేనటువంటి మాధుర్యం. దీని సౌరభం కస్తూరి గుబాళింపుకన్నా మిన్న. దృశ్యం ఆహ్లాదకరం. అందచందాల మాటకొస్తే మనస్సునే మరులుగొలుపుతుందది. అంతేకాకుండా మనిషి సునాయాసంగా దీనికి బానిసై పాపపంకిలంలోనికి జారిపోతాడు.

ఈ ఉపద్రవం నుండి తప్పించుకోవాలంటే మోమిన్ (విశ్వాసి) ఈ క్రింది మార్గాలను అనుసరించక తప్పదు.

1. నిషిద్ధమైన, ధర్మసమ్మతం కాని మార్గాల ద్వారా వచ్చే ఆదాయంలోని ఒక్క పైసాను కూడా స్వీకరించకుండా ఉండాలి.

2. తన ఆస్తిని, నిషేధించబడిన తప్పుడు మార్గాల్లో ఖర్చుపెట్టకుండా ఉండాలి.

3. తన సిరిసంపదలు, ఆస్తిపాస్తులు అల్లాహ్ ప్రసాదించిన అమానతు (ట్రస్ట్) అని తలచి ఓ ధర్మకర్త ఎలా ఖర్చుపెడతాడో అలా ఖర్చుపెట్టాలి.

4. తన సంపదను సాధ్యమైనంతవరకు ఎక్కువగా అల్లాహ్ చూపిన మార్గంలోనే ఖర్చుపెట్టడం సరైన పద్ధతి.

## దురాశాపరుని ధన సంపద శుభరహితం

(٢٠) اِنَّ حَكِيْمَ بْنَ حِزَامٍ رَضِىَ اللّٰهُ عَنْهُ قَالَ سَأَلْتُ رَسُوْلَ
اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَأَعْطَانِىْ ثُمَّ سَأَلْتُهُ فَاَعْطَانِىْ
ثُمَّ سَأَلْتُهُ فَأَعْطَانِىْ ثُمَّ قَالَ يَا حَكِيْمُ اِنَّ هٰذَا الْمَالَ
خَضِرَةٌ حُلْوَةٌ فَمَنْ اَخَذَهُ بِسَخَاوَةِ نَفْسٍ بُوْرِكَ لَهُ
فِيْهِ وَمَنْ اَخَذَهُ بِاِشْرَافِ نَفْسٍ لَمْ يُبَارَكْ لَهُ فِيْهِ
وَكَانَ كَالَّذِىْ يَأْكُلُ وَلَا يَشْبَعُ، اَلْيَدُ الْعُلْيَا خَيْرٌ مِنَ الْيَدِ
السُّفْلٰى قَالَ حَكِيْمٌ فَقُلْتُ يَا رَسُوْلَ اللّٰهِ وَالَّذِىْ بَعَثَكَ
بِالْحَقِّ لَا اَرْزَأُ اَحَدًا بَعْدَكَ شَيْئًا حَتّٰى اُفَارِقَ الدُّنْيَا
فَكَانَ اَبُوْبَكْرٍ رَضِىَ اللّٰهُ عَنْهُ يَدْعُوْ حَكِيْمًا اِلَى الْعَطَاءِ
فَيَأْبٰى اَنْ يَّقْبَلَهُ مِنْهُ ثُمَّ اِنَّ عُمَرَ رَضِىَ اللّٰهُ عَنْهُ دَعَاهُ
لِيُعْطِيَهُ فَأَبٰى اَنْ يَّقْبَلَ مِنْهُ شَيْئًا فَقَالَ عُمَرُ اِنِّىْ
اُشْهِدُكُمْ يَا مَعْشَرَ الْمُسْلِمِيْنَ عَلٰى حَكِيْمٍ اِنِّىْ اَعْرِضُ عَلَيْهِ
حَقَّهُ مِنْ هٰذَا الْفَيْءِ فَيَأْبٰى اَنْ يَأْخُذَهُ فَلَمْ يَرْزَأْ حَكِيْمٌ
اَحَدًا مِنَ النَّاسِ بَعْدَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

حَتّٰى تُوُفِّيَ - (بخاری کتاب الزکوٰۃ۔ کتاب الوصایا۔ کتاب الرقاق۔ مسلم کتاب الزکوٰۃ۔ ترمذی ابواب القیامۃ)

20. హకీమ్ బిన్ హిజామ్ (రజి) ఇలా అన్నారు : "(దైవప్రవక్త (సఅసం) సన్నిధికి యుద్ధసొత్తు రాగా) నాకేదైనా దయచేయరా అని అడిగాను. దైవప్రవక్త (సఅసం) కొంత సొమ్ము తీసి నాకిచ్చేశారు. తిరిగి (రెండోసారి) అడిగాను. నా విన్నపాన్ని మన్నించారు మళ్ళీ. మూడోసారి కూడా ఇలానే యాచిస్తే కొంత సొమ్ము ఇస్తూ ఇలా ప్రవచించారు:

"హకీమ్! ఈ డబ్బు ఎంతో ఇంపైనది. సొంపైనదీను. దీన్ని ఉదార బుద్ధి, విశాల హృదయంతో స్వీకరించేవాడు ఇందులో శుభాన్నికంటాడు. దీన్ని పొందేందుకు తహతహలాడేవాడికి ఇందులో శుభం అన్నదే కనబడదు. అలాంటి వాడు, ఎంత తిన్నా పొట్టనిండని (ఆకలితీరని) వ్యక్తిలాంటి వాడు. దానం చేసే చెయ్యి దానం గ్రహించే చేతికంటే మేలైనది." (ఈ ప్రవచనాన్ని ఉల్లేఖిస్తున్న) హజ్రత్ హకీమ్ (రజి)

"దైవప్రవక్తా! మిమ్మల్ని సత్యధర్మమిచ్చి పంపిన ఆ అల్లాహ్ సాక్షి! నా బొందిలో ప్రాణం ఉన్నంతకాలం ఇక ఇంకెవ్వరినీ యాచించను" అని అన్నారు.

హజ్రత్ అబూబక్ర్ (రజి) గారి ఖిలాఫత్ కాలంలో యుద్ధ ధనపంపకం జరిగేటప్పుడు ఆయన హకీమ్ (రజి)ను పిలిచేవారు. కాని ఆయన తీసుకోవడానికి నిరాకరించారు.

ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) తమ ఖిలాఫత్ కాలంలో, తన భాగాన్ని తీసుకువెళ్ళమని పిలిపిస్తే ఆయన ఒప్పుకోలేదు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి), అక్కడున్న వారినుద్దేశించి ముస్లిములారా! యుద్ధసొత్తు నుండి అల్లాహ్ నీ కోసం కేటాయించిన హక్కును నానుండి వసూలు చేసుకొమ్మని చెబితే ఇతడు ఒప్పుకోవడం లేదు చూశారా? అని అన్నారు. మొత్తానికి హకీమ్ (రజి) దైవప్రవక్త (సఅసం) గారిని యాచించిన తరువాత, తాను చనిపోయేంత వరకు మరెవ్వరిని యాచించలేదు.

(బుఖారి, ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

ధన పిపాస మనిషిని దురాశాపరునిగా చేస్తుంది. వీలైనంత మట్టుకు ధనాన్ని కూడబెట్టుకోవాలని తపన పడతాడు. కూడబెట్టిన ఆ ధనాన్ని పదేపదే లెక్కబెడుతూ, అది కలకాలం తన దగ్గరే ఉండిపోతుందని తలుస్తాడు, తాను బంగారంతో నిండిన ఓ లోయకు యజమాని అయితే (దాంతో తృప్తిపడకుండా) అలాంటి మరో లోయను కూడా పొందాలని కోరుకుంటాడు. అలాగే రెండు లోయలకు యజమాని అయితే మూడో దానికోసం తహతహలాడతాడు.

ఈ పేరాశ ఓ ఆకలిరోగం లాంటిది. ఆకలి రోగం గల వ్యక్తి ఎంత తిన్నా కడుపునిండదు. ఆకలి తీరదు. పేరాశ పిసినారితనం అన్నవి ధనపూజారులను వీలైనంత అధికంగా డబ్బును సంపాదించమని ప్రేరేపిస్తాయి. దురాశకు ఓ హద్దు అనేదే ఉండదు, దాని దగ్గరకు వెళ్ళాక ఇక చాలు అనడానికి మరణం ఆసన్నమైతే తప్ప.

దీనికి భిన్నంగా, ఎవరి మనస్సులో ధన పిపాస ఉండదో, దైవం ఆ వ్యక్తికి శాంతిని, స్థిమితాన్ని ప్రసాదిస్తాడు. అంతేకాకుండా ఈ వరాలు అతని సంపదలో ఆశ్చర్యకరమైన వృద్ధి వికాసాలను, శుభాలను కలుగజేస్తాయి. దైవప్రవక్త (సఅసం) గారి ఈ ప్రవచనాన్ని విన్నాక హకీమ్ బిన్ హిజామ్ (రజి) మరే వ్యక్తి ముందు చెయ్యి చాపి యాచించలేదు, సరికదా ఖలీఫాలు సైతం తన వంతు వాటాను తీసుకొని వెళ్ళమని బలవంతం చేసినా దాన్ని ముట్టనైనా ముట్టలేదు. దైవం ఆయన సిరిసంపదల్లో గొప్ప శుభాన్ని కలిగించినందువల్లే ఆయన మరణించే నాటికి ఖురైష్ తెగలోనే గొప్ప శ్రీమంతుడు అయ్యారు.

## ఈతి బాధలు (ప్రపంచ బాధలు)

٢) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ كَانَتِ الْاٰخِرَةُ
هَمَّهُ جَعَلَ اللّٰهُ غِنَاهُ فِيْ قَلْبِهِ وَجَمَعَ لَهُ شَمْلَهُ وَاَتَتْهُ
الدُّنْيَا وَهِيَ رَاغِمَةٌ وَمَنْ كَانَتِ الدُّنْيَا هَمَّهُ جَعَلَ
اللّٰهُ فَقْرَهُ بَيْنَ عَيْنَيْهِ وَفَرَّقَ عَلَيْهِ شَمْلَهُ وَلَمْ يَأْتِهِ
مِنَ الدُّنْيَا اِلَّا مَا قُدِّرَ لَهُ۔

(ترمذی عن انس بن مالک ابواب صفۃ القیامۃ)

21. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ఇలా ఉంది : "అపరిమితమైన పరలోకచింతన కలిగి ఉన్న వ్యక్తి హృదయానికి అల్లాహ్ తృప్తిని ప్రసాదిస్తాడు. అతని చిక్కుల్ని విడదీసి మనస్సుకు సాంత్వన చేకూరుస్తాడు. ప్రపంచం హీనమై అతని వద్దకు వచ్చి నిలుస్తుంది. (అంటే అతని అదృష్టంలో లిఖించబడ్డ సిరిసంపదలు శ్రమపడకుండానే అతని వద్దకు వచ్చి పడతాయి).

2. మరే వ్యక్తి ప్రపంచ వ్యామోహంలోనే పడి కొట్టుమిట్టాడుతాడో అలాహ్ అతనిపై అసంతృప్తిని, అగత్యాన్ని రుద్దుతాడు. (అంటే అతడు ఎల్లప్పుడు ఒకరిపై ఆధారపడి ఉన్నాను అనే భావనలోనే ఉంటాడు. అల్లాహ్ అతని సజావు సమస్యల్ని చిక్కుల్లో పడవేస్తాడు). అందుకే అతడు మనశ్శాంతిని పోగొట్టుకుంటాడు. ఈ లోకంలో, అతనికి ఎంత భుక్తి అయితే లిఖించబడి ఉందో అంతమట్టుకే లభిస్తుంది." (అనస్ (రజి) - తిర్మిజి)

**సంగ్రహణం :**

"అల్లాహ్ అతనిపై అగత్యాన్ని రుద్దుతాడు" అన్న మాటకు భావం, అతడు ధనవంతుడయినా సరే ఎల్లకాలం తన పేదరికాన్ని గురించే చెప్పుకుంటూ ఉంటాడు అని. భుక్తికి ఉపాధికి సంబంధించిన పరిస్థితులు తనకు ఏమాత్రం అనుకూలంగా లేవని చింతిస్తూ ఉంటాడు. ప్రపంచ వ్యామోహం అనే ఈ దురాశ అతని మనశ్శాంతిని హరించివేస్తుంది.

సిరిసంపదల్లో తన కంటే గొప్పవారిని చూసి, వారి కంటే తాను దరిద్రుణ్ణి అని భావించే అలవాటు హృదయాన్ని ఎప్పుడూ పీడిస్తూనే ఉంటుంది మరి.

## సంపన్నతకు ఏది ప్రమాణం?

۲۲) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَيْسَ الْغِنٰى عَنْ كَثْرَةِ الْعَرَضِ وَلٰكِنَّ الْغِنٰى غِنَى النَّفْسِ۔

(بخاری عن ابی ہریرۃ کتاب الرقاق بسلم کتاب الزکوٰۃ ترمذی ابواب الزھد)

22. "ప్రపంచ సిరిసంపదలు, భోగభాగ్యాలు ఏవీ సంపన్నత అనబడవు. అసలైన సంపన్నత ఆత్మసంతృప్తి, మనస్సంపన్నతలే" అని అంతిమ దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. (అబూ హురైరా (రజి) - బుఖారి, ముస్లిం, తిర్మిజి)

**సంగ్రహణం :**

ఇహలోక సంబంధమైన సకల సిరిసంపదలు సొంతం చేసుకొని కూడా మరిన్ని సంపదలకోసం ప్రాకులాడేవాడు 'గని' (ఏదీ అవసరంలేని నిండు శ్రీమంతుడు) కానేకాడు. అతడు ఉత్త ప్రపంచ బికారే అని చెప్పాలి. అసలు 'గని' అంటే ప్రపంచ వ్యామోహం, పేరాశా ఎరుగని హృదయం గలవాడే. ధనవ్యామోహం, దురాశల్లోపడి మార్గభ్రష్టత్వం పొందనివాడు. పరిపూర్ణ శ్రీమంతునికి ఇవే గుర్తులు.

హృదయ సంపన్నుడు ప్రపంచ భోగభాగ్యాలను చూసి విర్రవీగడు. అవి లేకపోతే బాధాపడడు. ధనరాశుల్ని కన్నెత్తైనా చూడడు. నిరుపేదల్ని, దరిద్రుల్ని నీచంగా హేయంగా చూడడు. వారిని చీదరించుకోడు. సరికదా వారిని ప్రేమిస్తాడు, దగ్గరకు చేర్చుకుంటాడు. గొప్ప చక్రవర్తులు, రాజుల డాంబికాలు అతణ్ణి ఏమాత్రం లొంగదీసుకోవు.

## ఇహలోకం - వివేకవంతుని పాత్ర

(۲۳) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ الْكَيِّسُ مَنْ دَانَ
نَفْسَهُ وَعَمِلَ لِمَا بَعْدَ الْمَوْتِ وَالْعَاجِزُ مَنْ اَتْبَعَ نَفْسَهُ
هَوَاهَا وَتَمَنّٰى عَلَى اللّٰهِ وَمَعْنٰى قَوْلِهٖ "دَانَ نَفْسَهُ" يَقُوْلُ
يُحَاسِبُ نَفْسَهُ فِى الدُّنْيَا قَبْلَ اَنْ يُّحَاسَبَ يَوْمَ الْقِيَامَةِ
وَيُرْوٰى عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ قَالَ حَاسِبُوْا اَنْفُسَكُمْ
قَبْلَ اَنْ تُحَاسَبُوْا وَتَزَيَّنُوْا لِلْعَرْضِ الْاَكْبَرِ
اِنَّمَا يَخِفُّ الْحِسَابُ يَوْمَ الْقِيَامَةِ عَلٰى مَنْ حَاسَبَ
نَفْسَهُ فِى الدُّنْيَا۔ (ترمذی عن شداد بن اوس ابواب صفۃ القیامۃ)

23. "తన ఆత్మను దైవదాస్యంలోనే విలీనం చేసి (అంటే మనోవాంఛలను యధేచ్ఛగా పరుగిడనీయకుండా నియంత్రించి

మరణానంతరం పనికివచ్చే) సత్కార్యాలను ఆచరించేవాడే పరమ వివేకి. అదేవిధంగా మరణానంతరం అల్లాహ్ తనను ఏ విషయంలోను ప్రశ్నించడు అనే ధీమాతో మనోవాంఛలకు దాసుడైన వాడే అతి బలహీనుడు (బుద్ధిహీనుడు). ఆత్మను దైవదాస్యంలో విలీనం చేయడం అంటే, ప్రళయదినాన తనను నిలదీయక మునుపే ఇహలోకంలోనే కోరికలకు కళ్ళెం వేయడం అని అర్థం. హజ్రత్ ఉమర్ (రజి) ఇలా సెలవిచ్చారు :

"మిమ్మల్ని పరలోకంలో నిలదీయక మునుపే ఈ లోకంలోనే జాగ్రత్త పడండి. (దైవన్యాయస్థానంలో) హాజరవడానికి ఇప్పటి నుండే సిద్ధంకండి. ఇహలోకంలోనే తన మనోవాంఛలకు కళ్ళెం వేసుకునేవానికి ప్రళయదినాన అడిగే ప్రశ్నలు అంతకఠినంగా ఉండవు."

*(షద్దాద్ బిన్ అవస్ (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

1. అల్లాహ్ తనను ఏమాత్రం ప్రశ్నించడు అనే ధీమాతో ఉండడం అంటే దైవాన్ని ధిక్కరిస్తూ ఆయనకు అవిధేయత చూపిస్తూనే, తాను స్వర్గానికి అర్హుణ్ణి అని తలచడం. ఇలాంటి వ్యక్తి అల్లాహ్‌ను మన్నించమని వేడుకోవడంగాని, తాను నడిచే దుర్మార్గాన్ని మానుకొని సన్మార్గంపైకి రావడం గాని చేయడు. అయితే ఇలాంటి వైఖరికి పాల్పడుతూనే, అల్లాహ్ తనను మన్నిస్తాడులే అనే ధీమాతోనే ఉంటాడు.

2. తనకు లభించిన అతి స్వల్పమైన జీవన వ్యవధిలో దైవాదేశాలకు తల ఒగ్గి, ఆయన చట్టాలను అనుసరించి పరలోక జీవితంలో లభించే అనంతమైన వరాలను, శుభాలను, సుఖాలను పొందే ప్రయత్నం చేసే వానికంటే వివేకి మరెవరు కాగలరు?

అయితే తన మనోవాంఛలకు దాసుడైన వ్యక్తి, కొన్ని నాణాలు దానం చేయడం వల్లనో, లేక ఏ వలీని గాని బాబానుగాని ఆశ్రయించడం మూలంగానో, మరే ఉన్నత కుటుంబంలో జన్మించినందువల్లనో పరలోక శిక్షనుండి తప్పించుకోవచ్చు అనే భ్రమలోపడిపోతాడు. ఏవో కొన్ని పుణ్యకార్యాలు చేసి తాను చేసిన భయంకర పాపాల నుండి రక్షింపబడతాను అని అనుకుంటాడు.

3. పరలోకాన్ని విస్మరించి, ఇహలోకంలో తమ మనోవాంఛలకు దాసోహం అన్నవారు, హజ్రత్ ఉత్బా బిన్ గుజ్వాన్ (రజి) గారి ప్రసంగంలోని ఈ భాగం గురించి ఆలోచించాలి. ఆయన ప్రసంగంలోని భాగం ఇది:

“ప్రపంచం తాను అంతం అయిపోతున్నాను అని ప్రకటించింది. (దీని చివరి దశ సమీపిస్తోంది). ఇది ఎంతో వేగంగా తిరుగు ముఖం పట్టి వెళ్ళిపోతోంది. పాత్ర అడుగున మిగిలిపోయిన నీరులా ఉంది ప్రపంచం. ఆ పాత్ర యజమాని ఆ అడుగున మిగిలి ఉన్న నీటిని కూడా త్రాగేస్తాడు.

దైవదాసులారా! విశ్వాసఘాతకి అయిన ఈ ప్రపంచాన్ని వదిలేసి పతనం అంటే ఏమిటో ఎరుగని గృహం (పరలోకం) వైపుకు వెడుతున్నారు. (మత్తును వదలి) పుణ్య సంపదను వెంట తీసుకొనివెళ్ళండి.” (ముస్లిం)

భావం ఏమిటంటే, ఇహలోక సంబంధమైన అధికభాగం గడిచిపోయింది. ఈ ప్రపంచం తన చివరి దశను పూర్తి చేసుకుంటోంది. మానవజాతి అంతా పరలోకం అనే అనంతమైన లోకంలోనికి ప్రవేశించనుంది. కేవలం సత్కార్యాల సంపదే ఆ లోకంలో మనిషికి పనికివచ్చేది.

## పరలోక సాఫల్యం పొందాలంటే

(۲۴) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ حُجِبَتِ النَّارُ بِالشَّہَوَاتِ وَحُجِبَتِ الْجَنَّۃُ بِالْمَکَارِہِ۔

(بخاری عن ابی ہریرۃ کتاب الرقاق مسلم کتاب الجنۃ۔ ترمذی ابواب الجنۃ)

24. “నరకాన్ని మనస్సుకు ఆహ్లాదం కలిగించే విషయాల్తోను, స్వర్గాన్ని మనస్సు అంగీకరించని విషయాలతోను కప్పి వేయడం జరిగింది” అని అంతిమ దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

(ఉల్లేఖనకర్త అబూహురైరా (రజి). (బుఖారి, ముస్లిం, తిర్మిజి)

**సంగ్రహణం :**

ఇహలోకంలో జీవితం గడపడానికి ఉన్న మార్గాలు రెండే రెండు:

1. అల్లాహ్‌ను, ఆయన ప్రవక్త ప్రవేశపెట్టిన షరీఅత్‌ను కాదని తన ఇష్టారాజ్యంగా జీవితం గడపడం, మనిషి మనసుకోరేది కూడా ఇదే. ఎవరైతే ఓ నియంత్రణకు కట్టుబడకుండా జీవితం గడుపుతూ ఉంటారో వారు, అల్లాహ్, ఆయన ప్రవక్త విధేయతా త్రాటిని మెళ్ళో వేసుకోవడానికి ససేమిరా ఒప్పుకోరు. దీన్నే షహ్వాత్, లేక మర్గూబాతె నఫ్స్. అంటే మనస్సుకు ఆహ్లాదం కలిగించే విషయాలుగా హదీసులో చెప్పడం జరిగింది. ఉదాహరణకు, మత్తుపానీయాల సేవనం, వ్యభిచారం, జూదం, పరోక్షనింద,

అసత్యమాడడం, అపవాదులు వేయడం, ఆడినమాట తప్పడం, అవినీతికి పాల్పడ్డం, వడ్డీ వ్యాపారం చేయడం, ఇతరులను పీడించడం, హింసించడం వగైరాలు. మనస్సుకు ఆహ్లాదాన్ని, ఉల్లాసాన్ని కలిగించే ఈ విషయాలు ప్రళయదినాన అగ్ని రూపాన్ని ధరిస్తాయి.

2. జీవితపు ప్రతి అడుగునా, ప్రతి రంగంలోనూ అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసం) ఆదేశాలను పాటించడం లాంటి కట్టుబాట్లు మనస్సుకు రుచించవు. ఎవరైతే దైవారాధనను, ఆయన ప్రవక్త ఆదేశాలను పాటిస్తూ ఒక్కో అడుగు అతి జాగ్రత్తగా వేస్తూ ఉంటారో వారి మనస్సు ఉసికొలిపే ఎలాంటి మనోవాంఛలకు దాసులు కానేకారు. ఉదాహరణకు ఇలాంటి వారు తమ కోపాన్ని దిగమ్రింగుతారు. తప్పుల్ని సహృదయంతో క్షమించేస్తారు. పాపాలకు ఆమడ దూరంలో ఉంటారు. దైవాదేశాల్నే అనుసరిస్తూ ఉంటారు. అయిదు పూటలా నమాజు చేస్తారు. రోజా వ్రతాన్ని పాటిస్తారు. దైవం వారికి ఆర్థిక స్తోమత కలిగిస్తే హజ్ చేస్తారు. దానధర్మాలు చేస్తారు. జకాత్ చెల్లిస్తారు. ఇవన్నీ ఓ విధంగా ఆత్మపై గొప్ప భారాన్నే వేస్తాయి. కాబట్టి హదీసులో దీన్ని 'మకారిహ్' అంటే మనస్కరించని విషయాలుగా చెప్పడం జరిగింది. ప్రళయదినాన ఈ పుణ్యకార్యాలన్నీ స్వర్గరూపంలో ప్రత్యక్షమౌతాయి. ప్రవక్త (సఅసం) గారి హదీసు భావం ఏమిటంటే, మనోవాంఛలకు లోనై మీరు నరకంలో పడకండి, సన్మార్గంపై నడిచి – ఆ నడక ఎంత కష్టతరమైనదయినప్పటికీ, ఎంత మనస్కరించకపోయినప్పటికీ – స్వర్గానికి అర్హులు కండి అని.

## ధర్మవిచ్ఛిత్తికి మూల కారణాలు రెండు

(۲۵) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا ذِئْبَانِ جَائِعَانِ
أُرْسِلَا فِيْ غَنَمٍ بِاَفْسَدَ لَهَا مِنْ حِرْصِ الْمَرْءِ عَلَى الْمَالِ وَ
الشَّرَفِ لِدِيْنِهٖ (مشکوٰۃ عن کعب بن مالک کتاب الرقاق بحوالہ ترمذی و الدارمی)

25. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఆకలితో నకనకలాడే రెండు తోడేళ్ళను గొర్రెల్ని చీల్చి చెండాడడానికి మందలో వదలివేస్తే అవి, ధర్మాన్ని చెడగొట్టే ఈ రెండు దుర్గుణాలు గల వ్యక్తి కంటే అధికంగా ఏమీ నష్టపర్చలేవు. (ఆ దుర్గుణాలు గల వ్యక్తి)

1. సిరిసంపదల్ని కూడగట్టుకోవాలన్న పేరాశ గలవాడు.
2. కీర్తికండూతి పొందాలనే తపన గలవాడు.

(కఅబ్ బిన్ మాలిక్ (రజి) – తిర్మిజి, దారిమి)

**సంగ్రహణం :**

ఆకలిగొన్న ఆ రెండు తోడేళ్ళను గనక గొర్రెల మందలో విచ్చలవిడిగా వదిలేస్తే అవి వాటిని చీల్చి చెండాడి తమ పొట్టను నింపుకోవడానికి ఏమాత్రం సంకోచించవు. కాని నీతిమాలిన ఈ రెండు తోడేళ్ళు 1. సిరిసంపదల్ని కూడగట్టుకోవాలి అనే పేరాశగలవాడు 2. కీర్తికండూతిని సంపాదించాలి అనే తపన గలవాడు చేసే వినాశనానికి మాత్రం ఓ హద్దూ పద్దూ అనేవి ఉండవు. సాధ్యమైనంత పెద్ద మొత్తంలో ధనాన్ని ఆర్జించాలి అనేదే తన జీవిత పరమార్థంగా గలవానికి, ప్రపంచంలో గౌరవాన్ని, కీర్తిని సంపాదించాలి అనే తపన గల వ్యక్తికి అసలు ధర్మాధర్మాలతో సంబంధమే ఉండదు. సరికదా, ధనార్జన అనే దురాశలో ధర్మసమ్మతం (హలాల్) అయినదేదో, నిషిద్ధం (హరాం) అయినదేదో ఆలోచించడు. బలహీనులు, అనాధలు, వితంతువుల ఆస్తుల్ని దోచుకోవడంలో ఎలాంటి జంకును ప్రదర్శించడు. మొత్తానికి సంపన్నుడైపోవాలి అనే దురాశ తన శక్తి సామర్థ్యాలకనుగుణంగా అనేకమంది హక్కుల్ని కొల్లగొట్టాలనే పురికొల్పుతుంది అతణ్ణి. అమాయకుల్ని దారిద్ర్యానికి ఎలా గురిచేయాలి అనేదే అతని ధ్యాస అంతాను.

అదేవిధంగా ప్రజల్లో గొప్పవాడు కావాలని, కీర్తిప్రతిష్ఠలు సంపాదించాలని తపనగలవాడు సాధ్యమైనంతవరకు ప్రజల్ని అగౌరవపరుస్తూ ఉంటాడు. వారి మానప్రాణాలతో చెలగాటం ఆడుతూ ఉంటాడు. బూటకపు గౌరవ ప్రపత్తులను నిలిపి ఉంచుకోవడానికి సతతం ప్రజల్ని పీడిస్తూనే ఉంటాడు.

ఏ వ్యక్తిలో ఈ రెండు దుర్గుణాలు చోటు చేసుకుంటాయో, అతడేమైనా కావచ్చుకాని యదార్థమైన ధర్మపరుడు మాత్రం కాలేడు. దైవప్రవక్త (సఅసం) గారి ప్రవచన సారాంశం ఏమిటంటే మీరేగనక దైవధర్మంలో చిచ్చు పెట్టదలచుకోకపోతే ఈ రెండు దుర్గుణాలకు దూరంగా ఉండండి. ఇవి ఆకలిగొన్న ఆ రెండు తోడేళ్ళ కంటే ప్రమాదకరమైనవి, నష్టదాయకమైనవీను.

## ప్రపంచ సిరుల్లోనే లీనం కాకండి

(۲۶) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا تَتَّخِذُوا الضَّيْعَةَ فَتَرْغَبُوْا فِي الدُّنْيَا۔ (ترمذی عن ابن مسعود ابواب الزھد)

26. "ప్రపంచాన్ని పొందేందుకు మీరు దాని సిరిసంపదల్లోనే మునిగి తేలకండి" అని దైవప్రవక్త (సఅసం) ప్రబోధించారు.

**సంగ్రహణం :**

హదీసు మూలభాషలోని 'జైఅహ్' అన్న పదానికి నానా అర్థాలు ఇలా ఉన్నాయి.

1. స్థిరాస్తి – తోట పంట పొలం, ఇల్లు వగైరాలు.
2. వ్యాపారం
3. వృత్తి లేక కళ

ఇస్లామీయ షరీఅత్, వ్యవసాయం, తోటలను పెంచడం, భూకమతం, వ్యాపారం, పరిశ్రమ, గృహనిర్మాణాల్లాంటి ధర్మసమ్మతమైన వ్యాపకాలను వారించడం లేదు. అయితే వాటిలోనే లీనం అయిపోయి దైవాన్ని విస్మరించడాన్నే వారిస్తోంది. ఈ వ్యాపకాలకే అంకితం అయిపోతే మనిషి దైవధ్యానాన్ని గురించి మరచిపోయి ప్రపంచ హంగు ఆర్భాటాల్లోనే మైమరిచిపోతాడు. ప్రపంచానికే సంబంధించిన ఈ వ్యాపకాలను నిర్వహించేటప్పుడు వీటి ద్వారా తన పరలోకం చక్కబడేట్లు కృషి చేయాలి మనిషి.

తన జీవన అవసరాలకు సరిపోయేటంత సామగ్రిని మాత్రమే కూడగట్టుకోవడం దాన్నుండి ప్రయోజనం పొందడం నిషిద్ధం ఏమాత్రం కాదు. సరికదా ధర్మసమ్మతమైన మార్గాల ద్వారా భుక్తిని సంపాదించి ఆ భుక్తి ద్వారా మనిషి గౌరవప్రదమైన జీవనం గడపడానికి ఇవి ఎంతైనా అవసరం కూడా. ఇలా సంపాదించడం ఓ విధమైన ఆరాధనే అంటుంది ఇస్లాం. అయితే ఇక్కడ వారించబడిందల్లా, మనిషి సంపన్నుడయ్యే పిచ్చిలోపడి అత్యధిక జీవనసామగ్రి – ఫర్నిచర్, పాత్రలు, వస్త్రాలు, గృహోపకరణాలు వగైరా – ఇంకా వ్యాపార సంబంధమైన పథకాలు వేయడం, విలాసాల కోసం డబ్బును నీళ్ళప్రాయంగా ఖర్చుపెట్టడం, తన ఔన్నత్యం చాటుకోవడానికి మల్టీస్టోరీడ్ బిల్డింగులు కట్టుకోవడమే. సంపన్నుడు కావాలనే తహతహలో మనిషి ఈ ఐహిక సుఖభోగాల్లో నిండా మునిగిపోవడం వల్ల అసలు యదార్థాన్ని మరచిపోతున్నాడు.

మనిషి దైవానికి దాసుడు. మరణానంతరం అల్లాహ్ సమక్షంలో నిలబడి తనకు లభించిన వనరులు, వరాల గురించి జవాబు చెప్పుకోవలసి ఉంది. ప్రపంచ వ్యామోహాల్లో చిక్కుకున్నవాడు దైవంతో గల సంబంధాన్ని కోల్పోవడం సహజం. ఈ రెంటిలో ఏదో ఒకదాన్ని ఎన్నుకోవలసి ఉంటుంది. ఇదే అసలైన పరీక్ష కూడాను.

## పరమ దుష్టుడు

(۲۷) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مِنْ شَرِّ النَّاسِ
مَنْزِلَةً عِنْدَ اللهِ يَوْمَ الْقِيَامَةِ عَبْدٌ اَذْهَبَ اٰخِرَتَهُ
بِدُنْيَا غَيْرِهٖ (مشکوٰۃ عن ابی امامہ کتاب الآداب باب الظلم بحوالہ ابن ماجہ)

27. "ఇతరుల ఐహిక సుఖాలకోసం తన పరలోకాన్ని నాశనం చేసుకున్నవాడు ప్రళయదినాన అల్లాహ్ దృష్టిలో పరమదుష్టుడిగా పరిగణించబడతాడు" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(అబీ ఉమామ (రజి) - మిష్కాత్)

**సంగ్రహణం :**

మైత్రి, బంధుత్వం, ప్రాపంచిక స్వార్థం ఇంకా అనేక విషయాల ప్రాతిపదికగా ఇహలోకంలో కొందరు ప్రజలను పీడించే వారికి సహాయపడుతూ వారి అడుగులకు మడుగులొత్తుతూ ఉంటారు. అయితే ఈ వైఖరిని అవలంబించే వారు ఇందుమూలంగా తమ పరలోకం చెడిపోతుందన్న విషయాన్ని విస్మరిస్తారు. ఏ వ్యక్తి ప్రజలను పీడించే వాడికి సహాయపడతాడో, అతనికి చేదోడు వాదోడుగా నిలుస్తాడో, చూడ్డానికి అతని సుఖభోగాలు మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లినా ప్రళయం రోజున మాత్రం ఈ దుర్మార్గుడు ఎంతో చింతించవలసి ఉంటుంది. అతడు పరమ దుష్టుడిగా లెక్కించబడతాడు.

## జీవన సంబంధమైన పంచ సూత్రాలు

(۲۸) عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
مَنْ يَأْخُذُ عَنِّيْ هٰؤُلَاءِ الْكَلِمَاتِ فَيَعْمَلُ بِهِنَّ اَوْ يُعَلِّمُ
مَنْ يَّعْمَلُ بِهِنَّ؟ قُلْتُ اَنَا يَا رَسُوْلَ اللهِ. فَاَخَذَ بِيَدِیْ
فَعَدَّ خَمْسًا فَقَالَ: اِتَّقِ الْمَحَارِمَ تَكُنْ اَعْبَدَ النَّاسِ،
وَارْضَ بِمَا قَسَمَ اللهُ لَكَ تَكُنْ اَغْنَى النَّاسِ، وَاَحْسِنْ اِلٰى
جَارِكَ تَكُنْ مُؤْمِنًا، وَاَحِبَّ لِلنَّاسِ مَا تُحِبُّ لِنَفْسِكَ
تَكُنْ مُسْلِمًا، وَلَا تُكْثِرِ الضِّحْكَ فَاِنَّ كَثْرَةَ الضِّحْكِ
تُمِيْتُ الْقَلْبَ۔ (مشكوٰة كتاب الرقاق بحوالہ احمد و ترمذی)

28. దైవసందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారని హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖించారు :

"నేను చెప్పే ఈ వాక్కులను గ్రహించి వాటికి అనుగుణంగా నడిచేవాడు మీలో ఎవరైనా ఉన్నారా? లేక వీటికి అనుగుణంగా నడిచేవాణ్ణి

మీలో ఎవరైనా చూపించగలరా?" అని అడగ్గా 'దైవప్రవక్తా! నేను సిద్ధంగా ఉన్నాను' అని అన్నాను. అప్పుడు ఆయన నా చేతిని పట్టుకొని ఈ సూత్రాలను ఇలా లెక్కించారు :

1. హరాంకు (నిషిద్ధమైన వాటికి) దూరంగా ఉండు. నీవు భక్తిపరుడవు అవుతావు.

2. అల్లాహ్ నీ నొసట రాసిన దాన్ని సమ్మతించి తృప్తిపడు. అందరిలోకెల్లా గని (ఆత్మ సంతృప్తిని పొందినవాడవు) అవుతావు.

3. నీ పొరుగువాని ఎడల సద్బుద్ధితో మెలుగు, నీవు మోమిన్ (విశ్వాసి) అవుతావు.

4. ఇతరులు నీ ఎడల ఏ వైఖరిని అవలంబించాలని అనుకుంటావో అదే వైఖరిని నీవు ఇతరుల ఎడల ప్రదర్శించు. నీవు (నిజమైన) ముస్లిం అవుతావు.

5. అధికంగా నవ్వకు, దీనివల్ల నీ హృదయం నిర్జీవమవుతుంది.

(అబూ హురైరా (రజి) - మిష్కాత్ - అహ్మద్, తిర్మిజి ఆధారంగా)

**సంగ్రహణం :**

జీవితం గడిపేందుకు ముఖ్యమైన, సంపూర్ణమైన అయిదు సూత్రాలను చూపించి వాటిని అమలుపరచాలని ఆదేశించారు దైవప్రవక్త (సఅసం). ప్రవక్తను విశ్వసించేవారు వాటిని అమలుచేస్తే సమాజం అన్ని రకాల రుగ్మతలనుండి ప్రక్షాళింపబడుతుంది. వాటిలో మొదటిది "హరాంకు దూరంగా ఉండండి, మీరు గొప్ప భక్తిపరులవుతారు అన్నది. అంటే బహుదైవారాధన, తల్లిదండ్రుల ఆదేశాల ధిక్కరణ, హింసా, దౌర్జన్యం, హత్యాకాండ, రక్తపాతం, మద్యపానం, జూదం, వ్యభిచారం, అనాథల ధనాన్ని కొల్లగొట్టడం, ప్రత్యక్షమైన పరోక్షమైన అశ్లీలం, వడ్డీ వ్యాపారం, ప్రజలను పీడించడం, కొలతల్లో మోసం చేయడం వగైరాలన్నీ నిషిద్ధమైనవి అంటే హరాం చేయబడినవి.

వీటన్నటికీ దూరంగా ఉండడం గొప్ప ఆరాధన. ఎవరయితే ఈ రుగ్మతల దరిదాపుల్లోకి కూడా పోరో వారు ఎల్లప్పుడూ దైవారాధనలోనే మునిగి ఉండే భక్తిపరుల కంటే గొప్ప భక్తిపరులు. మనిషి మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించే ఈ నిషిద్ధాలకు దూరంగా ఉండాలంటే అతడు తన మనోవాంఛలతో పోరాడి వాటిని అణచగలగాలి.

రెండోది, అల్లాహ్ మనిషిని సృష్టించాడు. అతణ్ణి పోషిస్తున్నాడు కూడా. ఆయన తన వివేచనా విజ్ఞానం దృష్ట్యా ఎవరికి ఎంత ఇవ్వాలో అదంతా రాసే ఉంచాడు. అల్లాహ్

రాసినది మనిషికి తప్పకుండా లభిస్తుంది. ఏ ఒక్కరూ దీన్ని ఆపడం గాని, పెంచడం గాని చేయలేరు. ఈ విషయాన్ని నమ్మి తృప్తిపడేవాని మనస్సులో ఓ విధమైన మనశ్శాంతి, సంతృప్తి ఉద్భవిస్తుంది. తన శక్తి సామర్థ్యాలకనుగుణంగా భుక్తికోసం ప్రయత్నం చేస్తాడు ఆ వ్యక్తి. అయితే పేరాశ, అసూయా ద్వేషాల అగ్ని జ్వాలల్లో మాత్రం మండడు. ఇతని జీవితం ఎంతో సాఫీగా ప్రశాంతంగా గడుస్తుంది.

మూడో సూత్రం, "నీ పొరుగు వారి ఎడల సద్బుద్ధితో మెలుగు, నీవు మోమిన్ అవుతావు" అన్నది. దైవప్రవక్త (సఅసం) గారి మరో ప్రవచనంలో ఇలా ఉంది: "ఎవరి దుష్కార్యాల నుండి అతని పొరుగువాడు సురక్షితంగా ఉండడో అతడు మోమిన్ కాదు" అని. అంటే మీరేగనక మోమిన్ (నిజమైన విశ్వాసి) కాదలచుకుంటే మీ పొరుగువారి ఎడల మంచి బుద్ధితో మెలగండి.

ఒకరి ధన మాన ప్రాణాలపై మీ నోటి ద్వారాగాని మీ చేతులతో గాని దాడి చేయకండి. మీ ధన మాన ప్రాణాలపై ఎవరూ దాడిచేయకూడదు అని మీరు కోరుకున్నట్లే ఇతరుల ఎడల కూడా మీరు అదే వైఖరిని అవలంబించండి అన్నది నాల్గో సూత్రం.

ఇక అయిదవ సూత్రం ఏమిటంటే, దైవ స్మరణతో హృదయం సతతం సజీవంగా ఉంటుంది. అధికంగా నవ్వడం వలన మీరు మైమరుపుకు గురి అవుతారు. ఈ పరిస్థితినే మరణంగా పేర్కొనడం జరిగింది.

## ఉత్తమమైన అయిదు పరిస్థితులు

(۲۹) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِرَجُلٍ وَهُوَ يَعِظُهُ
اِغْتَنِمْ خَمْسًا قَبْلَ خَمْسٍ شَبَابَكَ قَبْلَ هَرَمِكَ وَصِحَّتَكَ
قَبْلَ سُقْمِكَ وَغِنَاكَ قَبْلَ فَقْرِكَ وَفَرَاغَكَ قَبْلَ
شُغْلِكَ وَحَيَاتَكَ قَبْلَ مَوْتِكَ۔

(مشکوۃ عن عمرو بن میمون بحوالہ ترمذی)

29. దైవప్రవక్త (సఅసం) ఓ వ్యక్తికి హితబోధ చేస్తూ ఇలా సెలవిచ్చారు :

"నీ కెదురయ్యే ఈ అయిదు పరిస్థితులకు పూర్వమే ఈ అయిదు వరాల్ని మేలైనవిగా భావించుకో (అంటే వాటి ద్వారా ప్రయోజనం పొందు).

1. వృద్ధాప్యానికి పూర్వం నీ యవ్వనాన్ని 2. అనారోగ్యానికి పూర్వం నీ ఆరోగ్యాన్ని 3. లేమికి పూర్వం నీ కలిమిని 4. పనుల్లో పూర్తిగా నిమగ్నమవక పూర్వం నీ తీరికను

5. మరణానికి పూర్వం నీ జీవన కాలాన్ని. (అమ్రూ బిన్ మైమూన్ (రజి) - మిష్కాత్ - తిర్మిజి)

**సంగ్రహణం :**

ఇహలోకంలో నీవు పొందిన ఈ జీవితకాలం, నీకీయబడిన ఈ వరాలన్నీ నిన్ను పరీక్షించడానికే అల్లాహ్ నీకొసగింది. మనిషి ఈ యదార్థాన్ని దృష్టిలో ఉంచుకొని తన శక్తి సామర్థ్యాల మేరకు తనకా వరాలనిచ్చిన స్వామి, ప్రభువు అయిన దేవుని అభీష్టం కోసమే వాటిని ఖర్చుపెట్టాలి. ప్రతి విషయంలోను ఆయన అభీష్టం ఏదో చూసి నడుచుకుంటే, ప్రపంచం అనే ఈ పరీక్షా హాలులో విజయం పొందగలుగుతాడు.

'మేలైనవిగా భావించుకో' అంటే వాటిని వృథాగా పోనీయకు, వాటి విలువేమిటో తెలుసుకొని మసలుకో అని భావం. వృద్ధాప్యం వచ్చేవరకు దానికోసం ఎదురు చూడకుండా నీకొసగబడిన యవ్వన కాలంలోనే దైవదాసునిగా మారిపో. ఆయన్ను విధేయించు. చెడుమార్గాల్లో గ్రుడ్డిగా నడవకు. ఆరోగ్యమే మహాభాగ్యం. కాబట్టి పరలోక సౌఖ్యం పొందేందుకు నీ శక్తినంతా ధారపొయ్యి. దయాదాక్షిణ్యం లేని రోగం నీ శక్తినంతా హరించేస్తుంది సుమా! ఆ తరువాత నీవు దైవసమక్షంలో ఉత్తచేతుల్తో వెళ్ళాల్సివస్తుంది. అక్కడ, ఈ లోకంలో నీకు లభించిన ఆయురారోగ్యాలు, శక్తి సామర్థ్యాల ద్వారా నీ ప్రభువును ఏమాత్రం ప్రసన్నునిగా చేయలేకపోయానే అన్న విచారంలో పడిపోగలవు. నీకు యవ్వనం ఆరోగ్యం ఇచ్చిన దేవుణ్ణి ఈ భూమ్మీద ఉంటూ ధిక్కరించడం అవిధేయత చూపడం అన్న కృతఘ్నుత కాకపోతే మరేమిటి?

ఒకవేళ అల్లాహ్ ఆయన కటాక్షంతో నీకేదైనా ధనసంపత్తినిస్తే ఆయన్ను ధ్యానించు, నీ హృదయఫలకంపై ఏర్పడిన అలసత్వపు పొరను ఛేదించు. అప్పుడు గాని నీ హృదయం దైవ ప్రకాశంతో వెలుగొందిపోతుంది. ఈ లోకంలో నీకు లభించిన జీవిత వ్యాపకాలు ఒక్కొక్కటిగా చొక్కాబట్టుకొని నిలబెడ్తాయి అక్కడ; అయితే చూడు నీవే గనక సంపన్నుడవైతే అల్లాహ్ నీకు ఒసగిన ఈ వరాల గురించి ఆయనకు కృతజ్ఞతలు తెలియజెయ్యి. నిరుపేదలైన నీ బంధువుల్ని, అనాథలను, లేమికి గురిఅయిన నీ పొరుగువారిని, దరిద్రులను నీ ధనంతో ఆదుకో. దైవధర్మ ఉన్నతికోసం నీ సంపదను ఖర్చుపెట్టు. మంచి అదృష్టాన్ని పొందగలవు.

ఈ జీవితం స్వతహాగా ఓ పరీక్షా పత్రం. ఎంతో జాగ్రత్తగా, మరెంతో తెలివిగా దీనికి జవాబు రాయాలి. ఆ ప్రశ్నాపత్రంలోని ప్రతి ప్రశ్నకు జవాబు నీవు ఖుర్ఆన్ బోధనలు, దైవప్రవక్త (సఅసం) గారి వివరణ వెలుగులోనే రాయాల్సి ఉంది. ఆటపాటల్లోపడి, అనవసర విషయాల్లో తలదూర్చి నీ జీవితశేషాన్ని నాశనం చేసుకోకు. 'మరణం' అనే చిట్టచివరి గంట మ్రోగగానే నీవీ 'జీవితం' అనే పరీక్షా హాలు - ప్రపంచం - నుండి బయటకు నడవవలసిందే. ఏ ఒక్క ప్రశ్నకు జవాబు రాసినా, రాయకపోయినా.

## అల్లాహ్‌కు ప్రియమైన వారు

(۳۰) جَاءَ رَجُلٌ فَقَالَ يَا رَسُوْلَ اللّٰهِ دُلَّنِيْ عَلٰى عَمَلٍ إِذَا أَنَا عَمِلْتُهُ أَحَبَّنِيَ اللّٰهُ وَأَحَبَّنِيَ النَّاسُ، قَالَ إِزْهَدْ فِي الدُّنْيَا يُحِبَّكَ اللّٰهُ وَازْهَدْ فِيْمَا عِنْدَ النَّاسِ يُحِبَّكَ النَّاسُ (مشكوٰة عن سهل بن سعد كتاب الرقاق بحواله ابن ماجه)

30. ఒకతను దైవప్రవక్త (సఅసం)ను ఇలా అడిగాడు :

"దైవప్రవక్తా! ఏ కార్యం నెరవేరిస్తే దేవుడు, ప్రజలు నన్ను ప్రేమిస్తారో ఆ కార్యం ఏదో నాకు బోధించరా?" అన్న దానికి దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

"ప్రపంచ వ్యామోహంలోపడబోకు, దేవుడు నిన్ను ప్రేమిస్తాడు. ప్రజల సొమ్మును కన్నెత్తైనా చూడకు, వారిపై ఆశపెట్టుకోకు, వారు నిన్ను ప్రేమిస్తారు." (సహల్ బిన్ సఅద్(రజి)– మిష్కాత్, ఇబ్నెమాజా)

**సంగ్రహణం :**

'ప్రపంచ వ్యామోహంలో పడబోకు' అంటే మనిషి జీవన అవసరాల పరిపూర్తికోసం, భుక్తిని సంపాదించడానికి, ప్రపంచాన్ని, ప్రపంచ వనరుల్ని సమీకరించుకోకూడదు అని కాదు భావం; ధనాన్ని కూడబెట్టకు, విలాసవంతమైన జీవితాన్నే ధ్యేయంగా ఎంచుకోకు, నీ జీవన ప్రమాణాల్నే పెంచుకుంటూ పోవడం కంటే నీ నైతిక ప్రమాణాల్ని పెంచడంలో కృషి చెయ్యి అన్నదే దీని అర్థం.

ఎవరైతే సతతం అల్లాహ్ ఆదేశాల్ని పాటిస్తూ ఉంటాడో, ఆయన ధర్మ వ్యాప్తికోసం కృషి చేస్తూ తన సర్వస్వాన్నే ధారవోస్తాడో, ప్రపంచాన్ని సొంతం చేసుకునే ప్రయత్నం చేయకుండా కేవలం జీవిక మేరకే భుక్తికోసం కృషి చేస్తూ ఉంటాడో అలాంటి వ్యక్తినే అల్లాహ్ ప్రేమిస్తాడు. అతడే అల్లాహ్‌కు ప్రియమైనవాడూను. ఈ మాటనే దైవగ్రంథం అయిన దివ్య ఖుర్ఆన్ ఇలా సెలవిస్తోంది :

"జీవితంలోని ప్రతి రంగంలోను దైవప్రవక్తను అనుసరిస్తూ ఉంటే నీవు దైవానికి ప్రియమైన వాడవౌతావు" అంటే జీవితంలోని ప్రతి విషయంలోను దైవప్రవక్త (సఅసం) గారి అడుగుజాడల్లో నడిచేవాడు ప్రపంచ వ్యామోహంలో చిక్కుకోడు, అతని హృదయంలో ధన పిపాస చోటుచేసుకోజాలదు అని అర్థం.

"పరుల సొమ్మును కన్నెత్తైనా చూడకు" అని అంటే మనిషి ఎవ్వరితోను ధనాన్ని, దానాలను ఆశించకూడదు. అదేవిధంగా వారిని చూసి ఈర్ష్యాపడకూడదు. తనకంటే కలిమిలో గొప్పవాడైన వ్యక్తిపై అసూయా దృష్టిని వేయకూడదు. కేవలం తనకు లభించిన వనరులు, మార్గాలతోనే తృప్తిపడాలి. తన ధనం వల్లగాని, తన ఆస్తిపాస్తుల ద్వారాగాని, ఇతరులకు ఎలాంటి ప్రమాదం, ఆపద వాటిల్లకుండా చూడాలి. అప్పుడుగాని తన నుండి వారు నిశ్చింతగా ఉండలేరు. కాబట్టి వారు ఇలాంటి వ్యక్తి అంటే ఎంతో గౌరవిస్తారు, ప్రేమిస్తారు.

## ఈ సిరిసంపదలు ఎవరివి?

(۳۱) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ الْعَبْدُ مَالِيْ مَالِيْ وَاِنَّ مَالَهُ مِنْ مَالِهٖ مَا أَكَلَ فَاَفْنٰى اَوْ لَبِسَ فَاَبْلٰى اَوْ اَعْطٰى فَاَقْتَنٰى وَمَا سِوٰى ذٰلِكَ فَهُوَ ذَاهِبٌ وَتَارِكُهٗ لِلنَّاسِ۔ (مسلم عن ابی ہریرۃ، کتاب الزہد مشکوٰۃ کتاب الرقاق)

31. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "నేనింత ధనవంతుణ్ణి, నా సంపద ఇంతగొప్పది అని మనిషి బీరాలు పలుకుతాడు, అయితే ఆ సంపద నుండి తాను పొందేది కేవలం మూడు ప్రయోజనాలు మాత్రమే.

1. తాను తిని కాజేసింది
2. తొడిగి పాతవస్త్రంగా మిగిల్చింది
3. దైవమార్గంలో ఖర్చుపెట్టి (రేపటి కొరకు) భద్రపరుచుకున్నది."

*(అబూ హురైరా (రజి) – ముస్లిమ్)*

**సంగ్రహణం :**

ఓ పిచ్చివాడా! ఏ ప్రపంచ వ్యామోహంలో పడి నీవు కొట్టుమిట్టాడుతున్నావో ఆ ప్రపంచం ఎలాంటిదో నీవేమైనా ఆలోచించావా? ఇహలోక సిరిసంపదలు పొందడానికి నీ ప్రాణాలనే పణంగా బెడుతున్నావే! అది నిన్నెలా మోసగిస్తున్నదో చూడు. నీవెలాంటి పతన దశను చేరుకుంటున్నావో ఆలోచించు? అవును నీవు కుబేరుడివే, బాగా కూడబెట్టావు. గొప్ప ధనరాశులే నీ అధీనంలో ఉన్నాయి. అందులోనుండి కొంత నీ

ఆహారానికి, మరికొంత నీ వస్త్రాలకే సరిపోయింది. నీవు మరణించిన తరువాత మిగిలిన ఆస్తి అంతా నీ వారసుల పాలైపోతుంది. దాన్నుండి వాళ్ళే ప్రయోజనం పొందుతారు.

యదార్థం ఏమిటంటే నీ దగ్గర ఉన్న సిరినంతటికి యజమాని అల్లాహ్‌యే. ఏదో తాత్కాలికంగా నీకిచ్చి ఖర్చుపెట్టుకొమ్మని నిన్ను పరీక్షిస్తున్నాడు. ఈ సొత్తు ఇప్పటిదాక ఎవరిదగ్గరా శాశ్వతంగా నిలువలేదు. నీ దగ్గర నిలిచిపోవడానికి ప్రస్తుతం ఇది నీ అధీనంలోనే ఉన్నా, ఓ నాటికి ఇది నీకు దక్కకుండా పోగలదు. ఇతరులకు అధీనం కాక తప్పదు.

అయితే, దైవమార్గంలో నీవేదైనా దానధర్మాలు చేస్తే అది మాత్రం నీ ఖాతాలో జమ అవుతూ ఉంటుంది. నిరుపేద బంధువులు, అనాధలు, అగత్యపరులు, వికలాంగులు, వితంతువులకు సహాయం చేసి నీవు ఓ గొప్ప నిధినే నీ అధీనంలో ఉంచుకున్నావు. ఇది పరలోకంలో నిన్ను ఆహ్వానిస్తుంది. నీ మరణానంతరం దైవధర్మ ఔన్నత్యం కోసం, ఇస్లాం ప్రాబల్యం కోసం సత్యధర్మ వ్యాప్తికోసం పాటుపడే సిపాయిల కొరకు ఖర్చయ్యే ధనం గురించి నీవు నిశ్చింతగా ఉండు. అది వృధాకాలేదు సరికదా నీ ఈ సిరిసంపదల్ని ఓ దివ్యమైన బ్యాంకులో జమచేసుకున్నావు. అక్కడ నీకు వచ్చే లాభం ఏడువందల రెట్లు.

అల్లాహ్ మార్గంలో ఖర్చుపెట్టిన ఆస్తే మనిషికి నిజమైన ఆస్తి అన్నది ఈ ఉల్లేఖనం ద్వారా తేటతెల్లమౌతోంది.



# మరణాన్ని కోరడం

## మరణాన్ని కోరడం

(٣٢) إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَا يَتَمَنَّىٰ أَحَدُكُمُ
الْمَوْتَ إِمَّا مُحْسِنًا فَلَعَلَّهُ يَزْدَادُ وَإِمَّا مُسِيْئًا فَلَعَلَّهُ
يَسْتَعْتِبُ (بخاری عن ابی ہریرۃ - کتاب المرضیٰ - کتاب التمنی)

32. దైవప్రవక్త (సఅసం) గారి ఓ ప్రవచనం ఇలా ఉంది: "మీలో ఏ ఒక్కడూ మరణాన్ని కోరుకోవద్దు (ఎందుకంటే) అతడు పుణ్యాత్ముడైతే బ్రతికుండి పుణ్యపథంలో నడిచే భాగ్యం కలుగవచ్చు. అదే అతడు పాపాత్ముడైతే 'తౌబా' చేసి దైవాన్ని ప్రసన్నునిగా చేసుకునే వీలుంది."

*(అబూ హురైరా (రజి) – బుఖారి)*

**సంగ్రహణం :**

దేవునికి విధేయుడైన దాసుడు, తన ప్రభువు, స్వామి అయిన ఆ సర్వేశ్వరుని ప్రేమను బడసి, ఆయన్ను సేవించడంలో ఎలాంటి ఏమరుపాటును ప్రదర్శించడు. కాబట్టి ఈ ఇహలోకంలో అధిక కాలం జీవిస్తూ పరలోక సిరిసంపదల్ని పెంచుకోగలడు. అదేకాకుండా అతడు సమాజంలో పెరిగిపోతున్న చెడులను రూపుమాపడంలోను, మంచిని పెంచడంలోను కృషి సల్పి సమాజంలో శాంతిని, సామరస్యాన్ని సమకూర్చగలడు. ఇక పాపాల పంచన జీవించే మనిషిలో హృదయ పరివర్తన కలిగి ఏనాటికైనా దైవసందేశం వైపుకు మరలే అవకాశం ఉంది. దైవ సాన్నిధ్యంలో తన పాపాలకు పశ్చాత్తాపం చెంది (తౌబా చేసి) తన చెడు నడతల్ని త్యజించనూవచ్చు. దైవాన్ని ప్రసన్నునిగా చేసే ప్రయత్నమూ చేయవచ్చు. కాబట్టి మరణాన్ని కోరుకోవద్దని చెప్పడం జరిగింది. ఈ ప్రవచనంలో, మరణించాక పుణ్యాత్మునికి పుణ్యకార్యాలు చేసే వీలూ చిక్కదు. పాపాత్మునికి తన పాపాల గురించి తౌబా చేసే సమయమూ దొరకదు.

(٣٣) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَتَمَنَّيَنَّ
أَحَدُكُمُ الْمَوْتَ لِضُرٍّ نَزَلَ بِهٖ فَإِنْ كَانَ لَا بُدَّ مُتَمَنِّيًا
لِلْمَوْتِ فَلْيَقُلْ: اَللّٰهُمَّ أَحْيِنِيْ مَا كَانَتِ الْحَيٰوةُ

خَيْرًا لِّيْ وَتَوَفَّنِيْ إِذَا كَانَتِ الْوَفَاةُ خَيْرًا لِّيْ۔

(بخاری عن انس، کتاب الدعوات، کتاب المرضی، مسلم: کتاب الذکر والدعاء۔
ترمذی، ابواب الجنائز، ابوداؤد: کتاب الجنائز)

33. దైవ సందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు : "కష్టాలు కడగండ్లకు వెరచి ఏ ఒక్కరూ మరణాన్ని ఆశించవద్దు. ఇదే అనివార్యమైతే ఇలా పలకండి. దేవా! బ్రతికి ఉండడమే నాకు శ్రేయస్కరమైతే నన్ను బ్రతకని; మరణంలోనే నాకు ప్రయోజనం ఉంటే చావును ప్రసాదించు."

*(హజ్రత్ అనస్ (రజి) – బుఖారి, ముస్లిమ్, తిర్మిజి, అబూ దావూద్)*

**సంగ్రహణం :**

చావును ఆశించడాన్ని ఇస్లామ్ అనుమతించదు. ప్రపంచంలోని ప్రతి కష్టాన్ని, బాధను ఎంతో ధైర్యంగా ఎదుర్కోమంటుంది. ఇస్లాం పరిధిలో ఉంటూ, దారిద్ర్యాన్ని, ఆకలి బాధను, రోగాన్ని పారద్రోలేందుకు కృషి చేయడం విశ్వాసానికి వ్యతిరేకమైన కార్యం ఏమాత్రం కాదు. మనిషి వీటిని దూరం చేయడానికి తన వంతు కృషి చేయాల్సిందే. అప్పటికీ ఆ బాధలు తీరకపోతే ఎంతో సహనాన్ని, ధైర్యాన్ని ప్రదర్శించి వాటిని ఎదుర్కొనే ప్రయత్నం చేయాలి. అయితే ఏదైనా భయంకరమైన కష్టం వచ్చి పడ్డప్పుడు, ఇక దాన్ని భరించడం శక్తికి మించిన పనైతే అల్లాహ్‌ను – హదీసులో చెప్పిన వాక్యాల ప్రకారం – వేడుకోవచ్చు. ఆ వేడుకోలు కూడా మేలుకు సంబంధించిందే. అశాంతి, అలజడి, బాధలకు తల్లడిల్లే మనిషి కడగండ్లను ఆ కరుణామయుడే కడతేర్చగలడు. ఆ బాధల నుండి ఎలా తప్పించుకోవాలో మనిషికి మాత్రం తెలియదు. మనిషి ఈ బాధల్ని చనిపోయి తప్పించుకోగలడా లేక జీవించి దూరం చేసుకోగలడా అన్నది కూడా మనిషికి తెలియదు. అందుకే దైవాన్ని వేడుకుంటాడు, భారమంతా ఆయన మీదనే వేస్తాడు.

## తరచూ మరణం గూర్చి తలచుకోవడం

(۳۴) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أَكْثِرُوْا ذِكْرَ
هَاذِمِ اللَّذَّاتِ (ترمذی عن ابی ہریرۃ؛ ابواب الزهد)

34. "అభిరుచుల్ని సమూలంగా త్రెంపివేసేదాన్ని బాగా తలచుకోండి" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

*(అబూ హురైరా (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

ఓ రోజు మీరు చావవలసిందే. ఈ యదార్థం మీ మస్తిష్కంలో సదా మెదులుతూ ఉండాలి. మీ భార్యాబిడ్డల్ని, ఆస్తిపాస్తుల్ని, వ్యాపార వ్యవహారాలను ఓ రోజు వదిలేసి వెళ్ళిపోవలసిందే. ఇక్కడి తళుకు బెళుకు, మనోరంజకాలన్నీ వదులుకొని మట్టిలో కలువనున్నారు. మీ మనోభావాల పరిపూర్తికోసం, మీ అభిరుచుల్ని తీర్చుకోవడానికి, మీ విలాసవంతమైన జీవితం కోసం మీరు సమకూర్చుకున్నదంతా 'మరణం' అనే ఖడ్గపు ఒక్క వ్రేటుతో మీ నుండి తెగిపోవలసిందే.

ఏకాంతంలో మీకు మరణం గుర్తుకు రావాలి. మీ స్నేహితుల ఎదుట మరణం గూర్చి చర్చించాలి. మనిషి చనిపోయి ఈ భూలోకభౌతిక ప్రయోజనాలను, అభిరుచుల్ని వదిలేస్తాడు అన్న దానిలో సందేహం ఏమాత్రం లేదు. అయితే ఆ చావును పదే పదే గుర్తు చేసుకుంటూ ఉండడం వల్ల కలిగే ప్రయోజనం ఏమిటంటే మనిషి కళ్ళెం లేని గుర్రంలా ప్రవర్తించే వీలుండదు. అతని హృదయంలో దైవభీతి చోటు చేసుకోవడం వల్ల సన్మార్గంపై నడవడం సులువౌతుంది.

## మరణానంతరం వెంటవచ్చేవి కర్మలు మాత్రమే

(٣٥) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَتْبَعُ الْمَيِّتَ ثَلٰثَةٌ فَيَرْجِعُ اِثْنَانِ وَيَبْقٰى وَاحِدٌ - يَتْبَعُهٗ اَهْلُهٗ وَمَالُهٗ وَ عَمَلُهٗ فَيَرْجِعُ اَهْلُهٗ وَمَالُهٗ وَيَبْقٰى عَمَلُهٗ -

(مسلم عن انس کتاب الزھد۔ بخاری کتاب الرقاق ترمذی ابواب الزھد)

35. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు :

"(మరణించాక) మృతుని వెంట వెళ్ళేవి మూడు :

1. అతని బంధుమిత్రులు

2. అతని ధనం

3. అతని కర్మలు

(ఖననానంతరం) మొదటి రెండు వెనక్కు మళ్ళుతాయి. కర్మలు మాత్రం అతని వెంటే ఉండిపోతాయి." (అనస్ (రజి) – బుఖారి, తిర్మిజి)

**సంగ్రహణం :**

మరణానంతరం మృతునికి స్నానం చేయించి, కొత్తబట్టల కఫన్ తొడుగుతారు. శవయాత్ర గొప్ప ఆడంబరంతో ప్రారంభం అవుతుంది. ఆ తరువాత ఖనన ఘట్టం మొదలౌతుంది. సమాధి తయారౌతుంది. బంధుమిత్రులంతా కన్నీటితో అతణ్ణి మట్టిలో పాతిపెడతారు. అతడు వదిలివెళ్ళిన ఆస్తి పాస్తులన్నింటిని వారసులు పంచుకుంటారు. కనీసం చేతికి గడియారం, వ్రేలికి ఉంగరం అయినా ఉంచరు. ఇది అతని సొంత ఆస్తికి సంబంధించిన విషయం. తాను ధర్మ సమ్మతంగానో అధర్మంగానో సంపాదించిన దానిలో ఓ చిల్లగవ్వ కూడా అతని వెంటపోదు.

ఇక రక్తసంబంధీకుల విషయానికొస్తే, ఏ తల్లి కూడా తన తనయుని వెంట వెళ్ళడానికి సిద్ధపడుతుందా? పొయ్యేవాని భార్య, తనయుడు, సోదరుడు ఎవ్వడూ మృతునితో సమాధి అయ్యే ధైర్యం చేయలేరు. తనను చూసి బ్రతుకుతున్న తండ్రి కూడా మృతుని ప్రక్కలో పడుకోవడానికి సాహసిస్తాడా? అందుకే ఓ పరలోక బాటసారి! నీవు చేసిన పాప, పుణ్య కర్మలే నీ వెంటవచ్చేవి. అవే నీకు మిత్రులు, బంధువులునూ, అవి ఏ పరిస్థితిలోనూ నిన్ను వదిలిపెట్టవు. బ్రతికుండగా నీవే కర్మలనైతే ఆచరించావో వాటి ఫలితాలు ప్రభావాలు ఆ నీ చివరి జీవితంలో నీ వెంటవచ్చేవి- మిత్రుల రూపంగానో శత్రువుల రూపంగానో.

## ఖననం చేయడంలో ఆలస్యం చేయకండి

(٣٦) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ یَقُوْلُ اَسْرِعُوْا بِالْجَنَازَةِ فَاِنْ كَانَتْ صَالِحَةً قَرَّبْتُمُوْهَا اِلَی الْخَیْرِ وَاِنْ كَانَتْ غَیْرَ ذٰلِكَ كَانَ شَرًّا تَضَعُوْنَهٗ عَنْ رِقَابِكُمْ۔

(مسلم عن ابی ہریرة: کتاب الجنائز۔ بخاری بکتاب الجنائز۔ ترمذی ابواب الجنائز ابوداؤد کتاب الجنائز)

36. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

"జనాజా (మృత కళేబరాన్ని) తీసుకొని వెళ్ళేందుకు త్వరపడండి. చనిపోయిన ఆ వ్యక్తే గనక పుణ్యాత్ముడైతే మీరు (ఖననం చేసి) అతణ్ణి మేలుకు చేరువగా తీసుకొనిపోతారు. అతడే దుష్టుడైతే (త్వరగా పూడ్చిపెట్టి)

మీరు ఓ దౌష్ట్యాన్ని మీ భుజస్కంధాల నుండి దించుకున్న వారౌతారు. (అంటే ఓ పెద్ద విపత్తు నుండి మిమ్మల్ని మీరు రక్షించుకున్న వారౌతారు అని అర్థం. (అబూ హురైరా (రజి) - బుఖారి, ముస్లిమ్, తిర్మిజి, అబూ దావూద్)

**సంగ్రహణం :**

మృతదేహాన్ని ఖననం చేయడంలో ఏమాత్రం ఆలస్యం చెయ్యవద్దు అన్నదే ఈ హదీసులోని భావం. పుణ్యాత్ముడు విశ్వాసపాత్రుడు అయిన దైవదాసునికి అతని 'గోరీ'లో స్వాగతం పలకడం జరుగుతుంది. అక్కడ అతడు ఆచరించిన పుణ్యకార్యాలకు లభించబోయే సత్ఫలితాలు అతని ముందు ప్రత్యక్షమవుతాయి. కాబట్టి అతడు సాధ్యమైనంత త్వరగా తనను ఆ 'బర్జఖ్' పొలిమేరల్లో వదలాలని కోరుకుంటాడు. అయితే దైవధిక్కారానికి పాల్పడ్డవాడు, దేవుడొసగిన ఈ భువిపై ఆయన ఇచ్చిన భుక్తిని ఆరగిస్తూ దేవుని పేరు ఎత్తగానే పరిహసించే వ్యక్తి నిజంగా ఈ భూమ్మీద ఓ విపత్తులాంటివాడే. అతని భారాన్ని మీ భుజస్కంధాల నుండి ఎంత త్వరగా దిగిపోతే అంతమంచిది. అతని కృతఘ్నుతకు తగిన ఫలితాన్ని చవిచూసేందుకు నరక ద్వారం (గోరి)లో సాధ్యమైనంత త్వరగా నెట్టేస్తే మంచిది. ఫలితంగా భూమ్మీద అతని దౌష్ట్యం త్వరగా తగ్గిపోతుంది.

"జనాజాను త్వరగా తీసుకొని వెళ్ళండి" అంటే కొంత వేగంగా అడుగులు వేయండి అని అర్థం. సాధారణ నడకకంటే ఆ నడక కొంత వడిగా ఉండాలి. ఖననంలో ఆలస్యం జరగకూడదు అనే ఇలా చెప్పడం జరిగింది. అయితే వెంటవచ్చే బలహీనులు, వృద్ధులు శవయాత్రలో మరీ వెనకబడకుండా చూడ్డం ముఖ్యం.

ఈ హదీసువల్ల తెలిసిందేమిటంటే సుదూర ప్రాంతాల నుండి వచ్చే బంధువుల నిరీక్షణలో ఖననం చేయడంలో ఆలస్యం చేయడం ఏమాత్రం ధర్మసమ్మతం కాదు. 'జనాజా' సిద్ధం కాగానే ఖననం కోసం ప్రయత్నాలు మొదలుపెట్టాలి.

## మరణం

(٣٧) كَانَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ إِذَا وُضِعَتِ الْجَنَازَةُ
وَاحْتَمَلَهَا الرِّجَالُ عَلٰى أَعْنَاقِهِمْ فَإِنْ كَانَتْ صَالِحَةً قَالَتْ
قَدِّمُوْنِيْ وَإِنْ كَانَتْ غَيْرَ صَالِحَةٍ قَالَتْ لِأَهْلِهَا يَا وَيْلَهَا
أَيْنَ تَذْهَبُوْنَ بِهَا يَسْمَعُ صَوْتَهَا كُلُّ شَيْءٍ إِلَّا الْإِنْسَانَ
وَلَوْ سَمِعَ الْإِنْسَانُ لَصَعِقَ (بخاری عن ابی سعید کتاب الجنائز)

37. దైవప్రవక్త (సఅసం) ఇలా అంటూ ఉండేవారు :

"గుస్ల్ చేయించి కఫన్ వస్త్రం చుట్టడం అయిన తరువాత మయ్యత్ (మృతదేహం)ను ఓ చోట తీసుకొనివచ్చి ప్రజలు దాన్ని (శవపేటికను) తమ భుజాలపైకి ఎత్తుకుంటారు. అప్పుడు ఆ మృతుడు పుణ్యాత్ముడైతే, నన్ను త్వరగా ముందుకు చేర్చండి అని అంటాడు. ఒకవేళ ఆ వ్యక్తి పుణ్యాత్ముడు కాకపోతే తన ఇంటివారిని ఉద్దేశించి అయ్యో! నన్నెక్కడికి తీసుకొని వెడుతున్నారు మీరు? అని అంటాడు. అతని మాటల్ని ప్రతి వస్తువు వింటుంది-మానవులు తప్ప. మానవులు గనక ఆ పలుకుల్ని వినగలిగితే వెంటనే వారు స్పృహ కోల్పోతారు." (అబూ సయీద్ (రజి) - బుఖారి)

**సంగ్రహణం :**

మరణమాసన్నమైన వెంటనే ప్రారంభమయ్యే 'బర్జఖ్'జీవితం, మృతకళేబరంతో ఆత్మకు గల సంబంధం మన మేధకు అందే విషయాలు కావు. ఈ హదీసు వల్ల అర్థం అయ్యేదేమిటంటే మృతదేహం బొత్తిగా తెలివిలేకుండా ఉండదని, అది 'బర్జఖ్' భాషలో చెప్పేమాటలు మానవ శ్రవణేంద్రియాలకు అందవన్నదే.

## మృతులు రెండు రకాలు

(۳۸) إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مُرَّ عَلَيْهِ بِجَنَازَةٍ
قَالَ مُسْتَرِيْحٌ وَمُسْتَرَاحٌ مِنْهُ، قَالُوا يَا رَسُوْلَ اللّٰهِ مَا
الْمُسْتَرِيْحُ وَالْمُسْتَرَاحُ مِنْهُ؟ قَالَ، الْعَبْدُ الْمُؤْمِنُ
يَسْتَرِيْحُ مِنْ نَصَبِ الدُّنْيَا وَاَذَاهَا إِلَى رَحْمَةِ اللّٰهِ وَالْعَبْدُ
الْفَاجِرُ يَسْتَرِيْحُ مِنْهُ الْعِبَادُ وَالْبِلَادُ وَالشَّجَرُ وَالدَّوَابُّ

(بخاری عن ابی قتادۃ کتاب الرقاق مسلم کتاب الجنائز)

38. దైవప్రవక్త (సఅసం), ఓ జనాజా వెళుతూ ఉండగా చూసి ఇలా నుడివారు : "ఇతడు సుఖపడేవాడన్నా కావచ్చు లేదా ఇతని దౌష్ట్యాల బారినుండి ప్రజలన్నా సుఖపడవచ్చు."

(ఈ పలుకులకు), దైవప్రవక్తా! మీ పలుకుల భావం ఏమిటో బోధపడలేదు సెలవియ్యరా అని ఆయన అనుచరులు అడిగారు. దానికి ఆయన, "మోమిన్ (విశ్వాసి) అయిన దాసుడు (చనిపోయాక) ఇహలోక బాధలు, కడగండ్ల నుండి తప్పుకొని సుఖాన్ని అనుభవిస్తాడు. అల్లాహ్ కారుణ్యం అతణ్ణి పెనవేసుకుంటుంది. ఇక దైవానికి విధేయత చూపని వాని మరణం వల్ల మనుషులు, నగరాలు, చెట్టు చేమలు జంతు జాలం సైతం శాంతిని, హాయిని పొందుతాయి."

*(అబూ కలూదా (రజి) - బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

ఈ ప్రవచనం భావం ఏమిటంటే మృతులు రెండు రకాలని. 1. దైవంపై విశ్వాసం ఉంచి ఆయన ఆదేశాలకు అనుగుణంగా నడుచుకున్నవాడు. 2. దైవధిక్కారానికి పాల్పడి తన ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తించేవాడు అని.

1. ప్రపంచ జీవితంలో మోమిన్ (విశ్వాసి) ఎన్నో నష్టాలకు కడగండ్లకు లోనుకావలసి వస్తుంది. తన విశ్వాసాన్ని నిలబెట్టుకోవడానికి తన సొంత ప్రయోజనాన్ని వదలిపెట్టుకోవలసి వస్తుంది. ఇదేకాకుండా అసత్యవాదుల పన్నాగాలు, అవిశ్వాసులు పెట్టే అష్టకష్టాల్ని భరించాల్సి ఉంటుంది. అలాంటి తరుణంలో ఓ విశ్వాసి ఈ ప్రపంచాన్ని వదిలిపెట్టి వెళ్ళగానే బాధలు, దుఃఖాలు తమంతటతామే తొలగిపోతాయి. కరుణామయుడైన అల్లాహ్ తన కారుణ్యఛాయలో వారిని చేర్చుకుంటాడు. ఇది వారికి ఎంతో సుఖాన్ని, హాయిని ప్రసాదిస్తుంది.

2. దైవధిక్కారుల వైఖరి మూలంగా దైవదాసుల ధనమాన ప్రాణాలకు రక్షణే ఉండదు. వారి హక్కులు కొల్లగొట్టబడతాయి. ఆస్తిపాస్తులు బలవంతంగా ఆక్రమించ బడతాయి. అమాయకుల రక్తం చిందించబడుతుంది. హిట్లరు, చంగీజ్ ఖాన్ లాంటి చండశాసనుల చేతుల్లో జాతులకు జాతులే నామరూపాల్లేకుండా నాశనమౌతాయి. వీరి ఈ జులుము వల్ల దైవకారుణ్యం ప్రపంచానికి కరువైపోతుంది. ఇలాంటి రాక్షసుల మరణం వల్ల ప్రజలకు ఎంతో ఊరట, హాయి కలుగుతుంది. శాంతీ సౌఖ్యాలు లభ్యం అవుతాయి.

## సమాధి - పరలోకానికి తొలిమజిలీ

(٣٥) كَانَ عُثْمَانُ إِذَا وَقَفَ عَلَى قَبْرٍ بَكَى حَتَّى يَبُلَّ لِحْيَتَهُ، فَقِيلَ

لَـهُ: تُذَكِّرُ الْجَنَّةَ وَالنَّارَ فَلَا تَبْكِي وَتَبْكِي مِنْ هٰذَا فَقَالَ:
إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: إِنَّ الْقَبْرَ
أَوَّلُ مَنْزِلٍ مِنْ مَنَازِلِ الْآخِرَةِ فَإِنْ نَجَا مِنْهُ فَمَا بَعْدَهُ
أَيْسَرُ مِنْهُ، وَإِنْ لَمْ يَنْجُ مِنْهُ فَمَا بَعْدَهُ أَشَدُّ مِنْهُ قَالَ
وَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا رَأَيْتُ مَنْظَرًا
قَطُّ إِلَّا وَالْقَبْرُ أَفْظَعُ مِنْهُ - (ترمذی ابواب الزهد مسند احمد نمبر ۴۵۴)

39. (మూడవ) ఖలీఫా అమీరుల్ మోమినీన్ హజ్రత్ ఉస్మాన్ (రజి) ఏదైనా సమాధి (గోరీ) వద్ద ఆగితే గడ్డం కన్నీటితో తడిసిపోయేలా దుఃఖించేవారు. ఆయన గారి ఈ పరిస్థితిని చూసి, అయ్యా! స్వర్గనరకాల ప్రస్తావన వచ్చినప్పుడు మీరింతగా రోదించరే! మరి సమాధిని చూసినప్పుడల్లా ఇంతగా దుఃఖిస్తారెందుకు? అని అడగ్గా, దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు అని ఆయన జవాబిచ్చారు:

"సమాధికంటే భయానకమైన దృశ్యాన్ని నేనుకానలేదు. ఇది పరలోకానికి వెళ్ళే మార్గంలోని తొలి మజిలి. దీన్ని సునాయాసంగా దాటగలిగితే తరువాత వచ్చే ఘట్టాలు ఇంతకంటే తేలికగా ఉంటాయి. కాని (మనిషి) దీన్నుండి తప్పించుకోలేకపోతే (జారిపోతే) ఆ తరువాత వచ్చే మజిలీ అంతకంటే కఠినతరం కాగలదు."

(హజ్రత్ ఉస్మాన్ (రజి) - తిర్మిజి, ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

మూడో ఖలీఫా హజ్రత్ ఉస్మాన్ (రజి) ఎవరి గురించైతే దైవప్రవక్త (సఅసం) బ్రతికుండగానే 'నీవు స్వర్గంలో ఉంటావు' అనే శుభవార్త వినిపించారో ఆయన సైతం సమాధిలోని భయానక వాతావరణాన్ని, అక్కడి అంధకారాన్ని ఊహించగానే నిలువెల్ల కంపించిపోయేవారు. కన్నీరు మున్నీరుగా విలపించడం వల్ల ఆయన గడ్డం ముద్ద ముద్దగా తడిసిపోయేది. దీనికి కారణం ఏమై ఉంటుంది? ఈ సమాధి పరలోకంలోనికి ప్రవేశించే ప్రవేశద్వారమే కాకుండా ఆ పరలోకానికి ప్రథమ మజిలీ కూడా అన్న దానికే కదా! సమాధిలో ప్రత్యక్షం అయ్యే భయంకర రూపురేఖలు గల దైవదూతల్ని చూడగానే మెదడు మొద్దుబారిపోతుంది.

## ఖబ్ర్ (గోరీ) పిలుపు

(۴۰) دَخَلَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مُصَلَّاهُ فَرَأَى نَاسًا كَأَنَّهُمْ يَكْتَشِرُوْنَ، قَالَ أَمَا إِنَّكُمْ لَوْ أَكْثَرْتُمْ ذِكْرَ هَاذِمِ اللَّذَّاتِ لَشَغَلَكُمْ عَمَّا أَرَى، فَأَكْثِرُوْا مِنْ ذِكْرِ هَاذِمِ اللَّذَّاتِ، "اَلْمَوْتِ" فَإِنَّهُ لَمْ يَأْتِ عَلَى الْقَبْرِ يَوْمٌ إِلَّا تَكَلَّمَ فَيَقُوْلُ:-

أَنَا بَيْتُ الْغُرْبَةِ
أَنَا بَيْتُ الْوَحْدَةِ
أَنَا بَيْتُ التُّرَابِ
وَأَنَا بَيْتُ الدُّوْدِ

فَإِذَا دُفِنَ الْعَبْدُ الْمُؤْمِنُ قَالَ لَهُ الْقَبْرُ مَرْحَبًا وَأَهْلًا، أَمَا إِنْ كُنْتَ لَأَحَبَّ مَنْ يَمْشِيْ عَلَى ظَهْرِيْ إِلَيَّ فَإِذْ وُلِّيْتُكَ الْيَوْمَ وَصِرْتَ إِلَيَّ فَسَتَرَى صَنِيْعِيْ بِكَ فَيَتَّسِعُ لَهُ مَدَّ بَصَرِهٖ وَيُفْتَحُ لَهُ بَابٌ إِلَى الْجَنَّةِ،

وَإِذَا دُفِنَ الْعَبْدُ الْفَاجِرُ أَوِ الْكَافِرُ قَالَ لَهُ الْقَبْرُ لَا مَرْحَبًا وَلَا أَهْلًا أَمَا إِنْ كُنْتَ لَأَبْغَضَ مَنْ يَمْشِيْ عَلَى ظَهْرِيْ إِلَيَّ فَإِذْ وُلِّيْتُكَ الْيَوْمَ وَصِرْتَ إِلَيَّ فَسَتَرَى صَنِيْعِيْ بِكَ قَالَ فَيَلْتَئِمُ عَلَيْهِ حَتّٰى يَلْتَقِيَ عَلَيْهِ وَتَخْتَلِفَ أَضْلَاعُهُ قَالَ: قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ، بِأَصَابِعِهٖ فَأَدْخَلَ بَعْضَهَا فِيْ جَوْفِ بَعْضٍ قَالَ وَيُقَيَّضُ لَهُ سَبْعُوْنَ تِنِّيْنًا لَوْ أَنَّ وَاحِدًا مِنْهَا نَفَخَ فِي الْأَرْضِ مَا أَنْبَتَتْ شَيْئًا مَا بَقِيَتِ الدُّنْيَا، فَيَنْهَشْنَهُ وَيَخْدِشْنَهُ حَتّٰى يُفْضٰى بِهٖ إِلَى

الْحِسَابِ قَالَ: قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِنَّمَا
الْقَبْرُ رَوْضَةٌ مِنْ رِيَاضِ الْجَنَّةِ، أَوْحُفْرَةٌ مِنْ حُفَرِ النَّارِ
(ترمذی عن ابی سعیدؓ ابواب القیامۃ)

40. దైవప్రవక్త (సఅసం) తాను నమాజు చేసే ప్రదేశంలోనికి ప్రవేశించినప్పుడు అక్కడ చేరివున్న వారు పరస్పరం నవ్వుకుంటూ ఉండగా చూసి ఇలా పలికారు :

"మీరేగనక మీ సుఖాల్ని త్రెంచే దాన్ని గురించి అధికంగా తలచు కుంటూ ఉంటే ఈ నవ్వుల్ని మరిచిపోయి ఉందురు. ప్రజలారా! మీ సుఖాల్ని అంతం చేసే దాన్ని సాధ్యమైనంత అధికంగా తలచుకుంటూ ఉండండి. (ఆ సుఖాల్ని అంతం చేసేదేమిటో మీకు తెలుసా, అయితే వినండి) అది మృత్యువు. 'ఖబ్ర్' (సమాధి) ప్రతి రోజూ ఇలా పిలుపు నిస్తుంది:

– నేను స్వస్థలాన్ని వదిలి ఇక్కడకు వచ్చి ఉండేవారి నివాసాన్ని – నేను ఒంటరిగా ఉండవలసిన నీ ఏకాంతవాసాన్ని. – నేను మట్టితో కూడుకుని ఉన్న మృత్తిక గృహాన్ని. – నేను క్రిమికీటకాదులతో నిండియున్న నివాసాన్ని.

మోమిన్ (విశ్వాసి) సమాధి చేయగానే అది అతనికి స్వాగతం పలుకుతూ "నా వీపుపై నడిచే వారిలోకెల్ల నీవు నాకెక్కువ ప్రియమైన వాడివి. ఇప్పుడు నిన్ను నా రక్షణలో ఇవ్వడం జరిగింది. నువ్వు నా అధీనంలో ఉన్నావు. కాబట్టి నీ ఎడల నేనెంత ఉత్తమంగా మెలుగుతానో చూద్దువుగాని! ఆ తరువాత సమాధి చూపు ఆనేటంతవరకు విశాలం అవుతుంది. అందులో స్వర్గం వైపు వెళ్ళే ఓ ద్వారం తెరుచుకుంటుంది.

దైవధిక్కారి, అవిశ్వాసి అయినవాడు ఖననం కాగానే సమాధి స్వాగతం పలకదు. ఆ తరువాత అతణ్ణి ఉద్దేశించి, నా వీపును తొక్కే వాళ్ళల్లోకెల్లా నీవే నాకెక్కువ అయిష్టుడవు (ద్వేషివి). ఈ రోజు నాకు నీపై పెత్తనం ఇవ్వడం జరిగింది. ఇప్పుడు నీవు నా అధీనంలో ఉన్నావు. కాబట్టి

చూడు నీ ఎడల నేనెలా ప్రవర్తిస్తానో, అంటూ అతనిపై విరుచుకుపడుతుంది. దాంతో అతని ప్రక్కటెముకలు ఒక ప్రక్కవి మరో ప్రక్కలో చొరబడేలా - ఇలా అని చూపిస్తూ దైవప్రవక్త (సఅసం) తమ చేతుల ప్రేళ్ళను ఒకదానితో మరొకటి చొరబడేటట్లు దూర్చారు - అణచేస్తుంది. అతనిపైకి 70 సర్పాలు వదలివేయబడతాయి. వాటిల్లో ఏ ఒక్కటైనా భూలోకం మీదికి బుసకొడితే ఈ భూమండలంపై ప్రళయం వరకు ఏదీ మొలకెత్తలేదు. ఈ సర్పాలు ప్రళయం వరకు అతణ్ణి కాటేస్తూనే ఉంటాయి."

దైవప్రవక్త (సఅసం) చివరిగా ఇలా సెలవిచ్చారు :

"సమాధి స్వర్గ ఉద్యాన వనాల్లో ఓ భాగమో, లేక ఓ అగ్ని గుండమో అయి ఉంటుంది." *(అబూ సయీద్ (రజి) - తిర్మిజి)*

**సంగ్రహణం :**

శరీరం నుండి ఆత్మ వేరై పోవడమే మరణమంటే. ఈ ఆత్మ ఏనాటికైనా ఈ బొందిని వదలి వెళ్ళవలసిందే. అందుకనే దాన్ని ఎల్లప్పుడూ తలచుకుంటూ ఉండాలని చెప్పడం జరిగింది ఈ హదీసులో. 'హాజిమ్' అనే అరబీ పదానికి అర్థం త్వరగా నరికి వేసేది అని. మృత్యువుకు దయా దాక్షిణ్యాలు ఉండవు. ఒక ఉదుటున పైనబడి సుఖాల్ని దుఃఖాలుగా మార్చివేస్తుంది. దాని ఒకే ఒక వ్రేటుతో ఐశ్వర్యాలు, సుఖభోగాలు అన్నీ బూడిదగా మారిపోతాయి. మనిషి నిర్మించుకున్న ఆకాశ హర్మ్యాలు, మహలులు, ఐశ్వర్య సదనాలన్నీ దీని ఒకే ఒక దెబ్బతో స్మశాన వాటికలుగా మిగిలిపోతాయి. ఇది ముమ్మాటికి నిజం. ఇక సమాధి (గోరి) లోని అంధకారం, అక్కడి భయానక పరిస్థితి గురించి ఈ హదీసులో ఎంతో వివరంగా సెలవియ్యడం జరిగింది.

## సమాధి యాతన

(۴۱) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا قُبِرَ الْمَيِّتُ
(أَوْقَالَ أَحَدُكُمْ) أَتَاهُ مَلَكَانِ أَسْوَدَانِ أَزْرَقَانِ
يُقَالُ لِأَحَدِهِمَا الْمُنْكَرُ وَالْاٰخَرُ النَّكِيْرُ فَيَقُوْلَانِ: مَاكُنْتَ
تَقُوْلُ فِيْ هٰذَا الرَّجُلِ؟ فَيَقُوْلُ مَا كَانَ يَقُوْلُ هُوَ عَبْدُ اللّٰهِ
وَرَسُوْلُهُ اَشْهَدُ أَنْ لَا إِلٰهَ إِلَّا اللّٰهُ وَأَنَّ مُحَمَّدًا عَبْدُهُ

وَرَسُوْلُهُ۔ فَيَقُوْلَانِ: قَدْ كُنَّا نَعْلَمُ أَنَّكَ تَقُوْلُ هٰذَا ثُمَّ
يُفْسَحُ لَهُ قَبْرُهُ سَبْعُوْنَ ذِرَاعًا فِيْ سَبْعِيْنَ۔ ثُمَّ يُنَوَّرُ لَهُ
فِيْهِ ثُمَّ يُقَالُ لَهُ: نَمْ۔ فَيَقُوْلُ أَرْجِعُ إِلٰى أَهْلِيْ فَأُخْبِرُهُمْ
فَيَقُوْلَانِ: نَمْ كَنَوْمَةِ الْعَرُوْسِ الَّذِيْ لَا يُوْقِظُهُ إِلَّا
أَحَبُّ أَهْلِهِ إِلَيْهِ، حَتّٰى يَبْعَثَهُ اللّٰهُ مِنْ مَضْجَعِهِ ذٰلِكَ
وَإِنْ كَانَ مُنَافِقًا قَالَ: سَمِعْتُ النَّاسَ يَقُوْلُوْنَ فَقُلْتُ
مِثْلَهُ لَا أَدْرِيْ۔ فَيَقُوْلَانِ: قَدْ كُنَّا نَعْلَمُ أَنَّكَ تَقُوْلُ
ذٰلِكَ، فَيُقَالُ لِلْأَرْضِ: الْتَئِمِيْ عَلَيْهِ فَتَلْتَئِمُ عَلَيْهِ،
فَتَخْتَلِفُ أَضْلَاعُهُ، فَلَا يَزَالُ فِيْهَا مُعَذَّبًا حَتّٰى يَبْعَثَهُ
اللّٰهُ مِنْ مَضْجَعِهِ ذٰلِكَ۔

(ترمذی عن ابی ہریرۃ ابواب الجنائز، مشکوٰۃ باب اثبات عذاب القبر)

**41.** దైవప్రవక్త(స) ప్రవచనం ఇలా ఉంది: "ఖననం జరిగాక సమాధిలో మృతుని దగ్గరకు నల్లని ఆకారంలో ఇద్దరు దేవదూతలు వస్తారు. వారి కళ్ళు నీలంగా ఉంటాయి. ఒకడిని 'మున్కిర్' అని మరొకడిని 'నకీర్' అని అంటారు. ఆ దేవదూతలు "ఈ వ్యక్తి గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని అడుగుతారు. ఆ సమాధి చేయబడ్డ వ్యక్తి ఇదివరకు అన్నట్లుగానే (తాను బ్రతికి ఉండగా అన్నట్లుగానే) "ఈయన దైవదాసుడు, దైవప్రవక్త. అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యం ఇస్తున్నాను. హజ్రత్ ముహమ్మద్(స) అల్లాహ్ దాసుడు ఈయన ప్రవక్త కూడా" అని పలుకుతాడు. (ఇతని ఈ సమాధానం విని) అవును నీవు ఇదే సమాధానం ఇస్తావని మాకు ముందే తెలుసు అని అంటారు. అతని సమాధి అతని (సౌఖ్యం) కోసం డెబ్బై చదరపు మూరలంత విశాలంగా మారుతుంది. అదంతా దేదీప్యమానంగా వెలిగిపోతుంది. (అంటే అందకార భయం అన్నదే ఉండదు) 'ఇక నిద్రించు' అని అంటారు ఆ

దైవదూతలు, అతడే అతడు "నా భార్యపిల్లలకు ఈ శుభవార్త నందించడానికి వెడతానంటాడు. దానికి ఆ దేవదూతలు (లేదు) ఇక కేవలం ప్రియుడే వచ్చి నిద్ర లేపే పెళ్ళికూతురిలా నిద్రించు అని అంటారు (అతడు నిశ్చింతగా నిద్రపోతాడు) చివరికి అల్లాహ్ (ప్రళయం నాడు) అతడు నిద్రించిన స్థలంనుండి మేల్కొలుపుతాడు.

అదే (ఖననం చేయబడ్డవాడు) మునాఫిక్ (కపటి) అయితే దేవ దూతలు అడిగినదానికి, ఈ ముహమ్మద్(స) ఎవరో నాకు తెలియదు. అయితే ఇతరులు అనుకోగా నేనూ నోటితో వల్లించేవాణ్ణి' అని జవాబిస్తాడు. ఈ సమాధానం విన్న దేవదూతలు, మాకు తెలుసు నీవిలాగే అంటారని అని అంటారు. ఆ తరువాత భూమిని ఉద్దేశించి ఇతనిపైకి విరుచుకుపడు, ఒడిసి పట్టుకో అని ఆదేశం ఇస్తారు. భూమి అతనిపై దాడిచేస్తుంది. అతని ప్రక్కటెముకలు (ఆ ఒత్తిడికి) ఒకదానితో ఒకటి చొరబడతాయి. ఈ కపటి సమాధి యాతనలో సతతం చిక్కుకొని ఉంటాడు. చివరికి అల్లాహ్ ప్రళయ దినాన అతణ్ణి ఆ గోరి నుండి లేపి నిలబెడతాడు." (అబూ హురైరా(రజిఅన్)- తిర్మిజీ)

**సంగ్రహణం :**

'మున్కిర్' అంటే గుర్తింప వీలులేని వాడు. 'నకిర్' అంటే అసలు ఎవరినీ గుర్తించలేని వాడు. గోరీలో ప్రశ్నించే ఆ ఇద్దరు దేవదూతల్ని మున్కిర్, నకిర్ అని ఎందుకు అనవలసి వచ్చిందంటే వారి రూపురేఖల్ని చూడగానే ఆ గోరీలో ఖననం చేయబడ్డ వ్యక్తికి భయం ఏర్పడుతుంది. ఒకణ్ణి తాను గుర్తించనే లేడు. మరొకడు తనను గుర్తించనే గుర్తించడు. తన జీవితంలో వారిని చూడలేదు. వారితో పరిచయమూ లేదు. కాబట్టి వారిరువురు ఇతడికి అపరిచితులే.

'బర్జఖ్' (మృతుల ఆత్మలు నివాసముండే లోకం)లో దైవప్రవక్త (సఅసం)ను విశ్వసించడం, విశ్వసించకపోవడం గురించి మున్కిర్, నకిర్‌లు మానవుల్ని ప్రశ్నించడం యదార్థం. కొన్ని ఉల్లేఖనాల్లోనయితే నీ 'రబ్' ప్రభువు ఎవరని, నీ దీన్ (ధర్మం) ఏది అని అడిగే ప్రశ్నల ప్రస్తావన వస్తుంది. మొత్తానికి మనిషి చనిపోయాక తన కర్మలకు జవాబు చెప్పుకోవలసిన ఘట్టం వెంటనే ప్రారంభం అవుతుంది. మృతుణ్ణి గోరిలో పాతిపెట్టినా ఆ మృత దేహం కాలిబూడిద అయినా లేక అది నీళ్ళలో మునిగి చీలి ముక్క ముక్కలై చేపల

ఆహారంగా మారినా సరే మృత కళేబరంలో ఆత్మ అన్నది తిరిగి ప్రవేశించడం జరుగుతుంది. దేహపు కణాలన్నిటిని ఓ చోట చేర్చి అందులో ఆత్మను ప్రవేశపెట్టడం సృష్టికర్తకు ఏమంత కష్టమైన పనికాదు. అదేకాకుండా అలాంటి మరో దేహాన్ని సృష్టించడం కూడా జరగవచ్చు.

'ఖబ్ర్' అతనికోసం డెబ్బై చదరపు మూరలు విశాలంగా మారుతుంది అంటే అరబిక్ భాషలో 'డెబ్బై' అనే పదం విశాలత, 'మరింత' అనే భావంలో వాడబడుతుంది. అంటే సంఖ్య అనే భావం కాదిక్కడ. 'బర్జఖ్' లోకంలో మోమిన్ కోసం ఎంతో విశాలమైన ప్రదేశం లభిస్తుందని భావం.

(۴۲) اِنَّ النَّبِیَّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَالَ لَوْلَا اَنْ لَّا تُدَافِنُوْا لَدَعَوْتُ اللّٰهَ اَنْ یُّسْمِعَکُمْ مِنْ عَذَابِ الْقَبْرِ

(مسلم عن انس کتاب التوبۃ)

42. మీరు (మీ మృతుల కళేబరాలను) దఫన్ (పూడ్చడం) చేయడం మానేస్తారేమో అనే అనుమానం లేకపోతే, సమాధి యాతన అంటే ఏమిటో మీకు తెలుపమని అల్లాహ్‌ను వేడుకునేవాణ్ణి" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (అనస్ (రజి) – ముస్లిమ్)

**సంగ్రహణం :**

సమాధిలో పెట్టబడే యాతనల వల్ల ఉద్భవించే ఆక్రందనలు, ఆర్తనాదాలు, కర్ణకఠోరమైన శబ్దాలు మనిషి చెవినబడకుండా ఉంచాలన్నదే అల్లాహ్ అభిమతం. ఇందులో ఏదో ఔచిత్యం ఉండి ఉంటుంది. అలా జరగకపోతే మనుషులు తమ మృత కళేబరాల్నే పూడ్చడం మానేసేవారు. ప్రజలు భయవిహ్వలులై తమ ఆప్తుల శవాల దగ్గరకు కూడా పోయే వారు కారు అని ఈ హదీసు భావం.

మహాప్రవక్త ఇలా బోధించారు: "నాకు నా అనుచర సంఘం గురించి కలిగే ఆందోళన ఒక్కటే, వారు మనోవాంఛలను అనుకరించటం మొదలెడుతారన్నది, ప్రాపంచిక వ్యామోహంలోపడి పెద్దపెద్ద ప్రణాళికలు వేసుకోవడంలో లీనమవుతారన్నదే నా ఆందోళన. మనోవాంఛలు వారిని సత్యానికి బహుదూరం చేస్తాయి. ప్రాపంచిక ప్రణాళికలు వారిచే పరలోకాన్ని విస్మరింపజేస్తాయి. ప్రపంచం బయలుదేరింది. ముందుకు వెళుతోంది. పరలోకం కూడా బయలుదేరింది అని ఎదురువస్తోంది. వీటిలో ప్రతిదాన్నీ

ప్రేమించేవారున్నారు. అయితే మీరు ప్రపంచాన్ని అభిమానించేవారు కాకపోవడమే శ్రేయస్కరం. సత్కర్మలు చేయండి. ఈ ప్రపంచం క్రియా గృహం. ఇక్కడ లెక్కల విచారణ లేదు. రేపు మీరు పరలోకంలో ఉంటారు. అక్కడ (లెక్కల విచారణే కాని) ఆచరణలకు తావుండదు." (మిష్కాత్- జాబిర్)

మహాప్రవక్త(స)ఇలా అన్నారు: నరకం అంటే భీకరమైన దాన్ని నేను చూడలేదు- అయితే దాన్ని తప్పించుకు పారిపోవలసిన వాడు నిద్రపోతున్నాడు. స్వర్గం కంటే ఉత్తమమయినదాన్నీ నేను చూడలేదు- దాన్ని పొందగోరేవాడు కూడా గాఢనిద్రలో ఉన్నాడు. (తిర్మిజీ)

## ఆలమె బర్జఖ్ (ఆత్మల లోకం)

۴۳) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا مَاتَ الرَّجُلُ عُرِضَ عَلَيْهِ مَقْعَدُهُ بِالْغَدَاةِ وَالْعَشِيِّ إِنْ كَانَ مِنْ أَهْلِ الْجَنَّةِ فَالْجَنَّةُ وَإِنْ كَانَ مِنْ أَهْلِ النَّارِ فَالنَّارُ قَالَ ثُمَّ يُقَالُ هٰذَا مَقْعَدُكَ الَّذِي تُبْعَثُ إِلَيْهِ يَوْمَ الْقِيَامَةِ۔

(مسلم عن ابن عمر کتاب الجنۃ، بخاری کتاب الجنائز- ترمذی ابواب الجنائز)

43. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : మనిషి మరణించాక తాను ఏ ప్రదేశంలో నివాసముండబోతున్నాడో ఆ ప్రదేశాన్ని ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం చూపించడం జరుగుతుంది. అతడు స్వర్గానికి అర్హుడయిన వాడయితే స్వర్గాన్ని, నరకానికి అర్హుడైనవాడయితే నరకాన్ని చూపిస్తూ, ప్రళయదినాన సమాధి నుండి లేచిన తరువాత నీకు లభించ నున్న నీ శాశ్వత నివాసం ఇదే' అని చెప్పడం జరుగుతుంది.

*(ఇబ్నె ఉమర్ (రజి) – ముస్లిమ్, బుఖారి, తిర్మిజి)*

**సంగ్రహణం :**

మనిషికి బర్జఖ్ అనే లోకంలో అతని చివరి నివాసాన్ని – అది స్వర్గం అయినా నరకం అయినా – ఉదయం, సాయంకాల వేళల్లో చూపడం జరుగుతుంది. నీవు ఇహలోకంలో అవలంబించిన వైఖరికి ఫలితంగా నీకు లభించబోయే నివాసం ఇదే అని

చెప్పడం జరుగుతుంది.

పరలోక సంబంధమైన ఈ మొదటి మజిలీ (ఖబ్ర్) నిజంగానే భయంకరమైనది. సమాధి చేయబడ్డవాడు తన విశ్వాసం, ఆచరణల ఫలితంగా స్వర్గానికి అర్హుడయితే అతడు ప్రతి దినం తనకు లభించబోయే స్వర్గం యొక్క ప్రతిబింబాన్ని చూస్తూ ఉంటాడు. ఇక ఆ పూడ్చబడ్డ వ్యక్తి (అవిశ్వాసి అయి తన దైవధిక్కార వైఖరి ఫలితంగా) శిక్షార్హుడైతే, అతడు ప్రళయం వరకు తాను ఏ శిక్షకు అర్హుడవుతాడో ఆ శిక్షకు (నరకానికి) సంబంధించిన ప్రదేశం అతని ముందు ప్రతిరోజూ కనిపిస్తూ ఉంటుంది.

కొందరు ధర్మవేత్తలు ఈ హదీసు వివరణ ఇస్తూ చనిపోయాక మనిషికి రెండు తడవలు మాత్రమే అతను పొందబోయే నివాసాన్ని చూపడం జరుగుతుందని, తద్వారా ప్రళయం నాడు తాను ఏ ప్రదేశానికి వెళ్ళనున్నాడో అంచనా వేసుకోగలడని అంటారు.

ఈ హదీసులో 'పొద్దుమాపులు' అనే పదం ఉపయోగించడం జరిగింది. మన మానవ జ్ఞానాన్ని దృష్టిలో ఉంచుకునే అసలు బర్జఖ్ లోకంలో మనకు ఎదురు కాబోయే కాలం ఎలాంటిదో దానికి ఓ అంచనా అంటూ లేదు. 'బర్జఖ్' గురించి దైవప్రవక్త (సఅసం) ఇచ్చిన భోగట్టాకు సంబంధించిన విషయాలను తెలుసుకోవడం ఈ లోకంలో సాధ్యపడేది కాదు. ఎందుకంటే మన జ్ఞానేంద్రియాలు అక్కడి విషయాలను ఊహించనైనా ఊహించలేవు.

## మృతుని ఇంట్లో భోజనాల ఏర్పాటు

(۴۴) لَمَّا جَاءَ نَعِیُّ جَعْفَرٍ قَالَ النَّبِیُّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِصْنَعُوْا لِآلِ جَعْفَرٍ طَعَامًا فَقَدْ أَتَاھُمْ مَا یَشْغَلُھُمْ۔

(ترمذی عن عبداللہ بن جعفر ابواب الجنائز - ابو داؤد کتاب الجنائز - مشکوٰۃ کتاب الجنائز)

44. హజ్రత్ జాఫర్ బిన్ అబీ తాలిబ్ (రజి) (మూలూ యుద్ధంలో) అమరగతి నొందారు. ఈ వార్త విన్నంతనే దైవప్రవక్త (సఅసం) "జాఫర్ ఇంటి వారి కోసం భోజన ఏర్పాట్లు చేయండి. వారు విన్న బాధాకరమైన వార్త వారిని ఏ పనీ చేయకుండా చేసింది" అని సెలవిచ్చారు.

(అబ్దుల్లా బిన్ జాఫర్ (రజి)– తిర్మిజి, అబూ దావూద్)

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం) తమ ఇంటి వారికి, భోజనం తయారుచేసి జాఫర్ (రజి) గారింటికి పంపమని పురమాయించారు. అప్పుడే విన్న ఆ బాధాకరమైన వార్త మృతుని ఇంటివారికి భోజనాలు తయారుచేసుకునేటట్లు ఎలా చేస్తుంది? అందుచేత పొరుగువారో, బంధుమిత్రులో మరణం సంభవించిన ఇంటికి కనీసం రెండు పూటల భోజనం అయినా పంపడం కనీసం ధర్మం, మానవత్వమూను.

## మృతుల గురించి చర్చించుకోవడం

(۴۵) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ اُذْکُرُوْا مَحَاسِنَ مَوْتَاکُمْ وَکُفُّوْا عَنْ مَسَاوِیْھِمْ۔

(ترمذی عن ابن عمر ابواب الجنائز۔ ابوداؤد کتاب الادب)

45. "మీరు మీ మృతుల మంచి పనుల గురించే చర్చించుకోండి. వారి చెడుల గురించి చెప్పుకోవడం మానుకోండి" అని దైవప్రవక్త (సఅసం) ప్రబోధించారు. (హజ్రత్ ఆయిషా (రజి) - అబూ దావూద్)

(۴۶) قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِذَا مَاتَ صَاحِبُکُمْ فَدَعُوْہُ وَلَا تَقَعُوْا فِیْہِ۔ (ابوداؤد عن عائشہ کتاب الادب)

46. 'మరణించిన మీ మిత్రుని లోపాలను ఎన్నకండి' అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

**సంగ్రహణం :**

చనిపోయిన వారి తప్పుల్ని, వారి లోపాలను గురించి చర్చించుకోవడం సరైన విషయం కాదు అన్నది ఈ 'హదీసు'లోని భావం. చచ్చి తన ప్రభువు వద్దకు వెళ్ళిన వ్యక్తి చెడు ప్రవర్తనను చాటుకుంటూ తిరగడం ఏమంత మంచి పని కూడా కాదు. అతని పాపాలను, లోపాలను వెల్లడించడం మానుకోవాలి. సరికదా అతని గురించి ఎల్లప్పుడూ మంచి వాక్యాలనే పలకాలి. అతని మేళ్ళను కొనియాడాలి. అతడు తన పరీక్షా పత్రాన్ని పూర్తిచేసి ప్రపంచం అనే ఈ పరీక్షాహాలు నుండి ఎప్పుడో బయటపడ్డాడు. ఈ లోకంలో

తాను ఆచరించిన కర్మల ఫలితాల కోసం ఎదురుచూస్తున్నాడు.

మరోవిధంగా ఆలోచిస్తే మృతుని లోపాలను ఎన్నడం, వంకలు పెట్టడం అంటే అది ఓ విధంగా పరోక్ష నిందకు గురి అయినట్లేకదా! బ్రతికున్న మనిషి ఎడల అలా జరిగితే బ్రతికున్నాడు కాబట్టి క్షమాపణ వేడవచ్చు. కాని ఇక్కడ చనిపోయిన వ్యక్తిని తప్పు జరిగిపోయింది క్షమించు అని అడగడం గాని, అతడు క్షమించడం గాని కుదరదు. అదేవిధంగా అతడు తిరిగి ఈ లోకానికి వచ్చి మనం వేసే నిందలకు సంజాయిషీ చెప్పుకుని ఖండించనూ లేదు.

## నౌహా (పెడబొబ్బలు పెట్టి ఏడ్వడం - తీవ్రమైన తప్పు)

(٤٧) وَجِعَ اَبُوْمُوْسٰی وَجَعًا فَغُشِیَ عَلَیْهِ وَرَأْسُهٗ فِیْ حِجْرِ اِمْرَاَةٍ مِنْ اَهْلِهٖ فَصَاحَتْ اِمْرَاَةٌ مِنْ اَهْلِهٖ فَلَمْ یَسْتَطِعْ اَنْ یَّرُدَّ عَلَیْهَا شَیْئًا فَلَمَّا اَفَاقَ قَالَ اَنَا بَرِیْءٌ مِمَّا بَرِیَٔ مِنْهُ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فَاِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ بَرِیَٔ مِنَ الصَّالِقَةِ وَالْحَالِقَةِ وَالشَّاقَّةِ۔

(مسلم عن ابی بردہ بن ابی موسی کتاب الایمان۔ بخاری کتاب الجنائز۔ ابوداؤد کتاب الجنائز)

47. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) వ్యాధికి గురైనప్పుడు ఆయన తన భార్య ఒడిలో తలపెట్టి ఆ స్థితిలోనే స్పృహ కోల్పోయారు. అది గాంచిన ఆమె లబోదిబో అని మొత్తుకోనారంభించింది. ఆ స్థితిలో అబూ మూసా ఆమెను వారించలేకపోయారు. కాని స్పృహలోకి రాగానే (భార్య నుద్దేశించి) ఏ విషయాన్నైతే దైవప్రవక్త (సఅసం) అసహ్యించుకున్నారో ఆ విషయాన్ని నేనూ అసహ్యించుకుంటాను. దుఃఖబాధను భరించలేక గగ్గోలు పెట్టడం, ముఖంపై బాదుకోవడం, కష్టకాలం వచ్చినప్పుడు తలవెంట్రుకల్ని పీక్కోవడం లేక గొరిగించుకోవడం లాంటి పనులు చేసే స్త్రీని అసహ్యించుకున్నారు దైవప్రవక్త (సఅసం) అని అన్నారాయన. (అబీ బుర్దా బిన్ అబీ మూసా (రజి) - ముస్లిమ్, బుఖారి)

**సంగ్రహణం :**

కష్టకాలం దాపురించినప్పుడు లేక బంధుమిత్రులు చనిపోయినప్పుడు కొందరు మహా గోల చేస్తారు. ఆ బాధను తాళలేక వారు తమ గుండెల్ని బాదుకోవడం శోకాలు తీసి ఏడ్వడం, తల వెంట్రుకల్ని పీక్కోవడం బట్టలు చింపుకోవడం చేస్తూ ఉంటారు. ఇలాంటి వెకిలి చేష్టల ద్వారా వారిలోని అసహనం, పిరికితనం బయటపడతాయి. కాబట్టి ఇస్లాం ఇలాంటి చేష్టల్ని నిరసిస్తోంది.

## మాతం (శోకాలు తీసి ఏడ్వడం)

(۴۸) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَيْسَ مِنَّا مَنْ ضَرَبَ الْخُدُوْدَ
وَشَقَّ الْجُيُوْبَ وَدَعَا بِدَعْوَى الْجَاهِلِيَّةِ۔

(بخاری عن عبداللہ بن مسعود کتاب الجنائز، مسلم کتاب الایمان ترمذی ابواب الجنائز)

48. "ముఖంపై కొట్టుకునే వాడు, బట్టలు చించుకునేవాడు అజ్ఞానుల్లా పెడబొబ్బలు పెట్టేవాడు మన వాడు కాడు" అని అంతిమ దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. *(అబ్దుల్లా బిన్ మస్‌ఊద్(రజి)- బుఖారీ, ముస్లిం)*

(۴۹) لَعَنَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ النَّائِحَةَ وَالْمُسْتَمِعَةَ

(ابوداؤد عن ابی سعید الخدری کتاب الجنائز)

49. దైవప్రవక్త(స) మాతం చేసే స్త్రీని, ఆ మాతం విన్న స్త్రీని శపించారు. *(అబూ సయీద్ ఖుద్రి (రజి) - అబూ దావూద్)*

**సంగ్రహణం :**

పై హదీసులో 'నాహియా' అనే పదం వాడడం జరిగింది. ఇది 'నియాహత్' అనే మూల పదం నుండి వచ్చింది. నియాహత్ అంటే మృతుని కొరకు పెద్దగా రోదించడం. గొంతుచించుకొని ఏడుస్తూ అతని గురించి గొప్పలు చెప్పడం. అదేకాకుండా నెత్తిమీద దుమ్మెత్తిపోసుకోవడం, ముఖాన్ని గీసుకోవడం, బట్టల్ని చించుకోవడం, గుండెలు బాదుకోవడం లాంటివన్నీ ఈ 'నియాహత్'కు సంబంధించినవే. ఉర్దూ భాషలోని మాతం అనే పదం ఈ భావాలన్నిటిని కలిగి ఉంది.

మరణం నిరాకరించని ఓ యదార్థం, దానికి ఎవడూ అతీతుడు కాడు. అయితే

దీన్ని ఒప్పుకుంటూనే మరణించినవాని కోసం పరితపించడం సహజం. హృదయవేదన, బాధ కన్నీరు కార్చేలా చేస్తుంది, షరీఅత్ అంతమట్టుకే అనుమతి ఇస్తుంది. కాని చనిపోయినవాని విరహ వేదనకు లోనై ఆ మృతుని బంధువులు, మిత్రులు తమ బట్టల్ని చించుకోవడం, చెంపలపై చరుచుకోవడం, శోకాలు తీసి అతడు చేయని మంచి పనుల గూర్చి చెప్పుకుంటూ రోదించడం ఎంతవరకు సబబు? అలాంటి వారికోసమే దైవప్రవక్త (సఅసం), 'వాళ్ళు మన వాళ్ళు కారు, వారితో మనకెలాంటి సంబంధం లేదు' అని అన్నది. ఏ ముస్లిం కూడా దైవప్రవక్త (సఅసం) గారి సమాజం నుండి వేరైపోవడానికి ఊహామాత్రంగానైనా ఒప్పుకోడు.

ఇక ముహర్రం మాసం వచ్చిందంటే హజ్రత్ ఇమామ్ హుసైన్ (రజి) గారి మాతమ్ చేయడాన్ని ఓ ఆరాధనగా భావిస్తారు కొందరు. ఇలాంటి అమాయక ముస్లిమ్ సోదరులు ఈ హదీసు గురించి కొంత ఆలోచించవలసి ఉంది. అమరగతి నొందిన ఆ మహానుభావుణ్ణి తలుచుకునే పద్ధతి ఇది కాదు. దైవప్రవక్త (సఅసం) మాతమ్ చేసేవారిని, ఆ మాతమ్ తతంగాన్ని శ్రద్ధచూపే వారిని కలిపి ఒకేవిధమైన నేరస్తులుగా పరిగణించారు.

(٥٠) عَنْ اِمْرَأَةٍ مِنَ الْمُبَايِعَاتِ قَالَتْ كَانَ فِيْمَا أَخَذَ عَلَيْنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فِي الْمَعْرُوْفِ الَّذِىْ أَخَذَ عَلَيْنَا اَنْ لَّا نَعْصِيَهُ فِيْهِ اَنْ لَّا نَخْمِشَ وَجْهًا وَلَا نَدْعُوَ وَيْلًا وَلَا نَشُقَّ جَيْبًا وَلَا نَنْشُرَ شَعْرًا۔

(ابوداؤد عن اسيد بن ابى اسيد كتاب الجنائز)

50. దైవప్రవక్త (సఅసం) చేతిపై బైత్ (ప్రమాణం) చేసిన ఓ మహిళ ఇలా అంటారు: దైవప్రవక్తతో మేము చేసిన వాగ్దానం ప్రకారం, "మేము దైవం నిర్దేశించిన కార్యాల (మారూఫ్) విషయంలో మిమ్మల్ని జవదాటం" అన్నది. అదేవిధంగా ఈ వాగ్దానంలోనే (కష్టసమయాల్లో హృదయాన్ని కదిలించే దుఃఖ సమయాల్లో) మేము మా ముఖాన్ని గాయపర్చుకోము, చావును కోరుకోము, మా బట్టల్ని చించుకోము, మా వెంట్రుకల్ని పీక్కొని చిందరవందర చేసుకోము అన్నవి కూడా ఉన్నాయి.

(అసీర్ బిన్ అబీ అసీర్ - అబూ దావూద్)

**సంగ్రహణం :**

చావును కోరుకోవడం అంటే, స్త్రీలు ఎప్పుడైనా భరించరాని బాధకు (దుఃఖానికి) గురైతే ఎంతో అసహనాన్ని ప్రదర్శిస్తూ, మేమీరోజు బ్రతికుండేకంటే చనిపోయి ఉంటే బాగుండేది అని అనడం. ఇది మనం తరచూ వింటూనే ఉంటాం. సాధారణంగా ఇలాంటి సమయాల్లో తమ బట్టల్ని చించుకునే బలహీనతలను కూడా కనబరుస్తూ ఉంటారు. ఇలాంటి సమయాలు వచ్చినప్పుడు నెత్తిపై దుమ్మెత్తి పోసుకోవడం, వెంట్రుకల్ని ఛిన్నాభిన్నం చేసుకోవడం, మరణాన్ని కోరుకోవడం జరుగుతుంది. కాబట్టే మహాప్రవక్త (సఅసం) ఇలా చేయవద్దని, అజ్ఞాన కాలం నాటి ఈ పోకడల్ని వదిలేయమని వారితో ప్రమాణం చేయించారు.

## మృతుల విషయంలో కన్నీరు కార్చే అనుమతి

(٥١) عَنْ اُسَامَةَ بْنِ زَيْدٍ قَالَ كُنَّا عِنْدَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَاَرْسَلَتْ اِلَيْهِ اِحْدٰى بَنَاتِهٖ تَدْعُوْهُ وَتُخْبِرُهُ اَنَّ صَبِيًّا لَهَا اَوْ اِبْنًا لَهَا فِي الْمَوْتِ فَقَالَ لِلرَّسُوْلِ اِرْجِعْ اِلَيْهَا فَاَخْبِرْهَا اِنَّ لِلّٰهِ مَا اَخَذَ وَلَهٗ مَا اَعْطٰى وَكُلُّ شَيْءٍ عِنْدَهٗ بِاَجَلٍ مُسَمًّى فَمُرْهَا فَلْتَصْبِرْ وَلْتَحْتَسِبْ فَعَادَ الرَّسُوْلُ فَقَالَ اِنَّهَا قَدْ اَقْسَمَتْ لَتَأْتِيَنَّهَا قَالَ فَقَامَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَقَامَ مَعَهٗ سَعْدُ بْنُ عُبَادَةَ وَمُعَاذُ ابْنُ جَبَلٍ وَانْطَلَقْتُ مَعَهُمْ فَرُفِعَ اِلَيْهِ الصَّبِيُّ وَنَفْسُهٗ تَقَعْقَعُ كَاَنَّهَا فِيْ شَنَّةٍ فَفَاضَتْ عَيْنَاهُ فَقَالَ لَهٗ سَعْدٌ مَا هٰذَا يَا رَسُوْلَ اللّٰهِ؟ قَالَ هٰذِهٖ رَحْمَةٌ جَعَلَهَا اللّٰهُ فِيْ قُلُوْبِ عِبَادِهٖ وَاِنَّمَا يَرْحَمُ اللّٰهُ مِنْ عِبَادِهِ الرُّحَمَاءَ۔

(مسلم کتاب الجنائز۔ بخاری کتاب الجنائز۔ کتاب الایمان والنذور۔ ابوداؤد کتاب الجنائز)

51. హ(జత్ ఉసామా బిన్ (రజి) ఉల్లేఖనం ఇలా ఉంది : "మేము దైవప్రవక్త (సఅసం) వద్ద కూర్చొని ఉండగా ఆయన కుమార్తె హ(జత్ జైనబ్

(రజి.అన్హా) పంపిన ఓ వార్తాహరుడొచ్చి "నా కుమారుని ప్రాణాలు పోతున్నాయి, తమరు మా ఇంటికి దయచేయండి అని చెప్పి పంపారు" అని విన్నవించుకున్నాడు.

దైవప్రవక్త ఆ మనిషితో "ఇచ్చేదానికి, వెనక్కు తీసుకునేదానికి యజమాని అల్లాహ్‌యే. ప్రతిదానికి ఓ సమయాన్ని నిర్ణయించిన 'జ్ఞాని' ఆయన. నీ వెళ్ళి దుఃఖాన్ని దిగమింగమని, ఇలా చేసినందుకు అల్లాహ్ మంచి ఫలితాన్ని అందిస్తాడని నా తరఫున ఆమెకు ఆదేశాన్ని అందించు" అని చెప్పారు.

అయితే ఆ వార్తాహరుడు తిరిగొచ్చి "నాన్నగారు! మీకు మీ దేవునిపై ఒట్టు నా దగ్గరికి తప్పకుండా రండి" అన్న జైనబ్ (రజి.అన్హా) గారి మాటలను దైవప్రవక్తకు వినిపించాడు.

అప్పుడు దైవప్రవక్త (సఅసం) సఅద్ బిన్ ఉబాదా, ముఆజ్ బిన్ జబల్, ఉసామా బిన్ జైద్ (రజి.అన్హుం)లను వెంటబెట్టుకొని అక్కడికి చేరారు. పిల్లవాణ్ణి ఆయన ముందుకు తీసుకొని వచ్చారు. (ప్రవక్త ఆ పిల్లవాణ్ణి తన ఒడిలో పడుకోబెట్టుకున్నారు) అప్పుడు అతని ప్రాణం పోతోంది. ఓ పాతబడి ఎండిపోయిన తోలు సంచిలో గులకరాళ్ళు లేక నీరు పోసినప్పుడు వచ్చే శబ్దంలా ఉంది ఆ బాలుని గొంతునుండి వచ్చే శబ్దం. ఈ పరిస్థితిని చూసిన దైవప్రవక్త (సఅసం) కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

సఅద్ బిన్ ఉబాదా (రజి) దైవప్రవక్త (సఅసం) కళ్ళల్లో నీరు చూసి, దైవప్రవక్తా! ఇదేమిటీ అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు, అప్పుడు ఆయన ఇలా సెలవిచ్చారు :

"ఇది కరుణరసం. దేవుడు తన దాసుల్లో దీన్ని ఉంచాడు. దయార్ద్రహృదయులు మాత్రమే అనంత కారుణ్యానుగ్రహాలకు అర్హులు."

**సంగ్రహణం :**

చనిపోయిన ఆప్తుల్ని గురించిన ఆవేదనలో కన్నీరు కార్చడం కేవలం ధర్మసమ్మతమైన విషయమే కాదు, అది ఆ వ్యక్తి జాలిగుణాన్ని హృదయార్ద్రతను

చాటుతుంది. అదేకాకుండా ఆ వ్యక్తి కఠినాత్ముడు, నిర్దయుడు కాదు అనేది కూడా రుజువు చేస్తుంది. దైవప్రవక్త (సఅసం) మరణించిన వానికోసం తలబాదుకొని పెద్దగా పెడబొబ్బలు పెట్టి ఏడ్వడాన్ని మాత్రమే అనేకమార్లు వారించారు. అందుకనే ఆయన కళ్ళల్లో కన్నీరు చూసి, హజ్రత్ సాద్‌బిన్ ఉబాదా(రజి) మృతుని గురించి కన్నీరు కార్చడం కూడా 'నౌహా' చేయడంలా నిషిద్ధమేమో అని అనుకున్నారు. దైవప్రవక్త (సఅసం) మరణించిన వ్యక్తి గురించి కన్నీరు కార్చడం మానవ నైజంగా చెప్పి దానికి అనుమతినిచ్చారు. నౌహా, మాతమ్ చేయడాన్ని ఖండించడమే కాకుండా అవి శపించదగ్గ విషయాలుగానే పరిగణించారాయన.

## బర్జఖ్ - మూడు సత్కార్యాలు

۵۲) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ اِذَا مَاتَ الْاِنْسَانُ اِنْقَطَعَ عَنْہُ عَمَلُہٗ اِلَّا مِنْ ثَلَاثٍ: صَدَقَۃٍ جَارِیَۃٍ وَعِلْمٍ یُنْتَفَعُ بِہٖ وَوَلَدٍ صَالِحٍ یَدْعُوْ لَہٗ۔

(ترمذی عن ابی ہریرۃ کتاب الوقف۔ ابوداؤد کتاب الوصایا: مسلم کتاب الوصیۃ)

52. అల్లాహ్ ప్రవక్త (సఅసం) ప్రవచనం కఇలా ఉంది :

"మనిషి మరణించిన తోడనే అతడు చేసే కార్యాల క్రమం తెగి పోతుంది. అయితే మూడు రకాల పనులకు సంబంధించిన సత్ఫలితాలు మాత్రం అతని కర్మల చిట్టాలో రాయబడుతూనే ఉంటాయి. ఆ మూడింటిలో ఒకటి సదఖయే జారియా, రెండోది ఇతరులకు ఉపయుక్తమైన జ్ఞానం. మూడోది అతని కోసం ఎల్లప్పుడూ దుఆ చేసే తనయుడు."

*(అబూ హురైరా (రజి) – తిర్మిజీ, అబూ దావూద్)*

**సంగ్రహణం :**

'సదఖయే జారియా' అంటే కేవలం అవసరం ఏర్పడ్డప్పుడు మాత్రమే చేసే దానధర్మం కానిది. దాని ప్రయోజనం సార్వత్రికమై ఇతరులకు ఎల్లప్పుడూ అందుబాటులో ఉండేది. ఉదాహరణకు ధార్మిక పాఠశాల స్థాపన కాలువ, నదిని దాటడానికి నిర్మించబడే వంతెన, కల్వర్టు, మసీదు నిర్మాణం లేక బాటసారుల సౌకర్యార్థం నిర్మించే సత్రం; బావిని త్రవ్వించడం, ప్రజా సంక్షేమ కార్యకలాపాలు మొదలైనవి. ఇవి సదఖయే జారియా అంటే.

ఇదే కాకుండా విద్యా సంస్థలను నెలకొల్పడం, పేదసాదలు శాశ్వతంగా ప్రయోజనం పొందగలిగే ధర్మసమ్మతమైన సంస్థలను నెలకొల్పడం సదఖయె జారియా క్రిందికే వస్తాయి. 2. ప్రజలకు ఉపయోగపడే విజ్ఞానం అంటే దైవగ్రంథం అయిన ఖుర్ఆన్, దైవప్రవక్త (సఅసం) గారి సంప్రదాయ సంబంధమైన జ్ఞానాన్ని ఆయన ప్రవచనాలను ప్రజలకు బోధించడం, రాయడం, ప్రచురించడం అని అర్థం. మరణానంతరం కూడా ఈ సత్కార్యాల పుణ్యఫలం ఆ వ్యక్తికి లభిస్తూనే ఉంటుంది. 3. ఏ తనయుడయితే తల్లిదండ్రుల పర్యవేక్షణలోను, శిక్షణలోను దైవభీతిని పొంది సత్పురుషునిగా తయారవుతాడో ఆ తనయుడు బ్రతికున్నంత కాలం అతను చేసే సత్కార్యాల పుణ్యఫలం కూడా అతని తల్లిదండ్రులకు దక్కుతూనే ఉంటుంది. ఇదేకాకుండా స్వయంగా ఆ తనయుడు తన తల్లిదండ్రుల మన్నింపుకోసం అల్లాహ్‌ను వేడుకుంటూ ఉంటాడు. ఈ విధంగా అతని తల్లిదండ్రులకు ప్రయోజనం లభిస్తూనే ఉంటుంది.

మరణం అన్నది తిరుగులేని యదార్థం. ఏ ఒక్కడూ ఈనాటి వరకు దాన్ని అధిగమించలేకపోయాడు. మరోవిధంగా చెప్పాలంటే మరణానికి ఎవరూ అతీతులు కారు. జీవితాంతం ఏది చేసినా అది అతని కర్మల చిట్టాలో రాయబడుతూనే ఉంటుంది. మరణం ఆసన్నం కాగానే ఆ చిట్టాను మడిచివేయడం జరుగుతుంది. ఇక పనిచేసే వ్యవధి లేదు గనక. అయితే తాను జీవించి ఉండగా చేసిన కొన్ని పనులు మరణం తరువాత కూడా అతని ఖాతాలో జమ అవుతూ ఉంటాయి. ఆ సత్కార్యాలు ఈ భూమీ్మద నుండి అంతమైపోతే తప్ప. ఆ సత్కార్యాల గురించే ఈ హదీసులో చెప్పడం జరిగింది.

## ఈసాలె సవాబ్ (పుణ్యఫల ప్రదానం)

(۵۳) اِنَّ رَجُلًا قَالَ لِرَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ
اُمَّهٗ تُوُفِّيَتْ اَيَنْفَعُهَا اِنْ تَصَدَّقْتُ بِهٖ عَنْهَا؛ قَالَ نَعَمْ
قَالَ فَاِنَّ لِيْ مِخْرَافًا فَاَنَا اُشْهِدُكَ اَنِّيْ قَدْ تَصَدَّقْتُ بِهٖ

عنہما (بخاری عن ابن عباس کتاب الوصایا۔ ترمذی ابواب الزکوٰۃ۔ ابوداؤد
کتاب الوصایا)

53. ఓ వ్యక్తి మహాప్రవక్త (సఅసం)ను అడిగాడు, “మా అమ్మగారు మరణించారు, నేనామె తరఫున దానం చేస్తే దాని పుణ్యఫలం ఆమెకు చేరుతుందా?” అని. దానికి దైవప్రవక్త (సఅసం) “అవును” అని బదు

లిచ్చారు. తిరిగి ఆ వ్యక్తి, "ప్రవక్తా! నేను నా ఖర్జూరపు తోటను ఆమె తరఫున సదఖా (దానం) చేసేశాను దీనికి మీరే సాక్ష్యం" అని అన్నాడు.

(ఇబ్నె అబ్బాస్ (రజి) - బుకారి, తిర్మిజి, అబూదావూద్)

**సంగ్రహణం :**

మరో ప్రవచనంలో ఒకాయన దైవప్రవక్తను, "నా తండ్రి చనిపోయాడు, చనిపోతూ కొంతసొత్తును కూడా వదలివెళ్ళాడు. ఎలాంటి మరణ శాసనం కూడా చేయలేదు. ఒకవేళ అతని తరఫున దానం చేస్తే అతని పాపాలు క్షమించబడతాయా? అని అడిగితే 'అవును' అని బదులిచ్చారు దైవప్రవక్త (సఅసం). (అబూ హురైరా (రజి) - ముస్లిం)

మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది : హజ్రత్ సఅద్ బిన్ అబ్బాస్ (రజి), దైవప్రవక్తతో, "దైవప్రవక్తా! మా అమ్మగారు మరణించారు (ఆమెకు పుణ్యఫలం దక్కడానికి) ఎలాంటి సదఖా చేయడం ఉత్తమం? అని అడగ్గా, "నీరు" అని సెలవిచ్చారు దైవప్రవక్త (సఅసం). కాబట్టి హజ్రత్ సఅద్ (రజి) ఓ బావిని త్రవ్వించి, "ఇది ఉమ్మె సఅద్ కోసం" (అంటే ఈ నూతికి సంబంధించిన పుణ్యఫలం ఉమ్మె సఅద్ (సఅద్ గారి తల్లి)కు దక్కుగాక) అని అన్నారు. (అబూదావూద్)

మృతుని ఆత్మకు శాంతి కలగాలనే ఉద్దేశంతో దానధర్మాలు చేయడం అన్నది ముస్తహబే (అభిలషణీయమే). అతని మన్నింపు కోసం వేడుకోవడం కూడా మంచిదే. మృతునిపై హజ్ ఆరాధన, జకాత్ చెల్లింపులు మిగిలివుంటే అతడు వదలివెళ్ళిన ఆస్తినుండి ఖర్చుపెట్టి వాటిని నెరవేర్చాల్సి ఉంటుంది. అప్పుడే అతని హజ్, జకాత్ అనే ఫర్జులు నెరవేరుతాయి. స్వచ్ఛందంగా చేసిన హజ్ పుణ్యఫలాన్ని మృతులకు, ఆప్తులకు అర్పించవచ్చు. ఇదేకాదు, వారి తరఫున కూడా ఇవ్వవచ్చు.

అయితే ఖుర్ఆన్ గ్రంథపారాయణం, నఫిల్ నమాజులు పుణ్యఫలాన్ని అర్పించడంలో (ఈసాలె సవాబ్)లో భేదాభిప్రాయం ఉంది. హజ్రత్ 'ఇమామె షాఫయీ' (రహ్మాలై) దీన్ని ఒప్పుకోరుగాని హనఫీ ఆలింలు ఇది ధర్మసమ్మతమే అని అంటారు.

ఏది ఏమైనా మనం నేడు ఈ 'ఈసాలె సవాబ్' పేరున చేస్తున్నదేమిటి? పుణ్యఫల ప్రదానం పేరున అనేక అవకతవకలు, దురాచారాలు మనలో చోటుచేసుకున్నాయి. వీటికి కావలసిన ఆధారం ఇటు దివ్య ఖుర్ఆన్‌లోగాని అటు హదీసు గ్రంథాల్లోగాని కానరాదు. నేడు ఈసాలె సవాబ్ కోసం చేసే 'ఖుర్ఆన్‌ఖానీ' (అంటే డబ్బిచ్చి ఖుర్ఆన్ పారాయణం చేయడం వగైరా) ప్రవక్త (సఅసం)గారి అనుచరుల కాలంలో కనబడదు. ఈ విధంగా చేయించే 'ఖుర్ఆన్‌ఖానీ'కి పుణ్యఫలం లభించే బదులు ఖుర్ఆన్‌ను అమ్ముకున్నందుకు, దాన్ని డబ్బిచ్చి కొన్నందుకు అటు పారాయణం చేసేవాడు ఇటు కూలి ఇచ్చి పారాయణం చేయించుకున్నవాడు ఉభయులూ దేవుని ముందు జవాబు చెప్పుకోవలసి ఉంటుంది.

## జియారతె ఖుబూర్ (సమాధుల సందర్శనం)

(۵۴) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَزُوْرُوا الْقُبُوْرَ فَإِنَّهَا تُذَكِّرُكُمُ الْمَوْتَ۔ (مسلم عن ابی ہریرۃ کتاب الجنائز۔ ابوداؤد کتاب الجنائز۔ ترمذی ابواب الجنائز)

54. "సమాధుల్ని (గోరీలను) సందర్శించండి. అవి మీకు మీ మరణాన్ని గుర్తుచేస్తాయి" అని దైవప్రవక్త (సఅసం) ఉద్బోధించారు.

(అబూ హురైరా (రజి) – ముస్లిమ్, తిర్మిజి, అబూ దావూద్)

**సంగ్రహణం :**

ఎంత రాతి గుండె కలవాడైనా ఖనన వాటికల్ని గోరీలను చూసి చలించకుండా ఉండలేడు. ఆ సమయంలో అతడికి తన చావు గుర్తుకు రాకమానదు. ఒకనాడు నేను మరణాన్ని ఆహ్వానించక తప్పదు. టన్నుల కొద్దీ మట్టి క్రింద పాతిపెట్టబడకుండా ఉండను అని అనుకుంటాడు. ఇదో యదార్థం. ఈ యదార్థాన్ని తిరస్కరించేవాడు ఓ పిచ్చివాడే అయి ఉంటాడు.

ఈ హదీసులో సమాధుల సందర్శనా ధ్యేయం ఏదై ఉండాలో చెప్పడం జరిగింది. ఈ గోరీలను చూడగానే మృత్యువు మన కళ్ళ ముందు మెదుల్తుంది. కొన్ని ఉల్లేఖనాల్లో సమాధుల్లో ఉండేవారికి (మృతులకు) సలాం చేయమని వారి మన్నింపు కోసం దేవుణ్ని దుఆ చేయమని ఉంది.

ఈనాటి దారి తప్పిన ముస్లిములు, ఈ సమాధుల సందర్శన (జియారతె ఖుబూర్) ధ్యేయాన్ని, ప్రవక్త (సఅసం) సంప్రదాయాన్ని మరిచిపోయి సమాధులపై జాతర్లు చేయడం, ఉర్సులు నిర్వహించడం, సమాధులపై కానుకలు వసూలు చేయడం లాంటి వ్యాపారాన్ని ప్రారంభించారు. సమాధుల్లో ఖననం చేయబడ్డ మహాపురుషుల్ని, పుణ్యాత్ములను తమ కోరికలు తీర్చేవారిగా, ఆపదల్లో ఆదుకునే వారిగా భావిస్తున్నారు కొందరు. ఇలాంటి సమాధుల దగ్గరకు, దర్గాల దగ్గరకు వెళ్ళి చావును గుర్తుకు తెచ్చుకునే బదులు ఆ గోరీల్లోని వారి మన్నింపుకోసం దుఆ చేసేబదులు తమ ఆపద మొక్కులు మ్రొక్కుకునేందుకే వాటి చుట్టు చక్కర్లు కొట్టడం జరుగుతుంది. సహాబా (ప్రవక్తగారి అనుచరుల) కాలంలోను ఆ తరువాత తాబయీ, తబఅత్తాబయీల కాలంలోను ఇలాంటి ఉదాహరణలు మచ్చుకైనా కానరావు.

## సమాధుల పట్ల గౌరవం

(٥٥) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا تَجْلِسُوْا عَلَى الْقُبُوْرِ وَلَا تُصَلُّوْا اِلَيْهَا۔

(مسلم عن ابی مرثد الغنوی کتاب الجنائز ابوداؤد کتاب الجنائز۔ ترمذی ابواب الجنائز)

55. "గోరీలపై (సమాధులపై) కూర్చోకండి. వాటికెదురుగా నిలబడి నమాజు కూడా చేయకండి" అని అంతిమ దైవప్రవక్త (సఅసం) ఉద్బోధించారు. (అబూ మర్సిదుల్ గనవీ (రజి) – ముస్లిమ్, అబూ దావూద్, తిర్మిజి)

**సంగ్రహణం :**

ఖబరస్తాన్ (ఖననవాటిక)లో చెత్తా చెదారం పడేయడం, మలమూత్ర విసర్జన చేయడం, గోరీలపై కూర్చోవడం, వాటిని త్రొక్కుకుంటూ వెళ్ళడం ధర్మ వ్యతిరేకమైన విషయాలు. ఇవి చనిపోయిన వారి గౌరవానికి భంగకరమైన చర్యలు. ఈ లోకం నుండి శాశ్వతంగా వెళ్ళిపోయిన వాని చిట్టచివరి గుర్తు సమాధి. ఈ జీవితం అంతం అయ్యేదని, మరణం తప్పకుండా వస్తుందని ఎవరైనా ఇలా మట్టిపాలు కావలసిందేనని మరణించిన తరువాత ఓనాడు తిరిగి లేపబడతారనే హెచ్చరిక చేసేదే ఈ సమాధి.

ఇస్లామ్ ధర్మంలో సమాధులకు సజ్దా (సాష్టాంగ ప్రణామం) చేసే ప్రశ్నే ఉత్పన్నం కాదు సరికదా, భావితరాల వారు బహుదైవారాధనలో చిక్కుకొని పోకూడదు అనే ఉద్దేశ్యంతో ఆ సమాధివైపు ముఖంపెట్టి నమాజు చేయవద్దని ఆ నమాజులో అల్లాహ్‌కు సజ్దా చేయడాన్ని కూడా అనుమతించలేదు దైవప్రవక్త (సఅసం). ఇక మహాపురుషుల సమాధులకు, వలీల దర్గాలకు సజ్దాలు చేసుకుంటూ తిరిగే జనం గురించి వారిని దానికోసం ప్రేరేపించే ధర్మకర్తలు, పూజారుల గురించి ఇంకేమని చెప్పమంటారు?

## గోరీలపై కట్టే కట్టడాలు (మక్బరాలు)

(٥٦) نَهٰى رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَنْ يُّجَصَّصَ الْقَبْرُ وَ اَنْ يُّقْعَدَ عَلَيْهِ وَاَنْ يُّبْنٰى عَلَيْهِ۔

(مسلم عن جابر کتاب الجنائز۔ ابوداؤد کتاب الجنائز۔ ترمذی ابواب الجنائز)

56. గోరీని సున్నంతో దృఢంగా కట్టడం, దానిపై కూర్చోడం, దానిపై కట్టడం నిర్మించడం కూడదన్నారు దైవప్రవక్త (సఅసం).

*(జాబిర్ (రజి) – ముస్లిం, అబూదావూద్, తిర్మిజి)*

**సంగ్రహణం :**

అవులియా అల్లాహ్ (దైవప్రియులు) గోరీలపై, మతనాయకుల సమాధులపై ఎత్తైన, అందమైన మక్బరాలు (గుమ్మటాలు) నిర్మించడం, జాతీయ నాయకులు, రాజకీయ నేతల సమాధులపై లక్షలాది రూపాయలు వెచ్చించడం ధర్మసమ్మతమైన విషయం కాదు అన్నది ఈ హదీసు ద్వారా తెలుస్తున్న విషయం. ఇస్లామ్ ధర్మంలో ఇలాంటి దుబారా ఖర్చులకు ఎలాంటి తావేలేదు. గోరీకి వెల్లవేయడం, దానిపై గుమ్మటాలను, గోపురా లను కట్టడం, దృఢంగా సిమెంటుతో గాని గచ్చుతోగాని వాటిని నిర్మించడం ప్రవక్త (సఅసం) సంప్రదాయానికి విరుద్ధం. గోరీ ఎంతో సీదా సాదాగా, నిరాడంబరత ఉట్టిపడేటట్లు భూమికి ఓ అడుగు ఎత్తు మించకుండా ఉండడం మంచిది. తిర్మిజీ హదీసులో ఈ ప్రవచనానికి అదనంగా "గోరీలపై రాయడాన్ని వారించారు అని ఉంది. అంటే ఆ గోరీపైన మృతుని బయోడేటా పుట్టుపూర్వోత్తరాలు తెలిపే శిలాఫలకంగాని, ఆ శిలా ఫలకంపై ఖుర్ఆన్ వాక్యాలు కాని రాసిపెట్టడం నిషేధం అని అర్థం.

## గోరీలపై దీపాలు వెలిగించచడం

(٥٧) لَعَنَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ زَائِرَاتِ الْقُبُوْرِ
وَالْمُتَّخِذِيْنَ عَلَيْهَا الْمَسَاجِدَ وَالسُّرُجَ۔

(ابوداؤد عن ابن عباس کتاب الجنائز۔ مسند احمد ۲۶۰۳ —— ۳۱۱۸)

57. "దైవప్రవక్త (సఅసం) గోరీలను సందర్శించే (జియారత్‌చేసే) స్త్రీలను, గోరీలపై దీపాలు వెలిగించే వారిని, వాటిపై మసీదులు కట్టే వారిని శపించారు." (ఇబ్నె అబ్బాస్ (రజి) – అబూ దావూద్, ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

తిర్మిజీ హదీసులో అబూ హురైరా (రజి) ఈ క్రింది వాక్యాలను కూడా ఉల్లేఖించారు అని ఉంది. 'దైవప్రవక్త (సఅసం), గోరీలను అధికంగా సందర్శించే స్త్రీలను శపించారు.' (తిర్మిజి – అబ్వాబుల్ జనాయిజ్)

ఈ హదీసులో అరబీ మూలపదమైన 'లానత్' ఉపయోగించడం జరిగింది. లానత్ అంటే దైవకారుణ్యానికి దూరమగుగాక అని అర్థం. అంటే తరచుగా గోరీల వద్దకు సందర్శనార్థం వెళ్లే స్త్రీలు దైవకారుణ్యానికి దూరమైన వారుగా పరిగణించారు మహాప్రవక్త (సఅసం).

ఈనాటి పరిస్థితుల్లో ఈ హదీసు దృష్ట్యా ఏ ఒక్క స్త్రీనైనా సమాధుల వద్దకు పోనీయకుండా ఉంచగలిగితే సమాధుల దగ్గర జరిగే దుర్మార్గపు పనుల్లో ఎనభైశాతం వరకైనా తగ్గించగలం. అవులియా అల్లాహ్ (దైవప్రియులు) దర్గాల దగ్గర స్త్రీల హాజరు ఎలాంటి రుగ్మతల్ని రేకెత్తిస్తోందో అందరికీ తెలిసిందే. ఆటపాటలు, గాన కచ్చేరీలు, నృత్యం చేసే స్త్రీలు ఆ మహాపురుషుని అనుగ్రహం పొందాలనే తలంపుతో ఉరుసుల్లో తమ కళను ప్రదర్శిస్తూ ఉంటారు. అయితే ఈ ఆటపాటలు ఇస్లామ్‌లో నిషిద్ధాలు. గోరీల్లో ఉన్న ఆ మహానుభావులు కూడా వారి జీవన కాలంలో వీటిని నిరసించిన వారే.

దైవప్రవక్త (సఅసం) ఆ గోరీల దగ్గర దీపాలు వెలిగించే వారిని కూడా శాపగ్రస్తులైన వారిగానే పరిగణించారు. కాని ఈనాడు ముస్లింలు మహాపురుషుల సమాధులను, దైవప్రియుల దర్గాలను మాత్రం కళ్లు జిగేలు అనిపించేలా రంగురంగు దీపాలతో ఖరీదైన గలేబులతో అలంకరిస్తున్నారు. ఇలా వారు దైవప్రవక్త (సఅసం) ప్రవచనాలను ఒకవిధంగా తిరస్కరిస్తున్నారని చెప్పక తప్పదు.

## పరలోకం ప్రళయదిన సూచనలు

(۵۸) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مِنْ اَشْرَاطِ السَّاعَةِ
اَنْ يَّظْهَرَ الْجَهْلُ وَيَقِلَّ الْعِلْمُ وَيَظْهَرَ الزِّنَا وَتُشْرَبَ
الْخَمْرُ وَيَقِلَّ الرِّجَالُ وَتَكْثُرَ النِّسَاءُ حَتّٰى يَكُوْنَ لِخَمْسِيْنَ
اِمْرَأَةً قَيِّمُهُنَّ رَجُلٌ وَّاحِدٌ۔

(بخاری عن انس کتاب الاشربہ۔ کتاب المحاربین۔ مسلم کتاب العلم ترمذی ابواب الفتن)

58. ప్రళయదినానికి సంబంధించిన కొన్ని సూచనలు ఇవి అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు :

1. అజ్ఞానం పెరిగిపోతుంది. (అంటే ప్రజలు అమాయకత్వాన్ని ప్రదర్శిస్తారు). 2. మత్తుపానీయ సేవనం సర్వసాధారణం అవుతుంది.

3. వ్యభిచారం బహిరంగంగా జరుగుతుంది. (ఈ జాడ్యం కూడా సార్వత్రికమై కొందరు మాత్రమే దీనికి దూరంగా ఉండగలుగుతారు). 4. ధార్మిక విద్య కొద్దిగా మాత్రమే మిగిలుంటుంది. (ఖుర్‌ఆన్, ప్రవక్త (సఅసం) సంప్రదాయాలకు సంబంధించిన ధర్మవేత్తలు క్రమక్రమంగా తగ్గిపోతుంటారు. చివరికి ఏమీ తెలియని అజ్ఞానుల్ని ప్రజలు ధార్మిక విషయాలను గురించి అడుగుతారు. వారు తప్పుడు ఫత్వాలు (ధార్మిక తీర్పులు) ఇచ్చి ప్రజల్ని అపమార్గం పట్టిస్తూ ఉంటారు. 5. పురుషుల సంఖ్య తగ్గి స్త్రీల జనాభా పెరిగిపోతుంది. చివరికి యాభైయేసి మంది స్త్రీలను ఒక్క పురుషుడు మాత్రమే సంరక్షిస్తాడు.

(అనస్ (రజి) –బుఖారి, ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

స్త్రీల సంఖ్య పురుషుల సంఖ్యకన్నా అధికంగా ఉండగలదు. జాతుల నడుమ, దేశాల నడుమ వైరం, మనస్పర్థలు పెరిగి యుద్ధాలు జరుగు తుంటాయి. ఫలితంగా పురుషుల్లో అత్యధికమంది హతమార్చబడతారు. ఇదో కారణం కావచ్చు. లేదా అల్లాహ్ అభీష్టం మేరకు బాలురకన్నా బాలికలే అధికంగా పుట్టవచ్చు. యాభైయేసి మంది స్త్రీలకు ఒక్క పురుషుడే సంరక్షకుడౌతాడు అంటే ఒకే ఒక పురుషుడు అనేక మంది స్త్రీలను పోషిస్తాడని అర్థం.

పాశ్చాత్య సమాజంలో సారాయి నీళ్ళ ప్రాయంగా ఖర్చవుతుంది. ముస్లిమ్ సమాజం కూడా దాన్ని దరిని చేరుస్తోంది. వ్యభిచారానికి, సారాయికి అవినాభావ సంబంధం ఉంది. సినిమాలు, వీడియోలు, టీ.వీ.లు, రేడియోలు అశ్లీల సాహిత్యం నగ్న, అర్థనగ్న చిత్రాలు, నైటుక్లబ్బులు ఆడా మగా తారతమ్యం లేని కో ఎడ్యుకేషన్, కుటుంబ నియంత్రణకు ఉపయోగించే మాత్రలు, పరికరాలు సమాజం నుండి సిగ్గు ఎగ్గులన్నింటిని అంతమొందిస్తాయి. కామక్రీడలు, సిగ్గులేని ఓ ఫ్యాషనుగా మారిపోయాయి. మొత్తం సమాజం వ్యభిచార కూపం వైపుకు శీఘ్ర గతిన వెళుతుంది.

## మరో ఆరు సూచనలు

(۵۹) رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: اِنَّ اللّٰهَ يُبْغِضُ الْفُحْشَ
وَالتَّفَحُّشَ وَالَّذِىْ نَفْسُ مُحَمَّدٍ بِيَدِهٖ لَا تَقُوْمُ السَّاعَةُ حَتّٰى

يُخَوَّنَ الْاَمِيْنُ وَيُؤْتَمَنَ الْخَائِنُ، حَتّٰى يَظْهَرَ الْفُحْشُ وَ
التَّفَحُّشُ وَقَطِيْعَةُ الْاَرْحَامِ وَسُوْءُ الْجِوَارِ۔
(مسند احمد۔ مرویات عبداللہ بن عمرو نمبر ۶۸۷۲)

59. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

"అశ్లీలం గురించి చర్చించుకోవడం, దాన్ని వ్యాప్తిచేయడం లాంటి విషయాలను అల్లాహ్ అతిగా అసహ్యించుకుంటాడు. ఎవరి అధీనం లోనయితే ముహమ్మద్ (సఅసం) ప్రాణం ఉందో ఆ దైవం సాక్షిగా చెబుతున్నాను.

1. నీతిమంతుణ్ణి అవినీతిపరులుగా చిత్రించేటంత మట్టుకు.
2. అవినీతిపరుడు నీతిమంతునిగా చెలామణి అయ్యేటంతమట్టుకు.
3. అశ్లీల విషయాలు బహిరంగంగా చర్చనీయాంశాలుగా మారేటంత మట్టుకు.
4. వాటిని వ్యాపింపజేచేటంతవరకు.
5. బంధువులతో గల సంబంధాల్ని తెగ త్రెంచుకునేటంతవరకు.
6. పొరుగున ఉన్న వారితో చెడుగా ప్రవర్తించేంతమట్టుకు ప్రళయ దినం రావడం అసంభవం. *(అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి)-ముస్నద్ అహ్మద్)*

**సంగ్రహణం :**

మన దురదృష్టం ఏమిటో గాని పైన చెప్పిన సూచనలన్నీ ఈ కాలంలోనే అగుపడుతున్నాయి.

(۶۰) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ لَا تَقُوْمُ السَّاعَةُ
حَتّٰی یَکْثُرَ الْھَرْجُ قَالُوْا وَمَا الْھَرْجُ یَا رَسُوْلَ اللّٰہِ! قَالَ
اَلْقَتْلُ، اَلْقَتْلُ۔ (مسلم عن ابی ہریرۃ کتاب الفتن و اشراط الساعۃ)

60. "హర్జ్" అధికం కానంతవరకు ప్రళయం సంభవించదు" అని దైవప్రవక్త (సఅసం) పలుకగా, దైవప్రవక్తా! 'హర్జ్' అంటే ఏమిటీ అని అడిగారు అక్కడి వారు. 'హర్జ్' అంటే హత్యాకాండ! హత్యాకాండ!! అని సెలవిచ్చారు దైవప్రవక్త (సఅసం). *(అబూహురైరా (రజి) – ముస్లిమ్)*

**సంగ్రహణం :**

ఈ హదీసు బహుశా నేటి మన సంకట పరిస్థితిని, నాస్తిక, భౌతిక వాదాల్ని ఎత్తిచూపుతోంది. నేడు మనిషి ప్రాణానికి ఏమాత్రం విలువ లేకుండాపోయింది. గొప్ప గొప్ప సామ్రాజ్యవాద దేశాలు, నేటి నియంతలు కేవలం తమ అధికార పిపాసను చల్లార్చు కోవడానికి, తమ బడాయిని నిలుపుకోవడానికి లక్షలాది మందిని సామూ హికంగా హతమార్చారు. కమ్యూనిజాన్ని రక్షించడానికి సంరక్షించడానికి నిర్దాక్షిణ్యంగా అతిక్రూరంగా మానవ రక్తపుటేరుల్ని పారించిన విధం మానవ చరిత్రపుటల్లోనే కానరాదు. పాశ్చాత్య నియంతలు ఈ ఎర్రబందిపోట్ల అడుగులకు మడుగులొత్తే మన ఆసియా ఖండానికి చెందిన పాలకులు తమ తమ దేశాల్లో స్వయంగా తమ జాతుల్నే ఎలా తుదముట్టించారో, మానవత్వాన్ని ఎలా మంటగలిపారో చెప్పనవసరం లేదు. నాస్తిక భావాలు కలిగిన సభ్యతా సంస్కృతుల జోరు ఫలితంగా ముస్లిమ్ సమాజాల్లోను హత్యాకాండ సర్వసామాన్యమైపోయింది. ప్రపంచం తన చివరి శ్వాసను పీలుస్తోందని, ప్రళయం అతి త్వరలో ప్రత్యక్షం కానుందని అనడానికి ఇవన్నీ సూచనలు కావా?

## అసమర్థ పాలకులు ప్రళయదిన సూచనల్లో ఒక సూచనే

(۶۱) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا ضُيِّعَتِ الْأَمَانَةُ فَانْتَظِرِ السَّاعَةَ قَالَ كَيْفَ إِضَاعَتُهَا يَا رَسُوْلَ اللهِ؟ قَالَ إِذَا أُسْنِدَ الْأَمْرُ إِلَى غَيْرِ أَهْلِهِ فَانْتَظِرِ السَّاعَةَ۔

(بخاری عن ابی ہریرۃ کتاب الرقاق۔ کتاب العلم)

61. అంతిమ దైవప్రవక్త (సఅసం) ఓ ప్రశ్నకు సమాధానమిస్తూ "ఎప్పుడయితే అమానతు **(Trust)** వ్యర్థం అవుతుందో అప్పుడు ప్రళయం కోసం ఎదురుచూడండి" అని సెలవిచ్చారు. "అమానతు ఎలా వ్యర్థం అవుతుంది దైవప్రవక్తా!" అని అడిగిన దానికి,

"ఎప్పుడయితే ప్రభుత్వ పగ్గాలు అసమర్థులకు అప్పచెప్పడం జరుగుతుందో అప్పుడు ప్రళయంకోసం నిరీక్షించండి" అని పలికారు దైవప్రవక్త (సఅసం). *(అబూ హురైరా (రజి) – బుఖారి)*

**సంగ్రహణం :**

అంటే ప్రభుత్వం పాలనాధికారం అల్లాహ్ తన దాసులకు ఒసగిన ఓ అమానతు. ఎవరైతే ఆ హోదాకు తగ్గవారో దాన్ని ఆ వ్యక్తులకే అప్పజెప్పాలి. దౌర్జన్యపరుడు, బహి రంగంగా పాపాలకు ఒడిగట్టేవాడు, అధర్మపరులు అయిన వారికి ప్రభుత్వాన్ని కట్టబెడితే ఆ అమానతును వ్యర్థపర్చినట్లే. ఇది ఓ పెద్ద పాపం. అంతర్జాతీయ విషయాలు మొదలు మునిసిపాలిటీలు ఇంకా చెప్పాలంటే గ్రామ పంచాయతీల స్థాయి వరకూ అసమర్థుల చేతికే అధికారం అందుతోంది. వీళ్ళ రాజకీయ నిఘంటువులో న్యాయం, దైవభీతి, సిగ్గు ఎగ్గు, మానవత్వం అన్న పదాలే కనిపించవు. కాబట్టి ఓ గొప్ప ముప్పును గురించి ఎదురు చూడాలి. అదే రాబోయే ప్రళయం. అంటే ప్రళయానికి పూర్వం ప్రజలు అసమర్థులయిన నాయకుల్ని ఎన్నుకొని నీతిమంతులు, దైవభీతిపరులయిన వారిని విస్మరిస్తారని ఈ హదీసునుబట్టి తెలుస్తోంది. ఈ సూచనలు ఈనాడు మనకు కానవస్తూనే ఉన్నాయి.

# ప్రళయం రాబోయేముందు

## ప్రతివాడు వికల మనస్కుడై ఉంటాడు

(٦٢) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَا تَقُوْمُ السَّاعَةُ حَتّٰى يَمُرَّ الرَّجُلُ بِقَبْرِ الرَّجُلِ فَيَقُوْلُ يَا لَيْتَنِيْ مَكَانَهُ۔

(بخاری عن ابی ہریرہ کتاب الفتن مسلم کتاب الفتن مسند احمد نمبر ۷۲۲٦)

نبی صلی اللہ علیہ وسلم نے فرمایا۔قیامت اس وقت برپا ہوگی جب

62. “గోరీ దాపున నుండి వెళ్ళే వ్యక్తి, తానీ గోరీలో సమాధి అయి వుంటే ఎంతో బాగుండును అని ఎప్పుడు తలపోస్తాడో అప్పుడు ప్రళయం సంభవిస్తుంది” అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

*(అబూ హురైరా (రజి) – బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

ప్రతి ఒక్కడూ ఈ బ్రతుకు బ్రతికేకంటే చావడం మేలు అని అనుకునే పరిస్థితులు దాపురిస్తాయి అప్పుడు. అశాంతి, అలజడి, భయం రాజ్యమేలుతాయి. ఎటు చూసినా రాజకీయం, ప్రభుత్వం, సమాజం ఒక్కటేమిటి జీవన రంగాల్లోని ప్రతిదీ ఛిన్నాభిన్నమై పోతుంది. ప్రజల ధనమాన ప్రాణాలకు రక్షణ పూర్తిగా కరువైపోతుంది.

# ధర్మాధర్మ సంపాదన

## (హలాల్ హరామ్)లో తేడాయే కానరాదు

(٦٣) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ يَأْتِيْ عَلَى النَّاسِ
زَمَانٌ لَا يُبَالِي الْمَرْءُ مَا اَخَذَ مِنْهُ اَمِنَ الْحَلَالِ اَمِنَ الْحَرَامِ

(بخاری عن ابی ہریرۃ کتاب البیوع)

63. “మనిషి తాను సంపాదించే సంపద హలాల్ లేక హరామ్ (ధర్మసమ్మతమైందా లేక నిషిద్ధమైందా) అన్న తేడాను కూడా గమనించ కుండా సంపాదించే ఓ కాలం రానుంది” అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. (అబూ హురైరా (రజి) – బుఖారి)

**సంగ్రహణం :**

అంటే ప్రళయానికి పూర్వం మనిషి ధర్మాధర్మ సంపాదనల నడుమ తేడాను కూడా కనుగొనలేని ఓ కాలం రాబోతోంది అని అర్థం. దైవప్రవక్త (సఅసం) గారి ఈ భవిష్యత్‌వాణి మన నేటి కాలానికి ఎలా అతుకుతోందో చూడండి!

## హష్ర్ మైదానపు తీరు తెన్నులు

(٦٤) عَنْ سَهْلِ بْنِ سَعْدٍ قَالَ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
يَقُوْلُ يُحْشَرُ النَّاسُ يَوْمَ الْقِيَامَةِ عَلَى اَرْضٍ بَيْضَاءَ عَفْرَاءَ
كَقُرْصَةِ النَّقِيِّ لَيْسَ فِيْهَا مَعْلَمٌ لِاَحَدٍ۔

(بخاری کتاب الرقاق، مسلم باب صفۃ القیامۃ)

64. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిస్తూ ఉండగా నేను విన్నానని హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) ఉల్లేఖించారు : “ప్రళయదినాన ప్రజలంద రినీ బూడిదవర్ణం గల తెల్లటి నేలపై ఓ చోట చేర్చడం జరుగుతుంది. అది మైదా పిండితో తయారైన రొట్టెలా ఉంటుంది. అందులో ఎవరికీ ఏ గుర్తూ కానరాదు.” (బుఖారి, ముస్లిమ్)

**సంగ్రహణం :**

ఆది మానవుని పుట్టుక మొదలు ప్రళయం సంభవించేవరకు వివిధ ఖండాల్లో, దేశాల్లో పుట్టిన మానవ జాతి నంతటిని 'హష్ర్' అనే మైదానంలో ఓ చోట చేర్చడం జరుగుతుంది. ప్రళయం అనేది మనం నివసించే ఈ భూమ్మీదనే సంభవిస్తుంది. అయితే ఈ భూమికిగల ప్రస్తుత రూపు రేఖలు అన్నీ మార్చివేయబడతాయి. ఇందులో ఎలాంటి మిట్టపల్లాలు, కొండలు, గుట్టలు వాగులు వంకలు, పట్టణాలు రోడ్లు అనే గుర్తులేమీ ఉండవు. ఇది ఓ చదునైన మైదానంగా తీర్చిదిద్దబడి ఉంటుంది.

## ప్రళయ బీభత్సం

(٦٥) اِنَّ عَائِشَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُحْشَرُوْنَ حُفَاةً عُرَاةً غُرْلًا قَالَتْ يَارَسُوْلَ اللّٰهِ الرِّجَالُ وَالنِّسَاءُ يَنْظُرُ بَعْضُهُمْ اِلٰى بَعْضٍ فَقَالَ الْاَمْرُ اَشَدُّ مِنْ اَنْ يُّهِمَّهُمْ ذَالِكَ (بخاری کتاب الرقاق، مسلم کتاب الجنة، ترمذی ابواب التفسیر)

65. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా), దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారని ఉల్లేఖిస్తున్నారు :

"(ప్రళయదినాన) మానవులందరిని (ఓ మైదానంలో) పూర్తి నగ్నంగా కాళ్ళకు చెప్పులు లేకుండా, సుంతీ చేయనటువంటి స్థితిలో ఓ చోట చేర్చడం జరుగుతుంది." దీనికి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) "దైవప్రవక్తా! మరి అలాంటి పరిస్థితిలోనయితే స్త్రీ పురుషులు పరస్పరం ఒకరినొకరు (నగ్న పరిస్థితిలో) చూసుకోరా?" అని అడిగితే దైవప్రవక్త (సఅసం), "ప్రళయదిన బీభత్సం కారణంగా ఎవ్వరికీ పరస్పరం ఒకరివైపు మరొకరు చూసుకునే ధ్యాసే ఉండదు" అని సెలవిచ్చారు.

*(బుఖారి, ముస్లిమ్, తిర్మిజీ)*

**సంగ్రహణం :**

మరో జీవిత ఆరంభంనాడు మనిషి పరిస్థితి అచ్చం అప్పుడే పుట్టిన బిడ్డలా ఉంటుంది. ఒంటిపై బట్టలుగాని, సుంతీచేసి ఉండడం గాని కాళ్ళకు పాదరక్షలు గాని

ఉండవు. మానవులు ఈ పరిస్థితిలోనే తమ తమ సమాధుల నుండి లేచి నిలబడతారు. మానవ జాతి సంతతినీ ఒకే మైదానంలో చేర్చడం జరుగుతుంది. అక్కడ తమ కర్మలకు జవాబు చెప్పుకోవలసి ఉన్నది అన్న ఆలోచన, అడగబోయే ప్రశ్నల గూర్చిన భయాందోళనలు అల్లాహ్ క్రోధం వల్ల వారిపై పడే ప్రభావం ఇవన్నీ కలగలసి ఒకరిని ఒకరు చూసుకునేటంత వ్యవధిని కూడా ఇవ్వవు. అక్కడ మనిషి కేవలం తన గురించిన ఆలోచనే తప్ప ఇతర మరే ఆలోచనలకు తావునీయదు.

## అల్లాహ్ ప్రళయ దిన క్రోధావేశం

(٦٦) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَطْوِى اللهُ عَزَّ وَجَلَّ
السَّمٰوَاتِ يَوْمَ الْقِيَامَةِ ثُمَّ يَأْخُذُهُنَّ بِيَدِهِ الْيُمْنٰى ثُمَّ
يَقُوْلُ أَنَا الْمَلِكُ اَيْنَ الْجَبَّارُوْنَ اَيْنَ الْمُتَكَبِّرُوْنَ؟ ثُمَّ
يَطْوِى الْاَرْضَ بِشِمَالِهِ ثُمَّ يَقُوْلُ أَنَا الْمَلِكُ اَيْنَ
الْجَبَّارُوْنَ؟ اَيْنَ الْمُتَكَبِّرُوْنَ؟ (مسلم عن عبداللہ بن عمر باب صفۃ القیامۃ)

66. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు :

"అల్లాహ్ ప్రళయదినాన ఆకాశాలన్నింటిని చుట్టి తన కుడిచేతిలో ఒడిసిపట్టుకొని, నేను రాజాధిరాజును. సృష్టిపై తమ సొంత ఇష్టాలను రుద్దిన ఆ క్రూరులైన పాలకులెక్కడా? నా భూమీమ్మద తమ బడాయి సింహాసనాల్ని వేసుకొని కూర్చునే ఆ రాజులేరి?? అని గద్దిస్తాడు. ఆ తరువాత భూమిని తన ఎడమ చేతితో చుట్టి, "నేనే చక్రవర్తిని, తమకు లభించిన ఆ శక్తి సామర్థ్యాలు చూసుకుని ప్రజలను పీడించిన ఆ దౌర్జన్య పరులు ఏరి? ధనమదంతో కన్ను మిన్నూ గానక విర్రవీగేవారు, తమకు లభించిన హోదా అంతస్తులను చూసుకొని విర్రవీగే ఆ గర్విష్టులు ఎక్కడా??" అని ప్రశ్నిస్తాడు. *(అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) – ముస్లిమ్)*

**సంగ్రహణం :**

ప్రపంచంలో హద్దులు మీరిన అధికార బలంతో ఒక్క వెలుగు వెలిగి ప్రజలను దౌర్జన్యానికి, అన్యాయానికి గురిచేసిన ఏ ఒక్క పాలకుడు అక్కడ తన తలను పైకెత్తే సాహసం చేయజాలడు.

భూమ్యాకాశాలను చుట్టి చేతబట్టడమంటే ఈ విశ్వమంతా ఆయన చెప్పుచేతల్లోనే ఉంది అనే అర్థం కూడా వస్తుంది. పరలోకంలో యదార్థాలన్నీ ఒక్కొక్కటిగా ముందుకు వచ్చినప్పుడు, ఈ విశ్వం అంతా ఆయన పాలనా శక్తి ముందుకు మోకరిల్లిందన్న సత్యం, ఆయన దానంతటికి యజమాని అన్న యదార్థం కూడా బయటపడుతుంది.

## ప్రళయదినం నాటి సూర్యుడు

(٦٧) رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ تُدْنَى الشَّمْسُ يَوْمَ
الْقِيَامَةِ مِنَ الْخَلْقِ حَتّٰى تَكُوْنَ كَمِقْدَارِ مِيْلٍ فَيَكُونُ النَّاسُ
عَلٰى قَدْرِ اَعْمَالِهِمْ فِى الْعَرَقِ فَمِنْهُمْ مَنْ يَّكُوْنُ اِلٰى كَعْبَيْهِ وَ
مِنْهُمْ مَنْ يَّكُوْنُ اِلٰى رُكْبَتَيْهِ وَمِنْهُمْ مَنْ يَّكُوْنُ اِلٰى حَقْوَيْهِ
وَمِنْهُمْ مَنْ يُّلْجِمُهُ الْعَرَقُ اِلْجَامًا قَالَ وَاَشَارَ رَسُوْلُ
اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِلٰى فِيْهِ۔

(مسلم عن المقداد بن الاسود باب صفة القيامة - ترمذی ابواب القیامة)

67. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు :

"ప్రళయదినం నాడు సూర్యుణ్ణి ప్రజలకు దాపుగా తీసుకొని రావడం జరుగుతుంది. చివరకు సూర్యునికి మనుషులకు నడుమ ఒక మైలు దూరం మాత్రమే ఉంటుంది. (దాని వేడివల్ల) వారు తమ కర్మలకు అనుగుణంగా చెమటలో మునిగిపోతారు. కొందరికి చెమట చీలమండల వరకు వస్తే కొందరికి మోకాలి వరకు వస్తుంది. (ఈ హదీసు ఉల్లేఖించిన హజ్రత్ మిక్దాద్ (రజి) దీన్ని ఉల్లేఖిస్తూ) దైవప్రవక్త (సఅసం) తమ ముఖం వైపుకు సైగ చేస్తూ కొందరు ఇక్కడి వరకు చెమటలో మునిగిపోగలరు అని పలికారు. (మిక్దాద్ బిన్ అస్వద్ (రజి) – ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

సూర్యుడు మనకు కోట్లాది మైళ్ళ దూరం ఉన్నప్పటికీ దాని ఉష్ణ తీవ్రతను మనం మే, జూన్ నెలల్లో తట్టుకోలేకుండా ఉన్నాం. ప్రళయదినాన సూర్యగోళం మరింత దగ్గరకు వస్తుంది.

'హశ్ర్' మైదానంలో సూర్యుడు దగ్గరై నిప్పులు గక్కడం వల్లను, అనంతమైన జన సందోహం కారణంగానే కాకుండా అక్కడ ఏర్పడే భయభ్రాంతుల మూలంగా కూడా మనుషులు, జిన్నుల శరీరాల నుండి చెమట కారుతుంది. వారి వారి కర్మలకు అనుగుణంగా వారి చెమటల్లో హెచ్చుతగ్గులుంటాయి. ప్రతివాడు తన పాపాలకు అనుగుణంగా ఈ చెమట బాధకు గురౌతాడు. పరలోకానికి సంబంధించిన జ్ఞానం మనకు లేదు. దీనిగురించి దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చిన విషయాలను నిస్సంకోచంగా మనం నమ్ముతాం. ఇన్షా అల్లాహ్ ఆ రోజున్నే ఖుర్‌ఆన్, హదీసుల్లో చెప్పబడ్డ యదార్థాలను మన కళ్ళతో చూసి అర్థం చేసుకోగలం.

## దేవుని న్యాయస్థానంలో ప్రతి ఒక్కడూ జవాబుదారుడే

(٦٨) رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ كُلُّكُمْ رَاعٍ وَكُلُّكُمْ مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ الْإِمَامُ رَاعٍ وَمَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ وَالرَّجُلُ رَاعٍ فِيْ أَهْلِهِ وَهُوَ مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ وَالْمَرْأَةُ رَاعِيَةٌ فِيْ بَيْتِ زَوْجِهَا وَمَسْئُوْلَةٌ عَنْ رَعِيَّتِهَا وَالْخَادِمُ رَاعٍ فِيْ مَالِ سَيِّدِهٖ وَمَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهٖ وَالرَّجُلُ رَاعٍ فِيْ مَالِ أَبِيْهِ وَهُوَ مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهٖ وَكُلُّكُمْ رَاعٍ وَمَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهٖ (بخاری عن ابن عمر کتاب الجمعة۔ کتاب فی الاستقراض کتاب النکاح۔ کتاب الاحکام مسلم کتاب الامارة ترمذی ابواب الجهاد ابوداؤد کتاب الخراج)

رسول اللہ صلی اللہ علیہ وسلم فرماتے تھے کہ تم میں سے ہر ایک نگران

68. దైవప్రవక్త (సఅసం) ఇలా అంటూ ఉండేవారు :
"మీలో ప్రతి ఒక్కడూ సంరక్షకుడే, జవాబుదారుడే."

1. ఇస్లామీయ రాజ్యపాలకుడు ఓ సంరక్షకుడు. అతణ్ణి అతని రాజ్యం లోని ప్రజానీకం గురించి అడగడం జరుగుతుంది.
2. ప్రతివాడు తన భార్యాపిల్లలకు యజమాని. అతడు తన బాధ్యత లను గురించి దేవునికి జవాబు చెప్పుకోవలసి ఉంది.

3. స్త్రీ (భార్య) తన భర్త ఇంటికి (అతని సంతానానికి) బాధ్యురాలు. గృహ సంబంధమైన బాధ్యతల గురించి ఆమెను ప్రశ్నించడం జరుగుతుంది.
4. నౌకరు తన యజమానికి
5. తనయుడు తన తండ్రి ఆస్తికి సంరక్షకుడు. దేవుడు వారి బాధ్యతల గురించి అడుగుతాడు.

(సావధానంగా వినండి) మీలో ప్రతి ఒక్కడూ (తమ తమ పరిధుల్లో) యజమానే, సంరక్షకుడే. మీలో ప్రతి ఒక్కరిని, వారి సంరక్షణలో ఉన్న వారి బాపతు అడగడం జరుగుతుంది." *(హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) - బుఖారి, ముస్లిమ్, తిర్మిజి, అబూ దావూద్)*

**సంగ్రహణం :**

ముస్లిం సమాజంలోని ప్రతి వ్యక్తి అనేక బాధ్యతలకు కట్టుబడి ఉన్నాడు. తనకు అందుబాటులో ఉన్నది, తాను ఖర్చుచేసే ప్రతి విషయం అల్లాహ్ అతనికి ఒసగిన ఓ అమానతు, దైవానికి దాసునిగా ఉంటానని ప్రతిజ్ఞ చేసినందున అల్లాహ్ తనకు అందించిన ఆ అమానతును కొల్లగొట్టకుండా దాన్ని ఎంతో మెలకువగా పరిరక్షించేందుకు కట్టుబడి ఉన్నవాడు. ఎందుకంటే మరణానంతరం, ఈ భూమిలో తనకు లభించిన ప్రతి వరాన్ని, ప్రతి శక్తిని, సామర్థ్యాన్ని గురించి ఎలాంటి మొహమాటం లేకుండా అక్కడ అడగడం జరుగుతుంది. ఒక ముస్లిమ్‌గా మనిషి తాను పనిచేసే పరిధిలో, శక్తి సామర్థ్యాల్లో స్వతంత్రుడు ఎంతమాత్రం కాడు. సరికదా ఆ వరాలన్నిటికీ అతడు సంరక్షకుడు. మరణానంతరం దైవన్యాయస్థానంలో బాధ్యతలు, సంరక్షణలకు సంబంధించిన పూర్తి రికార్డు ప్రశ్నలకు ఎదురౌతుంది.

ఇస్లామీయ దేశాధ్యక్షుణ్ణి నేరుగాను, ఇస్లామీయ పాలనా వ్యవస్థలో, న్యాయవ్యవస్థలో పనిచేసే ప్రతి చిన్నా పెద్దా అధికారుల్ని ఉద్యోగుల్ని పరోక్షంగాను హెచ్చరించడం జరిగింది. ఈ హెచ్చరిక ఏమిటంటే, మీరు ఏయే హోదాల్లోనయితే పనిచేస్తున్నారో లేక ఏయే ప్రభుత్వ శాఖలకు ఇన్‌ఛార్జులుగా ఉన్నారో, ఎంతో న్యాయంగా, దైవభీతి కలిగి మీ బాధ్యతలను నెరవేర్చే ప్రయత్నం చేయండి. అక్కడ అల్లాహ్ ఏర్పరిచే న్యాయస్థానంలో మిమ్మల్ని నిలబెట్టి, మీరు భూలోకంలో ఏ బాధ్యతలనయితే తీసుకున్నారో, మీకే అమానతునయితే అధీనం చేయడం జరిగిందో దాన్ని పూర్తిగా నిర్వర్తించారా లేదా? అని అడగడం జరుగుతుంది జాగ్రత్త!

ప్రతివాడు తన భార్యాపిల్లల ధర్మానికి, నైతికతలకు, విద్యాబుద్ధులకు కాపలా దారుడు. వారి హక్కుల గురించి అతణ్ణి అడగడం జరుగుతుంది. భార్య తన శీల సంపదకు, తన పిల్లల శిక్షణకు, భర్త ఆస్తికి, ధన సంపదలకు, ఇంటిని నడిపేందుకు బాధ్యురాలు. సమాజంలో జరిగే నిర్మాణం, విచ్ఛిన్నాలకు మూలం గృహవ్యవస్థే. కాబట్టి భార్యాభర్త లొండొరులను ఒకరి విషయాల్లో మరొకరిని బాధ్యులుగా, కాపలాదారులుగా చేయడం జరిగింది.

భర్త బాధ్యత కేవలం ఆర్థిక విషయాల వరకే పరిమితమై లేదు. భార్య ధార్మికతను, ఆమె నైతిక విలువల్ని కాపాడడం, దైవభీతిని పెంపొందించడం, వాటిని పరిరక్షించడం కూడా అతని బాధ్యతే.

సంతానం, తన తల్లిదండ్రుల ఆస్తి పాస్తులను, వారి ఇష్టం అనుమతి లేకుండా ఖర్చుబెట్ట వీలులేదు. ఎందుకంటే వారు ఆ ఆస్తిపాస్తులకు సంరక్షకులు, కాపలాదారులు కావడం మూలంగా. ప్రళయం నాడు వారు దానికి జవాబు చెప్పుకోవలసి ఉంటుంది.

మొత్తానికి ప్రళయదినం నాడు ప్రతి వ్యక్తీ తన జీవిత కర్మల చిట్టా చేతబట్టి అల్లాహ్ న్యాయస్థానంలో నిలబడాల్సిందే.

## అయిదు విషయాల గురించి అడిగే ప్రశ్నలు

(٦٩) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا تَزُوْلُ قَدَمَا عَبْدٍ حَتّٰى يُسْأَلَ عَنْ عُمُرِهٖ فِيْمَا اَفْنَاهُ وَعَنْ عِلْمِهٖ فِيْمَا فَعَلَ وَعَنْ مَالِهٖ مِنْ اَيْنَ اكْتَسَبَهُ وَفِيْمَا اَنْفَقَهُ وَعَنْ جِسْمِهٖ فِيْمَا اَبْلَاهُ۔

(ترمذی عن ابی برزۃ الاسلمی ابواب القیامۃ)

69. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు :

“ప్రళయదినం నాడు ఈ విషయాలను గురించి ప్రశ్నించబడకుండా దేవుని న్యాయస్థానం నుండి ఏ ఒక్కడూ అడుగును కూడా కదపలేడు.

1. తాను, తన వయస్సును ఏ ఏ కార్యకలాపాల్లో మళ్ళించాడు?
2. (తనకు లభించిన) ధార్మిక విజ్ఞానాన్ని ఎంతవరకు అనుసరించాడు?
3. సంపదను ఏ యే మార్గాల ద్వారా సంపాదించాడు?

4. దాన్ని యే యే మార్గాల్లో ఖర్చు పెట్టాడు?
5. తన శరీరాన్ని (యవ్వనాన్ని కూడా) ఏ యే కార్యకలాపాల్లో కృశింప జేశాడు. (అబూ బర్జతుల్ సల్మా (రజి) – తిర్మిజి)

**సంగ్రహణం :**

మనిషి ప్రపంచంలో దైవదాసునిగా జీవించనంతమట్టుకు, ప్రతి విషయంలో అల్లాహ్ ఆదేశాలకు అనుగుణంగా నడుచుకోనంతమట్టుకు పై అయిదు ప్రశ్నలకు సమాధానం ఇచ్చుకోవడం సాధ్యపడదు.

(٧٠) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اَتَدْرُوْنَ مَنِ الْمُفْلِسُ؛ قَالُوْا اَلْمُفْلِسُ فِيْنَا مَنْ لَا دِرْهَمَ لَهٗ وَلَا مَتَاعَ فَقَالَ اِنَّ الْمُفْلِسَ مِنْ اُمَّتِيْ مَنْ يَّاْتِيْ يَوْمَ الْقِيَامَةِ بِصَلٰوةٍ وَصِيَامٍ وَزَكٰوةٍ وَيَاْتِيْ قَدْ شَتَمَ هٰذَا وَقَذَفَ هٰذَا وَاَكَلَ مَالَ هٰذَا وَسَفَكَ دَمَ هٰذَا وَضَرَبَ هٰذَا فَيُعْطٰى هٰذَا مِنْ حَسَنَاتِهٖ وَهٰذَا مِنْ حَسَنَاتِهٖ فَاِنْ فَنِيَتْ حَسَنَاتُهٗ قَبْلَ اَنْ يُّقْضٰى مَا عَلَيْهِ اُخِذَ مِنْ خَطَايَاهُمْ فَطُرِحَتْ عَلَيْهِ ثُمَّ طُرِحَ فِي النَّارِ۔ (مسلم-ابوہریرہ-کتاب البر والصلۃ ترمذی ابواب القیامۃ)

70. దైవ సందేశహరులు (సఅసం) "అందరికంటే దరిద్రుడు ఎవరో మీకు తెలుసా?" అని ప్రశ్నించగా అక్కడున్నవారు, "ఎవరి వద్ద దిర్హం (డబ్బు)గాని, ఎలాంటి వస్తుసామగ్రి గాని ఉండదో అతడు దరిద్రుడు" అని బదులిచ్చారు.

ఆ సమాధానానికి దైవప్రవక్త (సఅసం) "నా సమాజంలోని వాడయి వుండి, ప్రళయదినాన తన వెంట నమాజులు, రోజాలు, జకాత్ వగైరాలకు సంబంధించిన ఓ పెద్ద పుణ్య ఫల సంపదను గొనివస్తూ, తోడుగా ప్రపంచంలో తన పరుష పదజాలంతో ఇతరుల మనస్సుల్ని నొప్పించినవాడై, ఒకరిపై వ్యభిచారానికి సంబంధించిన అపవాదులు వేసినవాడై, ఒకరిని హత్య గావించినవాడై, ఒకడిని దండించినవాడై ఉంటాడో అతడే పరమ దరిద్రుడు."

అతని పుణ్యఫలాల్ని ఆయా పీడితులకు ధారాదత్తం చేయడం జరుగుతుంది. అలా అతని వద్ద గల పుణ్యఫలాల సంపద మొత్తం తరిగి అంతం అయిపోయిన తరువాత ఆ పీడితుల పాపాల్ని ఇతని కర్మల చిట్టాలో రాయడం జరుగుతుంది. ఆ తరువాత అతణ్ణి అగ్నిలో పడవే యడం జరుగుతుంది.” (అబూ హురైరా (రజి) – ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

ఇహలోకంలో దారిద్ర్యం అనేది కొన్ని సందర్భాల్లో మనిషి జీవించి ఉన్నంత కాలమే అతణ్ణి వెంటాడుతుంది. అలా కాని పక్షంలో మరణం అయినా అతని దారిద్ర్యాన్ని అంతం చేయగలదు. అయితే పరలోకపు దారిద్ర్యం మాత్రం మనిషిని అగ్నిగుండంలో పడవేస్తుంది. దారిద్ర్యం అంటే ‘లేమి’కి మరోపేరు ఎంతమాత్రమూ కాదు. తన పుణ్యఫలాల్ని పరలోకం వరకు తీసుకొని వెళ్ళని వాడే దరిద్రుడు యదార్థంగా. తన పుణ్య ఫల సంపదను అక్కడి వరకు తీసుకొని వెళ్ళినా, ఇక్కడ ఇహలోకంలో దైవదాసుల్ని పీడించి, వారి హక్కుల్ని కొల్లగొట్టడం వల్ల తన సత్కర్మల పుణ్యఫలితాల్ని చేజారవిడుచుకున్న వాడే అసలైన దరిద్రుడు.

దైవప్రవక్త (సఅసం) దరిద్రుని పరిస్థితి ఎలా ఉంటుందో సెలవిచ్చారు ఈ ప్రవచనంలో. ఇతడు ఈ లోకంలో ఆస్తిపాస్తులు, సిరిసంపదలతో తులతూగినా, ప్రళయదినం నాడు దివాలా తీసిన ఓ బిచ్చగాడిలా మారిపోగలడు. ఇక్కడ ఎంతో పకడ్బందీగా అయిదు పూటలు నమాజులు చేసేవాడు. ప్రతి సంవత్సరం రమజాన్ మాసంలో ఉపవాస వ్రతాలు ఆచరించేవాడు, సతతం తన ధన సంపదనుండి జకాత్ కూడా చెల్లించేవాడు.

కాని ఈ లోకంలో తోటి మానవుల ఎడల అతని ప్రవర్తన ఏమంత బాగా ఉండేది కాదు. అల్లాహ్ ప్రతి మనిషికి అతని సత్కర్మలకు ప్రతిఫలం అందజేస్తాడు. అయితే అక్కడ తన సత్కర్మల పుణ్యాలు ఇతరులకు పంచివేయడం మూలంగా నిండుకుంటాయి. అలాంటి పరిస్థితిలోను పీడితుల హక్కులు ఇంకా మిగిలిపోతే మట్టుకు, ఆ పీడితుల పాపాల భారం అల్లాహ్ ఇతని వీపున బడవేస్తాడు. ఇలాంటి దురదృష్టవంతులు తమ పాపాల్నే కాకుండా ఇతరుల పాపాల శిక్షను కూడా అనుభవించడానికి నరక కూపంలో నెట్టివేయబడడం ఖాయం.

దైవారాధనల్లో, జిక్ర్, దుఆల్లో, దైవ నామస్మరణలో ఎల్లప్పుడు లీనమై ఉండేవారు. ఎంతో ధార్మికత ఉట్టి పడేలా కనబడే వారిలో కొందరు తమ దైనందిన వ్యవహార సరళిలో, ఇచ్చిపుచ్చుకోవడాల్లో మాత్రం ఏమంత నిజాయితీగా ఉన్నట్లు కనబడరు. దైవారాధన

చేసేవారు దైవదాసుల హక్కులను కొల్లగొడుతూ తమ పరలోకాన్ని నాశనం చేసుకోకూడదు. దేవుడు తన సృష్టితాలపై జులుము, బలాత్కారం చేసేవారి ఆరాధనల్ని ఏమాత్రం స్వీకరించడని తెలుసుకోవడం మంచిది.

(۷۱) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِتَّقُوا النَّارَ ثُمَّ اَعْرَضَ وَ
اَشَاحَ ثُمَّ قَالَ اِتَّقُوا النَّارَ ثُمَّ اَعْرَضَ وَ اَشَاحَ ثَلٰثًا حَتّٰى
ظَنَنَّا اَنَّهٗ يَنْظُرُ اِلَيْهَا ثُمَّ قَالَ اِتَّقُوا النَّارَ وَلَوْ بِشِقِّ تَمْرَةٍ
فَمَنْ لَّمْ يَجِدْ فَبِكَلِمَةٍ طَيِّبَةٍ (بخاری عن عدی بن حاتم کتاب رقاق)

71. "అగ్ని నుండి తప్పించుకోండి" అంటూ దైవప్రవక్త (సఅసం) తన ముఖాన్ని పక్కకు త్రిప్పుకున్నారు. తిరిగి "అగ్ని నుండి తప్పించుకోండి" అంటూ మూడుసార్లు తన ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకున్నారు. ఆ అగ్నిని స్వయంగా తమ కళ్ళతో చూస్తున్నారా అనే అనుమానం మాకు కలిగింది. ఆ తరువాత ఆయన ఇలా సెలవిచ్చారు : "అగ్ని నుండి తప్పించుకోండి అల్లాహ్ మార్గంలో సదఖా (దానం)చేసి, అది ఖర్జూరపు సగం ముక్కయినా సరే. అది లేనివాడు ఒక్క సద్వచనం (మేలైనమాట) పలికైనా సరే అగ్ని నుండి తప్పించుకునే ప్రయత్నం చేయాలి." *(అద్దీ బిన్ హాతిమ్(రజి)– బుఖారి)*

**సంగ్రహణం :**

అంటే, అల్లాహ్ ప్రసన్నత పొందడానికి ధర్మసంపాదనలో నుండి ఖర్చుపెట్టండి. మీ శక్తి మేరకు దైవమార్గంలో ఖర్చుబెట్టడానికి వెరువకండి. అది సగం ఖర్జూరపు ముక్కైనా సరే ఇస్లామ్ ధర్మ వ్యాప్తికోసం, ఇస్లామీయ పాలనా రక్షణార్థం, పేదసాదల్ని, అనాథల్ని, వితంతువుల్ని, అగత్యపరుల్ని ఆదుకునేందుకు ఖర్చుచేసే ధనం ద్వారా మనిషి అగ్ని యాతన నుండి కాపాడుకోగలడని అర్థం. దైవప్రవక్త (సఅసం) చివరిగా చెప్పింది మీ జేబులో చిల్లిగవ్వ కూడా లేకపోతే ఓ సద్వచనం (మంచిమాట) పలికి ఆ అగ్ని నుండి కాపాడుకునే ప్రయత్నం చేయడం అన్నదే.

సద్వచనం అంటే ప్రజలను సత్కార్యం వైపుకు రమ్మని ఆహ్వానించడం, చెడుల వైపుకు వెళ్ళొద్దని వారించడం, ఇతరుల ఎడల మంచి ప్రవర్తన కలిగి ఉండడం. దానం చేసేవాని చిత్తశుద్ధికే విలువ ఉంది అల్లాహ్ దృష్టిలో. సహృదయంతో, పుణ్యఫలాపేక్షకోసం దానం చేసే వ్యక్తి విషయంలో ఓ ఖర్జూరంలోని సగం ముక్కకు లభించే పుణ్యఫలం

విలువను, ఇతరులకు చూపి పెద్ద దానకర్ణుడు అనిపించుకోవాలి అన్న తలంపుతో లక్షరూపాయలు దానం చేసిన వాడు కూడా ఊహించలేడు సరికదా అతనికి పుణ్యఫలం లభించడం అటుంచి ప్రదర్శనాబుద్ధితో దానం చేసినందుకు అతడు శిక్ష అనుభవించడానికి సిద్ధంగా ఉండాలి.

## ప్రతివాని దాపునే వున్న స్వర్గ నరకాలు

(۷۲) قَالَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَلْجَنَّةُ اَقْرَبُ اِلَى اَحَدِكُمْ
مِنْ شِرَاكِ نَعْلِهِ وَالنَّارُ مِثْلُ ذَالِكَ۔

(بخاری عن عبداللہ بن مسعود کتاب الرقاق)

72. "స్వర్గ నరకాలు మీ కాలి చెప్పుల అడుగున వున్న చర్మానికంటే ఎక్కువ సమీపంలో ఉన్నాయి" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

*(అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

మనిషి దైవాన్ని ధిక్కరించి, ఆయన ఆదేశాల్ని జవదాటడం మూలంగా నరకానికి చేరువవుతాడు. అదేవిధంగా ఆయన ఆజ్ఞల్ని శిరసావహించడం మూలంగా స్వర్గానికి అర్హుడవుతాడు. పైన చెప్పిన విధంగా నడుచుకోవడం మనిషికి సాధ్యమే. అయితే ఈ విషయంలో మనిషి తన ఇష్టప్రకారం ఏ మార్గాన్ని ఎన్నుకోగలడో ఆ మార్గంపై నడిచే వీలు కల్పించడం అన్నది అల్లాహ్ ఆచారం.

## నరకం అంటే...

(۷۳) اِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَرَأَ هٰذِهِ الْاٰيَةَ اِتَّقُوا
اللهَ حَقَّ تُقَاتِهٖ وَلَا تَمُوْتُنَّ اِلَّا وَاَنْتُمْ مُسْلِمُوْنَ قَالَ رَسُوْلُ
اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَوْ اَنَّ قَطْرَةً مِنَ الزَّقُّوْمِ قَطَرَتْ
فِيْ دَارِ الدُّنْيَا لَاَفْسَدَتْ عَلٰى اَهْلِ الدُّنْيَا مَعَايِشَهُمْ فَكَيْفَ
بِمَنْ يَّكُوْنُ طَعَامُهٗ (ترمذی عن ابن عباس ابواب جہنم مسند احمد نمبر ۲۷۳۵)

رسول اللہ صلی اللہ علیہ وسلم نے قرآن کی یہ آیت پڑھی۔

اِتَّقُوا اللّٰهَ حَقَّ تُقَاتِهٖ وَلَا تَمُوْتُنَّ اِلَّا وَاَنْتُمْ مُّسْلِمُوْنَ۔

(آل عمران آیت ۱۰۲)

73. దైవప్రవక్త (సఅసం) ఖుర్‌ఆన్ నుండి ఈ ఆయత్ (వాక్యం) పఠించారు : "అల్లాహ్‌కు ఏ విధంగా భయపడాలో ఆ విధంగా భయ పడండి. ముస్లిములుగా తప్ప మీరు మరణించకండి." *(ఆలి ఇమ్రాన్ : 102)*

ఆ తరువాత ఇలా సెలవిచ్చారు : నరకంలోని 'జక్కూమ్' అనే వృక్షానికి సంబంధించిన ఓ బిందువు ఈ భూమ్మీద జారిపడితే ఇక్కడ నివసించే ప్రాణుల జీవితం దుర్భరమైపోతుంది. అలాంటప్పుడు ఆ 'జక్కూమ్' అనే చెట్టునే తినేవారి పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించండి" అని సెలవిచ్చారు. *(ఇబ్నె అబ్బాస్ (రజి) – తిర్మిజి, ముస్నద్ అహ్మద్)*

**సంగ్రహణం :**

అంటే మీరే గనుక ముస్లిములుగా జీవితం గడపకుండా దైవాన్ని ధిక్కరిస్తే ప్రళయం రోజున నరకానికి వెళ్ళి 'జక్కూమ్' అనే వృక్ష ఫలాల్ని తినవలసి ఉంటుంది. ఈ వృక్షం అతి చేదుగా ఉండి, ఎంతో దుర్వాసన కొడుతూ ఉంటుంది. గొంతునుండి పొట్టలోనికి దిగగానే అక్కడ, పొయ్యిపై పెట్టిన కుండలోని వేడి నీరు ఎలా మరుగుతాయో అలా మరుగుతుంది. నరకంలోని ఈ భయంకరమైన, విషతుల్యమైన వృక్షానికి సంబంధించిన ఒకే ఒక ద్రవపు బొట్టు ఈ ప్రపంచాన్ని నరక యాతనకు గురి చేయగలిగినప్పుడు, ఆ నరకంలోనికి వెళ్ళి ఆ వృక్షాన్నే ఆహారంగా తీసుకునే ఆ పాపాత్ముల పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించలేం.

## నరకపు లోతు

(۷۴) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ كُنَّا مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذْ سَمِعَ وَجْبَةً فَقَالَ النَّبِیُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَتَدْرُوْنَ مَا هٰذَا؟ قَالَ قُلْنَا اَللّٰهُ وَرَسُوْلُهٗ اَعْلَمُ قَالَ هٰذَا حَجَرٌ رُمِیَ بِهٖ فِی النَّارِ مُنْذُ سَبْعِیْنَ خَرِيْفًا فَهُوَ يَهْوِیْ فِی النَّارِ الْاٰنَ حَتّٰى انْتَهٰى اِلٰى قَعْرِهَا۔ (مسلم کتاب الجنۃ)

74. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ఇలా ఉంది : "మేము దైవప్రవక్త (సఅసం) వెంట ఉన్నప్పుడు, ఆయన ఓ విస్ఫోటాన్ని విని అదేమిటో మీకు తెలుసా? అని అడిగారు. దానికి మేము దేవునికి, దైవప్రవక్తకే బాగా తెలుసు అదేమిటో అని విన్నవించుకున్నాం. ఆ తరువాత ఆయన ఇలా పలికారు:

"అదో బండరాయి. దాన్ని డెబ్భై సంవత్సరాల క్రితం నరకాగ్నిలో పడవేయగా అది ఇప్పటి వరకు ఆ అగ్నిలో క్రిందికి పడి పోతూ ఇప్పుడు దాని అడుగుకు చేరింది." (అబూ హురైరా (రజి) – ముస్లిమ్)

**సంగ్రహణం :**

అంటే నరకపు వైశాల్యం, దాని లోతు ఎంతో, ఈ రాయి దాని అడుగుకు చేరడానికి డెబ్భై ఏళ్ళు పట్టిన విధానాన్ని బట్టి తెలుసుకోవచ్చు.

## నరకాగ్ని తీవ్రత

(۷۵) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ نَارُكُمْ جُزْءٌ مِّنْ
سَبْعِيْنَ جُزْءًا مِّنْ نَارِ جَهَنَّمَ قِيْلَ يَا رَسُوْلَ اللّٰهِ اِنْ كَانَتْ
لَكَافِيَةً قَالَ فُضِّلَتْ عَلَيْهِنَّ بِتِسْعَةٍ وَّسِتِّيْنَ جُزْءًا
كُلُّهُنَّ مِثْلُ حَرِّهَا۔

(بخاری عن ابی ہریرۃ۔ کتاب بدء الخلق۔ مسلم باب جہنم ترمذی ابواب جہنم۔)

75. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "మీ (ఇహలోకపు) అగ్ని, నరకాగ్నిలోని డెబ్భైయ్యో వంతు అంటే (1/70) అని అనగా, దైవ ప్రవక్తా! (పాపాత్ములను శిక్షించడానికి) ఈ ప్రపంచపు అగ్నే సరి పోతుంది కదా అని అన్నారు ఆయన శిష్యులు. అప్పుడు "నరకపు అగ్ని, అక్కడి ఉష్ణోగ్రత ప్రపంచంలో ఉన్న అగ్ని, ఉష్ణోగ్రతలకంటే 69 రెట్లు అధికం" అని సెలవిచ్చారు దైవప్రవక్త (సఅసం).

(అబూ హురైరా (రజి) – బుఖారి, ముస్లిమ్, తిర్మిజి)

## 76. నరకపు పగ్గాలు డెబ్బైవేలు

(٧٦) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُؤْتَىٰ بِجَهَنَّمَ يَوْمَئِذٍ لَهَا سَبْعُوْنَ اَلْفَ زِمَامٍ مَعَ كُلِّ زِمَامٍ سَبْعُوْنَ اَلْفَ مَلَكٍ يَجُرُّوْنَهَا۔ (مسلم عن ابن مسعود باب جهنم۔ ترمذی ابواب جهنم)

76. "ప్రళయ దినాన జహన్నమ్ (నరకం)ను తీసుకొని రావడం జరుగు తుంది. దానికి డెబ్బైవేల పగ్గాలు ఉంటాయి. ఆ పగ్గాల్ని డెబ్బైవేల మంది దైవదూతలు పట్టుకొని లాగుతూ ఉంటారు" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (ఇబ్నె మస్ఊద్ *(రజి)* – ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

ప్రజల్ని భయకంపితులుగా చేయడం కోసం, వారికి ఆ నరకాన్ని చూపించడానికి అంతా ఓ చోట చేరి వున్న హష్ర్ మైదానంలోకి నరకాన్ని తీసుకొని రావడం జరుగుతుంది. నరకాన్ని అదుపు చేసే దైవదూతల సంఖ్య నాలుగు వందల తొంభైకోట్లు.

## దైవాన్ని విస్మరిస్తే...

(٧٧) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُؤْتَىٰ بِالْعَبْدِ يَوْمَ الْقِيَامَةِ فَيَقُوْلُ لَهٗ اَلَمْ اَجْعَلْ لَكَ سَمْعًا وَبَصَرًا وَوَلَدًا وَسَخَّرْتُ لَكَ الْاَنْعَامَ وَالْحَرْثَ وَتَرَكْتُكَ تَرْأَسُ وَتَرْبَعُ فَكُنْتَ تَظُنُّ اَنَّكَ مُلَاقِيْ يَوْمَكَ هٰذَا؟ فَيَقُوْلُ لَا فَيَقُوْلُ لَهُ الْيَوْمَ اَنْسَاكَ كَمَا نَسِيْتَنِيْ۔

(ترمذی عن ابی سعید ابواب القیامۃ)

77. మహాప్రవక్త (సఅసం) గారి ప్రవచనం ఇలా ఉంది : "ప్రళయ దినాన ఓ వ్యక్తిని దైవసన్నిధికి హాజరుపర్చడం జరుగు తుంది. అతణ్ణి ఉద్దేశించి దేవుడు, 'నీకు నేను కళ్ళు, చెవులు ఇచ్చానా? నీకు ధన సంపద

సంతానమొసిగానా? వ్యవసాయంలో సహాయపడడానికి నీకు పశు సంపదనిచ్చానా? కాని నీవు ప్రజలపై పెత్తనం చెలాయించే వాడివి, వారి నుండి పన్నులు వసూలు చేసేవాడివి, ఈ రోజు నా దగ్గరకు వస్తావని తెలియదా నీకు?' అని అడుగుతాడు. సమాధానంగా ఆ వ్యక్తి 'నాకు తెలియదు' అని అంటాడు. అప్పుడు దేవుడు, 'ప్రపంచంలో నీవు నన్ను ఎలా విస్మరించావో ఈనాడు అదేవిధంగా నిన్ను విస్మరిస్తున్నాను' అని అంటాడు." *(అబూ సయీద్ (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

'నిన్ను విస్మరిస్తున్నాను' అని అంటే నిన్ను నరకాగ్ని గుండంలో పడవేస్తున్నానని అర్థం. ఈ వ్యక్తి అల్లాహ్ ఒసిగిన వరాలతో ప్రయోజనం పొందుతూనే మరణానంతరం తాను అల్లాహ్ న్యాయస్థానంలో హాజరై వీటన్నిటికి లెక్క చూపవలసి ఉందన్న యదార్థాన్ని నిరాకరిస్తూ ఉండేవాడు. సరికదా ఇహలోక జీవితమే సర్వస్వం అని మరణానంతరం మరొక జీవితమేదీ లేదని భావించేవాడు.

## ఆనాడు భూమి సాక్ష్యం పలుకుతుంది

(٧٨) قَرَأَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ "يَوْمَئِذٍ
تُحَدِّثُ أَخْبَارَهَا" قَالَ أَتَدْرُوْنَ مَا أَخْبَارُهَا؟ قَالُوْا
اَللهُ وَرَسُوْلُهٗ أَعْلَمُ قَالَ فَإِنَّ أَخْبَارَهَا أَنْ تَشْهَدَ
عَلَى كُلِّ عَبْدٍ أَوْ أَمَةٍ بِمَا عَمِلَ عَلَى ظَهْرِهَا أَنْ تَقُوْلَ عَمِلَ
كَذَا وَكَذَا فِيْ يَوْمِ كَذَا وَكَذَا قَالَ بِهٰذَا أَمْرُهَا۔

(ترمذی ابو ہریرہ ابواب القیامۃ)

78. అంతిమ దైవప్రవక్త (సఅసం) దివ్య ఖుర్ఆన్‌లోని ఈ వాక్యం పఠించారు: "ఆ రోజున భూమి తనపై సంభవించిన సంఘటనలను వివరిస్తుంది" *(అల్ జిల్‌జాల్)*

ఆ తరువాత సహాబా (రజి) (అనుచరగణం)ను ఉద్దేశించి 'సంఘటనలను వివరించడం అంటే ఏమిటో మీకు తెలుసా?' అని అడిగారు.

'అల్లాహ్ ఆయన ప్రవక్తకే అది బాగా తెలుసు దైవప్రవక్తా!' అని బదులిచ్చారు.

'దాని అర్థం ఏమిటంటే, భూమి ఆనాడు సాక్ష్యం పలుకుతుంది. ఫలానా పురుషుడు లేక ఫలానా స్త్రీ నా వీపుపై ఫలానా రోజున మంచి లేక చెడు పనులు చేశారు అని భూమి ఆనాడు సాక్ష్యమిస్తుంది. దైవం ఆదేశం మేరకే ఈ సాక్ష్యం పలుకుతుంది భూమి" అని సెలవిచ్చారు దైవప్రవక్త. *(అబూ హురైరా (రజి)- తిర్మిజి)*

**సంగ్రహణం :**

మనం దేని మీద అయితే మనుగడ సాగిస్తున్నామో ఆ భూమికి బొత్తిగా స్పృహ లేకుండా లేదని, అది ఓ ప్రత్యేకమైన జీవితాన్ని కలిగి ఉందని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. ప్రళయం రోజున ప్రతి వ్యక్తి చేసిన కర్మల గురించి అది చెప్పే సాక్ష్యం సంగతిని ఊహిస్తేనే శరీరం జలదరిస్తుంది.

## నరక భటులు

(۷۹) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَخْرُجُ عُنُقٌ مِّنَ
النَّارِ يَوْمَ الْقِيَامَةِ لَهٗ عَيْنَانِ تُبْصِرَانِ وَأُذُنَانِ تَسْمَعَانِ
وَلِسَانٌ يَّنْطِقُ يَقُوْلُ إِنِّيْ وُكِّلْتُ بِثَلَاثَةٍ: بِكُلِّ جَبَّارٍ عَنِيْدٍ
وَبِكُلِّ مَنْ دَعَا مَعَ اللّٰهِ إِلٰهًا اٰخَرَ وَبِالْمُصَوِّرِيْنَ۔

(ترمذی عن ابی ہریرہ ابواب صفۃ جہنم)

79. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ప్రళయదినం నాడు నరకాగ్నిలో నుండి ఓ మెడ బయటకు తొంగి చూస్తుంది. అది తన రెండు కళ్ళతో చూడగలదు, తన రెండు చెవులతో వినగలదు, నోటితో మాట్లా డనూ గలదు. అది నరకం నుండి బయటకు రాగానే-ఇలా అంటుంది:

"అల్లాహ్ నన్ను ఈ మూడు రకాల వారికోసం (సకల సృష్టితాల ముందు వారిని అవమానపరిచేందుకు, వారిని నరకంలోనికి ఈడ్చుకొని పోయేందుకు) నియమించాడు.

1. సత్యం ఎడల శత్రుత్వం వహించే అహంకారి కోసం, దైవధిక్కారి కోసం.
2. (కష్టకాలం వచ్చినప్పుడు) అల్లాహ్‌తో పాటు ఇతరుల్ని సహాయ పడమని అర్థించే వారి కోసం.
3. (ప్రాణుల చిత్రాలను గీచే) చిత్రకారుడి కోసం.

*(అబూ హురైరా (రజి)- తిర్మిజి)*

**సంగ్రహణం :**

నరకం నుండి ఓ అగ్ని కీల పొడవాటి మెడ రూపంలో బయల్పడుతుంది. అది పైన చెప్పిన మూడు రకాల పాపాత్ముల్ని పట్టి నరకం అనే కారాగారంలో బంధిస్తుంది. అసంఖ్యాకమైన సాక్షుల సమక్షంలో వారిని అవమానిస్తుంది.

## అగ్ని చేసే దాడి

(٨٠) اِنَّ نَبِیَّ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ مِنْھُمْ مَنْ تَأْخُذُہُ
النَّارُ اِلٰی کَعْبَیْہِ وَمِنْھُمْ مَنْ تَأْخُذُہُ النَّارُ اِلٰی رُکْبَتَیْہِ وَ
مِنْھُمْ مَنْ تَأْخُذُہُ النَّارُ اِلٰی حُجْزَتِہٖ وَمِنْھُمْ مَنْ تَأْخُذُہُ
اِلٰی تَرْقُوَتِہٖ۔ (مسلم عن سمرہ باب جہنم)

80. దైవప్రవక్త (సఅసం) గారి ప్రవచనం ఇలా ఉంది : "(నరక) అగ్ని (ప్రళయం రోజున) కొందరిని చీలమండల వరకు చుట్టుకుంటుంది. కొందరిని వారి మోకాళ్ళ వరకు ముంచుతుంది. కొందరు దురదృష్ట వంతుల నడుము కూడా అగ్ని కీలల్లో మునిగిపోగలదు. కొందరైతే తమ కంఠం వరకు అగ్నిలో కూరుకొనిపోతారు." *(సమ్రా (రజి) - ముస్లిమ్)*

## దైవతిరస్కార (కుఫ్ర్) శిక్ష నుండి తప్పకోవడం అసంభవం

(٨١) اَنَّ نَبِیَّ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ کَانَ یَقُوْلُ یُجَاءُ بِالْکَافِرِ
یَوْمَ الْقِیَامَۃِ فَیُقَالُ لَہٗ اَرَأَیْتَ لَوْ کَانَ لَکَ مِلْءُ الْاَرْضِ
ذَھَبًا أَکُنْتَ تَفْتَدِیْ بِہٖ فَیَقُوْلُ نَعَمْ فَیُقَالُ لَہٗ قَدْ کُنْتَ

شَيْئًا مَا هُوَ أَيْسَرُ مِنْ ذَالِكَ - (بخاری عن انس بن مالک کتاب الرقاق)

81. దైవప్రవక్త (సఅసం) ఇలా పలికేవారు : "ప్రళయదినాన కాఫిర్ (దైవతిరస్కారి)ను అల్లాహ్ సన్నిధికి గొనిరావడం జరుగుతుంది. అప్పుడతడ్ని ఉద్దేశించి, "నీ వద్ద భూమండలమంతా నిండిపోయేటంత బంగారం ఉందనుకో. దాన్ని ఫిదియాగా (పాపపరిహారంగా) ఇవ్వడానికి సిద్ధమేనా?" అని అడగడం జరుగుతుంది.

అతడు దానికి 'అవును' అని బదులిస్తాడు. అప్పుడు, 'మరి నీవు ప్రపంచంలో ఉండగా కోరింది ఇంతకు చాలా సునాయాసమైన విషయమే కదా?' అని తిరిగి అడగడం జరుగుతుంది."

*(అనస్ బిన్ మాలిక్ (రజి) – బుఖారి)*

**సంగ్రహణం :**

కుఫ్ర్ (దైవతిరస్కారం) షిర్క్ (బహుదైవారాధన)లకు సంబంధించిన శిక్ష వాటిని అనుసరించిన వ్యక్తి ఎల్లప్పుడూ నరకంలో యాతనలు అనుభవిస్తూనే ఉంటాడు.

ప్రపంచంలో అతణ్ణి కోరింది కేవలం దైవాన్ని విశ్వసించమని, ఆయన్ను ఆరాధించమని, ఆయనకు మరెవ్వరినీ సాటి కల్పించవద్దనే కదా! అయితే అతడు దాన్ని ఖాతరు చేయలేదు. ప్రళయదినాన ప్రపంచం నుండి పోయేటంత బంగారం పరిహారంగా అది అతని దగ్గర ఉన్నప్పుడు – ఇచ్చినా సరే ఇలాంటి కఠినమైన, ఎడతెగని శిక్ష నుండి తప్పుకోజూస్తాడు. అయితే అక్కడ ఆ వ్యక్తి చేతిలో చిల్లి గవ్వకూడా ఉండదు.

## నరకవాసుల్లో స్త్రీలే ఎక్కువ

(۸۲) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ قَالَ اِطَّلَعْتُ فِي الْجَنَّةِ فَرَأَيْتُ اَكْثَرَ اَهْلِهَا الْفُقَرَاءَ وَفِي النَّارِ فَرَأَيْتُ اَكْثَرَ اَهْلِهَا النِّسَاءَ.

(بخاری عن عمران بن حصین کتاب الرقاق مسلم عن ابن عباس کتاب الذکر والدعاء ترمذی ابواب جہنم)

82. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "నేను స్వర్గంలోనికి దృష్టిని సారించినప్పుడు అక్కడ పేదసాదలే అధికంగా అగుపడ్డారు నాకు.

నరకంలోనికి తొంగిచూసినప్పుడు అందులో స్త్రీలే అధికంగా ఉన్నట్లు తోచింది."

(ఇమ్రాన్ బిన్ హసీన్ (రజి)–బుఖారి, ఇబ్నె అబ్బాస్ (రజి)–ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

ప్రళయం నాడు నరకపు ఇంధనంగా మారకుండా స్త్రీలు సాధ్యమైనంత మట్టుకు పుణ్యకార్యాలు చేసుకుంటూ జాగ్రత్తపడడం మంచిది.

## స్వర్గాన్ని పొందేవారు అత్యధికంగా నిరుపేదలే

(۸۳) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ قُمْتُ عَلٰى بَابِ الْجَنَّةِ فَكَانَ عَامَّةُ مَنْ دَخَلَهَا الْمَسَاكِيْنُ وَاَصْحَابُ الْجَدِّ مَحْبُوْسُوْنَ غَيْرَ اَنَّ اَصْحَابَ النَّارِ قَدْ اُمِرَ بِهِمْ اِلَى النَّارِ وَقُمْتُ عَلٰى بَابِ النَّارِ فَاِذَا عَامَّةُ مَنْ دَخَلَهَا النِّسَاءُ۔

(بخاری عن اسامہ کتاب الرقاق مسلم کتاب الذکر والدعاء)

83. దైవప్రవక్త (సఅసం) ఇలా నుడివారు : "(మేరాజ్ రాత్రి) నేను స్వర్గద్వారం దగ్గర నిలబడి చూస్తే అందు అధికంగా పేదవారే ప్రవేశిస్తున్నారు. ధనవంతుల్ని (వారికిచ్చిన ధనం గురించిన లెక్క జూపమని అడగడానికి) నిలబెట్టడం జరిగింది. (వారిలో) ఎవరికయితే అగ్ని శిక్ష పడిందో వారిని సత్వరం నరకంలోకి తీసుకువెళ్ళమని ఆదేశం అయింది. నరక ద్వారంలో అధికంగా స్త్రీలే ప్రవేశిస్తూ ఉండటం నేను చూశాను.

*(ఉసామా (రజి) – బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

మేరాజ్ రాత్రి దైవప్రవక్త (సఅసం)కు మనుషుల కర్మలకు లభించే సత్ఫలితాలు, దుష్ఫలితాల వ్యవస్థ ఎలా ఉండబోతోందో చూపించడం జరిగింది. స్వర్గ, నరక ద్వారాల దగ్గరకు వెళ్ళి చూడ్డం ఇందులోని ఓ భాగమే. స్వర్గంలో అనాథలు, దరిద్రులు, నిరుపేదలు, బలహీనులు అధికంగా ప్రవేశించడం, దైవన్యాయస్థానంలో తమ ధన వ్యయం గురించిన ఆడిట్ చేయించుకునేందుకు పెద్ద పెద్ద పెట్టుబడిదార్లు, జమీందార్లు, ధనవంతులు,

పాలకులు, వి.ఐ.పి. వగైరాలు నిలబడి ఉండడం వారి జీవిత రికార్డులు క్షుణ్ణంగా పరిశీలింపబడడం ఆయన చూశారు.

ఈ హదీసు ద్వారా తెలిసిందేమిటంటే, అధికారం పెట్టుబడిదారీతనం, సంపన్నత, సమాజంలో కలిమి కలిగి ఉన్న వారందరినీ దైవన్యాయస్థానంలో గట్టిగా క్షుణ్ణంగా లెక్క అడగడం జరుగుతుంది. ఎవరయితే ఈ పరీక్షలో నెగ్గుతారో వారినే స్వర్గంలో ప్రవేశించడానికి అనుమతినీయడం జరుగుతుంది. అయితే పేదసాదల్లోని పుణ్యాత్ములు మాత్రం వారికి అయిదు వందల సంవత్సరాలకు ముందే స్వర్గంలో నివాసం పొందగలరు.

దైవధర్మాన్ని అనుసరించే భాగ్యం అధికంగా పేదసాదలకే లభిస్తుంది అన్నది నిర్వివాదాంశం. దైవధర్మ వ్యాప్తి కోసం, మానవాళి సమక్షంలో సత్య సాక్ష్యాన్ని నిర్భయంగా చాటేవారు అధికంగా పేదవారే. ధనమదంలో కన్ను మిన్నూ గానక వ్యవహరించే వారికి ఈ భాగ్యం ఎలా లభిస్తుంది? ధనం మనిషికి జలసాలు నేర్పుతుందే తప్ప దైవధర్మ వ్యాప్తి కోసం పాటుబడేటట్లు చేయడం బహు అరుదు. సంపన్నుల్లో అధికభాగం దైవధర్మానికి దూరంగానే ఉండడం మనం చూస్తున్న యదార్థం.

## స్వర్గ నరకవాసుల అనుభవాలు

(٨٤) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُؤْتَى بِاَنْعَمِ اَهْلِ الدُّنْيَا مِنْ اَهْلِ النَّارِ يَوْمَ الْقِيَامَةِ فَيُصْبَغُ فِى النَّارِ صَبْغَةً ثُمَّ يُقَالُ يَا ابْنَ اٰدَمَ! هَلْ رَأَيْتَ خَيْرًا قَطُّ؟ هَلْ مَرَّ بِكَ نَعِيْمٌ قَطُّ؟ فَيَقُوْلُ لَا وَاللّٰهِ يَارَبِّ وَيُؤْتَى بِاَشَدِّ النَّاسِ بُؤْسًا فِى الدُّنْيَا مِنْ اَهْلِ الْجَنَّةِ فَيُصْبَغُ صَبْغَةً فِى الْجَنَّةِ فَيُقَالُ لَهٗ يَا ابْنَ اٰدَمَ! هَلْ رَأَيْتَ بُؤْسًا قَطُّ؟ هَلْ مَرَّ بِكَ شِدَّةٌ قَطُّ فَيَقُوْلُ لَا وَاللّٰهِ يَارَبِّ مَا مَرَّ بِىْ بُؤْسٌ قَطُّ وَلَا رَأَيْتُ شِدَّةً - (مسلم عن انس بن مالک باب فى الكفار)

84. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ప్రపంచంలో అమితంగా సుఖభోగాలు అనుభవించిన ఓ నరకవాసిని ప్రళయదినాన హాజరుపర్చడం జరుగుతుంది. అతణ్ణి నరకాగ్నిలో ఒక్కసారి ముంచి

బయటకు తీసి, ఆదం కుమారుడా! నీవెప్పుడయినా సుఖం అన్నది చవిచూశావా? వాటిని అనుభవించే కాలం ఎప్పుడయినా చూశావా?" అని అడగడం జరుగుతుంది.

దానికి అతడు, "ప్రభూ! నీపై ఒట్టు. నేను అలాంటి కాలాన్ని గురించి ఊహించనైనా ఊహించలేదు (అది ఎలా ఉంటుందో)" అని పలుకుతాడు.

ఆ తరువాత ఈ లోకంలో పరమ దరిద్ర్యాన్ని అనుభవించిన ఓ స్వర్గ వాసిని స్వర్గంలోని వరాలను చవిచూసిన తరువాత (దైవసన్నిధిలోనికి) తీసుకురావడం జరుగుతుంది. అప్పుడు అతణ్ణి ఉద్దేశించి "ఆదం కుమారా! నీ వెప్పుడయినా దారిద్ర్యం అన్నది అనుభవించావా? కష్టం అంటే ఏమిటో ఎప్పుడయినా చవిచూశావా?" అని అడిగితే అతడు, "ఓ నా ప్రభూ! నీవే సాక్షి! నేను దారిద్ర్యానికి, లేమికి ఏనాడూ గురికాలేదు, నాకు ఎలాంటి కష్టకాలమూ దాపురించలేదు" అని సమాధానమిస్తాడు.

*(అనస్ బిన్ మాలిక్ (రజి) - ముస్లిమ్)*

## దేవుని నీడలో ఉండేవారు

(٨٥) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ سَبْعَةٌ يُظِلُّهُمُ اللّٰهُ
يَوْمَ الْقِيَامَةِ فِي ظِلِّهِ يَوْمَ لَا ظِلَّ اِلَّا ظِلُّهُ،
اِمَامٌ عَادِلٌ،
وَشَابٌّ نَشَأَ فِي عِبَادَةِ اللّٰهِ،
وَرَجُلٌ ذَكَرَ اللّٰهَ فِي خَلَاءٍ فَفَاضَتْ عَيْنَاهُ،
وَرَجُلٌ قَلْبُهُ مُعَلَّقٌ فِي الْمَسَاجِدِ،
وَرَجُلَانِ تَحَابَّا فِي اللّٰهِ،
وَرَجُلٌ دَعَتْهُ امْرَأَةٌ ذَاتُ مَنْصِبٍ وَجَمَالٍ اِلٰى
نَفْسِهَا قَالَ اِنِّي أَخَافُ اللّٰهَ،

وَرَجُلٌ تَصَدَّقَ بِصَدَقَةٍ فَأَخْفَاهَا حَتّٰى لَا تَعْلَمَ شِمَالُهُ
مَا صَنَعَتْ يَمِيْنُهُ

(بخاری عن ابی ہریرۃ کتاب الحدود، کتاب الزکوٰۃ کتاب الاذان مسلم کتاب الزکوٰۃ۔
ترمذی ابواب الزھد)

85. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : “అల్లాహ్ ప్రళయం రోజున ఏడు రకాల మనుషుల్ని తన నీడన ఆశ్రయమిస్తాడు. ఆ రోజున ఆయన నీడ తప్ప మరే నీడా కానరాదు. వారు –

1. న్యాయమూర్తి అయిన పాలకుడు. (అంటే న్యాయంగా ధర్మంగా పరిపాలించే రాజు, దేశాధ్యక్షుడు లేక ప్రధానమంత్రి).
2. తన యవ్వనమంతా అల్లాహ్ ఆరాధనలో గడిపిన యువకుడు.
3. ఏకాంతంలో ఉన్నప్పుడు అల్లాహ్ గుర్తుకు రాగానే (ఆయన భయం వల్లనైనా లేక ఆయన వాత్సల్యం కారణంగానైనా) అతని కళ్ళనుండి అశృవులు జలజల కారిన వ్యక్తి).
4. తన మనస్సునంతా మస్జిద్‌లోనే లగ్నం చేసినవాడు. (అంటే ఎల్లప్పుడు మస్జిదులో సామూహికంగా నమాజు చేసేవాడు, నమాజు తరువాత బయటకు వస్తే తిరిగి మరో నమాజు కోసం వెళ్ళేందుకు తహ తహలాడేవాడు.
5. అల్లాహ్ (ప్రసన్నత) కోసమే పరస్పరం ఆత్మీయత నేర్పర్చుకునే ఇద్దరు (అంటే వారు మరే ప్రాపంచిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకోకుండా కేవలం అల్లాహ్‌ను ప్రసన్నునిగా చేసేందుకు పరస్పరం ప్రేమానురాగాలు కలిగివున్నవారు).
6. ఉన్నత కుటుంబానికి చెందిన ఓ అతి సౌందర్యవతి అయిన స్త్రీ కామసంబంధమైన కోరికను తీర్చమని అడిగితే నేను అల్లాహ్‌కు భయపడుతున్నానని చెప్పి నిరాకరించేవాడు.
7. అల్లాహ్ మార్గంలో దానం చేసేటప్పుడు కుడిచేయి చేసిన దానం

ఎడమ చేతికి కూడా తెలియకుండా అతి గోప్యంగా చేసేవాడు.

(అబూ హురైరా (రజి) - బుఖారి, ముస్లిమ్)

**సంగ్రహణం :**

అల్లాహ్ ఏడు రకాల మనుషుల్ని తన నీడలో చోటిస్తాడు అంటే కృపాకరుడు, కరుణామయుడైన దేవుడు ఈ ఏడు రకాల ప్రత్యేకతలు గల వారిని తన సంరక్షణలోనికి తీసుకోవడం మూలంగా 'హష్ర్' మైదానపు భయానక వాతావరణం, అక్కడి అతి తీవ్రమైన ఉష్ణోగ్రత నుండి వారు రక్షించబడతారు అని అర్థం. అదేకాకుండా 'హష్ర్' మైదానంలో సూర్యుడు అతి సమీపం నుండి తన తీక్షణతను కురిపిస్తూ ప్రతాపం చూపేటప్పుడు అక్కడున్న వారు చెమటలు గ్రక్కుతారు. వేడిమివల్ల ఉక్కిరిబిక్కిరై బాధపడుతుంటారు. అట్టి సమయంలో అల్లాహ్ అర్ష్ (పీఠం) నీడ తప్ప మరే నీడ కానరాదు అని అర్థం కూడా. అప్పుడు ఈ హదీసులో చెప్పిన ఏడు రకాల మనుషుల్ని అల్లాహ్ తన నీడన (పంచన) ఆశ్రయం కల్పిస్తాడు.

## స్వర్గలోక ప్రాముఖ్యత

(۸۶) عَنْ سَهْلِ بْنِ سَعْدٍ قَالَ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَوْضِعُ سَوْطٍ فِي الْجَنَّةِ خَيْرٌ مِّنَ الدُّنْيَا وَمَا فِيْهَا

(بخاری کتاب الرقاق)

86. "స్వర్గంలో ఓ 'కొరడా' ఆక్రమించేటంత స్థలం ఇహలోకంలో సకల ఐశ్వర్యాల కంటే మిన్న' అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించగా నేను విన్నానని" హజ్రత్ సహల్ బిన్ సఅద్ (రజి) ఉల్లేఖించారు. (బుఖారి)

**సంగ్రహణం :**

పరలోకంలో అల్లాహ్ తన దాసుల్ని స్వర్గవనాల్లోకి ప్రవేశం కల్పి స్తాడు. ఇహలోకపు ఐశ్వర్యాలు, ఇక్కడి సుఖభోగాలు, ఆహారవిహారాలు అన్నీ సూర్యుని ముందు ఓ చిన్న మిణుగురు పురుగు లాంటివి. ఎవరికైనా ఇక్కడి సమస్త భోగభాగ్యాలు, ధనసంపదలన్నీ ఇచ్చి ఆపై అతడిని స్వర్గాన్ని తిలకింపజేయిస్తే, అక్కడి ఓ జానెడు స్థలం ఈ ప్రపంచం, దాని అన్ని హంగులకంటే మిన్న అని ఒప్పుకోక తప్పదు, 'స్వర్గం' అన్నది ప్రభువు తన దాసుణ్ణి మెచ్చి ఒసిగే ప్రదేశం. తన ప్రభువు మెప్పు ఎల్లవేళలా లభించే ప్రదేశం కంటే మరింకే వస్తువు కావలసి ఉంటుంది ఆ దాసునికి?

## కర్మల విచారణ లేకుండానే స్వర్గ ప్రవేశం

(۸۷) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ يَدْخُلُ الْجَنَّةَ مِنْ اُمَّتِىْ سَبْعُوْنَ اَلْفًا بِغَيْرِ حِسَابٍ، هُمُ الَّذِيْنَ لَا يَسْتَرْقُوْنَ، وَلَا يَتَطَيَّرُوْنَ وَعَلٰى رَبِّهِمْ يَتَوَكَّلُوْنَ۔

(بخاری عن ابن عباس کتاب الرقاق)

87. "నా ఉమ్మత్ (సమాజం)లోని ఈ డెబ్బైవేల మంది తమ కర్మల లెక్క చూయించకుండానే స్వర్గంలో ప్రవేశిస్తారు.

1. తాయెత్తులు కట్టించుకోనివారు, మంత్రాలు వేయించుకోనివారు.
2. శకునాలను నమ్మనివారు.
3. తమ భారమంతా అల్లాహ్‌పైన్నే వేసేవారు"

అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. (ఇబ్నె అబ్బాస్ (రజి) - బుఖారి)

**సంగ్రహణం :**

ముస్లిమ్ సమాజంలోని డెబ్బైవేలమంది తీర్పుదినంనాడు అల్లాహ్ న్యాయస్థానంలో తమ కర్మలకు జవాబు చెప్పుకోవడాన్ని నిరీక్షించకుండానే స్వర్గంలో ప్రవేశిస్తారు. వారి ముఖాలు పూర్ణచంద్రబింబాల్లా ప్రకాశిస్తూ ఉంటాయి. ఈ గౌరవం కేవలం మహాప్రవక్త (సఅసం) గారి ఉమ్మత్ (సమాజం)కే ఒసగబడడం విశేషం. వారెవరై ఉంటారన్నది కేవలం అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. అయితే దైవప్రవక్త (సఅసం) ఈ ప్రవచనంలో వారి గుర్తులు మాత్రం కొన్ని సెలవిచ్చారు.

## స్వర్గ విశేషాలు

(۸۸) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ قَالَ اللّٰهُ اَعْدَدْتُ لِعِبَادِىَ الصَّالِحِيْنَ مَا لَا عَيْنٌ رَأَتْ وَلَا اُذُنٌ سَمِعَتْ وَلَا خَطَرَ عَلٰى قَلْبِ بَشَرٍ۔

(بخاری عن ابی ہریرۃ کتاب التوحید۔ مسلم فی صفۃ الجنۃ۔ ترمذی ابواب التفسیر)

88. అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు: "సదాచార సంపన్నులైన నా దాసులకోసం నేను సమకూర్చి పెట్టిన వరాలను (ఇప్పటి వరకు) ఏ కన్నూ కానలేదు, ఏ చెవి వినలేదు మరే మనిషి మనస్సులో వాటి ఊహ అయినా రాలేదు."

(అబూ హురైరా (రజి) – బుఖారి, ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం :**

స్వర్గధామంలో సదాచార సంపన్నులైన తన దాసులకు, పుణ్యాత్ము లకు అల్లాహ్ సమకూర్చిపెట్టిన మహోన్నతమైన వరాలను ఈ లోకంలో నివసించేవారు ఊహించనైనా ఊహించలేరు. నేటికి ఏ మానవమాత్రుడూ అక్కడి కట్టడాల్ని, పూదోటలను, స్వాదిష్టమైన భోజనాలను, ఆహ్లాదం కలిగించే పానీయాలను, అందచందాలను పుణికి పుచ్చుకున్న భార్యలను చూడ్డం, వినడమే కాకుండా ఊహామాత్రంగానైనా ఊహించి ఉండడు. ఈ వరాలన్నీ విశ్వాసులైన దాసులకోసం ఎదురుచూస్తున్నాయి. స్వర్గంలోని మానసిక, శారీరక సంబంధమైన వరాలను ఈ లోకంలో ఉండేవారి ఊహకు కూడా తట్టవు.

(٨٩) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَوَّلُ زُمْرَةٍ تَلِجُ الْجَنَّةَ صُوَرُهُمْ عَلٰى صُوْرَةِ الْقَمَرِ لَيْلَةَ الْبَدْرِ لَا يَبْصُقُوْنَ فِيْهَا وَلَا يَمْتَخِطُوْنَ. وَلَا يَتَغَوَّطُوْنَ فِيْهَا اٰنِيَتُهُمْ وَاَمْشَاطُهُمْ مِنَ الذَّهَبِ وَالْفِضَّةِ وَمَجَامِرُهُمْ مِنَ الْاُلُوَّةِ وَرَشْحُهُمُ الْمِسْكُ وَلِكُلِّ وَاحِدٍ مِّنْهُمْ زَوْجَتَانِ يُرٰى مُخُّ سُوْقِهِمَا مِنْ وَّرَاءِ اللَّحْمِ مِنَ الْحُسْنِ، لَا اِخْتِلَافَ بَيْنَهُمْ وَلَا تَبَاغُضَ قُلُوْبُهُمْ قَلْبٌ وَاحِدٌ يُسَبِّحُوْنَ اللهَ بُكْرَةً وَّعَشِيًّا۔ (مسلم عن ابی ہریرۃ کتاب الجنۃ۔ بخاری کتاب بدء الخلق)

89. అంతిమ దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "ప్రప్రథమంగా స్వర్గంలో ప్రవేశించే బృందసభ్యులు (నిలువెల్ల ధవళకాంతితో, సుందరమైన) పున్నమి చంద్రుణ్ణి పోలి ఉంటారు. వారి నోటినుండి ఉమ్మి ముక్కుల నుండి జిగటైన ద్రవపదార్థం (చీమిడి) కారడం ఉండవు.

స్వర్గంలో మల విసర్జన చేసే అవసరం ఏర్పడదు. వారి పాత్రలు, దువ్వెనలు వెండి బంగారాలవి. వారిలోని ప్రతి ఒక్కరికి ఇద్దరేసి భార్య లుంటారు. అందచందాల కారణంగా వారి కాళ్ళ పిక్కల్లోని (చీలమండ పైభాగం) ఎముకల మూలుగ (Bone marrow) పైనగల మాంసం (చర్మం కూడా) గుండా బయటకు అగుపడుతుంది. (అంటే అంత పారదర్శకంగా ఉంటాయి). ఆ స్వర్గవాసుల నడుమ ఎలాంటి మనస్పర్థలు, భేదాభి ప్రాయాలు ఉండడంగాని, ఒకరిని ఒకరు అసహ్యించుకోవడం గాని జరుగదు. వారి సంబంధబాంధవ్యాలను చూస్తే వారందరి హృదయ స్థితి ఒకేలాగున్నట్లు తోస్తుంది. వారంతా ఉదయం సాయం సమయాల్లో అల్లాహ్ స్తోత్రం చేస్తూ ఉంటారు." (అబూ హురైరా (రజి) – ముస్లిమ్, బుఖారి)

**సంగ్రహణం :**

ప్రథమంగా స్వర్గంలో ప్రవేశించిన బృందంలోని సభ్యులు అందంలో పున్నమి చంద్రునిలా వెలిగిపోతుంటారు. ఆ తరువాత ప్రవేశించే వారు సుందర నక్షత్రాలకు మల్లే ధగధగ మెరిసిపోతారు.

స్వర్గలోక పరిశుద్ధ వాతావరణంలో ఎలాంటి కాలుష్యానికి తావు ఉండదు. అదేవిధంగా మలమూత్ర విసర్జనగాని ముక్కుల నుండి కారే చీమిడిగాని, ఉమ్మి వేయడం గాని అక్కడ ఉండవు. అలాగే ఆ పవిత్రమైన వాతావరణంలో ఎలాంటి విభేదాలు, జగడాలు, కయ్యాలు పొడసూపవు. వారి పరస్పర సంబంధబాంధవ్యాలు ఎంతో ఉత్తమమైనవిగా ఉంటాయి. అక్కడ వారిలో అసూయ, వైరం గురించి ఊహించనైనా ఊహించలేము. ఇహలోకంలో ఏ స్త్రీ అయితే మోమిన్‌కు (విశ్వాసికి) భార్యగా ఉంటూ వచ్చిందో స్వర్గం లోనూ ఆమె అతని భార్యగానే ఉంటుంది. అదనంగా అతడు ఇద్దరు సుందరాంగులైన కన్యల్తో వివాహమాడుతాడు.

## స్వర్గ నివాసపు తీరు తెన్నులు

(٩٠) عَنْ جَابِرٍ قَالَ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ

اِنَّ اَهْلَ الْجَنَّةِ يَأْكُلُوْنَ فِيْهَا وَيَشْرَبُوْنَ وَلَا يَتْفِلُوْنَ وَلَا

يَبُوْلُوْنَ. وَلَا يَتَغَوَّطُوْنَ وَلَا يَمْتَخِطُوْنَ قَالُوْا فَمَا بَالُ

الطَّعَامِ؛ قَالَ جُشَاءٌ وَرَشْحٌ كَرَشْحِ الْمِسْكِ يُلْهَمُونَ التَّسْبِيحَ وَالتَّحْمِيدَ كَمَا يُلْهَمُونَ النَّفَسَ۔

(مسلم کتاب الجنۃ)

90. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచిస్తూ ఉండగా విన్నానని హజ్రత్ జాబిర్ (రజి) ఉల్లేఖించారు :

"స్వర్గంలో తినడం త్రాగడం కొనసాగుతుంది. కాని అక్కడి వారు ఉమ్మి వేయడంగాని, మలమూత్ర విసర్జన చేయడం గాని ఉండవు. వారి ముక్కుల వెంట చీమిడి కూడా కారదు." దీనికి ఆయన అనుచరులు, "దైవప్రవక్తా! మరి తిన్నదంతా ఏమైపోతుంది" అని అడిగితే -

"ఓ ప్రత్యేకమయిన త్రేన్పు ద్వారా, కస్తూరి సువాసనలు వెదజల్లే చెమట ద్వారా" (అంతా జీర్ణమైపోతుంది) వారి హృదయ స్పందన, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, తస్బీహ్, తమ్‌హీద్‌లే" అని సెలవిచ్చారు.

*(జాబిర్ (రజి) - ముస్లిమ్)*

**సంగ్రహణం :**

స్వర్గ ఉద్యానవనాల్లో నివసించే ఆ పరిశుద్ధ నాగరిక సమాజం, దుర్వాసనలకు, కంపుకు, అశుద్ధ పదార్థాలకు అతీతంగా ఉంటుంది. కేవలం ఒకే ఒక త్రేన్పు తిన్న ఆహారాన్నంతా జీర్ణింపజేస్తుంది. అలాగే రకరకాల పానీయాలు చెమట రూపంలో బయటకు వచ్చేస్తాయి. అరబీ భాషలో 'తస్బీహ్' అంటే 'సుబ్హానల్లాహ్' అని పలకడం, అంటే అల్లాహ్ ప్రతి లోపానికి, బలహీనతకు అతీతుడు, పరిశుద్ధుడు అని అనడం.

'తమ్‌హీద్' అంటే అల్‌హమ్‌దులిల్లాహ్ అని పలకడం. అనగా, ఆయన ఒసగిన ప్రతి వరాన్ని పొంది కృతజ్ఞత తెలుపడం. ఆయన గుణగణాలను, ఆయన అధికారాన్ని గుర్తిస్తూ సదా ఆయన్నే స్తోత్రించడం. ఇలా సుబ్హానల్లాహ్, అల్‌హమ్‌దులిల్లాహ్ అనే నినాదాలతో స్వర్గం మొత్తం మారుమ్రోగుతుంది. ఎల్లవేళలా వారు అల్లాహ్ ఒసగిన వరాలకు కృతజ్ఞతలు చూపుతూనే వుంటారు.

శ్వాస అనేది ప్రతి జీవికి అవసరమైనది. ఇది లేకుండా ఓ నిమిషం కూడా బ్రతకడం అసంభవం. ఇలాగే తస్బీహ్, తమ్‌హీద్‌లు స్వర్గవాసుల భౌతికపరమైన, సహజమైన అవసరాలుగా మారిపోతాయి. అవి లేకుండా వారు ఉండనే ఉండలేరు.

## స్వర్గం, వృద్ధాప్యం, దారిద్ర్య రహితమైనది

(۹۱) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ يُنَادِيْ مُنَادٍ اِنَّ
لَكُمْ اَنْ تَصِحُّوْا فَلَا تَسْقَمُوْا اَبَدًا وَاِنَّ لَكُمْ اَنْ تَحْيَوْا
فَلَا تَمُوْتُوْا اَبَدًا وَاِنَّ لَكُمْ اَنْ تَشِبُّوْا فَلَا تَهْرَمُوْا اَبَدًا
وَاِنَّ لَكُمْ اَنْ تَنْعَمُوْا فَلَا تَبْاَسُوْا اَبَدًا فَذٰلِكَ قَوْلُهٗ
عَزَّ وَجَلَّ وَنُوْدُوْا اَنْ تِلْكُمُ الْجَنَّةُ اُوْرِثْتُمُوْهَا بِمَا كُنْتُمْ
تَعْمَلُوْنَ۔ (مسلم عن ابی سعید الخدری کتاب الجنۃ)

91. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ఇది : "(స్వర్గంలో) ఓ దండోరా వేసేవాడు ఇలా ప్రకటిస్తాడు. (స్వర్గవాసులారా!) ఇక మీరు చిరంజీవులుగా ఉంటారు. మరణం అన్నది మీ దరిదాపులకు రాదు. చిరకాలం మీరు ఆరోగ్యంగానే వుంటారు. రోగాలు ఎన్నటికీ రావు. మీరు (ఎల్లప్పుడూ) నిండు యవ్వనంతో ఉంటారు. వృద్ధాప్యం అన్నదే ఎరుగరు. సతతం సకల ఐశ్వర్యాలతో తులతూగుతుంటారు. దారిద్ర్యం, కష్టాలు ఇక కనబడనే కనబడవు. అల్లాహ్ తన గ్రంథంలో, "ఈ స్వర్గం దేనికైతే మీరు వారసులుగా చెయ్యబడ్డారో మీరు చేస్తూ ఉండిన పనులకు ప్రతిఫలంగా మీకు లభించింది" అని సెలవియ్యబడ్డమాటే ఇది."

**సంగ్రహణం :**

స్వర్గవాసుల జీవితం గురించి ఎంతని చెప్పాలి. వ్యాధిగ్రస్తులవడం గాని, వృద్ధాప్యం అనుభవించడం గాని ఉండనే ఉండవక్కడ. ఇక చావు వస్తుందనే ప్రశ్నే ఉత్పన్నం కాదు. సతతం యవ్వన ఆర్భాటాల్లో మునిగి తేలుతూ ఉండి సకల ఐశ్వర్యాలు, భోగభాగ్యాలు అనుభవించే స్థలం అది.

మరో హదీసులో ఇలా ఉంది : "స్వర్గంలో ప్రవేశించినవాడు సంప న్నుడై పోతాడు. దారిద్ర్యం కష్టాలు అతని దాపుకే రావు. అతని వస్త్రాలు పాతవై కూడా పోవు. అతని యవ్వనం ఏనాటికీ తరగదు." (ముస్లిమ్)

## స్వర్గవాసుల రూపు రేఖలు

(۹۲) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَهْلُ الْجَنَّةِ جُرْدٌ مُرْدٌ
كَحْلٰى لَا يَفْنٰى شَبَابُهُمْ وَلَا تَبْلٰى ثِيَابُهُمْ

(ترمذی عن ابی ہریرہ ابواب الجنۃ)

92. "స్వర్గవాసుల శరీరం మీద రోమాలు గాని ముఖంపై గడ్డం, మీసాలుగాని ఉండవు. వారి కళ్ళు 'సుర్మ' పెట్టుకున్న వారి కళ్ళలా (నల్లగా, అందంగా) ఉంటాయి. వారి యవ్వనం తరగని యవ్వనం. వారి వస్త్రాలు పాతవై చినిగిపోవు" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(అబూహురైరా (రజి) – తిర్మిజి)

**సంగ్రహణం :**

స్వర్గంలో జీవితం ఆహ్లోదాన్ని గొలిపే వసంతం లాంటిది. శరీరంలోని ఏ భాగంలోను రోమాలు మొలవవు. పురుషుల ముఖంపై గడ్డాలు, మీసాలు కూడా ఉండవు, అక్కడ వారి యవ్వనం తరగని యవ్వనం. వ్యాధిగాని, బలహీనతగాని, వృద్ధాప్య ఛాయలుగాని అగుపడవు అక్కడ. అయితే స్త్రీ పురుషుల తలలపై అందమైన కేశాలు తప్పకుండా ఉంటాయి. 89వ హదీసులో చెప్పిన వెండి బంగారాల దువ్వెనలు, స్వర్గంలో వారి తలపై కేశాలుంటాయన్న యదార్థాన్ని రుజువు చేస్తుంది.

## దైవదర్శనం

(۹۳) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ جَنَّتَانِ مِنْ فِضَّةٍ اٰنِيَتُهُمَا
وَمَا فِيْهِمَا وَجَنَّتَانِ مِنْ ذَهَبٍ اٰنِيَتُهُمَا وَمَا فِيْهِمَا وَمَا بَيْنَ
الْقَوْمِ وَبَيْنَ اَنْ يَّنْظُرُوْا اِلٰى رَبِّهِمْ اِلَّا رِدَاءُ الْكِبْرِيَاءِ عَلٰى
وَجْهِهٖ فِيْ جَنَّةِ عَدْنٍ۔

(مسلم عن عبداللہ بن قیس کتاب الایمان۔ بخاری کتاب التفسیر)

93. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ఇలా ఉంది : "స్వర్గంలోని ఓ

రెండు ఉద్యాన వనాల్లోని ప్రతి వస్తువు వెండిదే. చివరికి అక్కడి పాత్రలు కూడా వెండివే. మరో రెండు ఉద్యాన వనాల్లో ప్రతి వస్తువు బంగారు వస్తువే. చివరికి అక్కడి పాత్రలు కూడా బంగారు పాత్రలే. 'అద్న్' అనే స్వర్గంలో ఉండేవారు దైవదర్శనం చేసుకోకుండా ఏదీ అడ్డు తగలదు. 'అల్లాహ్' ముఖంపై గల ఔన్నత్యపు పరదా తప్ప."

*(అబ్దుల్లా బిన్ ఖైస్ (రజి) – ముస్లిమ్, బుఖారి)*

**సంగ్రహణం :**

ప్రళయదినాన స్వర్గధామంలో విశ్వాసులు అల్లాహ్ దర్శనం చేసుకొని తప్పకుండా తరిస్తారు. ఈ దర్శన భాగ్యం సకల వరాల కంటే మహోన్నతమైన భాగ్యం. పరలోకంలో లభించే ప్రతి వరం దీనికి దిగదుడుపే. ఈ హదీసులో 'ముఖం' అంటే సాక్షాత్తు అల్లాహ్‌యేనని, ఔన్నత్యపు పరదా అంటే ఆయన తీక్షణమైన ఔన్నత్యం అని అర్థం. అంటే దైవదాసులకు దేవుని దర్శనం చేసుకోవడానికి ఏదైనా అడ్డు తగుల్తోంది అంటే అది ఆయన ఔన్నత్యం, ఆయన ఉగ్రరూపమే. అయితే 'అద్న్' అనే స్వర్గంలో ఆయన ఈ పరదాను కూడా తొలగించి భక్తులను తరింపజేస్తాడు అని భావం.

(۹۴) خَرَجَ عَلَيْنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَيْلَةَ الْبَدْرِ
فَقَالَ اِنَّكُمْ سَتَرَوْنَ رَبَّكُمْ يَوْمَ الْقِيَامَةِ كَمَا تَرَوْنَ هٰذَا
لَا تُضَامُّوْنَ فِيْ رُؤْيَتِهٖ وَفِيْ رِوَايَةٍ عَنْهُ مَرْفُوْعًا اِنَّكُمْ
سَتَرَوْنَ رَبَّكُمْ عِيَانًا۔ (بخاری عن جریر بن عبداللہ کتاب التوحید)

94. దైవప్రవక్త (సఅసం) పున్నమి రాత్రి బయటకు వచ్చి, "ప్రళయ దినాన మీరు దేవుణ్ణి, ఇప్పుడు చంద్రబింబాన్ని తిలకించినట్లుగా చూడగలరు. ఆయన దర్శనం చేసుకోవడానికి పరస్పరం ఒకరిని ఒకరు నెట్టుకోనవసరం లేదు." మరో ఉల్లేఖనంలో "మీరు మీ కళ్ళతో ఆయన్ను దర్శించుకోగలరు" అని ఉంది. *(జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) – బుఖారి)*

**సంగ్రహణం :**

స్వర్గంలో అల్లాహ్ కారుణ్యం ఉప్పొంగిపోతుంది. అక్కడ ప్రతీ కోరికా తీరుతుంది. నా ఫలానా కోరిక తీరలేదు అని ఏ వ్యక్తీ అనే ఆస్కారం లేదక్కడ. అయితే ఈ సకల

వరాలకు అదనంగా 1. అల్లాహ్ ప్రసన్నత 2. ఆయన దర్శన భాగ్యం లభిస్తాయి. ఈ రెండు వరాలు లభించడం వల్ల స్వర్గ వాసులు ఆనందంలో మునిగి తేలుతారు.

(۹۵) عَنْ صُهَيْبٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ إِذَا دَخَلَ أَهْلُ الْجَنَّةِ الْجَنَّةَ قَالَ يَقُوْلُ اللّٰهُ تَبَارَكَ وَتَعَالٰى:
تُرِيْدُوْنَ شَيْئًا أَزِيْدُكُمْ؛ فَيَقُوْلُوْنَ أَلَمْ تُبَيِّضْ وُجُوْهَنَا؛
أَلَمْ تُدْخِلْنَا الْجَنَّةَ؛ وَتُنَجِّيْنَا مِنَ النَّارِ قَالَ فَيَكْشِفُ الْحِجَابَ
فَمَا أُعْطُوْا شَيْئًا أَحَبَّ إِلَيْهِمْ مِنَ النَّظَرِ إِلٰى رَبِّهِمْ -
(مسلم کتاب الایمان)

95. హజ్రత్ సుహైబ్ రూమీ (రజి), దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారని ఉల్లేఖించారు :

"స్వర్గానికి అర్హులైన వారు స్వర్గంలో ప్రవేశించిన తరువాత వారి నుద్దేశించి, "మీరింకేమి కోరుకుంటారో కోరుకోండి అది మీకొసగుతాను" అని అడుగుతాడు. అప్పుడు వారు ప్రభూ! నీవు మాకు గౌరవం ఒసగ లేదా? అంతేకాదు మమ్మల్ని అగ్ని యాతన నుండి రక్షించి స్వర్గంలోనికి ప్రవేశింపజేయలేదా? అని అంటారు. అప్పుడు అల్లాహ్ తనకూ- వారికి నడుమగల పరదాను ఎత్తేస్తాడు. (తన దర్శన భాగ్యం కలుగ జేస్తాడు). ఆ స్వర్గవాసుల దృష్టిలో ఆ దైవదర్శన భాగ్యం (స్వర్గలోకపు అన్ని భాగ్యాల కంటే) అతి ప్రియమైన భాగ్యమై ఉంటుంది."

(సుహైబ్ రూమి (రజి) - ముస్లిమ్.)

## మరణం ఇక లేదు అని ప్రకటించడం

(۹۶) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا صَارَ أَهْلُ الْجَنَّةِ
إِلَى الْجَنَّةِ وَأَهْلُ النَّارِ إِلَى النَّارِ جِيْءَ بِالْمَوْتِ حَتّٰى يُجْعَلَ
بَيْنَ الْجَنَّةِ وَالنَّارِ ثُمَّ يُذْبَحُ ثُمَّ يُنَادِيْ مُنَادٍ يَا أَهْلَ

الْجَنَّةِ لَا مَوْتَ وَيَا أَهْلَ النَّارِ لَا مَوْتَ فَيَزْدَادُ أَهْلُ الْجَنَّةِ
فَرَحًا إِلَى فَرَحِهِمْ وَيَزْدَادُ أَهْلُ النَّارِ حُزْنًا إِلَى حُزْنِهِمْ
(بخاری عن ابن عمر کتاب الرقاق مسلم باب جہنم)

96. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : “స్వర్గవాసులంతా స్వర్గంలోను, నరకానికి అర్హులైన వారంతా నరకంలోను తమ తమ స్థానాల్లోనికి చేరాక 'మరణాన్ని' స్వర్గం, నరకాలకు నడుమ ఓ ప్రదేశానికి తెచ్చి 'జిబహ్' చేయడం జరుగుతుంది. (అంటే చంపడం జరుగుతుంది). ఆ తరువాత ఓ దండోరా వేసేవాడు ఇలా ప్రకటిస్తాడు – స్వర్గ నివాసు ల్లారా! మీకు చావు అన్నదే రాదు. నరకవాసు ల్లారా! ఇక మీరూ చావరు (ఎందుకంటే దాన్ని జిబహ్ చేయడం జరిగింది). ఈ ప్రకటనను విన్న స్వర్గవాసుల ఆనందానికి హద్దులే ఉండవు. అప్పటికే శోకంలో మునిగి వున్న నరకవాసులు ఇది విని మరింత శోకంలో మునిగిపోతారు.

*(ఇబ్నె ఉమర్ (రజి) – బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

మరణం అంటే శరీరం నుండి ఆత్మ వేరైపోవడం. స్వర్గనరకాల్లో ఉండే వారికి మరణమన్నదే ఉండదు. మరణాన్ని వారి ముందు జిబహ్ చేసి అంతం చేసిన కారణంగా ఇక ఏ ప్రాణికి మరణం ఆసన్నం కాదక్కడ.

## దేవుని మెప్పు

(۹۷) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِنَّ اللّٰهَ يَقُوْلُ
لِأَهْلِ الْجَنَّةِ يَا أَهْلَ الْجَنَّةِ! يَقُوْلُوْنَ لَبَّيْكَ رَبَّنَا وَسَعْدَيْكَ
فَيَقُوْلُ هَلْ رَضِيْتُمْ؟ فَيَقُوْلُوْنَ وَمَا لَنَا لَا نَرْضٰى وَقَدْ
أَعْطَيْتَنَا مَا لَمْ تُعْطِ أَحَدًا مِّنْ خَلْقِكَ فَيَقُوْلُ أَنَا أُعْطِيْكُمْ
أَفْضَلَ مِنْ ذٰلِكَ قَالُوْا يَا رَبِّ، وَأَيُّ شَيْءٍ أَفْضَلُ مِنْ
ذٰلِكَ؟ فَيَقُوْلُ أُحِلُّ عَلَيْكُمْ رِضْوَانِيْ فَلَا أَسْخَطُ عَلَيْكُمْ

بَعْدَهٗ اَبَدًا - (بخاری عن ابی سعید الخدری کتاب الرقاق مسلم کتاب الجنۃ)

97. మహాప్రవక్త (సఅసం) ప్రవచనం : "స్వర్గవాసుల్లారా!" అని అల్లాహ్ సంబోధించి పిలిచినప్పుడు, "ప్రభూ! నీ ఆనతి శిరసావహించ డానికి మేము సిద్ధంగా ఉన్నాం సెలవివ్వు" అని విన్నవించుకుంటారు ఆ స్వర్గనివాసులు. "మీరంతా తృప్తిచెంది సంతోషం చెందారా?" అని అడుగుతాడు అల్లాహ్. వారంతా, ప్రభూ! ఇంకా మేము తృప్తిపడకుండా ఉంటామా! నీవు మాకొసగిన వరాలు సకల సృష్టితాల్లో మరెవ్వరికీ ఒసగలేదే!! అని అంటారు. దీనికి అల్లాహ్ "మీకు ఇంతకంటే మేలైన బహుమానమిచ్చి సత్కరించదలిచాను తెలుసా?" అని అడుగుతాడు. అప్పుడు వారు, ఇంతకంటే మరింకే బహుమానం ఉంటుంది ప్రభూ! అని ఆశ్చర్యపడుతూ అడగ్గా, "నా మెప్పుకోలు పతకం ఇచ్చి మిమ్మల్ని సత్కరిస్తున్నాను; ఇక ఎన్నడూ మీరంటే నాకు అయిష్టం ఉండదు" అని సెలవిస్తాడు దేవుడు. *(అబూ సయీద్ ఖుద్రి (రజి) – బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

స్వర్గంలోని అనంతమైన వరాలను చూసి తృప్తిపడ్డ స్వర్గవాసుల్ని దైవప్రసన్నత అన్న బహుమానమిచ్చి సత్కరిస్తాడు సృష్టికర్త.

## పరలోకంలో దైవకారుణ్యం

(۹۸) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ لِلّٰهِ مِائَةَ رَحْمَةٍ فَمِنْهَا رَحْمَةٌ بِهَا يَتَرَاحَمُ الْخَلْقُ بَيْنَهُمْ وَ تِسْعَةٌ وَّتِسْعِيْنَ لِيَوْمِ الْقِيَامَةِ -

(مسلم عن سلمان الفارسی کتاب التوبہ - بخاری عن ابی ہریرہ کتاب الادب و کتاب الرقاق)

98. "అల్లాహ్ కరుణారసంలోని మొత్తం భాగాలు నూరు. ఆ కారుణ్యంలోని కేవలం ఒకే ఒక భాగం (1/100) ఫలితంగా సృష్టిలోని ప్రతి జీవి ఒక దానిపై మరొకటి పరస్పరం కరుణాకటాక్షాలను చూప గలుగుతోంది. (ఇక అల్లాహ్ కారుణ్యంలోని) మిగతా తొంభై తొమ్మిది

భాగాలు ప్రళయదినం నాడు బహిర్గతమవుతాయి" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

*(సల్మాన్ ఫార్సీ (రజి) – ముస్లిమ్; అబూహురైరా (రజి) – బుఖారి)*

**సంగ్రహణం :**

జిన్నులు, మానవులు, పశుపక్షాదులు వన్యమృగాలు, జలచరాలు వగైరాల జీవన సరళిని గురించి ఏ కొంచెం ఆలోచించినా, తల్లికి తన పిల్ల అంటే ఎంత ప్రేమో! ఓ పిచ్చుక అప్పుడే గ్రుడ్డునుండి బయటకు వచ్చి కళ్ళు తెరువని తన పసిపిల్లల నోటికి ఆహారాన్నెం దుకు అందిస్తోందో? పీడితులు, కష్టాల్లో, బాధల్లో చిక్కుకున్న వారిని చూడగానే వారిని ఆదుకోవాలి అని మనిషికి ఎందుకు అనిపిస్తోందో? బంధుమిత్రులు మనలను ఎడబాసి శాశ్వతంగా ఈ లోకం వదలిపోతున్నప్పుడు మన కళ్ళు చెమర్చి వాటినుండి జలజలా అశ్రువులు ఎందుకు కారిపోతాయో? ఒక్కటేమిటి, జీవితంలోని అన్ని రంగాల్లోను దయ, కరుణ, జాలి, ఇతరుల్ని ఆదుకోవడం, ప్రేమ వగైరాలన్నీ ఆ కృపాకరుడు, కరుణా మయుని కారుణ్యంలోని కేవలం వందవ వంతుకు సంబంధించినదే. ఆయన కరుణా రసంలోని మిగతా తొంభై తొమ్మిది భాగాలు ప్రళయం రోజున్నే ప్రత్యక్షం కాబోతున్నాయి.

## స్వర్గంలోనే కట్టడాల నిర్మాణం

(౯౯) عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قُلْتُ يَا رَسُوْلَ اللهِ مِمَّ خُلِقَ الْخَلْقُ؟
قَالَ مِنَ الْمَاءِ، قُلْنَا الْجَنَّةُ مَا بِنَاءُهَا؟ قَالَ لَبِنَةٌ مِنْ ذَهَبٍ
وَلَبِنَةٌ مِنْ فِضَّةٍ وَمِلَاطُهَا الْمِسْكُ الْأَذْفَرُ وَحَصْبَاؤُهَا
اللُّؤْلُؤُ وَالْيَاقُوْتُ وَتُرْبَتُهَا الزَّعْفَرَانُ مَنْ يَدْخُلُهَا يَنْعَمُ
وَلَا يَبْأَسُ وَيَخْلُدُ وَلَا يَمُوْتُ وَلَا تَبْلَى ثِيَابُهُمْ، وَلَا يَفْنَى
شَبَابُهُمْ. (مشكوة كتاب الفتن باب صفة الجنة واهلها)

99. హజ్రత్ అబూ హురైరా (రజి) దైవప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖిస్తున్నారు : "దైవప్రవక్తా! జీవజాలం అంతా దేంతో సృష్టించబడింది అని నేను దైవప్రవక్త (సఅసం)ను అడిగాను. "నీటితో

సృష్టించబడిందని" సెలవిచ్చారు. స్వర్గలోకపు కట్టడాలు దేనితో నిర్మించబడ్డాయని అడిగాను. దానికి ఆయన వెండి బంగారాల ఇటుకలతో అంటూ, "ఆ నిర్మాణంలో (ఇటుకల్ని ఒకదానిపై ఒకటి పేర్చడంలో) సువాసనలు వెదజల్లే కస్తూరి మట్టిని అడుసుగా వాడడం జరిగింది. అక్కడి (వాగులు, వంకలు, రోడ్లు ఇతర ప్రదేశాల్లో) గల గులకరాళ్ళన్నీ ముత్యాలు మణిమాణిక్యాలు. అక్కడి మట్టి సాఫ్రాన్ (కేసరి) లాగుంటుంది. (అంటే ఎంతో మృదువుగా ఉండి సువాసనలు వెదజల్లే పసుపు రంగుగల మట్టి అన్నమాట).

అందులో ప్రవేశించిన వాడు ఎన్నో సుఖభోగాల్ని అనుభవిస్తాడు. కష్టాలు కడగండ్లు అనేవి అతని దాపుకే రావు. అతడు చిరకాలం జీవించి ఉంటాడు. అతనికి మరణం లేదు. వారి బట్టలు పాతబడి పోవు. వారి యవ్వనం ఏనాడు తరగని యవ్వనం" అని సెలవిచ్చారు దైవప్రవక్త (సఅసం). *(అబూ హురైరా (రజి) – మిష్కాత్)*

**సంగ్రహణం :**

స్వర్గలోకపు కట్టడాల్లు, భవనాలు కర్రతోగాని, రాతితోగాని, మట్టి ఇటుకలతో గాని నిర్మించబడవు సరికదా కొన్ని స్వర్గాలు కేవలం బంగారు ఇటుకలతోనే నిర్మించబడి ఉన్నాయి. కొన్ని స్వర్గాలకు చెందిన కట్టడాలు కేవలం వెండి ఇటుకలు పేర్చి కట్టడం జరిగింది. మరికొన్ని కట్టడాలు వెండి, బంగారాల కలగలుపు ఇటుకలతో నిర్మించడం జరిగింది. ఇది కేవలం ఆ స్వర్గపు కట్టడాల్లో వైవిధ్యం ఉంచడానికే నిర్మించడం జరగవచ్చు.

"వారి యవ్వనం ఏనాడూ తరగని యవ్వనం" అంటే వారు సదా యువకులుగానే ఉండిపోతారు అని అర్థం. వారిపై వృద్ధాప్యం అన్నది రానే రాదు. మరో హదీసులో వారంతా ముప్పై ఏళ్ల ప్రాయం కలిగి ఉంటారు అని ఉంది.

## సమిష్టి దైవదర్శన భాగ్యం

١٠٠) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ فِي الْجَنَّةِ لَسُوْقًا
يَأْتُوْنَهَا كُلَّ جُمُعَةٍ فَتَهُبُّ رِيْحُ الشَّمَالِ فَتَحْثُوْ فِيْ وُجُوْهِهِمْ
وَثِيَابِهِمْ فَيَزْدَادُوْنَ حُسْنًا وَجَمَالًا فَيَرْجِعُوْنَ اِلٰى اَهْلِيْهِمْ

وَقَدِ ازْدَادُوْا حُسْنًا وَجَمَالًا فَيَقُوْلُ لَهُمْ اَهْلُوْهُمْ وَاللهِ
لَقَدِ ازْدَدْتُمْ بَعْدَنَا حُسْنًا وَجَمَالًا فَيَقُوْلُوْنَ وَاللهِ لَقَدِ
ازْدَدْتُمْ بَعْدَنَا حُسْنًا وَجَمَالًا۔ (مسلم عن انس كتاب الجنة)

100. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "స్వర్గంలో ప్రతి 'జుమా' (శుక్రవారం) రోజున స్వర్గ నివాసులు బజారుకు వస్తారు. (అంటే సదస్సులో పాల్గొంటారు). అప్పుడు ఉత్తర దిక్కునుండి ఓ గాలి వీస్తుంది. అది వారి ముఖాలపై (శరీరాలపై కూడా), వారి వస్త్రాలపై కస్తూరి, ఇతర సువాసనల్ని వెదజల్లుతుంది. (ఆ సదస్సు నుండి వెను తిరిగి) వారు తమ గృహాలకు వెళ్ళిన తరువాత ఇంటివారు, వారిని మునుపటి కంటే సుందరమైన శరీరధారులుగా గుర్తించి "దైవసాక్షి! ఇప్పుడు మీరు మునుపటికంటే అందంగా కనబడుతున్నారు" అని అంటారు. జవాబుగా అవును దేవుని సాక్షిగా మేము వెళ్ళిన తరువాత మీ అందం కూడా ఎంతో పెరిగిపోయింది అని అంటారు వారు. *(అనస్ (రజి) – ముస్లిమ్)*

**సంగ్రహణం :**

బజారు అంటే మనం వ్యాపారం చేయడానికి, వస్తువులు కొనుక్కోవడానికి వెళ్ళే బజారు కాదు. ఇక్కడ స్వర్గంలో బజారు అంటే స్వర్గవాసులు ప్రతి జుమా రోజున తమ ప్రభువును దర్శించుకోవడానికి హాజరయ్యే ఓ సభా ప్రాంగణం అని అర్థం.

'జుమా' అని అంటే వారంలోని ఓ నిర్ణీత కాల ప్రమాణం. ఎందుకంటే అక్కడ సూర్యుడు లేకపోవడం వల్ల మన ఈ ప్రపంచంలోని కాలమాన వ్యవస్థ అక్కడుండదు. మరి ఆ స్వర్గలోకపు కాలం, దినవారాల వ్యవస్థ ఎలా ఉంటుందో మనకు అంతుపట్టేది కాదు. దానికి సంబంధించిన అసలు యదార్థం పరలోకంలోనే బయటపడుతుంది.



# దైవవిశ్వాసం

## అల్లాహ్‌ను విశ్వసించడం అంటే...

(١٠١) عَنْ سُفْيَانَ بْنِ عَبْدِ اللهِ الثَّقَفِيِّ قَالَ قُلْتُ يَا رَسُولَ اللهِ قُلْ لِيْ
فِي الْإِسْلَامِ قَوْلًا لَا أَسْأَلُ عَنْهُ أَحَدًا بَعْدَكَ ؟
قَالَ قُلْ آمَنْتُ بِاللهِ ثُمَّ اسْتَقِمْ۔ (مسلم کتاب الایمان)

101. హజ్రత్ సుఫ్‌యాన్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) ఉల్లేఖనం.

"దైవప్రవక్తా! ఇస్లామ్ విషయమై, మరెవ్వరినీ అడగకుండా ఉండేటట్లు నాకు ఓ హితోపదేశం చేయండి" అని నేను మహాప్రవక్తకు విన్నవించుకోగా, ఆయన ఇలా సెలవిచ్చారు :

"నేను అల్లాహ్‌ను విశ్వసించాను అని పలుకు. ఆ తరువాత (దానిపై స్థిరంగా) నిలబడు." (ముస్లిమ్)

**సంగ్రహణం :**

"నేను అల్లాహ్‌ను విశ్వసించాను" అని అంటే, ఈ భూమ్యాకాశాలు, సమస్త విశ్వానికి యజమాని, కర్త, ఆరాధ్యుడు, పాలకుడు కేవలం ఒక అల్లాహ్‌యేనని, ఆయన కష్టాలను కడగండ్లను కడతేర్చేవాడని, అవసరాలను తీర్చేవాడని, సకలం ఆయన వల్లనే జరుగుతోందని; ఇంకా ఈ విశ్వంలో కేవలం ఆయన అధికారమే చెల్లుతుందన్న సిద్ధాంతాన్ని హృదయపూర్వకంగా నమ్ముతున్నానని అర్థం. ఈ సిద్ధాంతానికి అనుగుణంగానే జీవితంలోని ప్రతి ఘట్టంలోను, ప్రతి అంశంలోను అల్లాహ్ షరిఅత్‌నే (ధర్మశాస్త్రాన్నే) అవలంబిస్తానని ప్రతినబూనడం. ఆయన ఏ జీవన మార్గాన్నయితే తన గ్రంథం ద్వారా అవతరింపజేశాడో ఆ షరిఅత్ ఆదేశాలనే పాలిస్తానని, రవ్వంతయినా వెనకాడబోనని పలకడం.

స్థిరంగా నిలబడు' అని అంటే ఈ ఏకేశ్వరవాద సిద్ధాంతాన్ని ఎన్నడూ జవదాటకు, నీ బొందిలో ప్రాణమున్నంత వరకు అల్లాహ్ ఆదేశాలను పాలించడంలోనే లీనం అయి ఉండు, ఆయన ధిక్కారానికి సతతం దూరంగానే ఉండు అని అర్థం.

అల్లాహ్‌ను విశ్వసించాక ధైర్యంగా, స్థిరంగా ఉంటూ ఎల్లవేళలా ఆయన ఆదేశాల్ని పాలించడానికి సిద్ధంగా ఉండే వారు దైవానికి ప్రీతిపాత్రులు. వీరే 'అవులియా అల్లాహ్' అనడంలో సందేహం ఏముంది.

## దైవదాసులపై దేవుని హక్కు...?

(۱۰۲) عَنْ مُعَاذِ بْنِ جَبَلٍ قَالَ كُنْتُ رِدْفَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَيْسَ بَيْنِيْ وَبَيْنَهُ اِلَّا مُؤْخَرَةُ الرَّحْلِ، فَقَالَ يَا مُعَاذَ بْنَ جَبَلٍ! قُلْتُ لَبَّيْكَ يَا رَسُوْلَ اللهِ وَسَعْدَيْكَ، ثُمَّ سَارَ سَاعَةً، ثُمَّ قَالَ يَا مُعَاذُ بْنَ جَبَلٍ! قُلْتُ لَبَّيْكَ يَا رَسُوْلَ اللهِ وَسَعْدَيْكَ ثُمَّ سَارَ سَاعَةً ثُمَّ قَالَ يَا مُعَاذُ بْنُ جَبَلٍ! قُلْتُ لَبَّيْكَ يَا رَسُوْلَ اللهِ وَسَعْدَيْكَ قَالَ هَلْ تَدْرِيْ مَا حَقُّ اللهِ عَزَّ وَجَلَّ عَلَى الْعِبَادِ؟ قَالَ قُلْتُ: اَللهُ وَرَسُوْلُهُ اَعْلَمُ قَالَ فَاِنَّ حَقَّ اللهِ عَلَى الْعِبَادِ اَنْ يَعْبُدُوْهُ وَلَا يُشْرِكُوْا بِهٖ شَيْئًا. ثُمَّ سَارَ سَاعَةً ثُمَّ قَالَ يَا مُعَاذُ بْنُ جَبَلٍ! قُلْتُ لَبَّيْكَ يَا رَسُوْلَ اللهِ وَسَعْدَيْكَ قَالَ هَلْ تَدْرِيْ مَا حَقُّ الْعِبَادِ عَلَى اللهِ اِذَا فَعَلُوْا ذٰلِكَ؟ قُلْتُ اَللهُ وَرَسُوْلُهُ اَعْلَمُ قَالَ اَنْ لَّا يُعَذِّبَهُمْ ـ (مسلم كتاب الايمان. بخاری کتاب اللباس. کتاب الرقاق)

102. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి)ఉల్లేఖనం ఇలా ఉంది :

"నేను దైవప్రవక్త (సఅసం) వాహనంపై ఆయన వెనుకవైపు కూర్చొని ఉన్నాను. నాకు ఆయనకు నడుమ కేవలం వాహనంపై కూర్చోవడానికి కట్టే 'కజావా'కు సంబంధించిన భాగం మాత్రమే ఉంది. (అంటే అప్పుడు ఆయనకు నేను అత్యంత సమీపంలో కూర్చొని వున్నాను అన్నమాట).

దైవప్రవక్త నన్ను ఓ ముఆజ్! అని పిలిచారు.

సెలవియ్యండి మహాప్రవక్తా! మీ ఆదేశాన్ని శిరసావహించడానికి సిద్ధంగా ఉన్నాను నేను.

కొంత దూరం వెళ్ళాక మళ్ళీ, "ముఆజ్ బిన్ జబల్!" అని పిలిచా రాయన. ఆజ్ఞాపించండి దైవప్రవక్తా! దాసుడు సిద్ధంగానే వున్నాడు అన్నాను. (అయినా ఆయన ఏమీ మాట్లాడకుండా ఉండిపోయారు). మరికొంచెం దూరం వెళ్ళాక మళ్ళీ పిలిచారు, ఓ ముఆజ్ బిన్ జబల్ అని.

దైవప్రవక్తా! తమరు ఆదేశించండి. మీ ఆజ్ఞ శిరసావహించడానికి సిద్ధంగానే వున్నాను అని పలికాను. అప్పుడు ఆయన ఇలా అడిగారు :

"అల్లాహ్‌కు తన దాసులపై వున్న హక్కేమిటో తెలుసా?" అని. "లేదు, దేవుడికి, దైవప్రవక్త (సఅసం)కే అది బాగా తెలుసు" అని విన్నవించు కున్నాను. దానికి ఆయన, "దేవునికి తన దాసులపై వున్న హక్కు ఏమిటంటే వారు ఆయన్నే ఆరాధించాలి. ఆయనకు మరెవ్వరినీ సహవర్తులుగా నిలబెట్టకూడదు."

మరికొంతదూరం వెళ్ళాక తిరిగి పిలిచారు, "ఓ ముఆజ్ బిన్ జబల్" అని. దాసుడు సిద్ధంగానే వున్నాడు, సెలవియ్యండి దైవప్రవక్తా! అని అన్నాన్నేను.

"మరి ఆయన్నే ఆరాధిస్తూ, ఆయనకు సహవర్తులుగా ఎవ్వరినీ నిలబెట్టకపోతే దేవునిమీద ఆ దాసులకు గల హక్కేమిటో నీకు తెలుసా?" అని అడిగారు.

"అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు" అని అన్నాన్నేను. అప్పుడాయన ఇలా సెలవిచ్చారు : "వారి హక్కేమిటంటే వారిని శిక్షించ కుండా ఉండటమే." *(బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

కేవలం అల్లాహ్‌నే ఆరాధించనంతమటుకు ఆయనకు సాటి కల్పించనంతమటుకు ప్రళయం రోజున మనిషి నరకాన్ని తప్పించుకోలేడు. అల్లాహ్‌ను ఆరాధించడం అంటే సకల పూజలకు, మ్రొక్కులకు, సాగిలపడడానికి, ప్రదక్షిణకు కేవలం అల్లాహ్ ఒక్కడే అర్హుడని, జీవితంలోని వ్యక్తిగత, సామూహిక విషయాల్లోను ఆయన ఆజ్ఞలనే పాటించాలని అర్థం. ఈ ఆరాధన ఆయన తప్ప మరెవ్వరికోసం కాకుండా ఉండాలి.

## విశ్వాసం సానుభూతి కోసం కావలసినవి

(۱۰۳) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَجِدُ اَحَدٌ حَلَاوَةَ الْاِيْمَانِ

حَتّٰى يُحِبَّ الْمَرْءَ لَا يُحِبُّهُ اِلَّا لِلّٰهِ

وَحَتّٰى اَنْ يُّقْذَفَ فِى النَّارِ اَحَبُّ اِلَيْهِ مِنْ اَنْ يَّرْجِعَ اِلَى الْكُفْرِ

بَعْدَ اِذْ اَنْقَذَهُ اللّٰهُ

وَحَتّٰى يَكُوْنَ اللّٰهُ وَرَسُوْلُهُ اَحَبَّ اِلَيْهِ مِمَّا سِوَاهُمَا

(بخاری عن انس کتاب الادب باب الحب فی اللہ)

103. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

విశ్వాస మధురిమను గ్రోలాలంటే మనిషిలో ఈ మూడు గుణాలుండడం అవసరం. అవి :

1. అతడు అల్లాహ్ ప్రీతికోసమే ఓ తోటి ముస్లిమ్‌ను ప్రేమించాలి. 2. అవిశ్వాసం (కుఫ్ర్) నుండి అల్లాహ్ అతణ్ణి రక్షించిన తరువాత తిరిగి ఆ కుఫ్ర్ వైపుకు మరలడం కంటే తాను అగ్నిలో పడిపోవడాన్నే కోరుకున్నవాడు. 3. అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను అన్నిటికంటే మిన్నగా ప్రేమించేవాడు. *(అనస్ (రజి) – బుఖారి)*

**సంగ్రహణం:**

అల్లాహ్ ప్రీతి కోసమే అతడు తోటి ముస్లిమ్‌ను ప్రేమిస్తాడు అని అంటే అతడు స్వార్థంకోసం, స్వప్రయోజనం కోసం స్నేహం చేయడు. దైవారాధనలో చిత్తశుద్ధితో మెలిగేవాడు దైవాదేశాలను తన శక్తి వంచన లేకుండా పాటించే తోటి ముస్లిమ్‌తో తన మిత్రత్వాన్ని కొనసాగిస్తాడని అర్థం. అదేవిధంగా ఆ మిత్రునిగా చేసుకున్న వ్యక్తి దైవధిక్కారిగాని, దైవాదేశాలను పెడచెవిన పెట్టేవాడుగా గాని ఉండకూడదు. అతడు దైవధర్మం వ్యాప్తిలో తనతో సహా కలసి కృషి చేసేవాడై ఉంటాడని అర్థం.

అల్లాహ్ ధర్మ వ్యాప్తికోసం, మంచిని పెంచి చెడుల్ని త్రుంచే కృషి చేసే వారంతా ఆ దైవం కోసం పరస్పరం ప్రేమానురాగాలతో మెలుగుతారు. వారి నడుమ ఉండే సంబంధాలు ఎంతో సజావుగా ఉంటాయి.

రెండో గుణం గురించి చెప్పాలంటే ఆ వ్యక్తి 'కుఫ్ర్' (దైవధిక్కారం) అనగానే ఏవగించుకుంటాడు. అతణ్ణి ఎవరైనా, దైవధిక్కారాన్ని (కుఫ్ర్)ను అవలంబించు లేకుంటే ధగధగ మండే ఈ అగ్నిలో పడవేయబడతావు అని బెదిరిస్తే అప్పుడతడు ఎంతో శాంతంగా, ఈ దైవతిరస్కారం, ధిక్కార మార్గంపై నడిచే దానికంటే ఈ అగ్ని గుండంలో పడడమే మేలు అని కోరుకుంటాడు. మూడో సుగుణం ఏమిటంటే అతడు దైవం, దైవప్రవక్త అంటే ఎనలేని అభిమానాన్ని ప్రదర్శిస్తాడు. వారి ఆదేశాల్ని ఎన్ని కష్టనష్టాలకు లోనైనా సరే పకడ్బందీగా శిరసావహిస్తాడు. దైవానికి, దైవప్రవక్తకు అయిష్టమైన పనులన్నింటిని వదిలేస్తాడు. ఏ వ్యక్తిలో పై మూడు సుగుణాలుంటాయో అతని హృదయం అతని ఆత్మ విశ్వాస మాధుర్యాన్ని గ్రోలుతుంది. దేవుని మార్గంలో వచ్చే అడ్డంకులను, కష్టనష్టాలను ఎదుర్కోవడంలో అతడు ఆనందానుభూతిని పొందుతాడు.

## పరిపూర్ణ విశ్వాసానికి గురుతు

(۱۰۴) عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّهُ قَالَ: مَنْ اَحَبَّ لِلّٰهِ وَاَبْغَضَ لِلّٰهِ وَاَعْطٰى لِلّٰهِ وَمَنَعَ لِلّٰهِ فَقَدِ اسْتَكْمَلَ الْاِيْمَانَ

(ابوداؤد عن ابی امامہ کتاب السنہ)

104. "ఒకరితో స్నేహంగాని, మరొకరితో తెగతెంపులు గాని కేవలం అల్లాహ్ కోసమే చేసే వ్యక్తిలో (అలాగే) తన ధనాన్ని ఖర్చు పెట్టడంలో, ఖర్చుపెట్టకపోవడంలో అల్లాహ్ ఆదేశాల్నే శిరసావహించే వ్యక్తిలోగల విశ్వాసం పరిపూర్ణమయిన విశ్వాసం అనడంలో సందేహం లేదు" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(అబీ ఉమామ (రజి) - అబూ దావూద్)

**సంగ్రహణం :**

మోమిన్ (విశ్వాసి) జీవిత పరమార్థం కేవలం దైవాన్ని సంతుష్టిపరచడమే. అతడు ఒకరి మెప్పునుగాని, సత్కార్యాన్ని గాని కోరడు. ఒకరితో స్నేహం చేస్తే ఆ స్నేహంలో అతని స్వప్రయోజనం ఏదీ ఉండదు. దైవధర్మోన్నతే అతని లక్ష్యం. ఒకరి నుండి విడిపోయినా, తెగతెంపులు చేసుకున్నా తన సొంత లాభం కోసమో, స్వార్థం కోసమో కాదు. కేవలం దైవప్రీతిని దృష్టిలో ఉంచుకునే అలా చేస్తాడు. తాను కష్టపడి సంపాదించిన ధనం, ఎప్పుడు, ఎక్కడ, ఎంత ఖర్చుచేయాలో, ఆ ఖర్చు చేయడంలో దేవుని ఇష్టాలకే ప్రాధాన్యత ఇస్తాడు. ఈ విషయంలో అతడు అల్లాహ్ ధర్మశాస్త్రానికి బద్ధుడై, ఎలాంటి ప్రదర్శనా బుద్ధి

లేకుండా కేవలం దైవాభీష్టాన్నే దృష్టిలో ఉంచుకుంటాడు. అదేవిధంగా దైవక్రోధం వ్యక్తమయ్యే ఏ కార్యక్రమంలోను తన జేబులో నుండి చిల్లిగవ్వనైనా ఖర్చు పెట్టడు.

## దైవనామ స్మరణ (జిక్ర్)

(۱۰۵) عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَذْكُرُ اللّٰهَ عَلٰى كُلِّ اَحْيَانِهِ .. (مسلم کتاب الحیض)

105. దైవప్రవక్త (సఅసం) సతతం అల్లాహ్‌ను స్మరిస్తూ ఉండేవారని హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఉల్లేఖించారు. (ముస్లిమ్)

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం) జీవితమంతా దైవాదేశపాలనలోనే, దైవ నామ స్మరణలోనే గడిచిపోయింది. ఆయన అనుక్షణం, ప్రతి సందర్భంలోనూ రకరకాలుగా దైవాన్ని స్మరించేవారు. అంతెందుకు, ఆయన తన కాలకృత్యాలను తీర్చుకోవడానికి వెళ్ళేటప్పుడు, తిరిగి వచ్చేటప్పుడు కూడా దైవాన్నే స్మరించేవారు. దైవనామస్మరణ, ఆయన్ను వేడుకునే దృష్టితో ఆయన సచ్చరితాన్ని అధ్యయనం చేస్తే, సతతం ఆయన దైవాన్నే వేడుకుంటూ ఉండేవారని దైవాన్నే స్తోత్రించేవారని, స్మరించేవారన్న విషయం మనకు తెలుస్తుంది.

## జిక్ర్ (దైవనామస్మరణ)కు లభించే పారితోషికం

(۱۰۶) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اللّٰهُ عَزَّ وَجَلَّ
أَنَا عِنْدَ ظَنِّ عَبْدِيْ بِيْ، وَأَنَا مَعَهُ حِيْنَ يَذْكُرُنِيْ، اِنْ ذَكَرَنِيْ
فِيْ نَفْسِهٖ ذَكَرْتُهُ فِيْ نَفْسِيْ، وَاِنْ ذَكَرَنِيْ فِيْ مَلَإٍ ذَكَرْتُهُ فِيْ
مَلَإٍ هُمْ خَيْرٌ مِنْهُمْ، وَاِنْ تَقَرَّبَ اِلَيَّ شِبْرًا تَقَرَّبْتُ اِلَيْهِ
ذِرَاعًا، وَاِنْ تَقَرَّبَ اِلَيَّ ذِرَاعًا تَقَرَّبْتُ مِنْهُ بَاعًا. وَاِنْ
أَتَانِيْ يَمْشِيْ اَتَيْتُهُ هَرْوَلَةً۔

(مسلم عن ابی ہریرہ۔ کتاب الذکر و الدعاء مسند احمد نمبر ۷۴۱۶ بخاری کتاب التوحید)

106. "దేవుడు ఇలా సెలవిస్తున్నాడు" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు: "నా దాసుడు నా గురించి ఎలా తలపోస్తాడో నేనూ అతడి పట్ల అలాగనే మెలుగుతాను. అతడు నన్ను స్మరించినప్పుడు నేనతని వెంటనే ఉంటాను. అతడు తన మనస్సులోనే నన్ను స్మరిస్తే నేను నా మనస్సులోనే అతణ్ణి తలచుకుంటాను. ఉత్తములైన వారి బృందంలో నన్ను అతడు నా గురించి చెప్పుకుంటే నేను అంతకంటే ఉత్తములైన వారి బృందంలో అతడి గురించి పొగుడుతాను. అతడు ఓ జానెడు దూరం నాకు చేరువయితే నేను అతనికి ఓ మూరెడు దూరం చేరువవుతాను. అదే అతడు నా వైపుకు ఓ మూరెడు దూరం జరిగితే నేను అతని వైపుకు ఓ 'బాఅ' (షుమారు ఆరున్నర అడుగుల దూరం) వరకు అతనికి దాపుగా వస్తాను. అతడు నా వైపుకు నడిచివస్తే నేను అతని వైపుకు పరుగిడుతూ వస్తాను." *(అబూ హురైరా (రజి) - ముస్లిమ్, ముస్నద్ అహ్మద్, బుఖారి)*

**సంగ్రహణం :**

అల్లాహ్ సెలవిచ్చిన దానికి అర్థం ఏమిటంటే నేను నా దాసుణ్ణి ఎలాంటి ఆధారం లేకుండా వదిలిపెట్టను. అతణ్ణి ఆదుకుంటూనే ఉంటాను. సతతం నా కారుణ్య కటాక్షాలు అతణ్ణి అంటిపెట్టుకునే ఉంటాయి అని. ఏకాంతంలో హృదయపూర్వకంగా ప్రేమతో నన్ను తలచుకున్న వారికి నేనిచ్చే పారితోషికం ఏమిటో ఎవరూ ఊహించలేరు.

అతడే ఉత్తములైన సత్పురుషుల సమూహంలో నా గురించి చర్చిస్తే అతడి గురించి నేను అంతకంటే ఉత్తములు సచ్ఛీలురు అయిన ఫరిష్తాల (దైవదూతల) సమూహంలో అతణ్ణి పొగిడిన వానిగా చేసుకుంటాను.

నా దాసుడు నాకు దాపుకు రావడంలో, నా ఆదేశ పాలనలో ఎంత కృషి సలుపుతాడో అంతకంటే అధికంగా అతనిపై నా కారుణ్య కటాక్షాలు వర్షిస్తాయి. అల్లాహ్‌ను స్మరించడం అంటే, దేవుని కోసం భక్తుడు తన సార్వభౌమత్వాన్ని వదిలేసుకోవడం. ఎల్లవేళలా ఆయన ఆదేశాల్నే పాలించడం. నోరు ఆయన గురించే స్తోత్రించడం. హృదయం ఆయన ఎడల ప్రేమాతిశయంతో పెల్లుబుకటం. సతతం దైవాన్ని స్మరించే వారు ఆయన కారుణ్య కటాక్షాలకు దూరం కాజాలరు.

అయితే ఆయనకు దగ్గరపడదానికి, ఆయన అనురాగాన్ని బడయటానికి భక్తుడు ఎంతమటుకు కృషి చేస్తున్నాడు? ఆయన చూపిన రుజుమార్గం అయిన ఇస్లామ్ వ్యాప్తికోసం ఎంతవరకు ప్రయత్నిస్తున్నాడు అన్నదే ఇక్కడ కావలసింది. నా భక్తుడు నా గురించి ఎలా తలపోస్తాడో నేను కూడా అతడి గురించి అలానే మెదలుతాను అని అంటే

అతడు నా గురించి సదుద్దేశ్యంతో ఉంటేనే నేనతనిపై నా కారుణ్యం కురిపిస్తాను. అలా కాకుండా అతడు నా గురించి ఆశలు వదుకుంటే నేను కూడా అతణ్ణి మరిచిపోతాను అని అర్థం.

ఈ లోకాన్ని వదిలిపోయేటప్పుడు అల్లాహ్ కరుణా కటాక్షాలపై అచంచలమైన ఆశలు పెట్టుకోవడమే మనిషికి కావలసింది. అతని బాగోగులు, అతని సంక్షేమం కోసం కావలసింది కూడా ఇదే. తన పాపాల గురించి పశ్చాత్తాపపడి, మన్నింపును కోరుతూ 'తౌబా' చేసే అవకాశమే లభిస్తే, దాసుడు తన పాపాల్ని అల్లాహ్ మన్నించి వేశాడని, తనను క్షమించేవాడని తలపోయాలి. అల్లాహ్ సన్నిధిలో దీనంగా దోసిలొగ్గి వేడుకునేటప్పుడు, ఆయన తన ప్రార్థనను ఆలకిస్తున్నాడని, దాన్ని పూర్తిగా మన్నిస్తాడనే పూర్తి నమ్మకంతో ఉండాలి.

## 'జిక్ర్' ప్రాముఖ్యత

(١٠٧) قال رسول الله صلى الله عليه وسلم إن لله ملائكة سياحين
في الأرض فضلا عن كتاب الناس فإذا وجدوا قوما يذكرون
الله تنادوا هلموا إلى بغيتكم فيجيئون فيحفون
بهم إلى السماء الدنيا فيقول الله
أي شيء تركتم عبادي يصنعون ؟
فيقولون تركناهم يحمدونك ويمجدونك و
يذكرونك
فيقول: هل رأوني
فيقولون: لا
فيقول: فكيف لو رأوني
فيقولون: لو رأوك لكانوا أشد تحميدا وتمجيدا
وذكرا۔
فيقول: فأي شيء يطلبون ؟
فيقولون: يطلبون الجنة

فَيَقُوْلُ: وَهَلْ رَأَوْهَا؟
قَالَ فَيَقُوْلُوْنَ: لَا
فَيَقُوْلُ: فَكَيْفَ لَوْ رَأَوْهَا؟
فَيَقُوْلُوْنَ: لَوْ رَأَوْهَا كَانُوْا اَشَدَّ عَلَيْهَا حِرْصًا وَاَشَدَّ طَلَبًا
قَالَ فَيَقُوْلُ: وَمِنْ اَيِّ شَيْءٍ يَتَعَوَّذُوْنَ؟
فَيَقُوْلُوْنَ مِنَ النَّارِ
فَيَقُوْلُ: وَهَلْ رَأَوْهَا؟
فَيَقُوْلُوْنَ: لَا
قَالَ فَيَقُوْلُ: فَكَيْفَ لَوْ رَأَوْهَا؟
فَيَقُوْلُوْنَ: لَوْ رَأَوْهَا كَانُوْا اَشَدَّ مِنْهَا هَرَبًا وَاَشَدَّ مِنْهَا خَوْفًا
قَالَ فَيَقُوْلُ: اِنِّيْ اُشْهِدُكُمْ اَنِّيْ قَدْ غَفَرْتُ لَهُمْ
قَالَ فَيَقُوْلُوْنَ: فَاِنَّ فِيْهِمْ فُلَانًا الْخَطَّاءَ لَمْ يُرِدْهُمْ اِنَّمَا جَاءَ لِحَاجَةٍ
فَيَقُوْلُ: هُمُ الْقَوْمُ لَا يَشْقٰى بِهِمْ جَلِيْسُهُمْ

(مسند احمد عن ابی ہریرۃ نمبر ۷۴۱۸ - بخاری کتاب الدعوات مسلم کتاب الذکر)

107. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "కర్మల చిట్టా రాసే దైవదూతలే కాకుండా మరికొందరు దైవ దూతలు ఈ భూమండల పర్యటన కోసం బయలుదేరుతారు. (వారి ఈ పర్యటన సార్థకమైన పర్యటన అయి ఉంటుంది. వాళ్ళు అల్లాహ్‌ను స్మరించే (జిక్ర్‌చేసే) వారి బృందాలెక్కడున్నాయా అని ఈ భూమిలోని ప్రతి ప్రదేశాన్ని వెతుకుతూ ఉంటారు). దైవనామ స్మరణలో లీనమై ఉండేవారిని కనుగొని, వారు

పరస్పరం ఒకరిని ఒకరు కేకలేసి, "రండి, మీ కోరిక ఈడేరింది" అని పిలుస్తారు. ఈ పిలుపు విని అక్కడ చేరిన దైవదూతలంతా తమ ఉజ్వలమైన రెక్కలతో ఆ ప్రదేశాన్ని, అక్కడి ఆకాశాన్నంతా కప్పేస్తారు. (అక్కడి నుండి దైవసన్నిధికి వెళ్ళిన తరువాత)

(అల్లాహ్‌కు తన దాసుల గురించి వారికంటే బాగా తెలుసు. అయినా) అల్లాహ్ వారిని అడుగుతాడు, "ఎక్కడి నుండి వస్తున్నారు? నా భక్తులను ఏ పరిస్థితిలో వదిలివచ్చారు?" అని.

"దైవదూతలు (మేము భూమండలాన్ని పర్యటించి వస్తున్నాం). అక్కడ నీ భక్తులు నీ గుణగణాల గురించి కీర్తిస్తూ ఉండగా, నీ ఔన్నత్యాన్ని కొనియాడుతూ ఉండగా, నీ నామాన్ని స్మరిస్తూ ఉండగా చూశాం" అని విన్నవించుకుంటారు.

వారు నన్ను చూశారా? అని అడుగుతాడు అల్లాహ్.

'లేదు' అని బదులిస్తారు దైవదూతలు.

"ఓ నా దూతల్లారా! నా భక్తులే నన్ను చూసి ఉన్నట్లైతే వారి పరిస్థితి ఎలా ఉండి ఉండేది?" అని అడుగుతాడు అల్లాహ్. దానికి దైవదూతలు, "అప్పుడు తమ ఔన్నత్యాన్ని మరింత కొనియాడేవారు, మిమ్ములను స్తుతించడంలో మరింత ముందుండేవారు. మీ నామస్మరణ చేయడానికి మరింత ఉత్సాహం చూపేవారు" అని అంటారు.

ఆ తరువాత వారితో, "వారు కోరేదేమిటి?" అని అడుగుతాడు.

"నీ స్వర్గాన్ని కోరుతున్నారు" అని విన్నవించుకుంటారు ఆ దైవదూతలు.

"దాన్ని వారు చూశారా?" అని అడగ్గా,

"లేదు" అని బదులిస్తారు వారు.

దాన్ని గనక వారు తమ కళ్ళతో చూసి ఉంటే వారి వైఖరి ఎలా ఉండేది? అని అడుగుతాడు.

"వారే గనక దాన్ని చూసి ఉంటే దాన్ని పొందాలన్న వారి కోరిక

మరింత పెరిగిపోయేది" అని బదులిస్తారు ఆ దూతలు.

"అయితే వారు దేన్నుండి శరణు కోరుతున్నారు?" అని అడుగుతాడు అల్లాహ్.

"నరకాగ్ని నుండి శరణు కోరుతున్నారు" అని బదులిస్తారు వారు.

"మరి ఆ నరకాన్ని చూశారా వారు?" అని అడగ్గా,

"లేదు" అని బదులిస్తారు దైవదూతలు.

"దాన్నే వారు తమ కళ్ళతో చూసి ఉంటే వారి పరిస్థితి ఎలా ఉండేది?" అని అడుగుతాడు.

"మహాప్రభూ! ఆ నరకాగ్నినే వారు చూసి ఉంటే అదంటేనే భయపడి పోయేవారు. దాన్నుండి తప్పుకోవడానికి మరింత ప్రయత్నం చేసేవారు" అని అంటారు.

ఈ సంభాషణ అంతా జరిగాక, అల్లాహ్ (దైవదూతలతో) ఇలా అంటాడు:

"మీరే సాక్షులు, వారందరినీ నేను మన్నించివేశాను" (అంటే వారికి స్వర్గంలో స్థానం కల్పించాను, నరకం నుండి కూడా రక్షణ కల్పించాను). అప్పుడు దైవదూతలు అడుగుతారు, "ప్రభూ! వారిలో ఫలానా వాడు (పాపి) కూడా ఉన్నాడు. అతడు ఆ జిక్ర్ బృందంలో సదుద్దేశ్యంతో చేరలేదు తన సొంత పని మీద అక్కడికి వచ్చి కూర్చున్నాడు (వాడి గురించి ఏమిటి?)" అని అడుగుతారు.

"పోనీండి! ఆ సత్సమావేశంలో చేరినవాడు ఎవరైనా సరే, కేవలం అందులో చేరినంత మాత్రాన ఆ బహుమానాలకు అర్హుడైపోతాడు" అని సెలవిస్తాడు అల్లాహ్.

(అబూ హురైరా (రజి) – బుఖారి, ముస్లిమ్, ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

1. దైవదూతలు అల్లాహ్ నామస్మరణ చేసేవారిని వెదకడానికి భూమండలంలోని ప్రతి స్థలాన్ని శోధిస్తూ ఉంటారు.

2. అల్లాహ్ తన నామాన్ని స్మరించే వారిని, తనను స్తోత్రించేవారిని, తన ఔన్నత్యాన్ని కొనియాడే వారిని అత్యంత ప్రీతిపాత్రులుగా చూస్తాడు.

3. స్వర్గాన్ని కోరుకోవడం, నరకం నుండి శరణు కోరడం అనేది తక్వా (దైవభీతి) మరియు ఆధ్యాత్మిక చింతనకు వ్యతిరేకం కాదు.

4. జిక్రుల్లాహ్ (అల్లాహ్ నామస్మరణ) లోని పదజాలంలో గల అర్థం ఇది.

అ) సుబ్హానల్లాహ్ : అల్లాహ్, ప్రతి లోపానికి, ప్రతి బలహీనతకు అతీతుడు, పరిశుద్ధుడు అని ప్రకటిస్తున్నానని చెప్పడం.

ఆ) అల్‌హమ్‌దులిల్లాహ్ : సకల స్తోత్రాలు అల్లాహ్‌కే. ఆయన నాకొసగిన ప్రత్యక్ష, పరోక్ష వరాలు, భాగ్యాల గురించి నేను ఆయనకు కృతజ్ఞుడై ఉన్నానని చెప్పడం.

ఇ) లా ఇలాహ ఇల్లల్లాహ్ : అల్లాహ్ తప్ప మరే దేవుడుగాని, పూజలకు అర్హుడుగాని, పాలకుడుగాని లేడు. ప్రతి సంకటాన్ని దూరం చేసేవాడు ఆయనే. నా సకల అవసరాలు తీర్చేవాడు ఆయనే. ఆయనే నా యజమాని, నా ప్రభువు. మేమంతా ఆయన దాసులం, పాలితులం అని చాటడం.

ఈ) అల్లాహు అక్బర్ : అల్లాహ్‌యే అందరికంటే ఉన్నతుడు, ఈ విశ్వంలో మరెవ్వరికీ ఆ ఔన్నత్యం లేదు. లోకాలన్నీ ఆయన ముందు మోకరిల్లి ఉన్నవే.

ఉ) లాహౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్ : అల్లాహ్ సహాయం, ఆయన ఊతం లేనిదే మనిషి పాపాల నుండి, తప్పుల నుండి రక్షింపబడలేడు. పుణ్యకార్యాలు చేయలేడు.

ఊ) సుబ్హానల్లాహి వ బిహమ్‌దిహీ : అల్లాహ్ గుణగణాలను కీర్తిస్తూ, ఆయన ప్రతి లోపానికి, బలహీనతకు అతీతుడు అని చాటి చెప్పడం.

5. దైవగ్రంథ పారాయణం, దాన్ని సాలోచనగా అధ్యయనం చేయడం, ఆ గ్రంథాన్ని అనువదించడం, వ్యాఖ్యానం రాయడం, బోధించడం కూడా జిక్ర్ (దైవనామ స్మరణ) క్రిందికే వస్తాయి. దాన్ని అనుసరిస్తూ ఇతరులను అనుసరించమని పిలుపునిచ్చే వారు కూడా జిక్ర్ చేస్తున్నట్లే. అదేవిధంగా అల్లాహ్‌కు భయపడుతూ పూర్తి ఏకాగ్రతతో నమాజు చేస్తున్న (అది ఫర్జు నమాజు అయినా, నఫిల్ నమాజు అయినా) వారు కూడా జిక్ర్ చేస్తున్నట్లే.

6. దివ్య ఖుర్‌ఆన్‌లో, హదీసుల్లో, అల్లాహ్‌ను స్మరించే వారిని పొగడడం జరిగింది. అయితే ఈ జిక్ర్ చేసే విషయంలో కొన్ని మర్యాదల్ని పాటించడం అవసరం. ఈ

షరతుల్ని, మర్యాదల్ని కాదని జిక్ర్ (దైవనామస్మరణ) చేసేవారు ఈ హదీసులో చెప్పిన భాగ్యానికి నోచుకోలేరు. ఆ మర్యాదలు ఇలా ఉన్నాయి:

1) దైవప్రవక్త (సఅసం) ఏ ఏ జిక్ర్‌లను తమ నిత్యకృత్యాలుగా చేసుకున్నారో ఆ జిక్ర్ పదాలనే, ఆ ప్రకారమే, వాటి సంఖ్యావరంగానే ఆచరించాలి. ఆయా సమయాలను కూడా దృష్టిలో ఉంచుకునే దైవ నామస్మరణ చేస్తూ వుండాలి.

2) దైవ నామ స్మరణలో పలికే పదాలను వాటి అర్థం, భావం ఏమిటో తెలియకుండా నోటితో పలుకకూడదు. పూర్తి అవగాహనతో, అర్థం చేసుకుంటూ మరీ చేయాలి. నోటితో పలికే ప్రతి పలుకు హృదయాన్ని, మేధను ప్రభావితం చేస్తుంది అన్న నిజాన్ని మరువకూడదు. మొత్తానికి ఏకాగ్రతతో జిక్ర్ చేయాలి.

3) ధర్మసమ్మతంగాని (హరాం) సంపాదనను పూర్తిగా విడనాడాలి. అంతేకాదు, అలాంటి అధర్మ, ఉపాధి మార్గాలన్నిటిని విడనాడాలి.

4) జిక్ర్‌ను జీవితంతో ముడివేయడం ఎంతో అవసరం. పాపాల్లో మునిగి దైవధిక్కారం చేసే వారికి ఈ హదీసులో చెప్పిన స్థాయిగాని, భాగ్యంగాని లాభించవు. నోటితో చేసే అల్లాహ్ స్మరణ, ఆయన ఒసగిన భాగ్యాలు, వరాలకు చెప్పే కృతజ్ఞతే. మనిషి తన జీవితంలో, దేవుడంటే లెక్కచేయకపోవడం, నిర్లిప్తత, తనకు ఒసగిన భాగ్యాలకు ఎలాంటి విలువ నివ్వకపోవడం, ఆయన ఎడల అవిధేయత జూపడం లాంటి విషయాలను పూర్తిగా విడనాడవలసి ఉంటుంది. మనిషి తాను అవలంబించే ప్రతి పనిలోను ప్రతి కార్యరంగంలోను దేవునికి విధేయులై ఉండాలి. అప్పుడే తన నోటితో చేసే జిక్ర్‌కు పైన చెప్పిన ప్రయోజనాలు లభిస్తాయి. ఇందులో సందేహం లేదు. అయితే ఓ ప్రక్క ఈ హదీసుల్లో చెప్పిన ప్రకారం జిక్ర్ చేస్తూ మరో ప్రక్క తమ దైనందిన కార్యకలాపాల్లో అల్లాహ్ చేసిన చట్టాలను, ఆయన ఆదేశాలను బహిరంగంగా ధిక్కరించేవారున్నారు. ఇలా పిచ్చివాళ్ళు మాత్రమే చేస్తారు.

## జిక్ర్ ఆత్మకు ఆహారం

(١٠٨) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَثَلُ الَّذِي يَذْكُرُ رَبَّهُ وَالَّذِي لَا يَذْكُرُ رَبَّهُ مَثَلُ الْحَيِّ وَالْمَيِّتِ.

(بخاری عن ابی موسیٰ کتاب الدعوات)

108. "తన పోషణకర్త అయిన దేవుణ్ణి స్మరించేవాడు సజీవుడు, స్మరించని వాడు నిర్జీవుల్లాంటి వారు" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

**సంగ్రహణం :**

దైవనామస్మరణ ఆత్మకు అన్న పానీయాల్లాంటిది. దానివల్ల ఆత్మకు ఆనందం, మధురానుభూతి లభిస్తాయి. భౌతికమయిన ఈ శరీరాన్ని వదిలి ఆత్మ ఊర్ధ్వలోకాలకు చేరినప్పుడు అక్కడ దానికి ఆహ్వానం పలకడం జరుగుతుంది. అది అక్కడి వారికి సుపరిచితమైనదై ఉంటుంది. ఇక దేవుణ్ణి అసలే స్మరించని వ్యక్తుల ఆత్మలు మలినమైన ఆత్మలు. పాపాల్లో నిండా మునిగిపోయి ఉండడం వల్ల, దేవుడంటే నిర్లక్ష్యంగా ఉండడంవల్ల అవి మరింత బలహీనమై నీరసించి ఉంటాయి. మరణానంతరం ఇలాంటి ఆత్మలకు ఆకాశాన స్వాగతం లభించదు. సరికదా తిరిగి క్రింద భూమి వైపునకు నెట్టివేయ బడతాయి. నేరస్థుల్ని బంధించినట్లు వాటిని కూడా బంధించడం జరుగుతుంది.

అల్లాహ్ నామస్మరణ (జిక్ర్) గురించి ఉత్సుకత చూపేవారికి దైవప్రవక్త (సఅసం) ఉపదేశించిన కొన్ని దైవనామస్మరణ పదాలు ఈ క్రింద ఇవ్వడం జరిగింది. నిత్యం వాటిని ఆయా సమయాల్లో జపిస్తూ ఉండాలి.

1. రాత్రి నిదురకు ఉపక్రమించేటప్పుడు : అల్లాహు అక్బర్ 34 సార్లు, సుబ్హానల్లాహ్ 33 మార్లు, అల్‌హమ్‌దులిల్లాహ్ 33 మార్లు పలకాలి. (బుఖారి)
2. సుబ్హానల్లాహి వ బిహమ్‌దిహీ : ఉదయం, సాయంత్రం వందేసిమార్లు. (బుఖారి, ముస్లిమ్)
3. లా ఇలాహ ఇలల్లాహ్ వహ్‌దహూ లాషరీక లహూ, లహుల్ ముల్‌కు వలహుల్ హమ్‌దు వహువ అలాకుల్లి షైఇన్ ఖదీర్.
4. సుబ్హానల్లాహి, వల్ హమ్దులిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్. (ముస్లిమ్)
5. లాహౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్. (బుఖారి)
6. సుబ్హానల్లాహి వబిహమ్దిహి, సుబ్హానల్లాహిల్ అజీమ్. (బుఖారి)

   దైవప్రవక్త (సఅసం) పైన చూపిన క్రమ సంఖ్య 4, 5, 6లో చెప్పిన దైవనామ స్మరణ పదాల కోసం ఓ ప్రత్యేకమయిన సమయాన్నిగాని, ఓ ప్రత్యేకమైన సంఖ్యను గాని నిర్ణయించలేదు. అయితే ఆయన, ఈ పదాలు అల్లాహ్‌కు ఎంతో ఇష్టమైనవి అని మాత్రం సెలవిచ్చారు.

   జిక్ర్ చేయాలని కోరుకునేవారు పై మూడు స్మరణ పదాలను లేక వాటిలో ఏదో ఒకదాన్ని తమకు సాధ్యం అయ్యే సంఖ్యను నిర్ణయించుకుని నిత్యం స్మరించినా తప్పుకాదు.

7. ప్రతి నమాజు అనంతరం : సుబ్‌హానల్లాహ్ - 33మార్లు, అల్‌హమ్దులిల్లాహ్ - 33మార్లు, అల్లాహుఅక్బర్ - 34 మార్లు (బుఖారి) ఇది సాధ్యం కాకపోతే
8. సుబ్హానల్లాహ్, అల్‌హమ్దులిల్లాహ్, అల్లాహు అక్బర్ అనేవి నమాజు ముగించిన ప్రతిసారి ఒక్కొక్కటి పదేసి మార్లయినా పఠించాలని ఉంది. (బుఖారి)
9. సుబ్‌హానల్లాహి వబిహమ్దిహి అదదఖల్కిహి, వరజాఅనఫ్సిహి వజినత అర్షిహి వ మీదాద కలిమాతిహీ - ప్రతి రోజు మూడుసార్లు పలకాలి.
10. ప్రతి ఉదయం, ప్రతి సాయంత్రం - సుబ్‌హానల్లాహ్ వందేసిమార్లు, అల్లాహు అక్బర్ వందేసి మార్లు ఉచ్చరించాలి.

## ఐహిక కార్యకలాపాల్లో దైవనామస్మరణ

(۱۰۹) رِجَالٌ لَا تُلْهِيهِمْ تِجَارَةٌ وَّلَا بَيْعٌ عَنْ ذِكْرِ اللهِ

قَالَ قَتَادَةُ: كَانَ الْقَوْمُ يَتَبَايَعُوْنَ وَيَتَّجِرُوْنَ وَلٰكِنَّهُمْ إِذَا نَابَهُمْ حَقٌّ مِنْ حُقُوْقِ اللهِ لَمْ تُلْهِهِمْ تِجَارَةٌ وَّلَا بَيْعٌ عَنْ ذِكْرِ اللهِ حَتّٰى يُؤَدُّوْهُ إِلَى اللهِ

(بخاری کتاب البیوع)

109. దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ తన దాసుల్ని ఈ పదాలతో పొగుడుతున్నాడు.

"వారు ఎలాంటి వారంటే, వ్యాపారంగానీ, క్రయవిక్రయాలుగానీ, అల్లాహ్ స్మరణగానీ, నమాజు స్థాపనగాని, జకాత్ ఇవ్వడం వంటి విషయాలలోగాని వారు అశ్రద్ధ వహించేవారు కారు." *(నూర్ - 37)*

హజ్రత్ ఖతాదా (రహ్మాలై) ఇలా అంటారు: "సహాబా (రజి) పరస్పరం వ్యాపార వినిమయాలు చేసుకునేవారు. అయితే ఎలాంటి వ్యాపారంగాని, క్రయవిక్రయాలుగాని వారిని అల్లాహ్ స్మరణ నుండి మైమరపించేవి కావు. అల్లాహ్ ఆదేశం ఆయన హక్కు నిర్వహణ వారికి పిలుపునిచ్చినప్పుడల్లా ఎలాంటి సంశయం లేకుండా ఆ హక్కును తీర్చే వారు. వారి వ్యాపారాలు క్రయవిక్రయాలు ఎలాంటి అడ్డంకుల్ని

కలిగించేవి కావు. వాటి మూలంగా వారు ఎప్పుడూ దైవ నామస్మరణను విస్మరించలేదు." (బుఖారి)

**సంగ్రహణం :**

సహాబా (రజి) తమ జీవితంలో అనుసరించిన ఈ మార్గం ద్వారా తెలుస్తున్నది ఏమిటంటే, దైవనామ స్మరణకోసం పనీబాట వదులుకొని సన్యాసం పుచ్చుకోవడం ఇస్లామ్ ధర్మంలో అసలే లేదన్నది. జిక్రుల్లాహ్ (అల్లాహ్ నామస్మరణ) అంటేనే జీవితంలోని ప్రతి రంగంలో దైవాదేశాలకు అనుగుణంగా నడవడం వ్యాపార వినిమయాల్లో కూడా ఖచ్చితమైన వైఖరిని అవలంబించేవాడు, ప్రాపంచిక లావాదేవీల్లో దైవనామస్మరణను వదలనివాడు, లౌకిక వ్యవహారాల్లో దైవాదేశాలను జవదాటనివాడు ఎల్లవేళలా దైవభీతిని కలిగి ఆయన్ను తలచుకునేవాడే అసలైన ధార్మికుడు, సిసలైన భక్తుడూను.

## ప్రతిదీ దేవుడినే అర్థించాలి

(۱۱۰) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ لِیَسْأَلْ اَحَدُکُمْ رَبَّہٗ حَاجَتَہٗ حَتّٰی یَسْأَلَہُ الْمِلْحَ وَحَتّٰی یَسْأَلَہٗ شِسْعَ نَعْلِہٖ اِذَا انْقَطَعَ (ترمذی عن ثابت البنانی ابواب الدعوات)

110. మీలోని ప్రతివారు తన కోరిక ఈడేరాలంటే దేవుడినే అర్థించాలి. కనీసం ఉప్పు కావలసినా సరే. చివరికి చెప్పు వారు తెగిపోయినా దాని గురించి కూడా ఆయన్నే యాచించాలి" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. (సాబితుల్ బనాని – తిర్మిజి).

**సంగ్రహణం :**

అంటే మనిషి దేవుని తప్ప మరెవ్వరినీ యాచించకూడదు. తన ప్రతి అవసరాన్ని తీర్చమని, ప్రతి కష్టాన్ని కడతేర్చమని ఆయన్నే వేడుకోవాలి.

సృష్టితాల అవసరం లేకుండా కేవలం ఆ సృష్టికర్త సాన్నిధ్యంలో దీనంగా వేడుకోవడమే 'తౌహీద్' (ఏకేశ్వరోపాసన). కనీసం చెప్పు వారు తెగిపోయినా, ఉప్పు కావలసి వచ్చినా దైవేతరుల ముందు చేయి జాపి అడగడాన్ని ఈ ఏకేశ్వర వాద సిద్ధాంతం ఎలా అనుమతిస్తుంది?

## అల్లాహ్‌ను యాచించని వాడు ఆయన క్రోధానికి గురౌతాడు

(۱۱۱) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّهٗ مَنْ لَّمْ يَسْأَلِ اللّٰهَ يَغْضَبْ عَلَيْهِ (ترمذی عن ابی ہریرہ ابواب الدعوات)

111. అల్లాహ్‌ను యాచించని వాని ఎడల అల్లాహ్ అప్రసన్నత జూపుతాడు" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(అబూ హురైరా (రజి) - తిర్మిజి)

**సంగ్రహణం :**

సకల భోగభాగ్యాలకు, తరగని ధనసంపదకు స్వామి, ప్రభువు అల్లాహ్‌యే అన్నది సుస్పష్టం. దాసుడు తన అవసరాల మేరకు అల్లాహ్‌ను కాదని తన తోటి మరో దాసుని ఎదుట చేయిజాపి అడిగితే అది దైవక్రోధాన్ని కొనితెచ్చుకున్నట్లే అవుతుంది. ఎవరి ముందరైతే దోసిలొగ్గి దీనంగా అడగాలో ఆ సృష్టికర్తను యాచించే బదులు, స్వయంగా తన లాంటి ఓ బికారి అయినవాడు, తనలా ఆ దేవుని మీదనే ఆధారపడి బ్రతికేవాని ఎదుట చేయిజాపి యాచిస్తే అది దైవక్రోధాన్ని కొనితెచ్చుకున్నట్లే అవుతుంది.

తనబోటి మనిషిని అడిగితే అతడు దానికి తన అయిష్టతను జూపుతాడు కారణం, అతడు అడిగింది ఇవ్వడానికి తన వద్ద ఏమీ లేదు కాబట్టి. అందుకు అతడు తన అయిష్టతను ప్రదర్శిస్తున్నాడు అంటే దానికి ఓ అర్థం అంటూ ఉంది.

అదే ఆ సృష్టికర్తను యాచించకపోతేనే ఆయన కృద్ధుడవుతాడు. కారణం, ప్రతివాని అవసరాలను తీర్చేవాడు ఆయనే. తరగని నిధులకు స్వామీ ఆయనే. ఆయన ఉండగా ఇతరుల ఎదుట చేయి జాపుతున్నవాడు కాబట్టి దాసుడు తన అవసరాలను గురించి ఆయన్ను అడగక మరెక్కడికి వెళ్ళగలడు? తన వైఖరి ద్వారా, దైవకారుణ్యం తనకవసరం లేదు. తన కోరికలు మరెక్కడో ఈడేరుతాయి అని రుజువు చేస్తున్నాడన్న మాటే కదా! ఎవరినైతే అతడు యాచిస్తున్నాడో, మరెవరిపైన్నైతే భారం వేసి కూర్చున్నాడో ఆ వ్యక్తి కూడా తన అవసరాల కోసం అల్లాహ్ కారుణ్యంపై ఆధారపడ్డవాడే.

## దేవుణ్ణే అర్థించాలి

(۱۱۲) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا سَأَلْتَ فَاسْأَلِ اللّٰهَ وَ اِذَا اسْتَعَنْتَ فَاسْتَعِنْ بِاللّٰهِ - (ترمذی عن ابن عباس ابواب الزہد)

112. "మీరు యాచిస్తే అల్లాహ్‌నే యాచించండి, సహాయం కోరితే అల్లాహ్‌నే సహాయానికై వేడుకోండి" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(ఇబ్నె అబ్బాస్ (రజి) – తిర్మిజి)

**సంగ్రహణం :**

సకల నిధులకు స్వామి కేవలం అల్లాహ్‌యే. ఆయన సృష్టించిన సృష్టితాల దగ్గర ఏదీ లేదు ఇవ్వడానికి. కాబట్టి మీరు ఏదైనా యాచించదలిస్తే ఆయన్నే యాచించండి. ఆయన నిధులు తరగనివి. ఏ మనిషి దగ్గర ఏమీ లేనప్పుడు అతడేమివ్వగలడు మీకు? మీరేగనక కష్టాల్లో చిక్కుకుని ఒకరి సహాయం అర్థించదలిస్తే కేవలం ఆ అల్లాహ్ సాన్నిధ్యం లోనే మీకు దోసిలొగ్గి సహాయపడమని వేడుకోండి. ఆయన తప్ప మరెవ్వరికీ మీ కష్టాలను తీర్చే శక్తిగాని సామర్థ్యంగాని లేవు. ఒకర్ని నష్టపెట్టడం గాని, ఒకరి కష్టాలను కడతేర్చడం గాని అతడే చేయగలడు అని చెప్పారు దైవప్రవక్త (సఅసం) ఈ హదీసులో.

## లాభనష్టాలన్నీ ఆయన హస్తగతమయ్యే ఉన్నాయి

(۱۱۳) عَنِ ابْنِ عَبَّاسٍ اِنَّهٗ قَالَ كُنْتُ رَدِيْفَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ فَقَالَ يَا غُلَامُ اَلَا اُعَلِّمُكَ كَلِمَاتٍ يَنْفَعُكَ اللّٰهُ بِهِنَّ ؟
فَقُلْتُ بَلٰى، فَقَالَ
اِحْفَظِ اللّٰهَ يَحْفَظْكَ، اِحْفَظِ اللّٰهَ تَجِدْهُ اَمَامَكَ،
تَعَرَّفْ اِلَيْهِ فِي الرَّخَاءِ يَعْرِفْكَ فِي الشِّدَّةِ
وَاِذَا سَأَلْتَ فَاسْأَلِ اللّٰهَ وَاِذَا اسْتَعَنْتَ فَاسْتَعِنْ بِاللّٰهِ
قَدْ جَفَّ الْقَلَمُ بِمَا هُوَ كَائِنٌ،
فَلَوْ اَنَّ الْخَلْقَ كُلَّهُمْ جَمِيْعًا اَرَادُوْا اَنْ يَنْفَعُوْكَ بِشَيْءٍ
لَمْ يَكْتُبْهُ اللّٰهُ عَلَيْكَ لَمْ يَقْدِرُوْا عَلَيْهِ
وَاِنْ اَرَادُوْا اَنْ يَضُرُّوْكَ بِشَيْءٍ لَمْ يَكْتُبْهُ اللّٰهُ عَلَيْكَ
لَمْ يَقْدِرُوْا عَلَيْهِ

وَاعْلَمْ اَنَّ فِي الصَّبْرِ عَلٰى مَا تَكْرَهُ خَيْرًا كَثِيْرًا
وَاَنَّ النَّصْرَ مَعَ الصَّبْرِ وَاَنَّ الْفَرَجَ مَعَ الْكَرْبِ
وَاَنَّ مَعَ الْعُسْرِ يُسْرًا (مسند احمد-۲۸۰۴)

113. హజ్రత్ అబ్బాస్ (రజి) ఇలా అంటారు : నేను ఓ రోజు దైవ ప్రవక్త (సఅసం) వెనుకభాగాన ఆయన వాహనంపై కూర్చుని వెళుతూ ఉండగా ఆయన,

"ఓ అబ్బాయి! అల్లాహ్ నీకు ప్రయోజనం కలిగించే విషయాలేమిటో చెప్పమంటావా?" అని అడిగారు.

"తప్పకుండా సెలవియండి దైవప్రవక్తా!" అని విన్నవించుకున్నాను. అప్పుడాయన ఇలా సెలవిచ్చారు :

1. అల్లాహ్‌ను మననం చేసుకుంటూ ఉండు. ఆయన నిన్ను గుర్తుంచుకుంటాడు. 2. ఆయన్ను గుర్తుంచుకో. ఆయన నీ ముందున్నట్లే కనుగొంటావు. 3. కలిమి కలిగి ఉన్నప్పుడే ఆయన్ను వెతికి గుర్తుంచుకో. కష్టాల్లో ఆయన నిన్ను ఆదుకుంటాడు. 4. మొరపెట్టుకోవలసి వస్తే ఆయన్నే మొరపెట్టుకో. 5. (కష్టకాలంలో) సహాయం కావలసి వస్తే అల్లాహ్‌నే సహాయం అర్థించు. 6. ఏది జరిగినా అది (అల్లాహ్‌కు తెలుసు) నిర్ణయమయ్యే ఉంది. 7. లోకమంతా కలిసి నీకు ప్రయోజనం చేకూర్చాలన్నా, అల్లాహ్ నీకా అదృష్టాన్ని కలిగించకుండా ఉంటే ఎంత ప్రయత్నం చేసినా నీకు ప్రయోజనం చేకూర్చలేరు. 8. వారంతా కలిసి నిన్ను నష్టపెట్టదలచుకున్నా అల్లాహ్ ఆ దురదృష్టాన్ని నీ నొసట రాయకపోతే నిన్నేమీ చేయలేరు. 9. ఉపద్రవమేదైనా వచ్చి పడినప్పుడు సహనం వహించడంలో ఎంతో మేలుందని తెలుసుకో. 10. ఓర్మి వహించడంలోనే అల్లాహ్ అండదండలు ఎప్పుడూ ఉంటాయి. 11. కష్టాలు వెతలతో పాటు సుఖశాంతుల కాలం కూడా వస్తుంది. 12. లేమిని కలిమి సదా అనుసరిస్తూనే ఉంటుంది.

(అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) – ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

ఈ హదీసు దైవాన్ని పొందే సూత్రాలేమిటో తెలుపుతోంది. లోతుగా ఆలోచిస్తే దీనిద్వారా మనకు తెలిసేదేమిటంటే లాభనష్టాలు అల్లాహ్ చేతిలో ఉన్నాయి కాబట్టి మనిషి ఆయన్నే ఆధారంగా చేసుకోవాలి అన్న యదార్థాన్ని తెలుసుకోగలం.

1. మొదటి సూత్రం : 'అల్లాహ్‌ను మననం చేసుకుంటూ ఉండు. ఆయన నిన్ను గుర్తుంచుకుంటాడు.'

అంటే నీవు అల్లాహ్ ఆదేశాలనే పాలించు. ఆయన ఆజ్ఞోల్లంఘన వైఖరికి, తిరుగుబాటు ధోరణికి దూరంగా ఉంటే ఆయనకు దగ్గరవగలవు. ఇహపరలోకాల కష్టాల నుండి నిన్ను రక్షిస్తాడు, దైవ సాన్నిధ్యాన్ని పొందాలంటే ఇంతకంటే మరో మార్గం లేదు.

2. రెండవ సూత్రం : "ఆయన్ను గుర్తుంచుకో. ఆయన నీ ముందరున్నట్లే కనుగొంటావు." అంటే నీవు అల్లాహ్‌ను ప్రార్థించు. ఆయన నీకు దూరంగా ఎక్కడో లేడు. సతతం నీతోనే ఉంటాడు. నీ మొరనాలకిస్తాడు, జవాబిస్తాడు. ఆయన్ను వదలి ఏ దైవేతర శక్తుల్ని ప్రజలు ఎలుగెత్తి మొరపెట్టుకుంటున్నారో వారు దగ్గరగా లేనందున వారి మొరలను ఆలకించలేరు.

3. మూడో సూత్రం : "కలిమి కలిగి ఉన్నప్పుడే ఆయన్ను వెతికి గుర్తుంచుకో. కష్టాల్లో ఆయన నిన్ను ఆదుకుంటాడు."

అంటే సకల ఐశ్వర్యాలు, భోగభాగ్యాలు అనుభవించే కాలంలో నీవు దైవనామ స్మరణ చెయ్యి. ఆయన ఆదేశాలను మరిచిపోబాకు. ఆయన్ను వెదికేందుకు సాధ్యమైనంత ప్రయత్నం చెయ్యి. ఆయన్ను కనుగొన్నావంటే ఇక ఆయన నీవాడే.

దీని ఫలితంగా కష్టాల్లో, దారిద్ర్యంలో అల్లాహ్ నీ మొరలాలకించి నిన్నాదుకుంటాడు. ఈ భూమ్యాకాశాల ప్రభువు దుఃఖ సాగరంలో మునిగి తేలుతున్నప్పుడు, అసహాయ స్థితిలో ఉన్నప్పుడు నిన్ను ఒంటరిగా వదిలిపెట్టకుండా నీకు తన సహాయ సహకారాలను అందిస్తూ రక్షగా నిలుస్తాడు.

4. నాల్గవ సూత్రం : "మొరపెట్టుకోవలసివస్తే ఆయన్నే మొరపెట్టుకో" ఎందుకంటే ఇతరులంతా రిక్తహస్తులే. మొరపెట్టుకొనే వాడి మొరనాలకించి అతణ్ణి ఆదుకునే శక్తి ఎవరికీ లేదు గనక.

5. "సహాయం కావలసి వస్తే అల్లాహ్‌నే సహాయం అర్థించు." : అంటే నీవు చిక్కుల్లో పడ్డప్పుడు వ్యతలకు బాధలకు గురి అయినప్పుడు అల్లాహ్‌నే సహాయం అర్థించు. ఎందుకంటే ఆయన తప్ప మరెవ్వరూ నీ కష్టాల్ని వ్యతల్ని దూరం చేయలేరు. కనుక ఆయన

సమక్షంలోనే నీ శిరసువంచి, సాష్టాంగపడి వేడుకో. రేయి మూడో ఝాముున నీ మనోవ్యాకులత వేడుకోలుగా మారితే ఆయన కారుణ్యం నీ మనోగాయాలపై నవనీతం పూస్తుంది. నీ హృదయవేదన చల్లబడుతుంది. నీకు ఊరట కలుగుతుంది. ఆయన కృప నీ దుఃఖాల్ని దూరం చేస్తుంది. నీ కష్టాలు తొలగిపోతాయి. కరుణామయుడు, కృపాశీలుడు అయిన ఆ దేవుడు తన ముంగిట నిలిచి వేడుకునే తన భక్తుణ్ణి ఆదుకుంటాడు.

ఆరు, ఏడు, ఎనిమిదవ సూత్రాల్లోని సారాంశం ఏమిటంటే, అల్లాహ్ ఈ విశ్వవ్యవస్థను ఏ రోజైతే నియంత్రించాడో ఆ నియంత్రణకు ఆ తీర్పుకు తిరుగులేదు. ఏది జరిగినా, జరుగుతూ ఉన్నా లేక జరగబోయినా అదంతా ఆయనకు తెలుసు. ఆయన ఆదేశాల మేరకే జరుగుతోంది. ఆయన నీకు ప్రయోజనం కలిగించదలిస్తే ఈ లోకమంతా కలిసి నిన్ను నష్టానికి గురిచేయజాలదు. ఆయన నీకు కష్టపడే రాతరాస్తే ఈ లోకం అంతా కలిసి నిన్నుద్ధరించజాలదు. మొత్తానికి ఈ విశ్వాంతరాళంలో ఆయన ఆదేశాలే నడుస్తాయి. ఆయన తలంపుకు, ఇష్టానికి వ్యతిరేకంగా ఆకైనా భూమ్మీద రాలదు. కాబట్టి మనిషి తన ఆశలకు, కోరికలకు కేంద్రంగా కేవలం అల్లాహ్‌నే ఖరారు చేసుకోవాలి. లాభనష్టాల తాళాలు ఆయన అధీనంలోనే ఉన్నాయి.

ఇక తొమ్మిది మొదలు పన్నెండు వరకు గల సూత్రాల భావం ఏమిటంటే మనిషి జీవితంలో సుఖదుఃఖాల ఆటుపోట్లు వస్తూనే ఉంటాయి. సుఖాల్లో మనిషి శారీరకంగా ఆధ్యాత్మికంగా దైవాన్ని స్మరిస్తూ ఉండాలి. పరీక్ష సమయం ఎదురైనప్పుడు మనిషి సహనం వహించాలి. కష్టాలు వచ్చిపడ్డప్పుడు బెంబేలెత్తకుండా, భయభ్రాంతులకు లోనుకాకుండా ఉండాలి. ఎల్లవేళలా దైవాన్నే వేడుకుంటూ ఉండాలి. ఇందులోనే అతనికి మేలుంది. దేవుడు అతడికి ఒసగిన పుణ్యఫలాలే గాకుండా తాను ఊహించనైనా ఊహించలేని భౌతిక వరాలను కూడా ఒనగూరుస్తాడు. ఆయన కారుణ్యం సహనం వహించేవాణ్ణి ఉపేక్షించదు. సరికదా, సతతం ఆ కారుణ్యం అతనిపై కురుస్తూనే ఉంటుంది. ప్రతి వ్యక్తిని ఆయన వరాలిచ్చి లేక దారిద్ర్యానికి గురిచేసి పరీక్షిస్తున్నాడు. అందుకని కలిమి కలిగి ఉన్నప్పుడు విర్రవీగడం, కష్టకాలం వచ్చినప్పుడు ఆశలు వదులుకొని బెంబేలెత్తడం ఆయనకు నచ్చవు. అల్లాహ్ కారుణ్యం ఎడల ఆశలు వదులుకోవడం అన్నది ఆయన్ను తిరస్కరించడమే అవుతుంది. దారిద్ర్య శిశిరం అంతం అయిపోగానే ఐశ్వర్యాల వసంతం వచ్చేస్తుంది. ఇక శాంతి సౌఖ్యాల వరాలు అపారంగా వచ్చిపడతాయి. కష్టాల సుడిగుండాలు, కడగండ్ల కొండలకు ఎదురొడ్డి పోరాడుతాడు నిజమైన విశ్వాసి. తనకు లభించిన భౌతిక వనరులన్నిటిని కూడదీసుకొని వాటి సహాయంతో కష్టాలను గట్టెక్కే ప్రయత్నం చేస్తాడు. దీని కోసం అతడు దేవుణ్ణి సతతం వేడుకుంటూ ఉంటాడు. ఎందుకంటే అతడు తన భారం అంతా ఆ అల్లాహ్‌పైన్నే వేస్తాడు కాబట్టి.

# దేవుని ఏకత్వం

(۱۱۴) عَنِ النَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فِیْمَا رَوٰی عَنِ اللّٰهِ تَبَارَكَ وَ تَعَالٰی
اِنَّهٗ قَالَ

یَا عِبَادِیْ! اِنِّیْ حَرَّمْتُ الظُّلْمَ عَلٰی نَفْسِیْ وَجَعَلْتُهٗ مُحَرَّمًا
بَیْنَكُمْ فَلَا تَظَالَمُوْا

یَا عِبَادِیْ! كُلُّكُمْ ضَالٌّ اِلَّا مَنْ هَدَیْتُهٗ فَاسْتَهْدُوْنِیْ
اَهْدِكُمْ

یَا عِبَادِیْ كُلُّكُمْ جَائِعٌ اِلَّا مَنْ اَطْعَمْتُهٗ فَاسْتَطْعِمُوْنِیْ اُطْعِمْكُمْ

یَا عِبَادِیْ! كُلُّكُمْ عَارٍ اِلَّا مَنْ كَسَوْتُهٗ فَاسْتَكْسُوْنِیْ اَكْسُكُمْ

یَا عِبَادِیْ! اِنَّكُمْ تُخْطِئُوْنَ بِاللَّیْلِ وَالنَّهَارِ وَاَنَا اَغْفِرُ
الذُّنُوْبَ جَمِیْعًا فَاسْتَغْفِرُوْنِیْ اَغْفِرْ لَكُمْ

یَا عِبَادِیْ! اِنَّكُمْ لَنْ تَبْلُغُوْا ضُرِّیْ فَتَضُرُّوْنِیْ وَلَنْ تَبْلُغُوْا
نَفْعِیْ فَتَنْفَعُوْنِیْ

یَا عِبَادِیْ! لَوْ اَنَّ اَوَّلَكُمْ وَاٰخِرَكُمْ وَ اِنْسَكُمْ وَجِنَّكُمْ كَانُوْا
عَلٰی اَتْقٰی قَلْبِ رَجُلٍ وَّاحِدٍ مِّنْكُمْ مَا زَادَ ذٰلِكَ فِیْ مُلْكِیْ شَیْئًا

یَا عِبَادِیْ! لَوْ اَنَّ اَوَّلَكُمْ وَاٰخِرَكُمْ وَاِنْسَكُمْ وَجِنَّكُمْ كَانُوْا
عَلٰی اَفْجَرِ قَلْبِ رَجُلٍ وَّاحِدٍ مِّنْكُمْ مَا نَقَصَ ذٰلِكَ مِنْ مُلْكِیْ
شَیْئًا۔

یَا عِبَادِیْ! لَوْ اَنَّ اَوَّلَكُمْ وَاٰخِرَكُمْ وَاِنْسَكُمْ وَجِنَّكُمْ قَامُوْا
فِیْ صَعِیْدٍ وَّاحِدٍ فَسَاَلُوْنِیْ فَاَعْطَیْتُ كُلَّ اِنْسَانٍ مَسْئَلَتَهٗ
مَا نَقَصَ ذٰلِكَ مِمَّا عِنْدِیْ اِلَّا كَمَا یَنْقُصُ الْمِخْیَطُ اِذَا اُدْخِلَ
فِی الْبَحْرِ

يَا عِبَادِيْ! إِنَّمَا هِيَ أَعْمَالُكُمْ أُحْصِيْهَا لَكُمْ ثُمَّ أُوَفِّيْكُمْ
إِيَّاهَا فَمَنْ وَجَدَ خَيْرًا فَلْيَحْمَدِ اللّٰهَ وَمَنْ وَجَدَ غَيْرَ ذٰلِكَ
فَلَا يَلُوْمَنَّ إِلَّا نَفْسَهُ (مسلم عن ابی ذر کتاب البر والصلة: باب تحریم الظلم)

114. అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు :

నా దాసులారా! జులుము (దౌర్జన్యం) చేయడాన్ని నేను నాపై హరాం (నిషిద్ధం) చేసుకున్నాను. (అంటే నేను జులుము అనేదే చేయను) అలాగే మీపై కూడా జులుము అన్నది నిషేధించాను. కాబట్టి మీరు ఒకరి మీద మరొకరు దౌర్జన్యం చేయకండి. ఒకరి హక్కుల్ని మరొకరు కొల్లగొట్టకండి.

నా దాసులారా! మీరందరూ దారి తప్పిన వాళ్ళే. నేను సన్మార్గంపై నడిచే భాగ్యం కలిగించినవారు తప్ప. మార్గదర్శకత్వం కోసం నన్ను వేడుకోండి. నేను మిమ్మల్ని రుజుమార్గంపై నడిపిస్తాను.

నా దాసులారా! మీరంతా ఆకలిగొన్నవారే. నేను అన్నం పెట్టిన వారు తప్ప. మీరు నన్నే వేడుకోండి. నేను మీకు తినిపిస్తాను.

నా దాసులారా! మీరందరూ వస్త్ర హీనులే. నేను తొడిగిన వారు తప్ప. మీరు కట్టుకోవడానికి వస్త్రాలు నన్నే అడగండి. నేను మీకు తొడుగుతాను.

నా దాసులారా! మీరు రేయింబవళ్లు పాపాలు చేస్తుంటారు. నేనందరి పాపాల్ని మన్నిస్తాను. కాబట్టి పాపహరణం కోసం నన్నే వేడుకోండి. నేను మిమ్మల్ని మన్నిస్తాను.

నా దాసులారా! మీరు నన్నేమీ నష్టపర్చలేరు (అదేవిధంగా) నాకు ఎలాంటి లాభాన్నీ చేకూర్చిపెట్టలేరు.

నా దాసులారా! (సృష్టి ప్రారంభం నుండి ప్రళయం వరకు పుట్టిన పుట్టబోయే) జిన్నులు, మానవులు అందరూ కలిసి నాకు భయపడుతూ జీవితం గడిపినా, వారి దైవభీతి తారస్థాయికి చేరినా, వారు పుణ్యకార్యాల్లో

పూర్తిగా లీనమైపోయినా సరే వారి ఈ దైవభీతి (తక్వా) పుణ్యకార్యాల మూలంగా నా పరిపాలనలో ఇసుమంతైనా వృద్ధి జరగదు.

నా దాసులారా! సృష్టి ప్రారంభం నుండి ప్రళయం వరకు వచ్చే జిన్నులు, మానవులు అందరూ కలిసి నన్ను ధిక్కరించినా నా పరిపాలనలో రవ్వంతైనా తరుగుదల కనిపించదు.

నా దాసులారా! (ఆది నుండి అంతం వరకు) మీ జిన్నులు, మానవ సంతతులు అందరూ ఓ మైదానంలో నిలబడి ప్రతివాడు నన్ను యాచిస్తే వారందరికి కాదనకుండా వారి కోరిక మేరకు ఒసగుతాను. వారేది అడిగినా, ఎంత అడిగినా నేను వారికి ఇస్తాను. ఇలా వారందరికీ నేను ఇచ్చినప్పుడు నా ఖజానాల్లో ఎలాంటి తరుగుదల కనిపించదు. సముద్రంలో ఓ సూది మునిగి తన వెంట ఎంత నీరైతే తెస్తుందో అంత తప్ప.

నా దాసులారా! నేను మీ జీవిత రికార్డును సురక్షితంగా ఉంచాను. (ప్రళయం రోజున) నేను దానికి ఖచ్చితమైన ప్రతిఫలం ఇస్తాను. ఎవరయితే మేలు పొందాడో అతడు దేవుడికి కృతజ్ఞత చూపాలి. ఎవరయితే అనర్థంలో చిక్కుకున్నాడో అతడు తనను తానే నిందించు కోవాలి. *(అబూజర్ (రజి) - ముస్లిమ్)*

**సంగ్రహణం :**

1. అల్లాహ్ ఒకరిని పీడించడు. తన దాసులు కూడా దానికి దూరంగా ఉండాలంటాడాయన. పరస్పరం మీ హక్కుల్ని కొల్లగొట్టకండి. సరికదా, దైవ సృష్టితాల్లో దేనిపైనా దౌర్జన్యం చెయ్యొద్దు.

2. ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించి దాన్ని ఆచరిస్తేనే ఇహలోకంలో శాంతి సౌఖ్యాలు, కలిమి ఉన్నతులు; పరలోకంలో విజయవంతమైన జీవితం గడుపగలరు. ఇస్లామ్ ధర్మాన్ని ఉపేక్షించినా, లేక ఆ ధర్మంలో మార్పులు చేర్పులు చేసినా ఏ రుజుమార్గంపై మీరు నడుస్తున్నారో అది కాస్తా తప్పిపోతుంది. ఇహపరలోకాల సౌఖ్యం పొందాలంటే మనిషి సతతం రుజువర్తన కలిగి ఉండి అల్లాహ్‌ను వేడుకుంటూ ఉండాలి. ఆయన సహాయ సహకారం లేనిదే ఎవ్వరూ రుజుమార్గాన్ని కనుగొనడం గాని, దానిపై నడవడం గాని చేయలేరు. కాబట్టి విశ్వాసి ప్రతి నిత్యం అయిదు పూటలా చేసే నమాజులో 'ఇహ్దినస్సిరాతల్

ముస్తకీమ్' (ఓ ప్రభూ! మమ్ము నీ రుజుమార్గంపై నడిపించు) అని వేడుకోమని దైవాదేశం.

3. ఈ జీవితంలో పోషణ కోసం ఉపాధి పొందాలంటే ఇక్కడి వనరుల్ని, మార్గాల్ని అవలంబించక తప్పదు. అయితే ఈ వనరులకు సంబంధించిన తాళాలు, వాటి నుండి రావలసిన ఫలితాలన్నీ అల్లాహ్ హస్తగతం అయ్యే ఉన్నాయి. కాబట్టి మనిషి ప్రతి అవసరాన్ని దేవునికే ఏకరువు పెట్టి వేడుకోవాలి. ఉపాధి సంపాదనలో కేవలం భౌతిక వనరుల మీదే ఆధారపడి, అల్లాహ్ దాతృత్వానికి విలువనివ్వనివాడు పెద్ద అమాయకుడు, బుద్ధిహీనుడు అనే చెప్పాలి. దైవకారుణ్యాన్ని లెక్క చేయక కేవలం తన శక్తిసామర్థ్యాలపై ఆధారపడడం దుస్సాహసమే.

4. మనిషి సాధారణంగా తన బుద్ధిని విజ్ఞానాన్ని తప్పుగా ఉపయోగించడం వల్ల నష్టాలకు గురై పాపపంకిలంలోనికి జారిపోతాడు. అయితే అతడు తాను చేసిన పొరపాట్లను గుర్తించి, పశ్చాత్తాపపడి 'తౌబా' చేస్తే, తాను చేసిన పాపాల గురించి సిగ్గుపడి దేవుణ్ణి మన్నించమని వేడుకుంటే రక్షణ పొందగలడు.

దాస్యం అంటేనే దైవధిక్కారానికి, పాపాలకు దూరంగా ఉండడం. అయితే ఏదైనా పాపం జరిగితే, ఆ కరుణామయుడైన కృపాశీలుడైన దేవుని సాన్నిధ్యంలో మన్నింపు కోసం దీనంగా వేడుకోవాలి. ఆయన కారుణ్యం పాపుల 'తౌబా' కోసం ఎల్లవేళలా నిరీక్షిస్తూనే ఉంటుంది. తౌబా ద్వారం ఎల్లవేళలా తెరుచుకునే ఉంటుంది. దైవకారుణ్యం ఎడల నిరాశా నిస్పృహలు చెందడం 'కుఫ్ర్' (దైవతిరస్కార వైఖరి)తో సమానం. ఏ పాపంగాని, ఏ నేరంగాని – అది కుఫ్ర్ అయినా, షిర్క్ (దైవానికి సాటి కల్పించడం) అయినా – దైవాన్ని మన్నించమని కోరటం ద్వారా అది మన్నించబడకుండా ఉండలేదు. అల్లాహ్ మన్నింపు, పాపులైన తన దాసుల్ని మన్నించడానికి, వారి పాప పరిహారణకు మార్గాలు వెదుకుతూనే ఉంటుంది. నిర్మల మనస్సుతో చేసిన పాపానికి సిగ్గుపడడం, ఆయన సాన్నిధ్యంలో మన్నింపు కోసం వేడుకోవడమే 'తౌబా' అంటే. అప్పుడే అది స్వీకరించబడుతుంది. పెద్ద పెద్ద పాపగుండాల్ని సైతం అల్లాహ్ కారుణ్య వర్షపు ఒకే ఒక చినుకు పూర్తిగా చల్లార్చగలదు. దీనికి కావలసిందల్లా ఏకాంతంలో చేసిన పాపాల గురించి పశ్చాత్తాపపడి దీనంగా ఆయన ఎదుట దోసిలొగ్గి వేడుకోవడమే.

5. మనం ఆచరించే సత్కార్యాలు, చేసే ఆరాధనలు దేవుడికి ఏవీ అవసరం లేదు. మనం పాపాలు చేస్తే ఆయనకేదైనా నష్టం వాటిల్లుతుందేమో అని అనుకోవడం పెద్ద పొరపాటు. అసలు విషయం ఏమిటంటే మనం చేసే ఆరాధనవల్ల, మన దాస్యం వల్ల ఆయనకు ఎలాంటి ప్రయోజనం కలగడం గాని, మన ధిక్కార వైఖరివల్ల ఆయనకు ఏదైనా నష్టం వాటిల్లడంగాని జరుగదు. అన్నిటికి అతీతుడు ఆయన. మనమంతా కలిసి పూర్తిగా సదాచార సంపన్నులం అయిపోయినా, ఆయన పీఠంలోగల ఔన్నత్యాన్ని రవ్వంతైనా

పెంచలేం. అదేవిధంగా అందరం పాపులుగా మారిపోయి ఆయన్ను ధిక్కరించినా ఇసుమంతైనా నష్టపర్చలేం ఆయన్ను.

సృష్టి ప్రారంభం నుండి ప్రళయం వరకు ఈ లోకంలో సృష్టించబడ్డవారు, సృష్టించబడేవారు - జిన్నులు, మనుషులు - అంతా కలిసి ఆయన ఎడల తిరస్కార భావాన్ని ఏమాత్రం రానీయకుండా ఆయన ఆదేశాలను శిరసావహించినా దోమ రెక్కకుగల విలువంత కూడా ఆయన పరిపాలనలో పెంపుదలకు దోహదపడలేం. దీనికి భిన్నంగా వీరంతా ఒక్కొక్కరుగా లేక సామూహికంగా కలసి అల్లాహ్‌ను ధిక్కరించినా ఆయన రాచరికంలో వెంట్రుక మొనంత తరుగుదలను కూడా సృష్టించలేం. దైవాదేశ పాలనా సత్ఫలితాలు, దైవధిక్కారపు దుష్ఫలితాలు అన్ని మనిషి జీవితంలోనే ముడివడి ఉన్నాయి. ఆరాధనలతో ఆయన్ను తనవాడిగా చేసుకున్నానని గర్వించేవాడు నిజంగా మోసానికి గురైపోతున్నాడు.

6. ప్రళయం రోజున ప్రతి వ్యక్తి ఎడల న్యాయం జరుగుతుంది. ప్రతి వాని జీవితపు కర్మల చిట్టా అల్లాహ్ న్యాయస్థానంలో తీర్పుకు గొనిరావడం జరుగుతుంది. అక్కడ ఎవరికి అన్యాయం జరుగదు. ఎవరి హక్కూ కొల్లగొట్టబడదు. ఇదే అసలు సిద్ధాంతం. హదీసు చివరిలో దైవప్రవక్త (సఅసం) గారు "ఎవరయితే మేలును పొందాడో అతడు దేవునికి కృతజ్ఞత చూపాలి. మరెవరయితే అనర్థంలో చిక్కుకున్నాడో అతడు తనను తానే నిందించుకోవాలి" అని సెలవిచ్చిన దాని అర్థం ఏమిటంటే అల్లాహ్ కారుణ్యవర్షం మీపై వర్షిస్తే ఆయన మీకు ఐశ్వర్య ఆరోగ్యాలు ఒసగితే ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకోండి. కృతఘ్నుత చూపకండి. మీరేదైనా అనర్థాల్లో చిక్కుకుంటే అది మీరు చేసిన ఏదో ఒక పాపానికి మీకు లభించిన శిక్ష అని గ్రహించండి. కాబట్టి మీ పాపాలను మీ చెడు ప్రవృత్తిని క్షుణ్ణంగా సమీక్షించి అల్లాహ్ మన్నింపుకై ఆయన్ను వేడుకోండి. ఆయన మీ పాపాల్ని మన్నిస్తాడు. మీ దారిద్ర్యాన్ని ఐశ్వర్యంగా మలచగలడు.

## దుఆలోని ఘనత

(١١٥) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَيْسَ شَيْءٌ أَكْرَمَ عَلَى اللهِ مِنَ الدُّعَاءِ

(ترمذی عن ابی ہریرۃ ابواب الدعوات)

115. "అల్లాహ్ దృష్టిలో దుఆ (వేడుకోలు) కంటే గౌరవ ప్రదమైనది మరేదీ లేదు" అని దైవప్రవక్త (సఅసం) నుడివారు.

(అబూ హురైరా (రజి) - తిర్మిజి)

**సంగ్రహణం :**

ప్రతి సత్కార్యానికి ప్రాధాన్యత ఉంది. ప్రతి పుణ్యకార్యం, సదాచరణ అల్లాహ్‌కు ఇష్టమైనదే. దానికి ఆయన ప్రతిఫలాన్నొసగుతాడు. అయితే అన్నింటికంటే గౌరవప్రదమైన స్థానాన్ని ఆయన 'దుఆ'కే కల్పించాడు. దుఆ అంటే మొరపెట్టుకోవడం, దీనంగా యాచించడం, సహాయపడమని అడగడం, కష్టాలనుండి గట్కెంచమని, కోరికల్ని ఈడేర్చమని ప్రార్థించడం, అనారోగ్యం, దారిద్ర్యబాధల్ని కడతేర్చమని విన్నవించుకోవడం.

శారీరక, ఆధ్యాత్మికమైన ఆపదలనుండి గట్టెక్కడం, సకల అవసరాల పరిపూర్తి జరగడానికి దోసిలొగ్గి దైవాన్ని వేడుకోవడమే దుఆ అంటే. తన దాసులు తననే వేడుకోవాలని, తన సాన్నిధ్యంలో మొరపెట్టుకోవాలని దేవుడు కోరుకుంటాడు. అందువల్ల దైవదాసులు తమకు అవసరం వచ్చిపడినా, ఏ బాధలు దుఃఖాలు కలిగినా వాటిని కడతేర్చమని ఆదేవుణ్ణే మొరపెట్టుకోవాలి. ఆయన ఎంతైనా ఒసగగలడు. ఆయన ఖజానాలు అనంతం. యాచించేవాణ్ణి రిక్తహస్తాలతో వెనక్కుపంపడు.

## వేడుకోవడం కూడా ఓ ఆరాధనే

(١١٦) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ الدُّعَاءُ هُوَ الْعِبَادَةُ ثُمَّ
قَرَأَ: ـــ وَقَالَ رَبُّكُمُ ادْعُوْنِيْٓ اَسْتَجِبْ لَكُمْ اِنَّ الَّذِيْنَ
يَسْتَكْبِرُوْنَ عَنْ عِبَادَتِيْ سَيَدْخُلُوْنَ جَهَنَّمَ دَاخِرِيْنَ۔

(ترمذی عن النعمان بن بشیر ابواب الدعوات)

116. "దుఆ (వేడుకోలు) కూడా ఓ ఆరాధనే" అంటూ దైవప్రవక్త (సఅసం) దివ్య ఖుర్‌ఆన్‌లోని ఈ వాక్యం పఠించారు:

"మీ దేవుడు ఇలా అంటున్నాడు : నన్నే మొరబెట్టుకోండి. నేను మీ మొరలాలకిస్తాను, స్వీకరిస్తాను. అహంకారం చేత నా ఆరాధన నుండి విముఖత చూపేవారు హేయమైన పరిస్థితుల పాలై నరకంలో ప్రవేశిస్తారు."

*(నోమాన్ బిన్ బషీర్ (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

ఆరాధన అనే పదం ఎంతో విస్తృతమైన అర్థాన్ని ఇస్తోంది. దైవప్రవక్త (సఅసం) అల్లాహ్‌నే వేడుకోవడాన్ని, కోరికలను తీర్చేవానిగా తలచి మొరబెట్టుకోవడాన్ని 'ఆరాధన'గా

పరిగణిస్తారు. అల్లాహ్ కోసం కాకుండా మరెవరి కోసమో నమాజు చేయడం, రోజాలు పాటించడం లేక ఇతరుల పేరు మీద జంతువును జిబహ్ చేయడం 'షిర్క్' (బహుదైవారాధన) అవుతుంది. అచ్చం అదేవిధంగా దైవేతరుల్ని మొరపెట్టుకోవడం, వేడుకోవడం, ఆదుకొమ్మని అర్థించడం కూడా షిర్కే. మనిషి తన అసహాయతను, దీనత్వాన్ని ప్రదర్శించి అల్లాహ్ ముందు దుఆ చేస్తాడు. అధికారానికి, శక్తికి మూలం కేవలం అల్లాహ్‌యేనని చాటుతాడు భక్తుడు.

## ఆరాధనా సర్వస్వం దుఆయే

(١١٧) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ الدُّعَاءُ مُخُّ الْعِبَادَةِ

(ترمذی عن انس بن مالک ابواب الدعوات)

117. "దుఆయే ఆరాధనకు ప్రాణం" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. *(అనస్ బిన్ మాలిక్ (రజి) - తిర్మిజి)*

**సంగ్రహణం :**

మనుషుల్ని, జిన్నులను అల్లాహ్ తన దాస్యం చేయడానికే సృష్టించాడు. దివ్య ఖుర్‌ఆన్‌లో మానవులనుద్దేశించి, మీ ప్రభువునే ఆరాధించమని, ఆయనకు మరెవ్వరినీ సహవర్తులుగా నిలబెట్టవద్దని పిలుపునిచ్చాడు. దుఆ (వేడుకోలు) ఆరాధనల సర్వస్వం కాబట్టే దైవేతరుల్ని వేడుకోవడం (దుఆ చేయడం) షిర్క్. దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ ఈ విషయాన్నే రకరకాలుగా, మాటిమాటికీ గుర్తు చేస్తూ మీకు ఆపదలు వచ్చినప్పుడు కేవలం అల్లాహ్‌నే మొక్కుకోండి అని చెప్పడం జరిగింది. ఆయన సాన్నిధ్యంలో మొరబెట్టుకోండి. ఏది ఎప్పుడు అడగవలసి వచ్చినా కేవలం ఆయన్నే అడగండి. ఎందుకంటే ఈ విశ్వంలో ఆ సృష్టికర్త తప్ప కష్టాల్ని తీర్చేవాడు గాని, మొరలనాలకించేవాడు గాని లేడు. మనిషి ప్రతి దానికి ఆ కారుణ్యమూర్తి ఎదుటే దోసిలొగ్గి యాచించాలి. మీ కష్టాల్ని బాధల్ని ఆయనే కడతేర్చగలడు.

## అల్లాహ్ సాన్నిధ్యంలో దుఆ

(١١٨) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ رَبَّكُمْ حَيِيٌّ كَرِيْمٌ
يَسْتَحْيِيْ مِنْ عَبْدِهٖ اِذَا رَفَعَ يَدَيْهِ اَنْ يَّرُدَّهُمَا صِفْرًا۔

(ابوداؤد عن سلمان کتاب الصلوٰۃ)

118. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు :

“మీ ప్రభువు ఎంతో లజ్జాపరుడు. ఎంతో కరుణామయుడు కూడా. దోసెడు ‘దుఆ’ కోసం తన దోసిలిని ఆయన ఎదుట చాచి వేడుకుంటే, ఆ దాసుణ్ణి రిక్తహస్తాలతో వెనక్కు పంపడానికి ఆయన ఎంతో సిగ్గు పడతాడు.” *(సల్మాన్ (రజి) – అబూదావూద్)*

**సంగ్రహణం :**

అంటే అల్లాహ్ తన దాసుడు, తన సాన్నిధ్యంలో యాచించేందుకు దోసిలొగ్గి నప్పుడు ఆ వేడుకోలును మన్నించకుండా రిక్తహస్తాలతో వెనక్కు మళ్ళించడానికి ఆయన ఎంతో సిగ్గుపడతాడు. ప్రార్థనను మన్నించకపోవడం ఆయన కారుణ్యప్రభకు వ్యతిరేకం. అల్లాహ్‌ను తన వైపునకు ఆకర్షించే చర్యల్లోకెల్లా గొప్పదైన చర్య కేవలం దుఆ అన్నది వాస్తవం.

## లాభనష్టాలు దైవాధీనం

(۱۱۹) عَنْ عُمَرَ رَضِیَ اللّٰہُ عَنْہُ اَنَّہٗ جَاءَ اِلَی الْحَجَرِ الْاَسْوَدِ فَقَبَّلَہٗ فَقَالَ اِنِّیْ اَعْلَمُ اَنَّکَ حَجَرٌ لَا تَضُرُّ وَلَا تَنْفَعُ وَلَوْلَا اَنِّیْ رَأَیْتُ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یُقَبِّلُکَ مَا قَبَّلْتُکَ۔

(بخاری کتاب المناسک، مسلم کتاب الحج، ترمذی ابواب الحج)

119. రెండో ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) (కాబా గృహగోడలో ఇమిడివున్న) నల్లరాయిని సమీపించగానే దాన్ని ముద్దిడుకున్నారు. ఆ తరువాత దాన్నుద్దేశించి ఇలా పలికారు :

“నీవో నల్లరాయివే. లాభనష్టాలు ఏవీ నీ చేతిలో లేవని నేనెరుగు దును. దైవప్రవక్త (సఅసం) నిన్ను ముద్దిడుకుంటూ ఉండగా నేను చూడక పోయి వుంటే నిన్ను ఎన్నటికీ ముద్దుపెట్టుకునే వాణ్ణే కాదు.”

*(బుఖారి, ముస్లిమ్, తిర్మిజి)*

**సంగ్రహణం :**

‘హజ్రె అస్వద్’ కాబా గృహపు ఓ పార్శ్వం, ముల్తజిమ్‌కు ఎడమ వైపున వున్న

నల్లరాయి. తవాఫ్ (ప్రదక్షిణ) ప్రారంభించే ముందు దాన్ని చుంబించడమో, స్పృశించడమో లేక దానివైపు అరచేతులు చూపి అంటుకున్నట్లు సైగ చేసో ప్రదక్షిణ ప్రారంభిస్తారు. 'హజ్ ప్రారంభం అయిన నాటి నుండి వస్తున్న ఆచారమిది. ఇదే ప్రదక్షిణ ప్రారంభానికి గుర్తుగా మిగిలిపోయింది. ఇలా తవాఫ్ ప్రారంభిస్తూ దైవప్రవక్త (సఅసం) దాన్ని చుంబించేవారు. అందుకే హజ్రత్ ఉమర్ (రజి) దాన్ని ముద్దిడుతూ ఆ మాటలన్నారు.

ఇస్లామీయ చక్రవర్తి (ఖలీఫా) అయిన హజ్రత్ ఉమర్ (రజి) గారి వైఖరిని దృష్టిలో ఉంచుకుంటే, దర్గాలు, మజార్లు, మహాపురుషుల సమాధుల్ని ముద్దుపెట్టుకునే వారి వైఖరి ఎంత అసమంజసమైనదో అర్థం అవుతుంది.

## వసీలా - మధ్యవర్తిత్వం (Intercession)

(۱۲۰) اِنَّ عُمَرَ بْنَ الْخَطَّابِ رَضِیَ اللّٰهُ عَنْهُ كَانَ اِذَا قُحِطُوْا اِسْتَسْقٰی
بِالْعَبَّاسِ بْنِ عَبْدِ الْمُطَّلِبِ فَقَالَ اَللّٰهُمَّ اِنَّا كُنَّا نَتَوَسَّلُ
اِلَيْكَ بِعَمِّ نَبِيِّنَا فَتَسْقِيْنَا وَ اِنَّا نَتَوَسَّلُ اِلَيْكَ بِعَمِّ نَبِيِّنَا فَاسْقِنَا
فَيُسْقَوْنَ (بخاری عن انس کتاب الاستسقاء۔ فضائل اصحاب النبی صلی اللہ علیہ وسلم)

120. హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) కరువు వచ్చిపడినప్పుడు హజ్రత్ అబ్బాస్ (రజి) గారిని అడ్డుపెట్టుకొని వర్షం కోసం అల్లాహ్‌ను వేడుకునేవారు. ఆ దుఆలోని పదజాలం ఇలా ఉండేది:

"ఓ అల్లాహ్ మేము దైవప్రవక్త (సఅసం)ను మధ్యవర్తిగా ఉంచి కరువు కాటకాల కాలంలో వర్షం కోసం నిన్ను వేడుకునేవారం. నీవు వర్షాన్ని కురిపించేవాడివి. ప్రస్తుతం దైవప్రవక్త గారి ప్రియ పినతండ్రి గారిని మధ్యవర్తిత్వంతో నిన్ను (వర్షం కురిపించమని) వేడుకుంటున్నాము. వర్షాన్ని కురిపించవా!" ఈ దుఆ చేసిన తరువాత దైవకారుణ్యం పుష్కలంగా కురిసేది. *(అనస్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

హజ్రత్ ఉమర్ (రజి) గారి పరిపాలనా కాలంలో ఓ మారు వరుసగా తొమ్మిది

నెలలపాటు వర్షం కురవక తీవ్రమైన కరువు ఏర్పడింది. చరిత్రలో ఆ సంవత్సరం 'ఆమ్మల్ రమాద్' (బూడిద సంవత్సరం)గా పేరు గాంచింది. కరువు మూలంగా ప్రజల చర్మం మాడిపోయి బూడిద రంగుగా మారిపోవడం కారణంగా ఆ సంవత్సరానికి ఆ పేరు వచ్చింది. ప్రభుత్వం ఆ యేడు ప్రజల నుండి జకాత్ వసూలును నిలిపివేసి మరుసటి సంవత్సరానికి వాయిదా వేసింది. ఇది హిజ్రీ శకం 18వ సంవత్సరం జరిగిన సంఘటన.

హజ్రత్ ఉమర్ (రజి) వర్షం కోసం దైవాన్ని వేడుకునేందుకు హజ్రత్ అబ్బాస్ (రజి) గారితో సహా మెంబరు (ప్రసంగవేదిక) ఎక్కి నిలబడ్డారు. ఆ తరువాత హదీసులో చెప్పిన పదాలతో దుఆ చేసి, హజ్రత్ అబ్బాస్ (రజి)ను మీరు దుఆ చేయండి అని కోరారు.

హజ్రత్ అబ్బాస్ (రజి) అల్లాహ్ సన్నిధిలో ఇలా మొరపెట్టుకున్నారు : "ఓ అల్లాహ్! ఆపద కేవలం పాపాలు చేయడం మూలంగానే వస్తుంది. తౌబా (పశ్చాత్తాపం) చేయకపోతే అది తొలగదు. జాతి నన్ను నీ సన్నిధిలోకి తెచ్చి నిలిపింది. ఎందుకంటే నీ ప్రవక్త దృష్టిలో నాకు విలువ ఉండేది కాబట్టి. మేము పాపాలు చేసినవారం. దీనికి తోడు నీ సన్నిధిలో దోసిలొగ్గి యాచిస్తున్నాం. తౌబా చేస్తూ మా తలల్ని నీ పాద సన్నిధిలో వంచుతున్నాం. కాబట్టి ఓ ప్రభూ! వర్షం కురిపించి మమ్ము తృప్తిపరచు."

'తవస్సుల్' అంటే ఎవరినైనా అడ్డుగా పెట్టి అల్లాహ్ సన్నిధానంలో దుఆ స్వీకరించమని వేడుకోవడం. తసవ్వుఫ్ (ఓ నిగూఢతత్వజ్ఞానం (Mysticism)ను అనుసరించే వారు ఈ వసీలా విధానాన్ని నమ్ముతారు. ప్రవక్తలు, మహాపురుషులు, సత్యసంధులు అల్లాహ్‌కు అతి చేరువైన వారని అంటారు. వారు వారి స్థానం, వారి హోదా గొప్పది, అల్లాహ్ వారిపై ఎనలేని కారుణ్యాన్ని కురిపించాడు కాబట్టి వారిని అడ్డుపెట్టి ఏ దుఆ చేసినా అల్లాహ్ స్వీకరిస్తాడని నమ్ముతారు. (ఉదాహరణకు, ఫలానా వారి గౌరవం, ఫలానా వారి స్థాయి ఫలానా వారి సత్య సంధతకోసమైనా నా దుఆను స్వీకరించు అని వేడుకుంటారు).

అయితే ఓ విషయాన్ని బాగా గుర్తుంచుకోవలసి ఉందిక్కడ. ఏ మహాపురుషులను వసీలాగా చేసి (అడ్డుపెట్టుకుని) దుఆ చేస్తున్నామో ఆ దుఆ చేసేటప్పుడు ఆ మహాపురుషులు హాజరుగా ఉండరు. అలాగే ఎవరో ఒకరు తమను అడ్డుపెట్టుకుని దుఆ చేస్తున్నారన్న విషయమూ వారికి తెలియదు.

ఖుర్‌ఆన్, ప్రవక్త సంప్రదాయం (సున్నత్) ప్రవక్తగారి అనుచరుల నడవడి ద్వారా ఇలాంటి తవస్సుల్ ధర్మసమ్మతమన్న విషయం రుజువు కావడం లేదు. అలాగే దివ్య ఖుర్‌ఆన్‌లో అవతరించిన ఏ దుఆలోను ఎవరిని అడ్డుపెట్టుకొని దుఆ చేసినట్లు ఆధారాలు లేవు. ఇంకా దైవప్రవక్త (సఅసం)గారు దుఆలన్నిటిలో ఇలాంటి భావన ఎక్కడా కనబడదు. పైన చెప్పిన హదీసులోని పదాలను నిశితంగా సమీక్షిస్తే, అందు తేలే విషయం ఒక్కటి మాత్రమే. సజీవులైన సత్యసంధుల ద్వారా వసీలా పొందవచ్చు అన్నది అది. దీని విధానం

ఏమిటంటే పుణ్యపురుషులను, "నా గురించి అల్లాహ్ సన్నిధిలో దుఆ చేయండి" అని అడగడం. ఆ దుఆ చేసే వారైనా ఫలానా వ్యక్తి చేసే దుఆను మన్నించు అని వేడుకోవడం. మహాప్రవక్త (సఅసం) పరమపదించిన తరువాత ఏ ఒక్క సహాబీ (ప్రవక్త అనుచరుడు) కూడా ఆయన సమాధి దగ్గరకు వెళ్ళి తమరు నా గురించి దుఆ చేయండి లేక సిఫార్సు చేయండి అని అడిగినట్లు హదీసు గ్రంథాల్లో ఎలాంటి ఆధారాలు లేవు.

## పాపపరిహారం కోసం దైవాన్ని వేడుకోవడం (ఇస్తిగ్‌ఫార్)లో గల శుభాలు

(۱۲۱) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ لَزِمَ الْاِسْتِغْفَارَ جَعَلَ اللّٰهُ لَهٗ مِنْ كُلِّ ضِيْقٍ مَخْرَجًا وَمِنْ كُلِّ هَمٍّ فَرَجًا وَّ رَزَقَهٗ مِنْ حَيْثُ لَا يَحْتَسِبُ۔

(ابو داؤد عن ابن عباس کتاب الصلوٰۃ باب فی الاستغفار)

121. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "సతతం ఇస్తిగ్‌ఫార్ చేసేవాడికి (పాపాల మన్నింపు కోసం సతతం వేడుకునే వాడికి) అల్లాహ్, సంకటాలనుండి గట్టెక్కే మార్గాన్ని సుగమం చేస్తాడు. ఈ బాధల నుండి అతడికి ముక్తిని ప్రసాదిస్తాడు. ఆ వ్యక్తి ఆలోచనకు సయితం తట్టని ప్రదేశం నుండి అతనికి భుక్తిని కల్పిస్తాడు."

(ఇబ్నె అబ్బాస్ (రజి) - అబూ దావూద్)

**సంగ్రహణం :**

'ఇస్తిగ్‌ఫార్' 'అస్తగ్ఫిరుల్లాహ్' అని పలకడం. అంటే అర్థం, ఓ ప్రభూ! నా పాపాలను క్షమించు అని. దీని అసలు భావం ఏమిటంటే మనిషి ఏ పాపం మన్నింపు కోసమయితే అల్లాహ్‌ను వేడుకుంటున్నాడో ఆ పాపకార్యాన్ని సత్వరం, సాంతం వదలి వేయాలి. అదే పాపాన్ని పదే పదే ఆచరిస్తూ దేవుడు మన్నిస్తాడులే అని మన్నింపుకోసం వేడుకునేవాడు నిజంగా అల్లాహ్‌తో పరిహాసాలాడుతున్నట్లే. పాపాల మన్నింపుకోసం సతతం వేడుకుంటున్నాడంటే తన తప్పులపై, తన పాపకార్యాలపై దృష్టిని ఉంచుతున్నట్లే కదా. పూర్తి ఏకాగ్రతతో, దీనంగా రోజుకు వందసార్లైనా అల్లాహ్‌ను మన్నింపుకోసం

వేడుకోవాలి. ఇలా ప్రతి సంకటం నుండి, ప్రతి దుఃఖం నుండి గట్టెక్కే మార్గం లభ్యం అవుతుంది. (అంటే మనస్సులో ఓ రకమైన ప్రశాంతత, సాంత్వన చేకూరుతాయి).

అల్లాహ్ తన దాసునికి, అతనికి తెలియని ప్రదేశం నుండి అతని ఊహకు కూడా అందనటువంటి మార్గం ద్వారా భుక్తిని ప్రసాదిస్తాడు.

హ॥జ్రత్ హసన్ బస్రీ (రహ్మాలై) దగ్గరికి నలుగురు వ్యక్తులు ఒకరి తరువాత ఒకరు హాజరై తమ సమస్యలను ఏకరువు పెట్టుకున్నారు. ఒకడు కరువు గురించి వాపోతే, మరొకడు తన దారిద్ర్యం గురించి లేమిని గురించి చెప్పుకున్నాడు. మూడోవాడు, అయ్యా! నాకు కుమారుడు కలగాలని అల్లాహ్‌తో దుఆ చేయండి అన్నాడు. నాల్గోవాడు నా తోట ఎండిపోయింది అని చెప్పుకున్నాడు.

ఆయన ప్రతి ఒక్కడితోను, 'ఇస్తిగ్‌ఫార్' చెయ్యి అని పురమాయించారు. దీనికి కారణం లేకపోలేదు. ఎందుకంటే ఈ 'ఇస్తిగ్‌ఫార్' ద్వారా ప్రతి కోరిక నెరవేరుతుంది. విషమపరిస్థితులు అనుకూలంగా మార్తాయి. ఈ కష్టాలు కడగండ్లు, విషమ పరిస్థితులు వచ్చిపడడానికి, సాధారణంగా మన దుష్కర్మలు, పాపాలు కూడా సహాయకారులవుతాయి. కాబట్టి చిత్తశుద్ధితో తౌబా చేసి మనిషి దైవమార్గంపై మరలుతాడు. తన పాపాల గురించి తక్షణం క్షమాపణ వేడుకుంటాడు. అల్లాహ్ ఆ తప్పులన్నింటినీ క్షమించేయడం మూలంగా, పాపాల కారణంగా మనపై వచ్చిపడ్డ కష్టాలు కడగండ్లు తొలగిపోతాయి. వాటి నుండి విముక్తి లభిస్తుంది. దైవప్రవక్త (సఅసం) ఇస్తిగ్‌ఫార్ చేసే విధానాలెన్నో చూపించారు. కాని ప్రస్తుతం కేవలం రెండు పద్ధతుల్ని మాత్రం ఇక్కడ రాయడం జరుగుతుంది.

1. "రబ్బిగ్‌ఫిర్‌లీ వతుబ్ ఇలయ్య ఇన్నక అంతత్ తవ్వాబుర్రహీమ్"

(ఓ ప్రభూ! నన్ను క్షమించు. నాపై కరుణాకటాక్షాలను కురిపించు. నీవు నీ దాసుల తౌబాను స్వీకరించేవాడివి. ఎంతో కరుణామయుడవూను).

2. "అస్తగ్‌ఫిరుల్లా హల్లజీ లా ఇలాహ ఇల్లాహువల్ హయ్యుల్ ఖయ్యూమ్ వ అతూబు ఇలైహి."

(నా పాపాల గురించి మన్నింపు వేడుకుంటున్నాను. ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన నిత్యుడు, సజీవుడు, విశ్వసంచాలకుడు. నేనాయన వైపుకే మరలుతాను (తౌబా చేస్తున్నాను).

ప్రతి వ్యక్తికి తాను చేసిన పాపాలేమిటో బాగు తెలుసు. ఆ పాపాల్ని మననం చేసుకుంటూ సిగ్గుపడి, పదే పదే వాటి మన్నింపుకోసం వేడుకోవడంలో ఎంతో ప్రయోజనం ఉంది. కొందరు పుణ్యకార్యాలు చేస్తారు, దైవారాధనలు సలుపుతారు. అయితే తమ మనస్సుల్లో తమకు తెలియకుండానే నేనో పుణ్యాత్ముణ్ణి, సదాచార సంపన్నుణ్ణి అని

విర్రవీగుతారు. ఇలా మాటిమాటికి ఇస్తిగ్ఫార్ చేస్తూ పాప క్షమాపణకోసం వేడుకునే వారి హృదయాల్లో అలాంటి భావన ఏ మాత్రం పొడసూపదు. వారి మనసు నిర్మలంగా ఉంటుంది.

## షిర్క్ చేయడం మహా పాపం

(١٢٢) قَالَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَكْبَرُ الْكَبَائِرِ اَلْاِشْرَاكُ
بِاللهِ وَعُقُوْقُ الْوَالِدَيْنِ وَشَهَادَةُ الزُّوْرِ وَشَهَادَةُ الزُّوْرِ
ثَلٰثًا اَوْ قَوْلُ الزُّوْرِ فَمَا زَالَ يُكَرِّرُهَا حَتّٰى قُلْنَا لَيْتَهُ سَكَتَ

(بخاری عن ابی بکرۃ کتاب استتابۃ المرتدین)

122. దైవప్రవక్త (సఅసం) ఇలా నుడివారు : 1. అన్నింటికంటే గొప్ప అపచారం అల్లాహ్‌కు సాటి కల్పించడం. 2. తల్లిదండ్రులకు అవిధేయులుగా మెలగడం. 3. తప్పుడు సాక్ష్యం పలకడం. (దీన్ని మూడుమార్లు రిపీట్ చేశారు) లేక అసత్యమాడడం. (ఈ చివరి మాటను) అదే పనిగా చెబుతూ ఉంటే ఇక ఆయన అంతటితో ఆగిపోతే ఎంత బాగుండును అనుకున్నాం మేం." *(అబీబక్రహ్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

అల్లాహుతఆలా గుణ విశేషాలను ఏ వ్యక్తికో, ఏ ప్రదేశానికో లేక ఏ వస్తువుకో ఆపాదించడమంటే వాటిని అల్లాహ్‌కు సాటి కల్పించడం లాంటిది. ఉదాహరణకు ఒకరి ఎదుట మోకరిల్లడం, లేక ఆ వ్యక్తికో లేక ఆ ప్రదేశానికో ప్రదక్షిణ చేయడం, తన అవసరాలను తీర్చమని కష్టాలనుండి గట్టెక్కించమని మ్రొక్కటం, భక్తి ప్రపత్తులతో సాష్టాంగపడడం లేక ఆ వ్యక్తి ముక్తి ప్రదాత, సంకట విమోచనుడుగా భావించడం, కష్టాల్లో సహాయపడమని అర్థించడం వగైరాలు.

ఇకపోతే, ఏ ప్రవక్త షిర్క్‌ను మహాపచారంగా పేర్కొన్నారో ఆ ప్రవక్త (సఅసం)ను అనుసరించే వారిలో చాలామంది అనుకోకుండా ఆ షిర్క్‌లోనే లీనం అయి ఉండడం ఎంతో విచారకరమైన విషయం. అల్లాహ్‌కు సాటి కల్పించేవాడు ఓ రకంగా, ఆయనకు ద్రోహం చేస్తున్నట్లు ప్రకటించడమే. ఆయన పాలనకు సవాలు విసురుతున్నట్లే. ఇది మహాపరాధం. కాబట్టే అల్లాహ్, ఇలాంటి ద్రోహిని ఎన్నటికీ మన్నించను, సతతం నరక యాతనల్ని భరించడానికి నరక కూపంలో పడవేస్తాను అని నిర్ణయించుకున్నాడు.

# సమాధికి సజ్దా చేయడం నిషిద్ధం

(۱۲۳) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ فِي مَرَضِهِ الَّذِي مَاتَ فِيْهِ لَعَنَ اللّٰهُ الْيَهُوْدَ وَالنَّصَارٰى اِتَّخَذُوْا قُبُوْرَ اَنْبِيَآءِهِمْ مَسَاجِدَ۔ (بخاری عن عائشہ کتاب الجنائز، مسلم کتاب المساجد)

123. దైవప్రవక్త (సఅసం) తన మరణానికి ముందు వచ్చిన వ్యాధితో ఇలా సెలవిచ్చారు : "యూదులు, నసారాలపై అల్లాహ్ శాపం పడుగాక! వారు తమ ప్రవక్తల సమాధుల్ని సాష్టాంగపడే ప్రదేశాలుగా చేసుకున్నారు." *(ఆయిషా (రజి) - ముస్లిమ్)*

124. "గతించిన సమాజాలు తమ మహాపురుషులు, ప్రవక్తల సమాధుల్ని సజ్దా (సాష్టాంగ) ప్రదేశాలుగా చేసుకున్నారు. జాగ్రత్త! దాన్నుండి మిమ్మల్ని వారిస్తున్నాను. మీరు సమాధులను సజ్దా చేసే పుణ్య స్థలాలుగా చేసుకోకండి." *(జుందుబ్ (రజి) - ముస్లిమ్)*

**సంగ్రహణం :**

ఈ హదీసు ప్రకారం - ఆరాధనా భావంతో, భక్తిశ్రద్ధలతో లేక గౌరవ పూర్వకంగానైనా - ప్రవక్తల సమాధులకు, వలీల దర్గాలకు, మహాపురుషుల మజార్లకు సజ్దా చేయడం (సాష్టాంగపడడం) నిషిద్ధం. ఈ హదీసుల ద్వారా ప్రస్ఫుటమయ్యే మరో విషయం ఏమిటంటే సమాధి ఉన్న ఆవరణలో గాని, దాని పరిధిలోగాని నమాజు చేయడం ధర్మ సమ్మతం కాదు. అంటే దైవప్రవక్త సమాధులు ఉన్న ప్రాంగణంలో అల్లాహ్‌కు సైతం సజ్దా చేయడాన్ని సహించలేదు. ఇలా సజ్దా చేయడంలో షిర్క్ పోలికలుంటాయి. కాబట్టి షరీఅత్ బాగా తెలిసిన వారు మహాపురుషుల సమాధులున్న మస్జిదుల్లో కూడా నమాజు చేయడానికి ఒప్పుకోరు. హజ్రత్ ఉమర్ (రజి), హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) గారిని ఓ సమాధి దగ్గరగా నిలబడి నమాజు చేస్తూ ఉండగా చూసి రెండుసార్లు పిలిచి "అనస్? ఆ సమాధి నుండి జాగ్రత్త పడండి" అని హెచ్చరించారు. (బుఖారి) (దానికర్థం సమాధి దగ్గర నమాజు చేయకండి అని అనడమే) అయితే ఆయన అనస్ గారిని నమాజును తిరిగి చేయమని ఆదేశించకపోయినా సమాధి దాపులో నమాజు చేయడాన్ని మంచిదృష్టితో చూడలేదు.

## దైవేచ్ఛకు మరొకరి అభీష్టాన్ని జతచేయడం

(۱۲۵) اِنَّ رَجُلًا قَالَ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا شَاءَ اللّٰهُ وَ
شِئْتَ فَقَالَ لَهُ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَجَعَلْتَنِيْ
وَاللّٰهَ عَدْلًا بَلْ مَا شَاءَ اللّٰهُ وَحْدَهٗ۔

(مسند احمد عن ابن عباس نمبر ۱۸۳۹)

125. ఓ వ్యక్తి దైవప్రవక్త (సఅసం)తో "అల్లాహ్ అభీష్టానికి తోడు మీ అభీష్టం కూడా" అని అనగా, "నీవు నన్ను అల్లాహ్‌కు సరిసమానుడిగా చేశావు. కేవలం అల్లాహ్ అభీష్టం అని మాత్రమే పలుకు" అని ఆదేశించారు. (ఇబ్నె అబ్బాస్ (రజి) - ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

ఈ సువిశాల విశ్వాంతరాళంలో ఏది జరిగినా అది అల్లాహ్ అభీష్టం మేరకే జరుగుతుంది. దైవేచ్ఛ లేనిదే ఆకైనా రాలదు. ఏది చేసినా అది ఆయన ఇష్టం మాత్రమే. ఆయన అనుకున్నది జరిగితీరుతుంది. అల్లాహ్‌కు తప్ప మరెవ్వరికీ ఆ శక్తి లేదు. ఈ హదీసులోని వ్యక్తి మహాప్రవక్త (సఅసం)గారి ఘనత, గొప్పతనానికి ప్రభావితుడై "అల్లాహ్ అభీష్టానికి తోడు మీ అభీష్టం కూడా ఉంటే ఫలానా పని తప్పక నెరవేరుతుంది" అన్న పలుకులు దైవప్రవక్తకు నచ్చలేదు. ఆయన ఆ వ్యక్తికి హితబోధ చేస్తూ, బాబూ! అపచారం అలా అనకు. ఇదంతా కేవలం దైవేచ్ఛపైన్నే ఆధారపడి ఉంది. ఆయన తలుచుకుంటే ఏదైనా ఇట్టే జరిగిపోతుంది. ఇక్కడ మరొకరి ఇష్టానికి విలువేమిటి? అని అన్నారు.

## దైవప్రవక్త (సఅసం)కు సాష్టాంగపడడం

(۱۲۶) عَنْ قَيْسِ بْنِ سَعْدٍ قَالَ اَتَيْتُ الْحِيْرَةَ فَرَاَيْتُهُمْ
يَسْجُدُوْنَ لِمَرْزُبَانٍ لَهُمْ فَقُلْتُ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ اَحَقُّ اَنْ يُّسْجَدَ لَهٗ فَاَتَيْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ فَقُلْتُ اِنِّيْ اَتَيْتُ الْحِيْرَةَ فَرَاَيْتُهُمْ يَسْجُدُوْنَ
لِمَرْزُبَانٍ لَهُمْ فَاَنْتَ يَا رَسُوْلَ اللّٰهِ اَحَقُّ اَنْ نَّسْجُدَ لَكَ

قَالَ: أَرَأَيْتَ لَوْ مَرَرْتَ بِقَبْرِيْ أَكُنْتَ تَسْجُدُ لَهُ؛ قَالَ قُلْتُ لَا، قَالَ فَلَا تَفْعَلُوْا لَوْ كُنْتُ اٰمِرًا اَحَدًا اَنْ يَّسْجُدَ لِاَحَدٍ لَاَمَرْتُ النِّسَاءَ اَنْ يَّسْجُدْنَ لِاَزْوَاجِهِنَّ لِمَا جَعَلَ اللّٰهُ لَهُمْ عَلَيْهِنَّ مِنَ الْحَقِّ

(ابوداؤد کتاب النکاح باب فی حق الزوج علی المرأة)

126. హ్రజత్ ఖైస్ బిన్ సఅద్ (రజి) ఉల్లేఖనం ఇది : "నేను హేరా (పట్టణం) చేరుకోగా అక్కడి ప్రజలు తన సర్దారుకు (నాయకునికి) సజ్దా చేస్తున్నారు. (సాష్టాంగపడుతున్నారు). వీరి ఈ సజ్దాకు అర్హులు దైవప్రవక్త అని నేను మనస్సులో అనుకున్నాను. తిరిగి నేను దైవప్రవక్త సన్నిధికి హాజరైనప్పుడు ఈ విషయమే విన్నవించుకున్నాను. "దైవప్రవక్తా! హేరాలో ప్రజలు తమ నాయకుడికి సజ్దా చేయడం నేను చూశాను. అతనికంటే తమరే ఆ సజ్దాకు అర్హులు కదా!" అని (ఈ మాటలు విన్న) మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు:

"మీరు నా సమాధి దాపునుండి వెళ్ళేటప్పుడు దానికి సజ్దా చేస్తారా?" అని అడగ్గా లేదు (మేము సజ్దా చేయము) అని బదులిచ్చాను.

"అయితే అలా చేయకు. నేను గనక సజ్దాను అనుమతిస్తే భర్తలకు సజ్దా చేయమని వారి భార్యలకు ఆదేశించే వాణ్ణి. వారిపై భర్తలకు హక్కుంది కాబట్టి." (అబూ దావూద్)

**సంగ్రహణం :**

అల్లాహ్‌కు తోడు మరో మనిషికి సజ్దా చేయడం హరాం (ధర్మసమ్మతం కానిది) అన్న విషయం ఈ హదీసుద్వారా తేటతెల్లం అవుతోంది. అతడు దేవుని ప్రవక్త అయినా సరే. ఇదేవిధంగా దైవప్రవక్త (సఅసం) గారి సమాధికి సజ్దా చేయడం కూడా నిషిద్ధమే. ఈ విషయంలో సహాబా (రజి)ల వైఖరి ఎలా ఉండిందో గమనించండి. మహాప్రవక్త (సఅసం)గారి ప్రశ్నకు హ్రజత్ ఖైస్ బిన్ సఅద్ (రజి) ఇచ్చిన సమాధానం "మీ సమాధికి

సజ్దా చేయము" అన్నదే కదా! ఆయన, మీరు నా సమాధికి సజ్దా చేయకండి అని ఖరాఖండిగా చెప్పేశారు.

అయితే అవులియా అల్లాహ్ (దైవభక్తుల) సమాధులకు సజ్దా చేస్తూ అదో పుణ్యకార్యంగా భావించే అమాయక ముస్లిముల వైఖరిని ఏమనాలి! ఆ అవులియాలే స్వయంగా ఇలాంటి సజ్దాలు చేయవద్దని, అది షిర్క్ అని వారు జీవించి ఉండగానే హెచ్చరించిన సంగతి పాపం వారికి తెలియదు.



# దైవభీతి - విశ్వాస సర్వస్వం

## దైవభీతి - విశ్వాస సర్వస్వం

(۱۲۷) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ رَجُلًا كَانَ قَبْلَكُمْ رَغَسَهُ
اللّٰهُ مَالًا فَقَالَ لِبَنِيْهِ لَمَّا حُضِرَ اَيَّ اَبٍ كُنْتُ لَكُمْ ؟
قَالُوْا: خَيْرَ اَبٍ، قَالَ: فَاِنِّيْ لَمْ اَعْمَلْ خَيْرًا قَطُّ فَاِذَا مُتُّ
فَاَحْرِقُوْنِيْ ثُمَّ اسْحَقُوْنِيْ ثُمَّ ذَرُّوْنِيْ فِيْ يَوْمٍ عَاصِفٍ
فَفَعَلُوْا فَجَمَعَهُ اللّٰهُ عَزَّ وَجَلَّ فَقَالَ مَا حَمَلَكَ ؟ قَالَ:
مَخَافَتُكَ فَتَلَقَّاهُ بِرَحْمَتِهٖ -

(بخاری عن ابی سعید کتاب الانبیاء - کتاب الرقاق مسلم کتاب التوبۃ)

127. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం : "గతించిన కాలానికి సంబంధించిన ఓ సంపన్నుడు, మరణించే ముందు తన కుమారుల్ని పిలిచి, "నా గురించి మీ అభిప్రాయం ఏమిటి? ఓ తండ్రిగా మీ పట్ల నేనెలా మెలిగాను?" అని అడుగుతాడు. ఆ కుమారులు 'మీరు ఓ ఉత్తమమైన తండ్రిగా ప్రవర్తించార'ని బదులిస్తారు. దానికి ఆ తండ్రి 'నెనెప్పుడూ సత్కార్యాలు చేయలేదు. (దైవన్యాయస్థానంలో హాజరయితే శిక్షకు గురికాక తప్పదు. నా మరణానంతరం నేను ఆదేశించినట్లుగా అమలుచేయండి). నేను మరణించాక నా శవాన్ని అగ్నిలో పడవేసి బాగా కాల్చండి. బొగ్గుగా మారిన నా శవాన్ని పొడిచేసి (ఆ బూడిదను) హోరు గాలిలో చెల్లాచెదరయ్యేటట్లు వెదజల్లండి" అని ఆదేశిస్తాడు. (తన కుమారులతో ప్రమాణం చేయించుకున్న తరువాత అతడు చనిపోతాడు). వారు అతని మరణ శాసనం అమలుచేసి అతని కోరికను నెరవేరుస్తారు.

అల్లాహ్ అతని బూడిదకు సంబంధించిన ప్రతి అణువును ఓ చోట చేర్చి ప్రాణం పోసి లేపి అడుగుతాడు. నీవు ఇలా ఎందుకు చేశావు అని.

"స్వామీ ఇదంతా నీ భయభీతుల వల్లనే చేశాను" అని జవాబు చెబుతాడు ఆ వ్యక్తి. (ఇది విని) అల్లాహ్ తన కారుణ్యంతో అతణ్ణి మన్నించివేస్తాడు.

*(అబూ సయీద్ (రజి) - బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

మనిషి సతతం అల్లాహ్‌కు జవాబు చెప్పుకోవలసి ఉంటుంది అన్న భావనలో ఆయనకు భయపడుతూ ఉండాలి అన్నది ఈ హదీసు ద్వారా తెలిసే విషయం. అల్లాహ్‌ను విశ్వసించిన తరువాత తనపై పడే బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించేవారు, ఆయన న్యాయస్థానంలో హాజరై కర్మలకు జవాబు చెప్పుకోవలసి ఉంటుందన్న భయంతో గడగడ వణికిపోయేవారు అల్లాహ్ కరుణా కటాక్షాలకు, ఆయన మన్నింపుకు ఎన్నడూ దూరం కాజాలరు.

## ఇహలోక వ్యధలు అతి స్వల్పం

(۱۲۸) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَوْ تَعْلَمُوْنَ مَا اَعْلَمُ
لَضَحِكْتُمْ قَلِيْلاً وَلَبَكَيْتُمْ كَثِيْرًا۔ (بخاری عن انس کتاب الرقاق)

128. "నాకు తెలిసిన విషయాలు మీకే తెలిస్తే మీరు అతి స్వల్పంగా నవ్వేవారు, అధికంగా ఏడ్చేవారు" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

*(అనస్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

కర్మల ఫలితాలకు సంబంధించిన యదార్థాల్ని మనిషి ఈ చర్మచక్షువులు గాంచలేవు. మరణ వ్యధ ఎంత తీవ్రమైనదో కూడా మనిషి ఊహించలేడు. బర్జఖ్ (ఆత్మలుండే లోకం)లో ఎలాంటి పరిస్థితి ఎదురవుతుందో, ప్రళయం రోజున ఎలాంటి కడగండ్లను ఎదుర్కోవలసి వస్తుందో ఎవ్వరికీ తెలియని విషయం. మహాప్రవక్త (సఅసం) ఈ విషయాల గురించి నేను బాగా ఎరుగుదును, అది మీకు అర్థమయ్యేవి కావు. నాకున్న ఈ యదార్థాల జ్ఞానం మీకూ ఉంటే మీరు అసలు నవ్వేవారే కారు. సతతం దుఃఖించేవారు అని సెలవిచ్చారు.

దైవధిక్కార నేరానికి, దురాచారాలు, దుర్నడతలు అవలంబించినందుకు దుష్కర్మల నాచరించినందుకు పడే శిక్ష ఎలాగుంటుందో మనం చూస్తుంటే మన ముఖాలు ఆ భయంవల్ల రక్తహీనమై పాలిపోతాయి. ఇది ముమ్మాటికీ నిజం, భవిష్యత్తులో రాబోయే విపత్తు ఏదో తెలిసిపోతే ముఖం పైన నవ్వు ఎలా వస్తుంది? భయవిహ్వాలుడైనవాడు ఏడ్వకుంటే ఏం చేస్తాడు?

## హజ్రత్ ఉమర్ (రజి) గారి దైవభీతి

(۱۲۹) وَلَجَ عَلَيْهِ شَابٌّ مِنَ الْاَنْصَارِ فَقَالَ اَبْشِرْ يَا اَمِيْرَ الْمُؤْمِنِيْنَ؛ بِبُشْرَى اللهِ عَزَّ وَجَلَّ، كَانَ لَكَ مِنَ الْقِدَمِ فِي الْاِسْلَامِ مَا قَدْ عَلِمْتَ ثُمَّ اسْتُخْلِفْتَ فَعَدَلْتَ ثُمَّ الشَّهَادَةُ بَعْدَ هٰذَا كُلِّهٖ، فَقَالَ لَيْتَنِيْ يَا ابْنَ اَخِيْ ــــ وَذٰلِكَ كَفَافٌ ــ لَا عَلَيَّ وَلَا لِيْ۔ (بخاری عن عمرو بن میمون کتاب الجنائز)

129. అగ్ని ఆరాధకుడు, హ(జత్ ఉమర్ (రజి)ను హత్యచేసే ఉద్దేశ్యంతో ఆయనపై (కత్తితో) దాడిచేశాడు. ఓ అన్సారీ యువకుడు ఆయన్ను చూడవచ్చి అమీరుల్ మోమినీన్! అల్లాహ్ శుభాశీస్సులను స్వీకరించండి. మీరు ఇస్లాం ధర్మాన్ని స్వీకరించడంలోను, దాన్ని వ్యాపింప జేయడంలోను ముందడుగు వేశారు. ఆ తరువాత ఖిలాఫత్ పదవి మీకు అప్పజెప్పబడినప్పుడు మీరు న్యాయవంతంగా పరిపాలించారు. (ఇప్పుడు) దైవమార్గంలో అమరగతి నొందారు అని పలికారు. ఇది విన్న హ(జత్ ఉమర్ (రజి) సోదరకుమారా! ఇస్లామీయ ఖిలాఫత్ విషయంలో నేను ఎలాంటి బహుమానం పొందడంగాని, ఎలాంటి శిక్షకు గురికావడం గాని జరగక నా సత్కార్యాలూ నా తప్పులకు సరిపోయి నేను వదిలేయబడితే అంతే చాలునని కోరుకుంటున్నా"నని బదులిచ్చారు.

*(అమ్రూ బిన్ మైమూన్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

ముగైరా బిన్ షుఐబా (రజి) గారి బానిస (ఫీరోజ్, విషంబూసిన కైజారుతో (హి(జీ శకం 32, జుల్ హజ్జ 26 నాడు) ఆయన్ను హతమార్చాలనే ఉద్దేశ్యంతో పొడిచిగాయ పరిచాడు. మూడు నాలుగు రోజుల వరకు ఎడతెగకుండా రక్త(సావం జరిగింది. ఈ గాయం వల్లనే ఆయన అమరగతి పొందారు. ఆ మూడు రోజుల వ్యవధి కాలంలో హ(జత్ అబ్బాస్ (రజి) గారే కాకుండా ఓ అన్సారీ యువకుడు ఆయన (పాభవాన్ని పొగడగా, మరణానంతరం కర్మలకు జవాబు చెప్పుకోవలసి ఉంది అనే తీ(వమైన ఆందోళనకు గురౌతున్న ఆ ఉత్తముడు వారి పొగడ్తలకు జవాబుగా చెప్పింది కేవలం సత్కార్యాలు నా తప్పులకు సరిపోయి నేను వదిలేయబడితే అంతే చాలు ఇది నా కోరిక" అని అంటారు.

## హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా)గారి దైవభీతి

(۱۳۰) اِنَّ عَائِشَةَ قَالَتْ دَعْنِیْ مِنْكَ یَا ابْنَ عَبَّاسٍ، وَالَّذِیْ نَفْسِیْ بِیَدِهٖ لَوَدِدْتُ اَنِّیْ كُنْتُ نَسْیًا مَّنْسِیًّا۔

(مسند احمد عن ابن عباس نمبر ۲۴۹۶)

130. హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి)తో ఇలా అన్నారు :

ఇబ్నె అబ్బాస్! పోనిద్దురు (ఎందుకిలా అంటారు) ఎవరి గుప్పెట్లో నా ప్రాణాలున్నాయో ఆ అల్లాహ్ సాక్షి! నేను పూర్తిగా మరిపింపబడితే నాకదే చాలు. ఇది నా కోరిక." (ఇబ్నె అబ్బాస్ (రజి) - ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) గారి ప్రియ సతీమణి హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) పరలోకంలో జవాబు చెప్పుకోవలసి ఉంది అనే భయంతో గడగడలాడిపోతూ పలికిన మాటలివి. ఆమె మరణానికి కొన్ని నిమిషాల ముందు అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఆమెను పరామర్శిస్తూ ఇస్లామ్‌లో ఆమె అంతస్తు హోదా ఇంకా ఆమె అందజేసిన సేవల గురించి ప్రస్తావిస్తూ పొగిడినప్పుడు ఆమె సెలవిచ్చిన మాటలు ఇవి:

"ఏమిటి మీరనేది? నేను కోరేదల్లా నన్ను అక్కడ మరచిపోతే చాలు అని. అసలు నా ఊసే అక్కడ రాకుండా ఉండడం మంచిది. నేను దైవసన్నిధిలో హాజరై నా కర్మల గురించిన లెక్క జూపడం అంటేనే భయమేస్తుంది నాకు."

## కనుమరుగైన యదార్థం

(۱۳۱) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِنِّیْ اَرٰی مَا لَا تَرَوْنَ وَاَسْمَعُ مَا لَا تَسْمَعُوْنَ، اَطَّتِ السَّمَاءُ وَحَقَّ لَهَا اَنْ تَئِطَّ، مَا فِیْهَا مَوْضِعُ اَرْبَعِ اَصَابِعَ اِلَّا وَمَلَكٌ وَاضِعٌ جَبْهَتَهٗ لِلّٰهِ سَاجِدًا۔ وَاللّٰهِ لَوْ تَعْلَمُوْنَ مَا اَعْلَمُ لَضَحِكْتُمْ قَلِیْلًا

وَلَبَكَيْتُمْ كَثِيرًا، وَمَا تَلَذَّذْتُمْ بِالنِّسَاءِ عَلَى الْفُرُشِ
وَلَخَرَجْتُمْ إِلَى الصُّعُدَاتِ تَجْأَرُوْنَ إِلَى اللهِ — "لَوَدِدْتُ
أَنِّيْ كُنْتُ شَجَرَةً تُعْضَدُ". (ترمذی ابواب الزھد عن ابی ذر)

131. దైవప్రవక్త (సఅసం) ఈ విధంగా సెలవిచ్చారు : "నేను చూస్తూ ఉన్నది మీరు చూడలేరు. నేను వింటూ ఉన్నది మీరు వినలేరు. (దైవదూతల బరువుతో) ఆకాశం చర చర లాడుతోంది. అది అలా చరచర లాడాల్సిందే."

ఆకాశంలో దైవదూతలు సాష్టాంగపడనటువంటి ఓ బెత్తెడు జాగా కూడా లేదు. అల్లాహ్ సాక్షిగా! నాకు తెలిసిందల్లా మీరు గ్రహిస్తే ఏ కొద్దిగానో నవ్వేవారు. అతిగా ఏడ్చేవారు. పడకలపై మీ భార్యలతో సుఖ మనుభవించే వారు కారు. అల్లాహ్‌ను వేడుకునేందుకు ఎడారుల్లోకి, మైదానాల్లోకి వెళ్ళిపోయేవారు."

ఈ ప్రవచనాన్ని ఉల్లేఖించిన తరువాత హ(జత్ అబూజర్ గప్ఫారి (రజి) ఇలా పలికారు : "నేను (మనిషిగా పుట్టకుండా) ఓ వృక్షాన్నై అది దాని మొదలంటూ నరికి వేయబడితే ఎంత బాగుండేది" అని.

*(అబూజర్ (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

ఆకాశం చరచరలాడుతోంది అంటే అది అల్లాహ్‌ను కీర్తిస్తోంది. కనుక ఆ శబ్దం వస్తోంది అని కూడా అనుకోవచ్చు. బుద్ధిజ్ఞానాలను సంతరించుకున్న ప్రతి ప్రాణి ప్రళయ దినం నాడు అల్లాహ్ ఏర్పరిచే పక్షపాత రహితమైన న్యాయస్థానంలో తన జీవితపు కర్మలన్నిటికి లెక్క చూపవలసి ఉంది. ఆ జవాబుదారి భావనే హ(జత్ అబూజర్ గప్ఫారి (రజి)ను భయకంపితునిగా చేసింది. అందుకే ఆయన, తాను ఓ మనిషిగా కాకుండా ఓ వృక్షాన్నై జన్మిస్తే బాగుండేదని, తనకు లెక్క చెప్పుకునే బాధ్యత తప్పేదని భావించారు. మానవుడై పుట్టినందుకు తాను తన కర్మలకు లెక్క చూపడానికి ఆ న్యాయస్థానంలో తప్పక హాజరు కావలసిందే. అది ఓ కఠినమైన మజిలీ అని ఆయన వాపోయారు.

## దుష్కర్మలు - సహాబా (రజి) దృష్టిలో

(۱۳۲) عَنْ اَنَسٍ رَضِیَ اللّٰہُ عَنْہُ قَالَ اِنَّکُمْ لَتَعْمَلُوْنَ اَعْمَالًا ھِیَ اَدَقُّ
فِیْ اَعْیُنِکُمْ مِنَ الشَّعْرِ اِنْ کُنَّا نَعُدُّ عَلٰی عَھْدِ النَّبِیِّ صَلَّی اللّٰہُ
عَلَیْہِ وَسَلَّمَ مِنَ الْمُوْبِقَاتِ قَالَ اَبُوْعَبْدِ اللّٰہِ یَعْنِیْ الْمُھْلِکَاتِ

(بخاری کتاب الرقاق)

132. "ఏ పాపాలైతే మీ దృష్టిలో తల వెంట్రుకలకన్న తేలికగా కనబడుతున్నాయో, దైవప్రవక్త (సఅసం) గారి హయాంలో అవి మాకు ఘోరమైన పాపాలుగా అగుపడేవి" అని హజ్రత్ అనస్ (రజి) సెలవిచ్చారు.

*(అనస్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం) తమ అనుచర గణానికి గరపిన శిక్షణలో దైవభీతికి ఎంతో ప్రాధాన్యత నిచ్చారు. దాని ప్రకారం ఏ దుష్కర్మలనయితే మనం అవి తేలికమైనవిగా ఎంచి లెక్కలోనికి తీసుకోమో వాటినే వారు ఓ పర్వతంలా భారమైనవిగా భావించేవారు. చిన్నా చితకా తప్పిదాలు జరిగిపోయినా అవి వారిని నిట్టనిలువున ముంచేయగలవని తలిచేవారు. ఆ చిన్న చిన్న పాపాల నుండి దూరంగా ఉండడానికి ప్రయత్నం చేసేవారు. మనిషిలో దేవుని ఎడల భయభక్తులు సంపూర్ణంగా ఏర్పడినప్పుడే అది సంభవం. చిన్న చిన్న పాపాలను తేలికైనవిగా భావించి వాటిని పదే పదే చేస్తూ ఉంటే అవే పెద్ద పాపాల్లోనికి పరివర్తనం చెందుతాయన్న యదార్థాన్ని మనం మరువ కూడదు.

## ప్రామాణికమయిన తక్వా (దైవభీతి)

(۱۳۳) عَنْ اَبِیْ بُرْدَۃَ بْنِ اَبِیْ مُوْسٰی قَالَ قَالَ لِیْ عَبْدُ اللّٰہِ بْنُ عُمَرَ
ھَلْ تَدْرِیْ مَا قَالَ اَبِیْ لِاَبِیْکَ؟ قَالَ، قُلْتُ، لَا، قَالَ فَاِنَّ
اَبِیْ قَالَ لِاَبِیْکَ، یَا اَبَا مُوْسٰی! ھَلْ یَسُرُّکَ اِنَّ اِسْلَامَنَا
مَعَ رَسُوْلِ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ وَھِجْرَتَنَا مَعَہٗ وَ

جهادنا معه وعملنا كله معه برد لنا وان كل عمل

عملنا بعده نجونا منه كفافا راسا براس فقال ابوك

لابي، لا والله قد جاهدنا بعد رسول الله صلى الله

عليه وسلم وصلينا وصمنا وعملنا خيرا كثيرا واسلم

على ايدينا بشر كثير وانا لنرجو ذلك۔

قال ابي:- ولكني انا والذي نفس عمر بيده لوددت ان

ذلك برد لنا- وان كل شيء عملنا بعده نجونا منه كفافا

راسا براس،

فقلت: ان اباك والله كان خيرا من ابي

(مشکوٰۃ کتاب الرقاق باب البکاء والخوف بحوالہ بخاری)

133. హ్రజత్ అబూ బుర్దా (రజి) గారి ఉల్లేఖనం ఇది : ఓ రోజు హ్రజత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) నాతో, "నా తండ్రిగారు (హ్రజత్ ఉమర్) మీ తండ్రి (అబూ మూసా అష్అరి–రజి) ఏమన్నారో మీకు తెలుసా అని అడిగారు. తెలియదు అని బదులిచ్చాన్నేను. "మా నాన్నగారు మీ నాన్న గారిని ఇలా అడిగారు అని చెప్పనారంభించారు.

"అబూ మూసా! దైవప్రవక్త (సఅసం) గారి ప్రాభవం తరువాత మనం ఇస్లామ్ స్వీకరించాం. ఆయన శిక్షణలో మాకు హిజ్రత్, జిహాద్‌లు చేయడమే కాకుండా అనేక పుణ్యకార్యాలు ఆచరించాం. ఆ కర్మలన్నిటికి లభించే పుణ్యఫలం మనకోసం సురక్షితంగా ఉండి, మహాప్రవక్త (సఅసం) అనంతరం మనం ఆచరించిన సత్కార్యాలు మనవల్ల జరిగిపోయిన దుష్కార్యాలు సరికి సరిగా కొట్టివేయబడితే ఎంత బాగుండునో అని మీరు అనుకోరా?" అని.

ఇది విన్న మీ నాన్నగారు, "లేదండి, అల్లాహ్ సాక్షి! దైవప్రవక్త గారి తరువాత మనం జిహాద్ (ధర్మయుద్ధం)లో పాల్గొన్నాం. నమాజులు ఆచరించాం, రోజాలు పాటించాం. అలాగే అనేక సత్కార్యాలు చేశాం.

మన చేతిమీదుగా ఎంతో మంది ఇస్లాం స్వీకరించారు. అల్లాహ్ మనం ఆచరించిన ఆ సత్కార్యాలన్నిటికి పుణ్యఫలం తప్పకుండా ఒసగుతాడని నేను దృఢంగా విశ్వసిస్తున్నా"అని బదులిచ్చారు.

అప్పుడు మా నాన్నగారు (హజ్రత్ ఉమర్ (రజి), కాని నా ప్రాణాల్ని తన గుప్పిట్లో ఉంచుకున్న ఆ దేవుని సాక్షిగా చెబుతున్నాను. మహాప్రవక్త (సఅసం) గారి కాలంలో మనమాచరించిన పుణ్యకార్యాలన్నీ స్వీకరించ బడాలని, ఆయన అనంతరం మనం ఆచరించిన మిగతా కర్మల గురించి మనలను ప్రశ్నించకుండా మనల్ని సరికిసరిగా వదిలివేయాలని నేను కోరుకుంటున్నాను అని బదులిచ్చారు. ఈ హదీసు ఉల్లేఖన కర్త హజ్రత్ బుర్దా (రజి) అది విని, దైవసాక్షి! మీ తండ్రిగారు మా నాన్నగారి కంటే ఉత్తములు" అని చెప్పారు. *(మిష్కాత్)*

**సంగ్రహణం :**

హజ్రత్ ఉమర్ గారి దైవభీతి, ఆయన జాగరూకతల గురించి నిశితంగా అధ్యయనం చేస్తే, ఆయనకు తాను చేసిన సత్కార్యాలపై నమ్మకం లేదని, దానికి ప్రతిఫలాన్ని ఆయన ఆశించడం లేదని తెలుస్తోంది. కేవలం తన తప్పిదాలకు పడే శిక్షగురించి ఆయన ఆందోళనంతా. ఆ శిక్ష పడకుండా ఉండాలనేదే ఆయన కోరిక. అయితే ఆయన ఆదర్శప్రాయమైన ప్రామాణికమైన పరిపాలన ఇస్లామీయ చరిత్ర పుటల్లో స్వర్ణాక్షరాలతో రాయబడింది. అదేకాదు, దైవప్రవక్త (సఅసం) ఆయన స్వర్గవాసి అనే శుభవార్తను కూడా వినిపించారు. అయినా ఆయన తాను చేసిన తప్పిదాలను గురించి ప్రశ్నించకుండా పుణ్యకార్యాలకు సరికిసరిగా వదిలిపెడితే బాగుండునని కోరుకుంటున్నారు. ఇక మన పరిస్థితి? ఏ చిన్నపాటి సత్కార్యం చేసినా, ఏ మాత్రం దైవనామాన్ని జపించినా ధర్మోన్నతి కోసం నామమాత్రపు కృషి సల్పినా ఇక మనం స్వర్గానికి వారసులం అనే అపోహలకు గురైపోతుంటాం.

## మోమిన్ (విశ్వాసి) దృష్టిలో పాపం

قَالَ (عَبْدُ اللّٰهِ بْنُ مَسْعُوْدٍ) اِنَّ الْمُؤْمِنَ يَرٰى ذُنُوْبَهٗ كَاَنَّهٗ قَاعِدٌ
تَحْتَ جَبَلٍ يَّخَافُ اَنْ يَّقَعَ عَلَيْهِ وَ اِنَّ الْفَاجِرَ يَرٰى ذُنُوْبَهٗ
كَذُبَابٍ مَرَّ عَلٰى اَنْفِهٖ فَقَالَ بِهٖ هٰكَذَا۔

(بخاری کتاب الدعوات، ترمذی ابواب القیامۃ)

134. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) ఇలా పలికారు :

"మోమిన్ (విశ్వాసి) తన పాపాలను పర్వతంలా భారమైనవిగా భావిస్తాడు. అప్పుడే తన మీద పడిపోతున్న పర్వతంలా తలచి భయపడతాడు.

ఇక ఫాజిర్ (పాపం అంటే లెక్క చేయనివాడు) కు ఆ పాపం ఓ ఈగలా తోస్తుంది. దాన్ని, అప్పుడే తన ముక్కు మీదనుంచి ఎగిరిపోయిన ఓ ఈగలా తలపోస్తాడు" ఇలా అంటూ ఆయన ముక్కుకు అడ్డుగా తన చేతిని విసిరి చూయించారు. *(బుఖారి, తిర్మిజి)*

**సంగ్రహణం :**

విశ్వాసి పాపాలకు అతీతుడు కాడు. అతని వల్ల తప్పులు దొర్లుతూనే ఉంటాయి. అయితే పాపాలను లేక తప్పులను అదేవిధంగా పదే పదే కొనసాగించడు. అలాగే తాను చేసిన ఘనకార్యాలను గురించి గొప్పలు చెప్పుకోడు. దాసుడు తన మానవ బలహీనతల మూలంగా పాపం చేస్తాడు. తప్పులు చేస్తాడు. అలా పొరపాటున జరిగిపోయిన పాపానికి అతడు అనునిత్యం చింతిస్తూ, తాను పర్వతం క్రింద నలిగిపోతున్నానా అన్నంత భీతి చెందుతాడు. అల్లాహ్ న్యాయస్థానంలో పాపాల గురించి ప్రశ్నింపబడతానన్న భయం అతణ్ణి నిలువెల్ల వణికిస్తుంది. అతని కళ్ళ వెంట అశ్రువులు టపటపా రాలిపోతుంటాయి. పాపం చేసినందుకు అతని తల సిగ్గుతో వంగిపోతుంది. మన్నింపుకోసం తన శిరస్సును కరుణామయుడైన ఆ ప్రభువు సన్నిధిలో వాల్చేసి ప్రభూ! ఓ కృపాకరా! దాసులను మన్నించే కరుణామయా! ఈ ఒక్కసారి కోసం నన్ను మన్నించు ఇంకెప్పుడూ నీ ఆజ్ఞ జవదాటను అని దీనాతి దీనంగా వేడుకుంటాడు.

ఇక ఫాజిర్ (అంటే దైనందిన జీవితంలో బాహాటంగా నిర్భయంగా పాపాలకు పాల్పడేవాడు అని అర్థం) తన పాపాలకు, దుర్నడతలకు లభించే పరలోక శిక్ష గురించి ఏ మాత్రం పట్టించుకోకుండా మరిన్ని పాపాలకు ఒడిగడతాడు. తన ఈ నికృష్ట జీవితం గురించి తాను ఏర్పరుచుకున్న భావన అతి తేలికైన భావన. ఈగ ముక్కుపై వ్రాలినా లేక ఆ ముక్కు పై నుండి ఎగిరిపోయినా దాన్ని ఎలా పట్టించుకోమో అలా తన పాపాల గురించి పట్టించుకోడు. మరణానంతరం దేవుని న్యాయస్థానంలో అతడు చేసిన పాపాలు, దుర్మార్గాలు విచారణకు వస్తాయి. వాటి శిక్షల తీర్పును అతడక్కడ వినబోతున్నాడు. నరకంలో అతడు వాటి శిక్షను అనుభవించక తప్పదు.

## నరకం నుండి తప్పకునే మార్గం

(۱۳۵) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَلِجُ النَّارَ رَجُلٌ بَكَىٰ مِنْ
خَشْيَةِ اللّٰهِ حَتّٰى يَعُوْدَ اللَّبَنُ فِي الضَّرْعِ وَلَا يَجْتَمِعُ غُبَارٌ فِيْ سَبِيْلِ
اللّٰهِ وَدُخَانُ جَهَنَّمَ (ترمذی عن ابی ہریرہ ابواب فضائل الجہاد)

135. దైవభయం వల్ల ఏడ్చేవాడు, పాలు తిరిగి స్తనములలోనికి వెళ్ళేంత మట్టుకు నరకంలోనికి ప్రవేశింపజాలడు. అల్లాహ్ మార్గంలో కృషి చేసినప్పుడు లేచిన దుమ్ము, ధూళి మరియు నరకం నుండి బయటకు వచ్చే పొగలు సెగలు ఓ చోట చేరవు" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. *(అబూ హురైరా (రజి) - తిర్మిజి)*

**సంగ్రహణం :**

దేవునికి భయపడేవాడు ఆయన ఆదేశాలను శిరసావహించేందుకు కృషి చేస్తాడు. ఆయన ఆజ్ఞోల్లంఘన వైఖరికి దూరంగా ఉంటూ అల్లాహ్ న్యాయస్థానంలో ఓ రోజున నిలబడి లెక్క చూపవలసి ఉంటుందన్న భయంతో గడగడలాడిపోతాడు. అతని కళ్ళ నుండి అశృవులు రాలు తుంటాయి. అలాంటి వ్యక్తి పాలు పితికిన తరువాత తిరిగి స్తనములలోనికి ఎలా వెళ్ళజాలవో నరకంలోనికి ప్రవేశించడం అంటే అసంభవమైన విషయం. ఏ వ్యక్తి అయితే దైవధర్మ స్థాపన కోసం కృషి సలుపుతూ ఉంటాడో అతడు ఆ నేరానికి గాను అనేక కష్టాలకు కడగండ్లకు గురి కావలసి వస్తుంది. అల్లాహ్ దృష్టిలో అతనికి ఎంతో గొప్ప విలువ ఉంది. ఈ మార్గంలో కలిగే దుఃఖాలు బాధలు వృధాగా పోవు. చివరికి ఆ మార్గంలో కృషి చేసినప్పుడు అతని కాళ్ళనుండి పైకి లేచిన దుమ్ము, ధూళి అతణ్ణి నరకం లోనికి వెళ్ళనీయవు. కేవలం అల్లాహ్ సంతుష్టికోసం ఇస్లాం ధర్మాన్ని ప్రపంచంలో వ్యాప్తిచేయడానికి కృషి చేసేవాడు ఎంతో ధన్యుడు.

## పరమ గౌరవనీయుడెవరు?

(۱۳۶) قِيْلَ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ اَكْرَمُ النَّاسِ؟ قَالَ اَكْرَمُهُمْ
اَتْقَاهُمْ۔ (بخاری عن ابی ہریرہ کتاب الانبیاء)

136. అందరిలో గొప్పవాడెవరు దైవప్రవక్తా! అని అడిగినప్పుడు "దేవునికి అందరికంటే ఎక్కువగా ఎవరు భయపడతాడో అతడే అత్యంత గౌరవనీయుడు" అని సెలవిచ్చారు దైవప్రవక్త (సఅసం).

(అబూ హురైరా (రజి) - బుఖారి)

**సంగ్రహణం :**

ప్రపంచంలోని ప్రతి సమాజంలోను గౌరవనీయునిగా వి.ఐ.పి.గా పిలువబడేవాడు సిరిసంపదలు, మంది మార్బాలాలు గలవాడే. ఆ సిరి సంపదల్ని ప్రజలను పీడించి సంపాదించినా, అక్రమ మార్గాలనుపయోగించి సొంతం చేసుకున్నాసరే అన్యాయం, అవినీతి, అక్రమం దోపిడీల్లో తనకు తానే సాటి అనిపించుకునేవాడే గొప్ప గౌరవనీయుడిక్కడ. దీనికి భిన్నంగా ఇస్లామీయ సమాజంలో గౌరవం పొందడానికి, గొప్పవాడనిపించుకోవడానికి అర్హుడు కేవలం వక్రమార్గాలకు దూరంగా ఉండేవాడు, ప్రతి విషయంలోను అల్లాహ్‌కు భయపడుతూ అడుగు ముందుకు వేసేవాడే. అతడో సాధారణ కూలివాడైనా, బక్కచిక్కిన రైతైనా సరే.

## 'తక్వా' అంటే

(۱۳۷) قَالَ ابْنُ عُمَرَ لَا يَبْلُغُ الْعَبْدُ حَقِيْقَةَ التَّقْوٰى حَتّٰى يَدَعَ
مَا حَاكَ فِي الصَّدْرِ (بخاری کتاب الایمان باب اول)

137. "మనస్సులో అనుమానాలను రేపే ప్రతి విషయాన్ని విడనాడని వాడు తక్వా (దైవభీతి)లో లోతుపాతులను కానలేడు" అని హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్లా (రజి) సెలవిచ్చారు. (బుఖారి)

**సంగ్రహణం :**

ఏ పని చేసినప్పుడు మనిషి అంతరాత్మ అతణ్ణి 'ఇది తప్పు' అని నిలదీస్తుందో అలాంటి పనిని వదిలేయడమే తక్వా అని నిర్వచించవచ్చు. ఇదే దైవభీతి అంటే. కొందరు పైకి కనబడేటట్లు ధార్మిక వేషధారణ చేస్తారు. కొన్ని ఆచార వ్యవహారాల్లోను ధార్మిక వైఖరినే అవలంబిస్తారు. దీన్నే వారు 'తక్వా' అని ఈ వైఖరిని అవలంబించిన వాడిని 'ముత్తఖీ' అని భావిస్తారు. ఇది పొరపాటు. తక్వా అంటే మనిషి తన జీవితంలోని ప్రతి వ్యవహారంలోను, ప్రతి రంగంలోను పాపాల ముళ్ళ పొదల్లో నుండి తనను తన వస్త్రాలను రక్షించుకుంటూ ఎలా జాగ్రత్తగా నడుస్తాడో అలా నడవాలి. అదేవిధంగా దైవాదేశధిక్కార కర్మల ముళ్ళు తన నిర్మలమైన ఆత్మకు గుచ్చుకొని ఎక్కడ గాయపరుస్తాయో అని భయపడుతూ అడుగు ఎంతో సావధానంగా ముందుకు వేయాలి. ఇదే తక్వా అంటే.

# పాపాన్ని గుర్తించే రెండు గురుతులు

(۱۳۸) عَنِ النَّوَّاسِ بْنِ سَمْعَانَ قَالَ سَأَلْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنِ الْبِرِّ وَالْإِثْمِ؟ فَقَالَ اَلْبِرُّ حُسْنُ الْخُلُقِ وَالْإِثْمُ مَا حَاكَ فِي الصَّدْرِ وَكَرِهْتَ اَنْ يَّطَّلِعَ عَلَيْهِ النَّاسُ۔ (مسلم کتاب البر والصلۃ ترمذی ابواب الزھد)

138. హజ్రత్ నవాస్ బిన్ సమ్అ (రజి) ఇలా ఉల్లేఖిస్తున్నారు: దైవప్రవక్త (సఅసం) గారిని పాపమంటే ఏమిటి? పుణ్యం అంటే ఏమిటి అని అడిగాను.

"పుణ్యం అంటే సద్వర్తన, సుగుణాలని; ఏ పనులు చేయడం వల్ల అంతరాత్మ బాధను, ఘోషను అనుభవిస్తుందో, (ఇంకా) నీవు చేసిన పని మరొకరికి తెలిస్తే నీవు వెగటును బాధను అనుభవిస్తావో అదే పాపం" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. *(ముస్లిమ్, తిర్మిజి)*

**సంగ్రహణం :**

అరబీ మూలభాషలో 'బర్ర్' అనే పదం వాడబడింది. దీనికి ఎన్నో అర్థాలున్నా, ఈ హదీసులో సద్వర్తనం కలిగి ఉండడమే పుణ్యకార్యంగా ఖరారు చేయడం జరిగింది. మనిషి - చిన్నవాడు, పెద్దవాడు - ప్రతి వ్యక్తితోను సహృదయతతో మెలగాలి. సంభాషణలో నమ్రతను, గాంభీర్యాన్ని ప్రదర్శించాలి. సతతం సత్యాన్నే పలకాలి. కోపంపై నియంత్రణ కలిగి ఉండాలి. తల్లిదండ్రుల ఎడల సేవాభావం కలిగి వారిని చేతినైనంత మటుకు సంతుష్టులుగా ఉంచే ప్రయత్నం చేయాలి. సరైన నీతి, నిజాయితీ లేనివాడు అనుమానాస్పదమైన కార్యకలాపాల్లో మునిగి ఉన్నవాడు సుగుణవంతుడు, సదాచారి కాజాలడు. దివ్య ఖుర్ఆన్ మరియు హదీసుల్లో పాపాల గురించిన జాబితా ఎంతో వివరంగా చెప్పడం జరిగింది. అయినా పాపం గురించి ఎలాంటి అనుమానానికి తావు లేనటువంటి రెండు పెద్ద గుర్తులను విడమర్చి వివరించారు దైవప్రవక్త (సఅసం).

**మొదటి గుర్తు :** చేసిన పని మనస్సుకు నచ్చాక అసంతృప్తిగా ఉండడం. ఆ కార్యాన్ని ఆచరించాక అంతరాత్మ ఏదో బాధకు గురి అయి చేసిన పని తప్పు అని ఘోషించడం.

**రెండో గుర్తు :** ఆ కార్యాన్ని బహిరంగంగా చేయడానికి వెరవడం. ఇది ప్రజల దృష్టిలో పడకూడదు అని కోరుకోవడం.

# స్వర్గ నరకాలకు ద్వారాలు

(۱۳۹) سُئِلَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنْ اَكْثَرِ مَا يُدْخِلُ النَّاسَ الْجَنَّةَ؟ قَالَ: تَقْوَى اللّٰهِ وَحُسْنُ الْخُلُقِ وَسُئِلَ عَنْ اَكْثَرِ مَا يُدْخِلُ النَّاسَ النَّارَ؟ قَالَ اَلْفَمُ وَالْفَرْجُ

(ترمذی عن ابی ہریرۃ ابواب البر والصلۃ)

139. ప్రవక్తా! ఏ యే కార్యాలు సాధారణంగా స్వర్గానికి దారి చూపుతాయి అని అడగ్గా "దైవభీతి మరియు సద్వర్తనం" అని బదులిచ్చారు దైవప్రవక్త (సఅసం).

ప్రజలను సాధారణంగా నరకంలో పడవేసేవి ఏమిటి? అని మళ్ళీ అడగ్గా, "నోరు, మర్మాంగం" అని సెలవిచ్చారు మహాప్రవక్త (సఅసం).

*(అబూ హురైరా (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

1. దైవభీతి (తక్వల్లాహ్) అంటే అల్లాహ్ హక్కుల్ని నెరవేర్చడమని భావం. కేవలం ఆయన్నే ఆరాధించడం, ఆయనకు మరొకరిని సాటి కల్పించకుండా ఉండడం. అల్లాహ్ ఆదేశించిన ఆదేశాలన్నిటిని పాలించి ఆచరించడం, అల్లాహ్ వారించిన పాపకార్యాలన్నిటినీ విడనాడడం. ఇవే ఆయన హక్కులు. ఆ హక్కులను నెరవేర్చడానికి ఇంతకంటే మరో మార్గం లేదు.

2. "సద్వర్తనం" (హుస్నుల్ ఖుల్ఖ్) అంటే దేవుడు సృష్టించిన సృష్టితాలన్నిటి ఎడల సద్భావంతో మెలగాలి. దీనికి కనీస స్థాయి మనిషి ఎవ్వరిని బాధించకుండా ఉండడం, అత్యున్నత స్థాయి అపకారం చేసిన వానికి ఉపకారం చేయడం. ఎవరయితే సృష్టికర్త హక్కులకు తోడు సృష్టితాల హక్కును కూడా నిర్వర్తిస్తాడో అతడు దైవకృపాకటాక్షాలతో స్వర్గంలో ప్రవేశిస్తాడు.

3. నోరు ఆహారాన్ని పొట్టలోనికి పంపే మార్గం. అదేకాకుండా ఇందులో సంభాషణకు పనికివచ్చే ఓ అవయం (నాలుక) కూడా ఉంది. ఏ వ్యక్తి నాలుక అతని అధీనంలో ఉండదో, అక్రమమైన, నిషిద్ధమైన సంపాదనతో ఎవరి శరీరం పెరుగుతుందో ఆ వ్యక్తి తప్పకుండా నరకాగ్నికి ఇంధనంగా మారుతాడు.

4. మర్మాంగపు విచ్చలవిడితనం కూడా అతణ్ణి నరకాగ్నిలో నెట్టుతుంది.

మర్మాంగం, నాలుక ఈ రెంటి విచ్చలవిడితనం, హరాం సంపాదన (నిషిద్ధమైన మార్గాల ద్వారా సంపాదించడం) ద్వారా శరీర పోషణల మూలంగా ప్రబలే వ్యక్తిగత, సామూహిక అస్తవ్యస్థత, అపశృతి, అశాంతి అల్లకల్లోలాలు మనిషిని నరకంలో పడవేయకుండా మరేం చేస్తాయి? ఇదేకాదు, ప్రపంచం అంతటా ప్రబలుతున్న జులుంలు, అత్యాచారాలు, దైవధిక్కార ధోరణులు తిరుగుబాటుతనం, ఇష్టారాజ్యం వీటన్నిటికి అంకురార్పణ చేస్తున్నది మర్మాంగపు విచ్చలవిడితనం మరియు నాలుక యొక్క హద్దుమీరిన స్వాతంత్ర్యమే. ఇవే ఈనాడు పెరిగి మహావృక్షాలైపోయాయి.

యదార్థంగా, దైవభీతి (అంటే దేవుని న్యాయస్థానంలో తమ చేతల కన్నిటికీ జవాబు చెప్పుకోవలసి ఉంది అనే భావన) అడుగడుగున ప్రతి సందర్భంలో మనిషిని ఆవహించి ఉంటే అతడు ప్రతి దుర్మార్గానికి ప్రతి పాపానికి వెరచి దూరంగా ఉంటాడు. అవంటేనే అతనికి ఓ విధమైన వెగటు కలుగుతుంది. ఈ దైవభీతిని పట్టించుకోక పోవడమే ప్రతి చెడుగుకు, దుర్మార్గానికి మూలం.

సమాజోద్ధరణ, దాని ప్రగతి వికాసాలు కేవలం సదాచారం సద్వర్తనలపై ఆధారపడి ఉన్నాయి. దైవానికి భయపడే వ్యక్తి, మంచి నైతిక విలువలు కలిగి ఉంటాడు. అతడు అన్నివిధాలుగా శాంతిని సాంత్వనను కలిగి ఉండి ఓ సజీవ నిదర్శనంగా అలరారుతాడు. మరి ఆ దైవభీతినే, సద్వర్తనాన్నే పునాదిగా చేసి అలాంటి దైవభీతి పరాయణులు, సత్పురుషులతో సంఘటితం చేసిన ఓ సమాజం ఓ సంపన్నమైన, ఉన్నతమైన సమాజంగా అలరారడంలో సందేహం ఉంటుందా?

## ప్రపంచ పరిత్యాగం ప్రవక్త సంప్రదాయానికే విరుద్ధం

(١٤٠) جَاءَ ثَلَاثَةُ رَهْطٍ إِلَى بُيُوتِ أَزْوَاجِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ يَسْأَلُونَ عَنْ عِبَادَةِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَلَمَّا
أُخْبِرُوا كَأَنَّهُمْ تَقَالُّوهَا فَقَالُوا وَأَيْنَ نَحْنُ مِنَ النَّبِيِّ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَدْ غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ
وَمَا تَأَخَّرَ قَالَ أَحَدُهُمْ أَمَّا أَنَا فَإِنِّي أُصَلِّي اللَّيْلَ أَبَدًا.
وَقَالَ آخَرُ أَنَا أَصُومُ الدَّهْرَ وَلَا أُفْطِرُ وَقَالَ آخَرُ أَنَا
أَعْتَزِلُ النِّسَاءَ فَلَا أَتَزَوَّجُ أَبَدًا فَجَاءَ رَسُولُ اللّٰهِ صَلَّى

اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ:
أَنْتُمُ الَّذِينَ قُلْتُمْ كَذَا وَكَذَا أَمَا وَاللهِ إِنِّي لَأَخْشَاكُمْ
لِلّٰهِ وَأَتْقَاكُمْ لَهُ لٰكِنِّي أَصُومُ وَأُفْطِرُ وَأُصَلِّي وَأَرْقُدُ
وَأَتَزَوَّجُ النِّسَاءَ فَمَنْ رَغِبَ عَنْ سُنَّتِي فَلَيْسَ مِنِّي

(بخاری عن انس کتاب النکاح)

140. ముగ్గురు వ్యక్తులు కలిసి దైవప్రవక్త (సఅసం) గారి సతీ మణుల ఇంటికొచ్చారు. ఆయన చేసే ఆరాధనా తీరు గురించి అడిగారు. వారికి ఆయన ఆరాధనల గరించి తెలుపడం జరిగింది. వారు దాన్ని స్వల్పమైన ఆరాధనగా భావించి, ఆయనకు మీకు పోలిక ఎక్కడా? ఆయన తప్పులు ఏనాడో మన్నించబడ్డాయి అని అనుకున్నారు. వారిలో ఒకడు నేను ప్రతి రోజూ రాత్రి తెల్లవార్లూ నమాజు చేస్తూ గడుపుతానంటే, రెండో వాడు, నేను ఎడతెగకుండా ప్రతిదినం రోజాలు పాటిస్తాను. ఇఫ్తార్ చేయను అని అన్నాడు. మూడో వ్యక్తి నేను స్త్రీలకు దూరంగా ఉంటాను, అసలు పెళ్ళే చేసుకోను అన్నాడు. ఈ విషయం తెలిసి దైవప్రవక్త (సఅసం) వారి దగ్గరకు వెళ్ళి, మీరు ఈ విధంగా పలికారు. అల్లాహ్ సాక్షి! నేను మీ కంటే దేవునికి అధికంగా భయపడేవాడిని, అయినా నేను రోజాలు పాటిస్తాను, ఒక్కొక్కసారి పాటించకుండా ఉంటాను కూడా. నమాజు చేస్తాను, నిద్రిస్తాను కూడా. వివాహమూ చేసుకుంటాను. నా ఈ సంప్ర దాయాన్ని విడనాడినవాడు నావాడే కాదు" అని పలికారు.

(అనస్ (రజి) – బుఖారి)

**సంగ్రహణం :**

కొన్ని ఉల్లేఖనాల్లో అడిగేవాడిలో ఒకరు నేను మాంసాన్నే ముట్టనని, మరొకరు ప్రక్కమీద అసలే పడుకోనని మూడో వ్యక్తి పెళ్ళే చేసుకోనని అన్నట్లు ఉంది. (ముస్లిమ్)

ఇది సన్యాసత్వం వైపునకు మొగ్గు చూపే వైఖరి. ఈ వైఖరి పొడసూపగానే దాన్ని మొదలంటా త్రుంచివేశారు దైవప్రవక్త (సఅసం). ఇస్లామీయ జీవన వ్యవస్థలో పూర్తి భౌతికత్వం గాని, పూర్తి సన్యాసత్వంగానీ లేవు. అసలది ఇటు ఆధ్యాత్మికత అటు భౌతికత్వం కలగలసిన ఓ మేలు కలయిక. దీన్నే దైవప్రవక్త (సఅసం) 'సున్నత్'గా అభివర్ణించారు.

ఇస్లాం ధర్మంలో ప్రపంచాన్ని పరిత్యజించే వీలేలేదు. ప్రక్కపై పడుకోవడం, మేలైన ఆహారాన్ని భుజించడం, వివాహమాడడం అన్నది దైవభీతికి సత్కర్మలకు వ్యతిరేకం ఏమీ కావు.

## తౌబా అంటే...!

(١٤١) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَلتَّوْبَةُ مِنَ الذَّنْبِ
اَنْ يَّتُوْبَ مِنْهُ ثُمَّ لَا يَعُوْدُ فِيْهِ۔

(مسند احمد عن ابن مسعود نمبر ۴۲۶۴)

141. పాపం చేసి తౌబా చేయడం అంటే, మనిషి తిరిగి ఆ పాపానికి ఒడిగట్టకుండా ఉండడం" అని దైవప్రవక్త (సఅసం) వివరించారు.

(ఇబ్నె మస్ఊద్ (రజి) – ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

మనిషి తప్పులు చేయడం సహజం. అసంభవమేమీ కాదు. అయితే జరిగిపోయిన ఆ పాపకార్యానికి తిరిగి ఒడిగట్టడమే విద్రోహం. ఓ మోమిన్ (విశ్వాసి) పొరపాటున పాపపంకిలంలో పడిపోవచ్చు. అయినప్పటికీ అతడు విద్రోహిగా మారలేదు. పాపం చేసే ఈ వైఖరి మాత్రం మనిషిని తన దాస్య స్థానం నుండి కొంచెం ప్రక్కకు నెట్టగలదు. అందుకనే పాపం జరిగిపోయిన తరువాత వెంటనే తౌబా చేయాలి. తౌబా అంటే తిరిగి రావడం, వెనక్కు మరలడం అని అర్థం. దాసుడు పాపం నుండి మరిలాడు అంటే, అతడు తాను చేసిన తప్పిదాన్ని గుర్తించి ఆ తప్పు మనస్ఫూర్తిగా ఒప్పుకున్నాడని తన యజమాని, స్వామి, ప్రభువు అయిన అల్లాహ్ యొక్క ధిక్కార వైఖరిని విడనాడాడు అన్నట్లే. అలాగే అతని తల పాపభారంతో వంగిపోయింది, ఇక భవిష్యత్తులో ఆ పాపం జోలికి పోనని ప్రతినబూనాడన్న మాటే. మునుపటిలా అతడు తన ప్రభువుకు విశ్వాసపాత్రునిగా మెలుగుతూ శేష జీవితాన్ని గడుపుతాననే దృఢ సంకల్పానికి వచ్చాడని భావం.

ఇక నోటితో, కేవలం 'తౌబా – తౌబా' అనే పదాలను వల్లించడం వల్ల తౌబా నెరవేరదు. తౌబా అంటే తౌబా చేస్తున్నవాడు తాను ఏ పాపానికి ఒడిగట్టాడో ఆ పాప కార్యాన్ని పూర్తిగా విడనాడడం; పాపకూపంలో పడిపోయినందుకు సిగ్గు పడడం; తిరిగి ఆ పాపం జోలికి పోననే దృఢ సంకల్పం చేసుకోవడం. అయితే అదే ఒకరిని పీడించడం బాధించడం, దౌర్జన్యం చేయడం, ఒకరి హక్కును కొల్లగొట్టడం లాంటి పాపం అయితే, దానికి పరిహారం చెల్లించనిదే అది మన్నింపబడదు. దానికి అనేకమైన మార్గాలున్నాయి. ఉదాహరణకు,

దౌర్జన్యానికి గురిఅయిన వ్యక్తి నుండి దోచుకున్న సొమ్మును అతనికి తిరిగి ఇచ్చివేయడం, లేదా దాని మూల్యాన్ని చెల్లించడం. లేదా క్షమించమని అతడిని ప్రాధేయపడడం ఓ మార్గం. అయితే అతడు దౌర్జన్యపరుణ్ణి క్షమించి వదిలివేయడమే దానికి పరిహారం.

## ఇస్లాం దృష్టిలో వ్యభిచారం

(١٤٢) كَانَ رَجُلٌ يُقَالُ لَهٗ مَرْثَدُ بْنُ اَبِيْ مَرْثَدٍ وَكَانَ رَجُلًا يَحْمِلُ
الْأَسْرٰى مِنْ مَكَّةَ حَتّٰى يَأْتِيَ بِهِمُ الْمَدِيْنَةَ قَالَ وَكَانَتِ
امْرَأَةٌ بَغِيٌّ بِمَكَّةَ يُقَالُ لَهَا عَنَاقُ وَكَانَتْ صَدِيْقَةً لَهٗ
وَاِنَّهٗ كَانَ وَعَدَ رَجُلًا مِنْ اُسَارٰى مَكَّةَ يَحْتَمِلُهٗ قَالَ فَجِئْتُ
حَتّٰى اِنْتَهَيْتُ اِلٰى ظِلِّ حَائِطٍ مِنْ حَوَائِطِ مَكَّةَ فِيْ لَيْلَةٍ مُقْمِرَةٍ،
قَالَ فَجَاءَتْ عَنَاقُ فَاَبْصَرَتْ سَوَادَ ظِلِّيْ بِجَنْبِ الْحَائِطِ
فَلَمَّا انْتَهَتْ اِلَيَّ عَرَفَتْ فَقَالَتْ: مَرْثَدٌ؟ فَقُلْتُ: مَرْثَدٌ
فَقَالَتْ مَرْحَبًا أَهْلًا فَبِتْ عِنْدَنَا اللَّيْلَةَ: قُلْتُ يَا عَنَاقُ،
حَرَّمَ اللّٰهُ الزِّنَا: قَالَتْ يَا اَهْلَ الْخِيَامِ هٰذَا الرَّجُلُ
يَحْتَمِلُ اُسَرَاءَكُمْ قَالَ فَتَبِعَنِيْ ثَمَانِيَةٌ وَسَلَكْتُ الْخَنْدَمَةَ
فَانْتَهَيْتُ اِلٰى غَارٍ اَوْ كَهْفٍ فَدَخَلْتُ فَجَاءُوْا حَتّٰى قَامُوْا
عَلٰى رَأْسِيْ فَبَالُوْا فَظَلَّ بَوْلُهُمْ عَلٰى رَأْسِيْ وَعَمَّاهُمُ اللّٰهُ عَنِّيْ
قَالَ ثُمَّ رَجَعُوْا وَرَجَعْتُ اِلٰى صَاحِبِيْ فَحَمَلْتُهٗ وَكَانَ رَجُلًا
ثَقِيْلًا حَتّٰى انْتَهَيْتُ اِلَى الْاِذْخِرِ فَفَكَكْتُ عَنْهُ اَكْبُلَهٗ
فَجَعَلْتُ أَحْمِلُهٗ وَيُعْيِيْنِيْ حَتّٰى قَدِمْتُ الْمَدِيْنَةَ۔

(ترمذی ابواب التفسیر سورۃ النور۔ ابوداؤد کتاب النکاح۔ نسائی کتاب النکاح)

142. మర్సద్ అనే పేరుగల ఓ సహాబి (ప్రవక్త అనుచరుడు) మక్కాలో నిర్బంధించబడిన ముస్లిము ఖైదీలను చెరవిడిపించి, మదీనాకు చేర్చేవారు. (ఇస్లామ్ స్వీకరించడానికి పూర్వం) 'అనాక్' అనే ఓ

వ్యభిచారిణితో ఆయనకు పరిచయం ఉండేది. ఓనాడు, మక్కా ఖైదీ ఒకరిని ఎత్తుకొని వెడతానని మాటిచ్చాడు. ఈ సంఘటన గురించి ఆయన వివరిస్తూ ఇలా చెప్పారు:

"నేను ఓ వెన్నెల రేయి మక్కా నగర ప్రాకారపు క్రీనీడన నిలబడి ఉండగా 'అనాక్' నన్ను చూచి అక్కడ ఆగిపోయింది. నన్ను గుర్తుపట్టి నువ్వు మర్సద్‌వేనా అని పలుకరించింది. అవును నేను మర్సద్‌నే అని బదులీయగా ఆమె, మీకు స్వాగతం, ఈ రాత్రి మీరు నాతో గడుపుదురు గాని రండి అని ఆహ్వానించింది. (వ్యభిచారం వైపునకు ఆహ్వానించిన ఆ ఆహ్వానానికి) నేను 'అనాక్! అల్లాహ్ వ్యభిచారాన్ని హరాం చేశాడు' అని చెప్పాను. అప్పుడామె (బిగ్గరగా) ఓ గుడారపు వాసుల్లారా! ఈ వ్యక్తి మీ ఖైదీలను ఎత్తుకొని వెడతాడు (జాగ్రత్త! ఇతనిని పారిపోకుండా పట్టుకొని బంధించండి) అని అరిచింది. దానికి ఎనమండుగురు నా వెంటబడ్డారు. నేను (మక్కాలోని ఓ గుట్ట) కందమాను దాటి ఓ గుహలో దాక్కున్నాను. వారు ఆ గుహ ముఖద్వారంపై నిలబడి నా నెత్తి మీద మూత్ర విసర్జన చేసి మరలిపోయారు. నన్ను చూడకుండా అల్లాహ్ వారిని గ్రుడ్డివారుగా చేశాడు. (వారు వెనక్కు తిరిగి వెళ్ళిపోయిన పిదప) నేను నా మిత్రుని వద్దకు వెళ్ళి ఆయన్ను 'ఇజ్‌కిర్' అనే ప్రదేశం వరకు ఎత్తుకొని వెళ్ళాను. (ఆయన స్థూల కాయం కలిగి ఉన్నందున చాలా బరువుగా ఉన్నారు). అక్కడ నేను వారి కాళ్ళకు వేసి వున్న బేడీలను తొలగించివేస్తూ మదీనా చేరాను. ఆయన నన్ను బాగా అలుపుకు గురిచేశారు."

(తిర్మిజి, అబూదావూద్, నిసాయి)

**సంగ్రహణం :**

హజ్రత్ మర్సద్ (రజి) మక్కావారి ఖైదులో వున్న ముస్లిములను ఆ అవిశ్వాసుల చెర నుండి విడిపించి మదీనాకు చేర్చేవారు. అజ్ఞాన కాలంలో (ఇస్లాం స్వీకరించకపూర్వం) మక్కా నగరానికి చెందిన ఓ వ్యభిచారిణితో ఆయనకు పరిచయం ఉండింది. ఇస్లామ్ ధర్మాన్ని తన జీవన వ్యవస్థగా మార్చుకున్న తదుపరి ఆయన జీవితమే మారిపోయింది. దైవభీతి ఆయన్ను రాత్రి సమయంలో కూడా కామవాంఛలకు గురి కాకుండా కాపాడగలిగింది.

## మోమిన్ (విశ్వాసి) ప్రవర్తన

(١٤٣) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَجِبْتُ مِنْ قَضَاءِ
اللّٰهِ عَزَّ وَجَلَّ لِلْمُؤْمِنِ، إِنْ أَصَابَهُ خَيْرٌ حَمِدَ رَبَّهُ وَشَكَرَ
وَإِنْ أَصَابَتْهُ مُصِيْبَةٌ حَمِدَ رَبَّهُ وَصَبَرَ، الْمُؤْمِنُ
يُؤْجَرُ فِيْ كُلِّ شَيْءٍ حَتّٰى فِي اللُّقْمَةِ يَرْفَعُهَا إِلٰى فِيْ امْرَأَتِهِ۔

(مسند احمد عن سعید بن ابی وقاص نمبر ١٤٨٧)

143. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం ఇలా ఉంది : "మోమిన్ గురించి అల్లాహ్ తీసుకున్న నిర్ణయానికి నేను అబ్బుర పడుతున్నాను. అతడు మేలు పొందితే అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. ఆయన్ను కీర్తిస్తాడు. తనకు కీడు జరిగినప్పుడు అల్లాహ్‌నే స్తోత్రిస్తాడు. సహనం వహిస్తాడు. (అంటే అదరడూ బెదరడూ). మోమిన్ యొక్క ప్రతి ప్రవర్తనకు దేవుని తరఫున పుణ్యఫలం లభిస్తుంది. చివరికి తన భార్య నోటికి అన్నం ముద్ద అందించినందుకు కూడా అతనికి పుణ్యం లభిస్తుంది.

(సయీద్ బిన్ అబీ వికాస్ (రజి) – ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

ప్రత్యక్షంగాను, పరోక్షంగాను దైవదాస్యం చేసేవాడు పుణ్యఫలానికి అర్హుడు. ఆరాధనల్లో, వ్యవహారాల్లో లావాదేవీల్లో, సంబంధ బాంధవ్యాల్లో, నైతిక ప్రమాణాలు నెలకొల్పడంలో, తన వ్యక్తిగత సామాజిక జీవనంలో అల్లాహ్ ఆదేశపాలన చేస్తూ ఆయన మెప్పును దృష్టిలో ఉంచుకొని నడిచేవాడే ఈ బహుమానాలకు, పుణ్యఫలాలకు అర్హుడు. అతడే మోమిన్ అని ఈ హదీసు బోధిస్తుంది.

(١٤٤) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَجَبًا لِأَمْرِ الْمُؤْمِنِ إِنَّ
أَمْرَهُ كُلَّهُ خَيْرٌ وَلَيْسَ ذٰلِكَ لِأَحَدٍ إِلَّا لِلْمُؤْمِنِ، إِنْ أَصَابَتْهُ
سَرَّاءُ شَكَرَ فَكَانَ خَيْرًا لَهُ وَإِنْ أَصَابَتْهُ ضَرَّاءُ صَبَرَ
فَكَانَ خَيْرًا لَهُ (مسلم عن صہیب کتاب الزھد باب فی احادیث متفرقہ)

144. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "మోమిన్ వ్యవహారం ఎంత విచిత్రమైనది! అతని ప్రతి కదలికా మేలైనదే. ఈ అదృష్టం కేవలం మోమిన్‌కే దక్కుతుంది. కలిమిలో అతడు దేవునికి కృతజ్ఞ తలు తెలుపుకుంటాడు. లేమిలోను, దుఃఖాల్లోను సహనం వహిస్తాడు. (అదరడూ బెదరడు). ఈ రెండు సందర్భాల్లోనూ అతడికి మేలే జరుగుతుంది." *(సుహైబ్ (రజి) – ముస్లిమ్)*

**సంగ్రహణం :**

మోమిన్ ప్రతి విషయంలోను అల్లాహ్‌నే నమ్ముకుని ఆయనపైన్నే భారం ఉంచుతాడు. ఆయనకే భయపడతాడు. మోమిన్ ఆశలకు, కోరికలకు మూలం ఆయనే. అతడికి ఆనందం కలిగినా, కలిమి కలిగినా సుఖసంతోషాలను పొందినా అతడు కృతజ్ఞతా భారంతో వంగిపోతాడు. తనకు లభించిన ఈ సిరిసంపదలు కరుణామయుడైన ఆ ప్రభువు కృపాకటాక్షాలే అని నమ్ముతాడు. తనకు లభించిన వరాలను చూసుకొని గర్వపడడు, విర్రవీగడు. సరికదా వాటిని ఖర్చుపెట్టేటప్పుడు వీటిని ఒసగిన ఆ ప్రభువు ఎక్కడ కృద్ధుడవుతాడోనని భయపడుతూ ఆయన ఆదేశాలకనుగుణంగానే ఖర్చుపెట్టే ప్రయత్నం చేస్తాడు.

ధన ప్రాణాల నష్టం, కష్టాలు కడగండ్ల తుఫానులు అతణ్ణి అదరగొట్టలేవు. ఏ ఆపద ఎదురైనా అతడు అదరడూ బెదరడు. ఇలాంటి పరీక్షలు, దుర్ఘటనలు జరిగిన ప్రతిసారి అతడు దృఢంగా నిలబడతాడు. సత్యం, న్యాయం, ధర్మం అనే మార్గంపై సాహసంగా అడుగు ముందుకు వేస్తాడు. అసత్యం అన్యాయపు దాడులు, బూటకపు దేవుళ్ళు బెదిరించే ఏ బెదిరింపూ అతని విశ్వాసాన్ని అణగద్రొక్కలేవు. సాధారణ పరిస్థితుల్లో అతడు వ్యాధికి, లేమికి లేక ఏదైనా దుర్ఘటనకు ప్రభావితుడు కాకుండా వాటివల్ల తనకు కలిగిన బాధను, అసహాయతను, తన కష్టాన్ని ఏ మాత్రం బహిర్గతం కానివ్వడు. సరికదా ఎంతో ధైర్యసాహసాలతో ఆ పరిస్థితులను మార్చడానికి ప్రయత్నం చేస్తూ ఉంటాడు. అల్లాహ్ వైపునకే మరలి ఆయన్ను వేడుకుంటాడు. ఇలా మేలును గురించి దేవుడికి కృతజ్ఞతలు తెలుపుకోవడం వల్ల మోమిన్ పుణ్యఫలాన్ని పొందుతాడు. అదేవిధంగా కష్టాల్లో సహనం వహించడం వల్ల కూడా అతడు సత్ఫలితాన్ని పొందగలుగుతాడు.

## మంచీ చెడులను తెలిపే గీటురాయి

(١٤٥) قَالَ رَجُلٌ لِرَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ كَيْفَ لِيْ
اَنْ اَعْلَمَ اِذَا اَحْسَنْتُ وَ اِذَا اَسَأْتُ ؟ فَقَالَ النَّبِيُّ صَلَّى

اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا سَمِعْتَ جِيْرَانَكَ يَقُوْلُوْنَ قَدْ اَحْسَنْتَ
فَقَدْ اَحْسَنْتَ وَاِذَا سَمِعْتَهُمْ يَقُوْلُوْنَ قَدْ اَسَأْتَ فَقَدْ
اَسَأْتَ۔ (مسند احمد عن ابن مسعود نمبر ۴۸۰۸ مشکوۃ کتاب الآداب)

145. ఓ వ్యక్తి దైవప్రవక్త (సఅసం)ను, మంచి పనేదో, చెడు కార్యమేదో నేనెలా తెలుసుకోగలను అని అడగ్గా, దైవప్రవక్త (సఅసం) ఇలా వివరించారు:

"నీవు చేసిన పని మంచిది అని నీ పొరుగువారి నోట విన్నప్పుడు నిజంగానే నీవు సత్కార్యం చేశావు అని నమ్ము. అదే నీ పొరుగున ఉన్న వారి నోట నీవు చేసింది చెడ్డపని అని వింటే నీవు తప్పకుండా చెడు కార్యమాచరించావని గుర్తుంచుకో."

(ఇబ్నె మస్‌ఊద్ (రజి) – ముస్నద్ అహ్మద్, మిష్కాత్)

**సంగ్రహణం :**

నలుగురికి కనబడే వేషం వస్త్రధారణ, మృదుసంభాషణల ద్వారా జన సామాన్యాన్ని మోసపుచ్చడం తేలిక. కొన్ని సందర్భాల్లో ఈ ప్రదర్శనాబుద్ధి కలవాడు స్వతహాగా నా అంతటి వాడు నిజంగా లేడోమోనని గర్వపడడం కూడా జరుగుతుంది. అందుకే ఓ మనిషి మంచి వాడా లేక చెడ్డవాడా అని తెలుసుకునేందుకు దైవప్రవక్త (సఅసం) అతడి ఇరుగుపొరుగు వారిని గీటురాయిగా ఖరారు చేశారు. ఎందుకంటే మనిషి సత్ప్రవర్తన గలవాడు లేక దుర్మార్గుడా అన్న విషయాన్ని నిర్ధారించడానికి అతని పొరుగువాడే తగినవాడు. ఫలానా వ్యక్తి నైతిక విలువలు ఎలాంటివో, అతడు తన దైనందిన వ్యవహారాల్లో ఎలా ప్రవర్తిస్తాడో దయాగుణం కలవాడా లేక కఠినహృదయుడా? నిరుపేదలు, దరిద్రులైన తన ఇరుగుపొరుగు ఎడల అతడు అవలంబించే వైఖరి ఎలాంటిది? అన్నవి కేవలం అతని పొరుగున ఉన్నవారికే బాగా తెలుసు. 'తక్వా' (దైవభీతి)కి గుర్తు మనిషి తన నిరుపేద బంధువులను, అసహాయులను, పేదరికంలో మ్రగ్గుతున్న పొరుగువారిని ఉపేక్షించకుండా ఉండడం, వారికి విలువనివ్వడం.



## ప్రవక్త (స) ఎడల ప్రేమాభిమానాలు, విశ్వాసానికి చిహ్నం

(۱۴۶) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يُؤْمِنُ اَحَدُكُمْ
حَتّٰى اَكُوْنَ اَحَبَّ اِلَيْهِ مِنْ وَّالِدِهٖ وَوَلَدِهٖ وَالنَّاسِ اَجْمَعِيْنَ

(بخاری عن انس کتاب الایمان ، مسلم کتاب الایمان)

146. “మీలోని ఏ ఒక్కడూ నన్ను తన తండ్రికంటే, కుమారుని కంటే ప్రజలందరికంటే మిన్నగా ప్రేమించనంతవరకు అతడు మోమిన్ కాజాలడు” అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

*(అనస్ (రజి) - బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం) తనను ప్రేమించండి అని మాత్రమే సెలవియ్యడం జరగలేదు. అందరికంటే తనపట్ల మిన్నగా ప్రేమాభిమానాలు కలిగి ఉండనంతవరకు ఏ ఒక్కరూ మోమిన్ కాజాలరు అని సెలవిచ్చారు. ప్రేమకు హృదయంలో పొడసూపే భావోద్రేకాలతోనే సంబంధం. ఇదో మధురానుభూతే తప్ప నోటితో వర్ణించడానికి వీలు కానిది. అయితే ఆ ప్రేమాభిమానాలను కొలవడానికి కొలబద్ద ఏమిటంటే ప్రేమించేవాడు తన ప్రియమైన వ్యక్తి యొక్క ప్రతి కదలికకు ప్రభావితుడవుతాడు. ప్రతి విషయంలో అతణ్ణి అనుసరించడంలో ఆనందానుభూతుల్ని పొందుతాడు. అతడు తాను ప్రేమించే వ్యక్తి ఎడల భేదాభిప్రాయం కలిగి ఉండడు. ఆయన ఆదేశాలను ఉల్లంఘించ డానికిగాని, ఆజ్ఞల్ని జవదాటడానికిగాని ఇష్టపడడు. అదేవిధంగా ఆయనకు ఇష్టంలేని వైఖరిని అవలంబించడంగాని, ఆయన శత్రువులతో చేయి కలిపే ప్రయత్నంగాని చేయడు. అసలు ఆ భావనలను తన దరిదాపుల్లోకే రానివ్వడు.

ఏ వ్యక్తికి దైవప్రవక్త (సఅసం) ఎడల ప్రేమాభిమానాలు మెండుగా ఉంటాయో, ఎవరయితే ఆయన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తాడో అతడు ఆయనతో విభేదించడంగాని, ఆయన కోరికను తృణీకరించడంగాని, జీవితంలోని ఏ వ్యవహారంలోను దైవప్రవక్త (సఅసం) తీర్పును, ఆదేశాలను ధిక్కరించడంగాని చేయడు. అలాగే ఆయన ఏ వ్యవస్థనయితే రూపుమాపడానికి ప్రభవించారో ఆ వ్యవస్థను తిరిగి స్థాపించే ప్రయత్నం చేసే హక్కు అతనికి ఉండబోదు.

(۱۴۷) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ هِشَامٍ قَالَ كُنَّا مَعَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ اٰخِذٌ بِيَدِ عُمَرَ بْنِ الْخَطَّابِ فَقَالَ لَهٗ عُمَرُ: يَا رَسُوْلَ اللّٰهِ لَاَنْتَ اَحَبُّ اِلَيَّ مِنْ كُلِّ شَيْءٍ اِلَّا مِنْ نَفْسِيْ، فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَهٗ: لَا وَالَّذِيْ نَفْسِيْ بِيَدِهٖ حَتّٰى اَكُوْنَ اَحَبَّ اِلَيْكَ مِنْ نَفْسِكَ فَقَالَ لَهٗ عُمَرُ فَاِنَّهُ الْاٰنَ، وَاللّٰهِ لَاَنْتَ اَحَبُّ اِلَيَّ مِنْ نَفْسِيْ فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَلْاٰنَ يَا عُمَرُ۔

(بخاری کتاب الایمان والنذور)

147. హజ్రత్ అబ్దుల్లా బిన్ హష్షామ్ (రజి) ఉల్లేఖనం ఇది : "మేము దైవప్రవక్త (సఅసం) వెంట ఉన్నాం. ఆయన హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) గారి చెయ్యి పట్టుకున్నారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి), "ఓ దైవప్రవక్తా! నా ప్రాణం తప్ప తమరు నాకు ప్రతిదానికన్నా ప్రియమైన వారు" అని విన్నవించుకోగా, "లేదు, ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆ దేవుని సాక్షి! నేను నీ ప్రాణం కంటే అధికంగా ప్రియమైన వాణ్ణయితే తప్ప (నీవు మోమిన్ కాజాలవు)" అని సెలవిచ్చారు దైవప్రవక్త (సఅసం). అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) "ప్రవక్తా! ఇప్పుడు తమరు నా ప్రాణాలకంటే నాకు ప్రియమైన వారయ్యారు" అన్నారు. దానికి దైవప్రవక్త (సఅసం), "అవును ఇప్పుడు నీ విశ్వాసం పరిపూర్ణతను సంతరించుకుంది" అని సెలవిచ్చారు. *(బుఖారి)*

**సంగ్రహణం :**

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఎడల ప్రేమాభిమానాలు కరువైన వ్యక్తిలో విశ్వాసం ఉందని భావించడానికి వీల్లేదు. ఏ హృదయంలో దైవప్రవక్త (సఅసం) ఎడల ప్రేమాభిమానాలు లుప్తమై ఉంటాయో ఆ హృదయంలో విశ్వాస కాంతి చొరబడడం కల్ల. ఆయనతో సంబంధం కలిగి ఉండడమే కాదు ఈ ప్రపంచంలోని ప్రతి వస్తువు కంటే చివరకు తన ప్రాణాలకంటే మిన్నగా ప్రేమించాలి ప్రతి విశ్వాసి. ఆయనతో దృఢమైన

సంబంధం కలిగి ఉండాలి. ఈ తారాస్థాయికి చేరిన ప్రేమాభిమానాలుగల విశ్వాసి, తన జీవితంలోని అడుగడుగున, ప్రతి సందర్భంలోను ఆయన ఆదేశాలను జవదాటలేడు. ఆయన నడిచిన మార్గం నుండి రవ్వంతయినా ప్రక్కకు జరుగడు. మరోవిధంగా చెప్పాలంటే ఆయన దృష్టికి నచ్చని ఏ పనీ చేయ సాహసించడు.

అయితే దైవప్రవక్త (సఅసం) ఎడల ప్రేమాభిమానాలే తన ప్రాణం అని చెప్పుకునే అనేకమంది పెద్దల జీవితాల్లో ఆయన (సఅసం) గుణ గణాలు ఆయన ఆచరణా సంప్రదాయాలు మచ్చుకైనా కనబడక పోవడం విచారకరం.

## ప్రవక్త విధేయతే దైవ విధేయత

(۱۴۸) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ مَنْ اَطَاعَنِیْ فَقَدْ اَطَاعَ اللّٰہَ وَمَنْ عَصَانِیْ فَقَدْ عَصَی اللّٰہَ

(بخاری عن ابی ہریرہ کتاب الاحکام)

148. “ఎవరయితే నాకు విధేయునిగా ఉంటాడో అతడు నిస్సందేహంగా అల్లాహ్‌కు విధేయుడు. మరెవరయితే నన్ను ధిక్కరిస్తాడో అతడు అల్లాహ్‌ను ధిక్కరించినట్లే” అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు.

*(అబూ హురైరా (రజి) - బుఖారి)*

**సంగ్రహణం:**

అల్లాహ్ మనందరికీ ప్రభువు, స్వామియే. మనమంతా ఆయన పాలితులం, దాసులం. అందుకే జీవితంలోని ప్రతి వ్యవహారంలోను ఆయనకు విధేయుడై ఉండడం, ఆయన ఆదేశాలను పాలించడం మన విద్యుక్త ధర్మం. అయితే మనం మన నిజప్రభువు ఆదేశాలను సక్రమంగా పాటిస్తున్నామా లేదా? ఆయన్ను ధిక్కరించడం లేదు కదా? అన్న విషయం మనకెలా తెలియాలి? ఈ హదీసులో ఈ ప్రశ్నకే సమాధానం లభిస్తోంది. మీరే గనక అల్లాహ్ ఆదేశాలను పాటిస్తూ ఆయనకు విధేయులై జీవితం గడపదలిస్తే మీరు దైవప్రవక్త (సఅసం)కు విధేయత చూపండి. ఎందుకంటే ఆయన ఆ దేవునికి ప్రతినిధి. మీరేగనక ఆయనకు విధేయులై ఉంటే అల్లాహ్‌నే విధేయించారనుకోండి. అదేవిధంగా ప్రవక్త (సఅసం) ఆదేశాలను ధిక్కరించి, ఆయన బోధనల్ని మరిచిపోయారంటే, మీ ప్రభువు, మీ స్వామి అయిన అల్లాహ్ యొక్క ఆదేశాలను ధిక్కరించినట్లవుతుంది.

# ప్రవక్తను ధిక్కరించడం దైవదౌత్యాన్ని ధిక్కరించడమే

(۱۴۹) اِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ. كُلُّ اُمَّتِيْ يَدْخُلُوْنَ الْجَنَّةَ اِلَّا مَنْ اَبٰى. قَالُوْا وَمَنْ يَّاْبٰى؟ قَالَ مَنْ اَطَاعَنِيْ دَخَلَ الْجَنَّةَ وَمَنْ عَصَانِيْ فَقَدْ اَبٰى۔

(بخاری عن ابی ہریرہ کتاب الاعتصام)

149. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "నా ఉమ్మత్ (అనుచర సమాజం) అంతా స్వర్గంలోనికి ప్రవేశిస్తుంది. నన్ను తిరస్కరించే వారు తప్ప. ఎవరు తిరస్కరిస్తారు దైవప్రవక్తా? అని అడిగితే, "నన్ను విధేయించిన వాడు స్వర్గంలో ప్రవేశిస్తాడు, నన్ను ధిక్కరించినవాడు నిజంగానే నన్ను తిరస్కరిస్తాడు" అని అన్నారు ఆయన.

(అబూహురైరా (రజి) – బుఖారి)

**సంగ్రహణం :**

తన జీవితంలో అడుగడుగునా దైవప్రవక్త (సఅసం)ను అనుసరించేవాడు, ఆయన ఆదేశాల్ని పాటించేవాడు, ఆయన ఉమ్మత్ (అనుచర సమాజం)లోని సభ్యుడే. అతడు తప్పకుండా స్వర్గంలో ప్రవేశిస్తాడు. మరెవరయితే ఆయన మార్గదర్శకత్వాన్ని నమ్మకుండా దాన్ని తృణీకరిస్తాడో అతడాయన సమాజంలోని వాడు కాదు. మరోవిధంగా చెప్పాలంటే అతడు ఆయన్ను తిరస్కరించేవాడు. అతనికి స్వర్గంలో ఎలాంటి స్థానం ఉండదు.

ఒక వ్యక్తి ప్రవక్త ఉమ్మత్‌లోని ఓ సభ్యునిగా ఉన్నాడంటే అతను స్వర్గంలో స్థానం సంపాదించడమే అవుతుంది. ఇందులో ఎలాంటి సందేహం లేదు. దైవప్రవక్తకు విధేయుడైనవాడు, తన దైనందిన వ్యవహారాల్లో, నీతినియమాల్లో, రాజకీయ రంగంలో ఆయన మార్గాన్నే అనుసరిస్తాడు. అనుసరించడం అంటే నోటి మాటగా కాదు కార్యరూపేణ అని అర్థం.

## దైవదౌత్యపు హోదా

(۱۵۰) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اِذَا نَهَيْتُكُمْ عَنْ شَيْءٍ فَاجْتَنِبُوْهُ وَاِذَا اَمَرْتُكُمْ بِاَمْرٍ فَاْتُوْا مِنْهُ مَا اسْتَطَعْتُمْ

(بخاری عن ابی ہریرہ کتاب الاعتصام)

150. "నేను కాదన్న దాన్ని విడనాడండి. నా ఆదేశాల్ని సాధ్యమై నంతమట్టుకు అమలు చేయండి" అని దైవప్రవక్త (సఅసం) ఆదేశించారు.

*(అబూహురైరా (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం)గారి హోదా, అంతస్తు ఎంతో ఉన్నతమైనది. ఆయన నోట వెలువడ్డ ప్రతి వాక్యం ఓ చట్టం. ఆయన పెదాల నుండి దొరిలే పదాలు జీవితపు రాజమార్గపు దీపస్తంభాలు. అదేకాదు, ఆయన ఇచ్చిన తీర్పులు, తీసుకున్న నిర్ణయాలు, చేసిన సిద్ధాంతాలు ప్రపంచ తత్వవేత్తలను, న్యాయకోవిదులను, మేధావులను ఆకర్షిం చాయి, ఆకర్షించుకుంటున్నాయి. అందుకే ఆయన, నేను ఏ విషయం గురించి మిమ్మల్ని వారిస్తానో దాని జోలికి పోకండి; వెంటనే వదిలేయండి, ఏ ఆదేశమయితే మీకిచ్చానో దాన్ని అమలు చేయండి అని ఆదేశించారు.

దేవుని ప్రతినిధిగా షరీఅత్‌లో ఆయన స్థానం పరిపూర్ణమయిన స్థానం. ఆయన పూర్తి ముస్లిం జగత్తుకే నాయకుడు, మార్గదర్శకుడు. ఆయన ఈ హోదాలో ఎవ్వరూ ఛాలెంజి చేయలేరు. అయితే కొంతమంది అజ్ఞానులు ఇస్లాం ధర్మానికి మూలం కేవలం దివ్య గ్రంథం ఖుర్‌ఆన్‌అని, ఇది కేవలం ఆయనపై అవతరించడం మటుకేనని, కాబట్టి ఆయన ఆదేశాలేవి ధర్మానికి మూలం కాజాలవని అంటారు. ఇదో పెద్ద పొరపాటు. ఇస్లామీయ ధార్మిక వ్యవస్థలో దైవప్రవక్త (సఅసం) అథారిటీ. చివరి నిర్ణయం ఆయనదే. ఆయన దేన్ని గురించి అయితే ఆదేశిస్తారో అది అమలు కావలసిందే. దేన్నుండి వారిస్తే దాన్ని వదిలేయాల్సిందే. పై హదీసు ఈ సిద్ధాంతాన్నే చాటిచెబుతోంది.

## దైవదౌత్యం ఇక ఉండదు

(۱۵۱) إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ إِنَّمَا مَثَلِي وَمَثَلُ النَّاسِ
كَمَثَلِ رَجُلٍ اسْتَوْقَدَ نَارًا فَلَمَّا أَضَاءَتْ مَا حَوْلَهُ جَعَلَ
الْفَرَاشُ وَالدَّوَابُّ تَقْتَحِمُ فِيهَا فَأَنَا آخُذُ بِحُجَزِكُمْ
وَأَنْتُمْ تَوَاقَعُونَ فِيهَا ــــــ وَمَثَلُ الْأَنْبِيَاءِ كَمَثَلِ رَجُلٍ
بَنَى بُنْيَانًا فَأَحْسَنَهُ وَأَكْمَلَهُ وَأَجْمَلَهُ فَجَعَلَ النَّاسُ
يُطِيفُونَ بِهِ، يَقُولُونَ: مَا رَأَيْنَا بُنْيَانًا أَحْسَنَ مِنْ هٰذَا
إِلَّا هٰذِهِ الثُّلْمَةَ فَأَنَا تِلْكَ الثُّلْمَةُ.

(مسند احمد عن ابی ہریرہ نمبر ۷۳۱۸)

151. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఓ వ్యక్తి (గాఢాంధ కారంలో) మంట రాజేస్తాడు. దాని వెలుగు కారణంగా అక్కడి పరిసరాలు ప్రకాశిస్తాయి. దీపపు పురుగులు ఆ మంటకు ఆకర్షించబడి అందులోపడి పోతుంటాయి. నేను మీ నడుము పట్టుకొని ఉన్నాను. మీరంతా ఆ దీపపు పురుగుల్లా మంటలో పడబోతున్నారు. నాకు ఇతరులకు గల తేడా అదే. (ఆ తరువాత ఇంకిలా సెలవిచ్చారు):

"దైవప్రవక్తల ఉపమానం ఇలా ఉంది : ఓ వ్యక్తి సమస్త హంగులతో కూడిన ఓ మేడ కడతాడు. ఆ తరువాత ప్రజలు ఆ కట్టడంలోనికి వెళ్ళి లోనా బయటా దాన్ని తిరిగిచూసి, మేమింతవరకు ఇలాంటి కట్టడం ఎక్కడా తిలకించలేదు. కాని ఇందులో ఇక్కడ ఈ లోపం కనబడుతోంది అని అంటారు. (చివరకు) నేనొచ్చి (దైవదౌత్యపు ఈ కట్టడంలో ఉన్న) ఈ శూన్యాన్ని (లోపాన్ని) భర్తీ చేశాను." *(అబూ హురైరా (రజి) – ముస్నద్ అహ్మద్)*

**సంగ్రహణం :**

భావం ఏమిటంటే దైవప్రవక్త (సఅసం) సత్యం వైపుకు పిలవడం వల్ల మానవాళిని 'కుఫ్ర్' (దైవతిరస్కార ధోరణి), అజ్ఞానపు గాడాంధకారం నుండి బయటకు తెచ్చే ప్రయత్నం చేశారు. ఇస్లాం వెలుగుతో వాతావరణమంతా ప్రకాశించిపోయింది. కాని ఆయన ఇంతటి ప్రయత్నం చేసినా దుష్టులు ఈ సత్యధర్మాన్ని కాదని నరక మార్గాన్నే ఎన్నుకున్నారు. దైవదౌత్యపు కట్టడం దైవప్రవక్తలకు నాయకులైన హజ్రత్ ముహమ్మద్ (సఅసం) అరుదెంచిన తరువాతే పరిపూర్ణమైంది. ఇక ఇప్పుడు ఆ కట్టడంలో ఎలాంటి లోపంగాని, శూన్యంగాని లేవు. అందుకే దాన్ని పూరించేందుకు మరే దైవప్రవక్త రానవసరం లేదు.

## దైవప్రవక్త ఎడల గౌరవం, శ్రద్ధాసక్తులు

(١٥٢) إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ افْتَقَدَ ثَابِتَ بْنَ قَيْسٍ فَقَالَ
رَجُلٌ يَا رَسُولَ اللهِ أَنَا أَعْلَمُ لَكَ عِلْمَهُ فَأَتَاهُ فَوَجَدَهُ جَالِسًا
فِي بَيْتِهِ مُنَكِّسًا رَأْسَهُ فَقَالَ مَا شَأْنُكَ؟ فَقَالَ شَرٌّ: كَانَ
يَرْفَعُ صَوْتَهُ فَوْقَ صَوْتِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَدْ
حَبِطَ عَمَلُهُ وَهُوَ مِنْ أَهْلِ النَّارِ فَأَتَى الرَّجُلُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ

وَسَلَّمَ فَأَخْبَرَهُ أَنَّهُ قَالَ كَذَا وَكَذَا فَرَجَعَ إِلَيْهِ الْمَرَّةَ الْآخِرَةَ
بِبِشَارَةٍ عَظِيمَةٍ فَقَالَ اذْهَبْ إِلَيْهِ فَقُلْ لَهُ إِنَّكَ لَسْتَ
مِنْ أَهْلِ النَّارِ وَلَكِنَّكَ مِنْ أَهْلِ الْجَنَّةِ۔

(بخاری عن انس کتاب المناقب۔ کتاب التفسیر مسلم کتاب الایمان)

152. హజ్రత్ సాబిత్ బిన్ ఖైస్ అన్సారి (రజి) కొన్నాళ్ళ నుంచి దైవప్రవక్త (సఅసం) సన్నిధికి హాజరుకావడం మానేశారు. అప్పుడు దైవప్రవక్త (సఅసం) ఆయన ఎక్కడున్నారని అడగ్గా ఒకాయన దైవప్రవక్తా! నేను వెళ్ళి ఆయన యోగక్షేమాలు తెలుసుకు వస్తానని వెళ్ళారు. ఆయన తన ఇంట్లో విచారవదనుడై కూర్చొని ఉండగా చూసి ఏమిటి మీ పరిస్థితి? అని అడిగారు. అప్పుడు హజ్రత్ సాబిత్ (రజి) ఆయనతో "నా పరిస్థితి విషమించింది. నా కంఠస్వరం దైవప్రవక్త కంఠస్వరంకంటే ఉచ్ఛస్థితిలో ఉంది. నా కర్మలన్నీ నాశనం అయిపోయాయి. నేను దైవప్రవక్త (సఅసం) సమక్షంలో ఉచ్ఛస్వరంతో మాట్లాడుతున్నాను. నరకంలో ప్రవేశించే వారిలో నేనూ చేరాను" అని బాధపడ్డారు. ఆ వ్యక్తి తిరిగి ప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరై హజ్రత్ సాబిత్ (రజి) చెప్పిన మాటలను ఏకరువు పెట్టారు. (అప్పుడు) దైవప్రవక్త (సఅసం) అతనితో, నీవెళ్ళి "నీవు నరక వాసివి కావు పైపెచ్చు స్వర్గవాసివి అని చెప్పు" అని పురమాయించి పంపారు. దైవప్రవక్త ఇచ్చిన ఆ మహోన్నత శుభవార్తను ఆ వ్యక్తి హజ్రత్ సాబిత్‌కు వినిపించారు." *(అనస్ (రజి) - బుఖారి, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

అసలు జరిగిన సంఘటన ఇది. సూరా అల్ హుజురాత్‌లోని ఈ ఆయత్ అవతరించింది.

"విశ్వసించిన వారలారా! మీ కంఠస్వరాలు ప్రవక్త కంఠ స్వరానికి మించరాదు. మీరు ఒకరితో నొకరు మాట్లాడుకున్నట్లు దైవప్రవక్త (సఅసం)తో ఉచ్ఛస్థాయిలో అంటే బిగ్గరగా మాట్లాడకండి. (అలా జరిగితే) మీరు చేసుకున్నదంతా మీకు తెలియకుండానే వ్యర్థం అయిపోగలదు (జాగ్రత్త!)"

ఈ ఆయత్ అవతరించినప్పుడు హజ్రత్ సాబిత్ బిన్ ఖైస్ (రజి) దైవప్రవక్త (సఅసం) సన్నిధికి హాజరు కావడం మానేసి తమ ఇంట్లోనే ఉండిపోయారు. దైవప్రవక్త (సఅసం) (కొన్ని ఉల్లేఖనాల ప్రకారం) హజ్రత్ సఅద్ బిన్ ఉబాదా (రజి)తో "ఏమిటి సాబిత్ పరిస్థితి ఎలా ఉంది? ఆయన జబ్బునపడ్డారా?" అని అడిగారు. సఅద్ బిన్ ఉబాదా (రజి), "దైవప్రవక్తా! ఆయన నా పొరుగున ఉంటూ వున్నవారే. నాకు తెలిసినంత మటుకు ఆయనకు ఎలాంటి బాధలేదు" అని అన్నారు. చివరికి ఆయన వెళ్ళి దైవప్రవక్త (సఅసం) అడిగి తెలుసుకున్నది సఅద్ (రజి)కు వినిపించారు. అప్పుడాయన, "సూరా హుజురాత్‌లో అవతరించిన దైవవాణి నన్ను వ్యాకుల పరిచింది. నా కంఠస్వరం ప్రవక్త కంఠస్వరం కంటే ఉచ్ఛస్థాయిలో ఉంది అన్న విషయం మీకు తెలుసు కదా! ఈ ఆయత్ ప్రకారం నేను నరకంలో ప్రవేశించే వారిలో చేరిపోయాను" అని బాధపడ్డారు.

ఇది విన్న సఅద్ (రజి) దైవప్రవక్త సన్నిధికి చేరి ఆయన వ్యాకులతను దానికి కారణాన్ని తెలిపారు. ఇది విన్న దైవప్రవక్త (సఅసం), "లేదు, నీ వెళ్ళి ఆయనతో, నీవు స్వర్గవాసివి అని చెప్పు" అని చెప్పి పంపించారు.

సహాబా (రజి) (ప్రవక్త అనుచరులు) దైవప్రవక్త (సఅసం) ఎడల ఎంత గౌరవ భావంతో, ఎంత శ్రద్ధాసక్తులతో మెలిగేవారో ఈ ఉల్లేఖనం ద్వారా తెలుస్తోంది. ఈ ఆయత్ అవతరించిన తరువాత హజ్రత్ ఉమర్ (రజి) కంఠస్వరంలో ఎనలేని నెమ్మది చోటు చేసుకుంది. ఆయన మాట్లాడేటప్పుడు దైవప్రవక్త, "ఏదీ! మరోసారి చెప్పు, నీ మాట నాకు పూర్తిగా అర్థం కాలేదు" అని చెప్పేవారు.

## దైవప్రవక్త సంరక్షణకు హజ్రత్ తల్హా ప్రాణాలొడ్డిన వైనం

(۱۵۳) عَنْ قَيْسِ بْنِ اَبِىْ حَازِمٍ قَالَ رَأَيْتُ يَدَ طَلْحَةَ الَّتِىْ وَقٰى بِهَا النَّبِىَّ

صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَدْ شَلَّتْ

(بخاری کتاب المناقب باب فضائل اصحاب النبی صلی اللہ علیہ وسلم و مسند احمد ۱۳۸۵)

153. దైవప్రవక్త (సఅసం) సంరక్షణార్థం హజ్రత్ తల్హా (రజి) అడ్డుపడగా గాయపడి చివరకు ఎండిపోయిన ఆ చేతిని నేను చూశాను అని హజ్రత్ ఖైస్ (రజి) ఉల్లేఖించారు. (బుఖారి, ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

ఉహద్ యుద్ధం (హిజ్రీ శకం, 3వ సంవత్సరం)లో మక్కాకు చెందిన సత్యతిరస్కారులు మహాప్రవక్త (సఅసం)పై కత్తులు, బరిశెలతో అనేక వేటులు వేశారు. హజ్రత్

తల్హా (రజి) ఆ వ్రేటుల్ని తన చేతిని అడ్డుపెట్టి ఆపారు. ఆయన చూపుడు వ్రేలు పూర్తిగా తెగిపోయింది. చేతి రక్తనాళాలు తెగిపోవడం వల్ల ఆ చేయి పూర్తిగా పనికిరాకుండా పోయింది. సత్యానికి అసత్యానికి నడుమ జరిగిన ఆ పోరాటంలో దైవప్రవక్త (సఅసం) శరీరానికి ఎలాంటి హాని జరగరాదన్నదే ఆయన ఆరాటం.

## దైవప్రవక్త (సఅసం) ఎడల అన్సార్‌లకు గల ప్రేమాభిమానాలు

(۱۵۴) اِنَّ الْمِقْدَادَ اَتٰی رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ وَھُوَ یَدْعُوْ عَلَی الْمُشْرِکِیْنَ فَقَالَ وَاللّٰہِ یَا رَسُوْلَ اللّٰہِ لَا نَقُوْلُ کَمَا قَالَتْ بَنُوْ اِسْرَائِیْلَ لِمُوْسٰی: اِذْھَبْ اَنْتَ وَرَبُّکَ فَقَاتِلَا اِنَّا ھٰھُنَا قَاعِدُوْنَ وَلٰکِنْ نُقَاتِلُ عَنْ یَمِیْنِکَ وَعَنْ یَسَارِکَ وَمِنْ بَیْنِ یَدَیْکَ وَمِنْ خَلْفِکَ فَرَاَیْتُ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اَشْرَقَ وَجْھُہٗ وَسَرَّہٗ ذٰلِکَ

(مسند احمد عن ابن مسعود نمبر ۳۶۹۸ —— ۳۷۶ھ) (بخاری کتاب المغازی، کتاب التفسیر)

154. మహాప్రవక్త (సఅసం) మక్కా బహుదైవారాధకులకు వ్యతిరేకంగా అల్లాహ్‌ను వేడుకుంటున్న తరుణంలో హజ్రత్ మిగ్దాద్ (రజి) దైవప్రవక్తను ఇలా విన్నవించుకున్నారు, "దైవప్రవక్తా! బనీ ఇస్రాయీల్ మూసా (అ)తో, నీవూ నీ దేవుడు వెళ్ళి కలిసి యుద్ధం చేయండి. మేమిక్క డనే ఉంటాం" అని చెప్పినట్లు మేం చెప్పం, మేము మీ కుడి ఎడమలుగా ఉండి (దైవశత్రువులతో) యుద్ధం చేస్తాం. మీ వెనకా ముందుండి బహు దైవారాధకులతో తలపడతాం." అనగా దైవప్రవక్త ముఖారవిందం ఆనందంతో వెలిగిపోయింది. ఇది విన్న దైవప్రవక్తకు ఎనలేని సంతోషం కలిగింది అని అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) ఉల్లేఖించారు.

**సంగ్రహణం :**

బద్ర్ యుద్ధం (హిజ్రీ శకం రెండో సంవత్సరం)లో ప్రవక్త (సఅసం) వెంట ఉన్న ముస్లిముల సంఖ్య సత్యతిరస్కారుల సంఖ్యకు మూడోవంతు ఉంది. అంటే 1:3 నిష్పత్తి అన్నమాట. ఈ సంఖ్యను చూసి దైవప్రవక్త (సఅసం) కొంత వ్యాకులత చెందారు.

అల్లాహ్‌ను అతి దీనంగా వేడుకున్నారు. ఆయన పరిస్థితి గాంచిన మిగ్దాద్ (రజి) ఇలా విన్నవించుకున్నారు. ప్రవక్తా! విచారించకండి, దైవచిత్తమయితే మేము సత్యాసత్యాల నడుమ జరిగే ఈ పోరాటంలో మా ప్రాణాలొడ్డి పోరాడతాం. గతంలో బనీ ఇస్రాయీలీలు మూసా (అస) ఎడల అవలంబించిన వైఖరిని మేమవలంబించం. హజ్రత్ మూసా (అ) చేసిన విజ్ఞప్తికి జవాబుగా వారు, మీరేవెళ్ళి యుద్ధం చేయండి. దైవ తిరస్కారులతో యుద్ధం చేయడానికి మీ దేవుణ్ణి కూడా వెంట తీసుకెళ్ళండి. మీరిద్దరే ఆ యుద్ధంలో పాల్గొనండి. మేమిక్కడనే ఉండి చూస్తూ ఉంటాం అని అన్నారు. దైవప్రవక్తా! మేమలా అనం అని ప్రవక్త (సఅసం)కు ధైర్యం చెప్పారు. ఈ మాటలు విన్న ప్రవక్త (సఅసం) ముఖారవిందం ఆనందంతో వెలిగిపోయింది.

దైవప్రవక్త (సఅసం) గారి ఆ ప్రయత్నం దైవధర్మాన్ని వ్యాపింపజేయడానికి, ఆయన నామాన్ని ఉన్నతం చేయడానికే. అయితే అదంతా ఓ ఎత్తు. మనం మాత్రం మన వ్యక్తిగత జీవితంలో కూడా ఆయనను అనుసరించడం కష్టమైపోయింది. అయినా దైవప్రవక్త ఎడల మాటలతో మన ప్రేమాభిమానాలను ఒలకపోయడానికి, కేవలం ఆయన గుణగణాలను కీర్తించడం మట్టుకే పరిమితం అయిపోయాం.

## ప్రవక్త సంప్రదాయం కూడా ఖుర్ఆన్‌లా ఆధారితమే

(١٥٥) عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّهٗ قَالَ اَلَا اِنِّيْ اُوْتِيْتُ الْكِتَابَ وَمِثْلَهٗ مَعَهٗ اَلَا يُوْشِكُ رَجُلٌ شَبْعَانُ عَلٰى اَرِيْكَتِهٖ يَقُوْلُ عَلَيْكُمْ بِهٰذَا الْقُرْاٰنِ فَمَا وَجَدْتُّمْ فِيْهِ مِنْ حَلَالٍ فَاَحِلُّوْهُ وَمَا وَجَدْتُّمْ فِيْهِ مِنْ حَرَامٍ فَحَرِّمُوْهُ۔

(ابوداؤد عن المقدام بن معدیکرب کتاب السنة باب فی لزوم السنة)

155. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "జాగ్రత్త! అల్లాహ్ తరఫు నుండి నాకు గ్రంథం ఇవ్వడం జరిగింది. దానికితోడు అలాంటిదే (సున్నత్) ఇవ్వబడింది. వినండి! త్వరలో ఓ సంపన్నుడు తన ఆసనంపై దిండుకు ఆనుకొని, ఈ ఖుర్ఆన్‌నే వదలకుండా పట్టుకోండి, ఇందులో ఏది హలాల్ (ధర్మసమ్మతం) చేయబడిందో దాన్నే హలాల్‌గా ఎంచండి. ఏది హరాం (నిషిద్ధమైనదిగా) చెప్పడం జరిగిందో దాన్నే హరాంగా ఖరారు చేయండి అని అంటాడు." (మిగ్దామ్ బిన్ మఅదీ కరబ్ - అబూ దావూద్)

**సంగ్రహణం :**

ఈ హదీసు దైవప్రవక్త ప్రవచనాలను తిరస్కరించే వారి వైఖరిని ఎత్తి చూపుతోంది. హదీసులను తిరస్కరించే వారు ముస్లిమ్ సమాజంలో లేవనెత్తబోయే దుమారం గురించి దైవప్రవక్త (సఅసం) చేసిన భవిష్యవాణి పొల్లుపోకుండా నిజమైంది ఈనాడు. బాగా సంపన్నులైన వారు ఈ ఉపద్రవాన్ని లేవదీసి ముస్లిమ్ సమాజాన్ని ఛిన్నాభిన్నం చేయ ప్రయత్నం చేశారు. ఈ వర్గం వారు, ఇస్లామ్ ధర్మానికి మూలం కేవలం ఖుర్ఆనే అంటుంది. మహాప్రవక్త (సఅసం) జీవితం, ఆయన సచ్చరితం, ఆయన సంప్రదాయాలకు ధర్మంలో ఎలాంటి విలువు లేదంటారు ఈ వర్గానుయాయులు. వీరు ఆయన సంప్రదాయం నుండి ఎలాంటి ఆధారాన్ని చూపడాన్ని ఒప్పుకోరు. అందుకే హదీసుల భాండాగారానికి ధార్మికపరంగా వారి దృష్టిలో విలువ ఉండదు. ధర్మాన్ని కేవలం ఖుర్ఆన్ వరకే పరిమితం చేసి దైవప్రవక్తను అథారిటీగా భావించకపోవడం వల్ల వారు ప్రవక్త కాలాన్ని ఆ తరువాత ఖలీఫాల కాలాన్ని దృష్టిలో పెట్టుకోకుండా ఖుర్ఆన్‌ను అనువదిస్తారు. దానికి భాష్యం చెప్పేటప్పుడు తమ ఇష్టాయిష్టాలను జొప్పిస్తారు. అలాగే దాన్ని అర్థం చేసుకునేటప్పుడు ఆనాటి పరిస్థితులను అధ్యయనం చేయడానికి ససేమిరా ఒప్పుకోరు. ఇలాంటి వ్యాఖ్యానాలను అనువాదాలను పాశ్చాత్య నాగరికతను పుణికి పుచ్చుకున్నవారే స్వీకరిస్తూ ఉంటారు. వీరు ఇస్లామీయ బోధనల ప్రకారం జీవితం గడపడాన్ని జైలు జీవితంగా భావిస్తారు. ఇంతజేసినా తమ పేర్లు మాత్రం రిజిష్టరులో ముస్లిములుగానే నమోదవ్వాలని ఆశిస్తారు. ఇటు దివ్య ఖుర్ఆన్‌ను అనుసరించినట్లూ అవుతుంది. అటు వారు తమ ఇష్టానుసారం నడుచుకున్నట్లూ అవుతుంది.

(١٥٦) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ مُتَّكِئًا عَلٰى أَرِيْكَتِهٖ يَأْتِيْهِ الْأَمْرُ مِنْ أَمْرِيْ مِمَّا أَمَرْتُ بِهٖ أَوْ نَهَيْتُ عَنْهُ فَيَقُوْلُ لَا نَدْرِيْ مَا وَجَدْنَا فِيْ كِتَابِ اللّٰهِ اتَّبَعْنَاهُ۔

(ابوداؤد عن ابی رافع کتاب السنۃ، ترمذی ابواب العلم)

156. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : “ఒకడు తన ఆసనంపై మెత్తటి దిండుకు ఆనుకొని కూర్చొని ఉండగా ఫలానా పని చేయమని, ఫలానా పనిని వదిలేయమని అంటాడు. నా ఆదేశం అతనికి చేరితే అతడు, అదేదీ నాకు తెలియదు. నాకు తెలిసిందల్లా దైవగ్రంథాన్ని

అనుసరించడమే అని అంటాడు. మీలో ఏ ఒక్కరిని ఈ పరిస్థితిలో నేను చూడదలచలేదు." (అబూ రాఫె - అబూ దావూద్, తిర్మిజి)

**సంగ్రహణం :**

ఓ పనిని చేయవద్దని వారించడం లేక ఓ పనిని చేయమని పురమాయించడం దైవప్రవక్త (సఅసం)కు అల్లాహ్ తరపున సంక్రమించిన అధికారం. ఏ వ్యక్తి అయితే అదంతా నాకు తెలియదు ఆయన ఈ అధికారాన్ని నేను స్వీకరించను. నేను మాత్రం కేవలం ఖుర్ఆన్ ఆదేశాల్నే అనుసరిస్తాను అని అంటాడో ఆ వ్యక్తి మార్గభ్రష్టత్వం పొందినట్లే. రుజుమార్గాన్ని విడనాడి దుర్మార్గాన్ని అవలంబించినట్లే. దైవప్రవక్తను ఖుర్ఆన్ నుండి వేరుచేసిన తరువాత, దివ్య ఖుర్ఆన్ యొక్క సరైన భాష్యం చెప్పడంగాని, వ్యాఖ్యానించడంగాని చేసే స్తోమత మరెవ్వరికి ఉంది? దైవప్రవక్తను కాదన్న వారికి అసలు ఖుర్ఆన్ భావమే అర్థం కాదు. ఉదాహరణకు దివ్య ఖుర్ఆన్‌లో 'అకిముస్సలాత్' అనే చిన్న వాక్యాన్నే తీసుకుందాం. దానికి అర్థం, నమాజును స్థాపించండి అని. సొంతంగా దాని భాష్యం చెప్పేవాడికి, అసలు నమాజు అంటే ఏమిటి? ఏ యే సమయాల్లో నమాజు చేయాలి? ప్రతి నమాజులో ఉన్న రకాత్‌ల సంఖ్య ఎంత? దాని విధానం ఏమిటి? మొదటి తక్బీరు లగాయతు చివరి సలాం వరకు ఏమి పఠించాలి? అనేది తెలియదు. ఈ విధానం ఖుర్ఆన్‌లో ఎక్కడా కనిపించదు. ఇలాగే దివ్య ఖుర్ఆన్‌లో జకాత్ చెల్లించండి అనే ఆదేశం ఉంది. అయితే అది ఎప్పుడు ఎంత సొమ్ముపై జకాత్ ఫర్జు అవుతుంది అని చెప్పలేదు. ఎంత శాతం చెల్లించాలో అందులో కనబడదు. మొత్తానికి దైవగ్రంథంలోని ఆదేశాలు, సూత్రాల గురించిన సరైన అవగాహన కేవలం దైవప్రవక్త (సఅసం) వారి బోధనలు, ఆదేశాలు, వ్యాఖ్యానాల ద్వారానే తెలుస్తాయి.

## ప్రవక్త గుణసంపద

(۱۵۷) عَنْ اَنَسٍ قَالَ خَدَمْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَشْرَ سِنِيْنَ فَمَا قَالَ لِىْ اُفٍّ قَطُّ وَمَا قَالَ لِشَىْءٍ صَنَعْتُهُ لِمَ صَنَعْتَهُ؟ وَلَا لِشَىْءٍ تَرَكْتُهُ لِمَ تَرَكْتَهُ؟ وَكَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مِنْ اَحْسَنِ النَّاسِ خُلُقًا وَمَا مَسِسْتُ خَزًّا قَطْ وَلَا حَرِيْرًا وَلَا شَيْئًا كَانَ اَلْيَنَ مِنْ كَفِّ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَلَا شَمِمْتُ مِسْكًا قَطُّ وَلَا عِطْرًا كَانَ اَطْيَبَ مِنْ عَرَقِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ۔ (ترمذی ابواب البر والصلۃ، مسلم کتاب الفضائل)

157. హజ్రత్ అనస్ (రజి) గారి ఉల్లేఖనం ఇది. ఆయన ఇలా అన్నారు : "నేను పదేళ్ళపాటు దైవప్రవక్త (సఅసం)ను సేవించాను. ఆయనెప్పుడు నా విషయంలో విసుక్కోలేదు. ఏ పని చేసినా అది ఎందుకు చేశావు అని నన్నడగలేదు. దైవప్రవక్త (సఅసం) అందరికంటే మిన్నయైన గుణసంపత్తి కలిగినవారు. ఉన్నిని, పట్టును రెంటిని తాకి చూచాన్నేను, కాని దైవప్రవక్త (సఅసం) అరచేయి వాటికంటే మృదువుగా మెత్తగా ఉండేది. కస్తూరి, అత్తర్ల గుబాళింపు లెలాంటివో నాకు తెలుసు కాని దైవప్రవక్త (సఅసం) దేహం నుండి వెలువడే చెమట ఆ కస్తూరి అత్తర్ల కంటే ఎక్కువగా ఘుమఘుమలాడేది." (తిర్మిజి, ముస్లిమ్)

**సంగ్రహణం :**

హజ్రత్ అనస్ (రజి) దైవప్రవక్త (సఅసం) గారి సత్‌శీలానికి, సచ్చరితానికి సంబంధించిన గ్రంథంలోని ఓ పుటను మాత్రమే తెరిచారు మన ముందు. పదేళ్ళ వరకు ఆయన సాంగత్యంలో ఉండి ఆయన సేవను చేసే మహాభాగ్యం ఆయనకు దక్కింది. ఆయన ఇంటి జీవితం, బయటి జీవితాన్ని కళ్ళారా తిలకించిన మహానుభావుడు. ఆయన కథనం ప్రకారం దైవప్రవక్త ఎన్నడూ ఆయన్ను గట్టిగా మందలించలేదు. ఏ పొరపాటు చేసినా మనసును నొప్పించేమాట అనలేదు. ఏ తప్పుకూ ఆయన భృకుటి ముడివడలేదు. కోపంగా హూంకరించనూ లేదు. చేయదగని పని ఏదైనా చేస్తే అది ఎందుకు చేశావూ అని కూడా అనలేదు. చేయవలసిన పనిని వదిలేసినా ఎందుకు చేయలేదనీ అనలేదు. ఇది కేవలం పైకి చూపడానికో లేక ఏదో అవసరం కొద్దో అవలంబించిన వైఖరి కాదు. ఇదంతా ఆయన దగ్గర పదేళ్ళపాటు ఉండి పనిచేసిన వ్యక్తి చెప్పే మాటలు. ఇంతకంటే మేలైన నీతి నడవడికలు మరే మానవమాత్రుడు నేటివరకు ప్రదర్శించలేదు.

దైవప్రవక్త (సఅసం) శరీరం అందచందాల్ని సంతరించుకున్న శరీరం. పున్నమి నాటి చంద్రుడు కూడా ఆయన ముఖార విందాన్ని చూసి సిగ్గుపడేవాడు. ఇదేదో శ్రద్ధాతిశయంగాని, అతి పొగడ్తగానీ ఏదీ కాదు. ఆయన దగ్గర పదేళ్ళపాటు ఉండి ఆయన శుశ్రూష చేసిన హజ్రత్ అనస్ (రజి) వర్ణించిన విషయం. పట్టు, ఉన్ని ఎంతో మృదువుగా ఉంటాయి. కాని ఆయన కథనం ప్రకారం ఆయన యజమాని అరచేతులు అంతకంటే మృదువుగా కోమలంగా ఉండేవి. ఆయన శరీరం నుండి వెలువడే స్వేదం కస్తూరి అత్తర్ల సువాసనను తలదన్నేవి. ఇది యదార్థం. అతిశయోక్తితో కూడిన వర్ణన మాత్రం కాదు.

## మృదుస్వభావం

(١٥٨) دَخَلَ رَهْطٌ مِّنَ الْيَهُوْدِ عَلٰى رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالُوْا اَلسَّامُ عَلَيْكَ فَفَهِمْتُهَا فَقُلْتُ، عَلَيْكُمُ السَّامُ وَاللَّعْنَةُ فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مَهْلًا يَا عَائِشَةُ فَاِنَّ اللهَ يُحِبُّ الرِّفْقَ فِي الْاَمْرِ كُلِّهٖ فَقُلْتُ يَا رَسُوْلَ اللهِ اَوَلَمْ تَسْمَعْ مَا قَالُوْا قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَدْ قُلْتُ وَعَلَيْكُمْ - (بخاری عن عائشۃ کتاب الاستیذان، مسلم کتاب السلام)

158. హజ్రత్ ఆయిషా (రజి. అన్హా) ఉల్లేఖనం : "యూదుల బృందం ఒకటి దైవప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి 'అస్సాముఅలైక' (నీవు మరణించుగాక) అని అంది. వారి ఈ మాటలను అర్థం చేసుకొని నేను కూడా 'అలైకుముస్సాము వ లానహ్' (మీరూ చనిపోదురుగాక మీపై శాపంపడుగాక) అని పలికాను. (ఇది విని) దైవప్రవక్త (సఅసం) "ఓ ఆయిషా! కొంత మృదుత్వాన్ని పాటించు. అల్లాహ్‌కు మృదు స్వభావం అంటే ఇష్టం' అని అన్నారు. వారన్నది మీరు వినలేదా దైవప్రవక్తా! అని తిరిగి నేను విన్నవించుకోగా "నేను 'వ అలైకుం' (మీపై కూడా) అని అన్నాను కదా అని అన్నారు.

(హజ్రత్ ఆయిషా (రజి. అన్హా) – బుఖారీ, ముస్లిమ్)

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం) గారి ఉన్నత నైతికత, విశాల హృదయాన్ని ఈ హదీసు ద్వారా గ్రహించగలం. యూదుజాతి వైరం, కాపట్యం, సంకుచిత స్వభావం ఎలాంటిదో కూడా అర్థం చేసుకోవచ్చు.

## పరిశుద్ధమైన ప్రవక్త సంభాషణ

(١٥٩) لَمْ يَكُنِ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ سَبَّابًا وَّلَا فَحَّاشًا وَّلَا لَعَّانًا كَانَ يَقُوْلُ لِاَحَدِنَا عِنْدَ الْمَعْتِبَةِ مَا لَهٗ تَرِبَ جَبِيْنُهٗ - (بخاری عن انس کتاب الادب)

159. తిట్లు, శాపనార్థాలు, అశ్లీల పదజాలం అంటే ఏమిటో దైవప్రవక్త (సఅసం) పవిత్ర నాలుక ఎరుగదు. ఆయన మాపై తమ కోపాన్ని, అయిష్టాన్ని ప్రదర్శించేటప్పుడు (మహాఅయితే) "ఇతని నొసటికి మట్టి అంటా! ఏమైంది ఇతనికి" అని మాత్రం అనేవారు.

*(హజ్రత్ అనస్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

హదీసులో 'తరిబ జబీనుహు' అనే పదం వుంది. దీనికి అర్థం అతడు బోర్లాపడిపోను, అతని నొసటికి మట్టి అంటను అని. అంటే అతడు దరిద్రుడైపోను అని చెప్పడం అన్నమాట. ఆ పదాన్ని దారిద్ర్యం అనే అసలైన అర్థంలో వాడేవారు కాదు అరబ్బులు. మాట్లాడేటప్పుడు ఈ పదాలు (ఇలాంటివే మరికొన్ని పదాలు) అనుకోకుండా వారి నోట వెలువడేవి. దైవప్రవక్త (సఅసం) కూడా మిగతా వారిలాగా ఈ పదాలను వాటి యదార్థమైన అర్థంలో వాడేవారు కాదు. అనుకోకుండా మనం వాడినట్లు ఓ దరిద్రుడా అని అనేవారు. దైవప్రవక్త (సఅసం) ఎడల ప్రేమానురాగాలు, శ్రద్ధాసక్తులు కలిగినవారు బూతుల్ని పరుషపదాలను తమ నాలుకపై రాకుండా జాగ్రత్తపడడం అవసరం.

## ప్రవక్త దాన గుణం

(١٦٠) مَاسُئِلَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنْ شَيْءٍ قَطُّ فَقَالَ لَا

(بخاری عن جابر کتاب الادب)

160. (ఆయన వద్ద ఉన్న) ఏ వస్తువును అడిగినా మహాప్రవక్త (సఅసం) 'లేదు' అని అనడం ఎప్పుడూ జరుగలేదు. *(జాబిర్ (రజి) - బుఖారి)*

**సంగ్రహణం :**

దైవప్రవక్త (సఅసం) గొప్పదాత. విశాల హృదయంతో దేన్నైనా సరే ఒసిగేవారు. ఆయనెప్పుడూ అడిగేవారికి రిక్తహస్తాలతో వెనక్కి పంపడం జరగలేదు, ఆ వస్తువు ఆయన దగ్గర లేకపోతే తప్ప. అలాంటి సందర్భాల్లో కేవలం మిన్నకుండిపోయేవారు. నోటితో మాత్రం లేదు అని ఎన్నడూ అనలేదాయన.

## సుగుణ సంపదల ఆలవాలం ఆయన వ్యక్తిత్వం

(١٦١) كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَحْسَنَ النَّاسِ، وَاَجْوَدَ
النَّاسِ وَاَشْجَعَ النَّاسِ وَلَقَدْ فَزِعَ اَهْلُ الْمَدِيْنَةِ ذَاتَ

لَيْلَةٍ فَانْطَلَقَ النَّاسُ قِبَلَ الصَّوْتِ فَاسْتَقْبَلَهُ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَدْ سَبَقَ النَّاسَ إِلَى الصَّوْتِ وَهُوَ يَقُوْلُ لَمْ تُرَاعُوْا لَمْ تُرَاعُوْا وَهُوَ عَلَى فَرَسٍ لِأَبِي طَلْحَةَ عُرْيٍ مَا عَلَيْهِ سَرْجٌ فِي عُنُقِهِ سَيْفٌ فَقَالَ لَقَدْ وَجَدْتُهُ بَحْرًا أَوْ إِنَّهُ لَبَحْرٌ۔ (بخاری عن انس کتاب الادب مسلم کتاب الفضائل)

161. దైవప్రవక్త (సఅసం) అందరికంటే అందమైనవారు. దాతృత్వంలో ఆయనకు ఆయనే సాటి. ధైర్యపరాక్రమాల్లో అందరికంటే ఆయనే మిన్న. ఓ రాత్రి (శత్రుభయంతో) మదీనాలో భయభీతుల వాతావరణం నెలకొన్నది. ప్రజలు ఓ శబ్దం వైపుకు బయలుదేరారు. దైవప్రవక్త ఆ శబ్దాన్ని అనుసరించి అందరికంటే ముందే అక్కడికి చేరుకొని (ప్రజలనుద్దేశించి) భయపడకండి అని ధైర్యం చెప్పారు. అప్పుడాయన ఖడ్గాన్ని ధరించి అబూ తల్హా (రజి) గారి జీను కట్టిన గుర్రంపై ఎక్కి కూర్చొని వున్నారు. ఆ గుర్రాన్ని మెచ్చుకుంటూ ఇది భలే వేగంగా పరుగెత్తే గుర్రం అని పొగిడారు కూడా. *(హజ్రత్ అనస్ (రజి) - బుఖారి, ముస్లిమ్)*

## ప్రవక్త ఆరాధనా తీరు

(۱۶۲) إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ صَلَّى حَتَّى انْتَفَخَتْ قَدَمَاهُ فَقِيْلَ لَهُ أَتَكَلَّفُ هٰذَا وَقَدْ غَفَرَ لَكَ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِكَ وَمَا تَأَخَّرَ قَالَ أَفَلَا أَكُوْنُ عَبْدًا شَكُوْرًا۔

(مسلم عن المغیرۃ بن شعبۃ کتاب التوبۃ باب اکثار الاعمال۔ بخاری کتاب التفسیر)

162. "దైవప్రవక్త (సఅసం) తమ కాళ్ళు వాచిపోయేటట్లు (అధికంగా నఫిల్) నమాజులు చేసేవారు. ఇంతగా ఎందుకు శ్రమపడతారు దైవప్రవక్తా! మీ తప్పిదాలన్నీ ఎప్పుడో మన్నించబడ్డాయి కదా? అని అడిగితే ఏమిటీ! నేను (నా పోషకుడు, నా స్వామికి) కృతజ్ఞుణ్ణి కావద్దా అని పలికారాయన." *(ముగైరా బిన్ షుఅబా (రజి) - ముస్లిమ్, బుఖారి)*

**సంగ్రహణం :**

నఫిల్ (అదనపు) ఆరాధన వల్ల దైవసాన్నిధ్యం లభిస్తుంది. అందుకోసమే ఆయన సతతం రాత్రుళ్ళు మేల్కొని ఎక్కువ సమయం రహ్మాన్ సన్నిధిలో కాలం గడిపేవారు. ఆరాధనాధిక్యత వల్ల ఆయన పాదాలపై వాపు కనబడేది. కొన్ని సందర్భాల్లో ఆ పాదాలు పగిలిపోయేవి కూడా. ఈ పరిస్థితిని గని ఆయన ప్రియ సతీమణి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) "తమ తప్పిదాలన్నీ మన్నించబడ్డాయి కదా ఇంతగా శ్రమ పడతారు ఎందుకు? మీ ఆరోగ్యం చెడిపోతుంది" అని విన్నవించుకోగా ఆమె విన్నపాన్ని త్రోసిపుచ్చారాయన. జీవితాంతం 'తహజ్జుద్' నమాజు, దైవస్మరణల్లోనే ఆయన రాత్రుళ్ళు గడిపేవారు.

దీనికి కారణం ఏమిటో ఆయన తెలియజేస్తూ "అల్లాహ్ నాపై ఎనలేని మేళ్ళు చేశాడు. ఆయన కారుణ్యంలో నన్ను ముంచెత్తాడు. నా తప్పిదాలన్నిటిని మన్నించాడు. ఆయన అనంతమైన ఈ కరుణాకటాక్షాలకు కృతజ్ఞత తెలుపుకోవడానికి నేనాయన సన్నిధిలో సాష్టాంగపడవద్దా? ఓ విశ్వాసపాత్రుడైన సేవకుడు తన యజమానికి కృతజ్ఞత తప్పకుండా చూపాలి. ప్రతిక్షణం తానొక దాసుణ్ణని రుజువుపరచాలి. తన విశ్వసనీయతను చాటాలి. అందుకే నేనెంతో కుతూహలంగా, ప్రేమాధిక్యతతో ఆయన సన్నిధిలో హాజరవుతూ వున్నాను. హృదయపూర్వకంగా వినమ్రుడై ఆయన ఎదుట నా అసహాయతను చాటుకుంటున్నాను" అని అనేవారు.

ఇక ఇస్లామ్ ధర్మాన్ని అనుసరించే వీలు కలిగి, ఆ ధర్మం వైపుకు ప్రజలను పిలిచే భాగ్యం లభించి వారు కూడా తమకు లభించిన ఈ వరం గురించి అల్లాహ్‌కు కృతజ్ఞత చెప్పుకోవాలి. ఆ కృతజ్ఞతలు చెప్పుకునే మార్గం ఏమిటంటే వారు కూడా రాత్రి మూడో ఝామున నిద్రలేచి తహజ్జుద్ నఫిల్ నమాజులు చేయడమే.

## నిబంధనల ప్రకారమే నడుచుకోవడం

(۱۶۳) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ مَسْعُوْدٍ قَالَ كُنَّا يَوْمَ بَدْرٍ كُلُّ ثَلَاثَةٍ عَلٰى
بَعِيْرٍ فَكَانَ اَبُوْلُبَابَةَ وَعَلِيُّ بْنُ اَبِىْ طَالِبٍ زَمِيْلَىْ رَسُوْلِ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ فَكَانَتْ اِذَا جَاءَتْ عُقْبَةُ رَسُوْلِ
اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَا نَحْنُ نَمْشِىْ عَنْكَ قَالَ مَا اَنْتُمَا
بِاَقْوٰى مِنِّىْ وَمَا اَنَا بِاَغْنٰى عَنِ الْاَجْرِ مِنْكُمَا۔

(مشکوٰۃ کتاب الجہاد، مسند احمد نمبر ۳۹۶۵)

163. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) ఇలా ఉల్లేఖించారు: "బద్ర్ యుద్ధానికి వెళ్ళేటప్పుడు మాలో ప్రతి ముగ్గురు (వంతులవారీగా) ఒక ఒంటెపై ప్రయాణం చేయాల్సి వచ్చింది. హజ్రత్ అలీ, అబుల్ బాబా (రజి) ఇద్దరూ దైవప్రవక్తకు తోడుగా వున్నారు. దైవప్రవక్త (సఅసం) నడిచే వంతు వచ్చినప్పుడు వారిరువురూ, దైవప్రవక్తా! తమరు మామూలుగా నడుస్తారా? అని విన్నవించుకున్నారు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) వారితో, మీరు నాకంటే బలాఢ్యులేమీ కారు. అలాగే నేనూ మీలాగే పుణ్య ఫలాన్ని ఆశించడంలో మీ కంటే తక్కువ ఏమీ కాదు" అని సెలవిచ్చారు.

(మిష్కాత్ – కితాబుల్ జిహాద్, ముస్నద్ అహ్మద్)

**సంగ్రహణం :**

మదీనా నుండి బద్ర్ యుద్ధ మైదానానికి వెళ్ళేటప్పుడు దైవప్రవక్తకు కాలి నడకన నడువవలసిన వంతు వచ్చింది. ఆయనకు తోడుగా వున్న మిగతా ఇద్దరు దైవప్రవక్తా! మీకు బదులు మేం నడుస్తాం మీరు ఒంటెపై ఎక్కి కూర్చొండి అని విన్నవించుకున్నారు. కాని దైవప్రవక్త (సఅసం) ససేమిరా ఒప్పుకోలేదు. ఎంత బ్రతిమాలినా, ప్రాధేయపడినా నియమ నిబంధనలను మాత్రం వీడలేదు. ఆయన సచ్చరితం, ఆయన నడవడికకు సంబంధించిన ఈ వైఖరి ఎంతో ఉన్నతమైనది. బానిసల్ని ఒంటెపై కూర్చుండబెట్టుకొని ఓ యజమాని ఒంటె త్రాడు చేతబట్టి నడవడం లాంటి దృశ్యం మానవ చరిత్రకు ఓ క్రొత్త అనుభవమే.

బద్ర్‌యుద్ధం రమజాన్ నెల హిజ్రీ శకం రెండవ సంవత్సరంలో జరిగింది. ఈ యుద్ధంలో దైవ తిరస్కారుల సంఖ్య ఒక వేయి. ముస్లిమ్ ముజాహిద్‌ల సంఖ్య కేవలం మూడు వందల పదమూడు. ఆనాడు వారు ప్రదర్శించిన ధైర్యసాహసాలకు అల్లాహ్ తన కరుణాకటాక్షాలను జోడించాడు. ఆ కొద్దిమందికే విజయం చేకూర్చాడు. ఆ యుద్ధంలో డెబ్భైమంది దుష్టులు సంహరించబడ్డారు. మరో డెబ్భైమంది బందీలుగా చిక్కారు. ఈ యుద్ధం తరువాత దైవ తిరస్కారుల నడ్డి విరిగింది. రాజకీయంగా చూస్తే దైవప్రవక్త (సఅసం) మదీనాకు తిరిగివచ్చిన తరువాత ఆయన విలువ మరింత పెరిగింది. మదీనావాసుల్లో అనేకులు ఇస్లామ్ స్వీకరించారు. శత్రువు భయవిహ్వాలుడయ్యాడు.

## దైవప్రవక్త ఆరాధనాస్థాయి

(١٦٤) عَنِ ابْنِ عَبَّاسٍ سَمِعَ عُمَرَ يَقُوْلُ عَلَى الْمِنْبَرِ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ لَا تُطْرُوْنِي كَمَا أَطْرَتِ النَّصَارٰى عِيْسَى بْنَ

مَرْيَمَ فَإِنَّمَا أَنَا عَبْدُهُ فَقُولُوا عَبْدُ اللهِ وَرَسُولُهُ ۔

(بخاری کتاب الانبیاء باب قول اللہ واذکر فی الکتاب مریم)

164. హజ్రత్ ఉమర్ (రజి) మెంబరు (ప్రసంగపీఠం)పై నిలబడి ఇలా పలికారు : "నేను దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిస్తూ ఉండగా విన్నాను:

"(ప్రజలారా!) నసారా (క్రైస్తవులు) హజ్రత్ మరియం కుమారుడైన హజ్రత్ ఈసా (అ)ను కీర్తించడంలో అతిశయానికి పాల్పడ్డారు. అలా నన్ను పొగడడంలో మీరు హద్దులు మీరకండి. నేను కేవలం దేవుని దాసుణ్ణి మాత్రమే. కాబట్టి మీరు, ముహమ్మద్ (సఅసం) దేవుని దాసుడు, ఆయన ప్రవక్త అని మాత్రమే పలకండి." *(ఉమర్ (రజి) – బుఖారి)*

**సంగ్రహణం :**

ఈ హదీసులో చెప్పబడిన విషయం ఎంతో ప్రాధాన్యతను సంతరించుకొని ఉంది. ఇందులో ఎంతో ప్రస్ఫుటంగా దైవప్రవక్త (సఅసం)స్థానం ఏమిటో ఆయన హోదా ఏమిటో సూచించడం జరిగింది. ఆయన దేవుని దాసుడనడంలో ఎలాంటి సందేహానికి తావులేదు. తన జీవితాన్నంతా దేవుని ఆరాధనలోనే గడిపారాయన. దేవునికి అతి చేరువ అవడం, ఆయనకు ప్రీతిపాత్రుడవడమంటే ఆ వ్యక్తి తన పూర్తి జీవితంలో దేవునికి దాసుడై ఉండడం అన్నమాటే. అంటే దేవుడు ప్రసన్నుడై అతడిని తన దాసునిగా ఖరారు చేయడం. ఇదే దేవుడు మనిషికిచ్చే గొప్పవరం. ఈ విషయం దివ్య గ్రంథమైన ఖుర్ఆన్ ఖుద్దుగా చెబుతోంది. మరో యదార్థం ఏమిటంటే ఆయన దేవుని ప్రవక్త అన్నది. దేవుడు మానవాళికి సన్మార్గం చూపేందుకు ఆ మార్గంపై వారిని నడిపేందుకు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)ను, ఆయన తన అంతిమ ప్రతినిధిగా నియమించి పంపాడు. అల్లాహ్ తన తరపున దివ్యగ్రంథాన్ని ఆయన మనకిచ్చారు. జీవించడానికి ఓ ఉత్తమ జీవన వ్యవస్థను అందించారు. దేవుడు సృష్టించిన ఈ భూమండలంపై దేవుని చట్టాన్నే అమలుపరిచారు. అందుకే ఆయన, "నేను దేవుని దాసుడను, ఆయన ప్రవక్తను" అని చాటారు.

ఈ వాక్యానికి అర్థం ఏమిటంటే, నేను దేవుణ్ణి కాదు – ఆయన దైవత్వంలో నాకు రవ్వంత భాగస్వామ్యమూ లేదు – అలాగే నేను దేవుడికి సాటివాణ్ణి కూడా కాదు. సరికదా నేను ఎలాంటి దాపరికం లేకుండా చెబుతోంది, నా వద్ద దేవుని శక్తులుగాని, పరోక్ష జ్ఞానం గాని లేవు అని. నా లాభనష్టాలు సైతం నా చేతిలో లేనప్పుడు మీకు ఏ విధమైన లాభాన్ని చేర్చడం గాని మిమ్మల్ని ఎలాంటి నష్టానికి గురిచేయడం నాకెలా చేతనవుతుంది? కేవలం

నేనో మానవ మాత్రుడను మాత్రమే. అయితే మానవ కళ్యాణం కోసం నాపై దైవవాణి అవతరిస్తుంది. కాబట్టి నేనాయన తరఫున మీ వైపుకు పంపబడిన దైవప్రవక్తను అంతే.

మీరు నన్ను దాస్యస్థానం నుండి పైకి లేపి దైవత్వ సింహాసనంపై కూర్చోబెట్టి నన్ను దేవుని సాటివాడిగా, దేవుడంతటి వాడిగా చేసి జులుముకు పాల్పడేరు జాగ్రత్త! అదేకాదు దేవుని గుణగణాల్లో నన్ను భాగస్వామిగా ఎంచి నన్ను పూజించేరు! నేను అల్లాహ్ అధికారంలో రవ్వంతైనా భాగస్వామిని కానుసుమా!! నేను పూజనీయుణ్ణి కాను. నేను కేవలం 'అబ్ద్' (దాసుణ్ణి) మాత్రమే. ఈ సకల చరాచర సృష్టికి విశ్వానికి ఎవరయితే యజమానో, స్వామియో నేనాయన్ను ఆరాధిస్తున్నాను, మ్రొక్కుతున్నాను. ఆయనే సకల లోకాలకు పోషకుడు. నేను కాదు మీకు భుక్తినిచ్చేది. ఎవరి జీవన్మరణాలు నా అధీనంలో లేవు. నేను ఎవరినీ వ్యాధికి గురిచేయడంగాని, ఏ వ్యాధిగ్రస్తుడికి స్వస్థత చేకూర్చేవాణ్ణి ఎంతమాత్రం కాను. నేను కేవలం అల్లాహ్‌కు దాసుణ్ణి. ఆయన సేవకుణ్ణి మాత్రమే. అందుకే నాకు రుజుమార్గమిచ్చి ప్రవక్తగా నియమించి మీ ముందుకు పంపించడం జరిగింది. నా ఈ స్థాయిని విశ్వసించండి. నేను చూపే మార్గంపై నడవండి.

క్రైస్తవుల్లా హద్దు మీరే ప్రయత్నం చేయకండి. ఆ నిర్భాగ్యులు దైవదాసుణ్ణి (హజ్రత్ ఈసా (అస)ను దేవునికి కుమారుడిగా చేశారు. ఆయన్ను కీర్తించడంలో అతిశయానికి లోనయ్యారు. ఆయన యొక్క మానవ స్థాయిని కాదని ఆయన్ను దేవుని స్థానం వరకు తీసుకొని వెళ్ళారు. ఫలితంగా వారు స్వయాన మార్గభ్రష్టత్వం పొందడమే కాకుండా దైవధర్మ స్వరూపాన్నే తారుమారు చేశారు. ఆ ధర్మాన్ని అర్థం కానటువంటి చిక్కు సమస్యగా తయారు చేశారు. ఈ అపనమ్మకాన్నే ప్రాతిపదికగా చేసి ఓ క్రొత్త ధర్మాన్ని మానవాళికి పరిచయం చేయడం వల్ల దాన్ని అది తన జీవితపు ధర్మంగా స్వీకరించడానికి నిరాకరించింది.

ప్రస్తుతం ఈ అపనమ్మకం కారణంగానే మానవాళి ఆ క్రొత్త ధర్మాన్ని త్రోసిపుచ్చి అసలు దేవుణ్ణే నమ్మడానికి సంశయిస్తుంది. దైవప్రవక్త రాకతో ఏ పని అయితే జరగవలసి ఉండిందో దానికి పూర్తి భిన్నంగా మరో ధోరణి పెరిగిపోయింది. దీనికంతటికి క్రైస్తవ ధర్మవేత్తలు దేవుని ఎదుట జవాబు చెప్పుకోవలసి వుంది ప్రళయం రోజున.

## మహాప్రవక్త (సఅసం) సద్గుణ సంపద

(١٦٥) عَنْ أَبِي عَبْدِ اللهِ الْجَدَلِيِّ يَقُولُ: سَأَلْتُ عَائِشَةَ عَنْ خُلُقِ رَسُولِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَتْ لَمْ يَكُنْ فَاحِشًا وَلَا مُتَفَحِّشًا وَلَا صَخَّابًا فِي الْأَسْوَاقِ وَلَا يَجْزِي بِالسَّيِّئَةِ السَّيِّئَةَ وَلٰكِنْ يَعْفُو وَيَصْفَحُ۔

(ترمذی ابواب الصلۃ)

165. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ జదలీ (రజి) గారి కథనం : "నేను హజ్రత్ ఆయిషా (రజి.అన్హా)గారిని, దైవప్రవక్త (సఅసం) గుణసంపద గురించి అడిగాను. దానికి ఆమె ఇలా సెలవిచ్చారు."

"దైవప్రవక్త (సఅసం) దుర్గుణాలకు అతీతులు. ఆయన ఆ దుర్గుణాలను అలవరచుకోవడానికి ఎలాంటి ప్రయత్నం చేయలేదు. వీధుల్లో బిగ్గరగా మాట్లాడేవారు కారు. దుర్మార్గానికి బదులు దుర్మార్గము ఎప్పుడూ అవలంబించలేదు. సరికదా తమపై దౌర్జన్యానికి పాలు పడేవారిని క్షమించి అతడి తప్పులను మన్నించివేసేవారు." (తిర్మిజి)

**సంగ్రహణం :**

సచ్ఛీలత, సద్వర్తనం కలగలిసిన ఆ మూర్తిమత్వం ఏనాడు తన పరిశుద్ధమైన నాలుకను దుర్భాషలతో అపవిత్రం చేయలేదు. ఏనాడూ అశ్లీలం జోలికి పోలేదు. సిగ్గు మాలిన పదాలను తన నోట ఎప్పుడూ పలుక లేదు. బజారుల్లో ఎన్నడూ పెద్దగా అరవలేదు. ఎవరైనా దురుసుగా ప్రవర్తిస్తే క్షమించి వదిలివేసేవారు. చెడు నడతలు గల వారికి సతతం దూరంగా ఉండేవారు. తనను హింసించి బాధించిన వారిని దీవించి పంపారు. వారి ఎడల సత్ప్రవర్తనతోటే మెలిగారు. బజారున నడిచే టప్పుడు ఎంతో హుందాగా తలదించుకుని నడిచేవారు.



# దైవప్రవక్తపై విశ్వాసం

## దైవదౌత్య స్థాయి

۱۶۶) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَا يَنْبَغِيْ لِعَبْدٍ اَنْ يَقُوْلَ اَنَا خَيْرٌ مِنْ يُوْنُسَ بْنِ مَتّٰى۔

(بخاری عن ابی ہریرۃ کتاب الانبیاء، مسلم کتاب الفضائل من فضائل موسٰی علیہ السلام)

166. హజ్రత్ యూనుస్ బిన్ మత్తా కంటే నేను (ముహమ్మద్(స) మెరుగైనవాణ్ణి అని ఎవరైనా అంటే అది సరైన మాట కాదు" అని దైవప్రవక్త(స) సెలవిచ్చారు. (అబూహురైరా(రజిఅన్)- బుకారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

ఈ గౌరవం, ఈ హోదా మరే ప్రవక్తకు లభించలేదు. అదేకాకుండా అనేక హదీసుల్లో, మహాప్రవక్త ముహమ్మద్(స) హోదా, అంతస్తు మిగతా ప్రవక్తలకంటే ఉన్నతమైంది అని చెప్పడం జరిగింది. ఆయన పూర్తి మానవ జాతి కోసం ప్రభవించిన నాయకుడు (ఇమామ్) (ఈ మానవ జాతిలోనే మిగతా ప్రవక్తలు, దైవసందేశహరులు ఉన్నారన్నది ఇక్కడ గమనార్హం)

ఉదాహరణకు కొన్ని హదీసులు ఇలా ఉన్నాయి: "ప్రళయదినాన నేను మానవులందరికి నాయకుడిగా ఉంటాను. అందరికంటే ముందు నేను నా సమాధి నుండి బయటకు వస్తాను. అందరికంటే ముందు నేను సిఫారసు చేస్తాను. ప్రథమంగా స్వీకరింపడే సిఫారసు నాదే" (ముస్లిమ్)

"గతించినవారు, ఇక పుట్టబోయేవారి కంటే అల్లాహ్ దృష్టిలో నేను ఎక్కువ గౌరవనీయుణ్ణి. (ఇది దేవుని ప్రత్యేక కరుణా కటాక్షం) దానికి నేను గర్వించడం లేదు". (మిష్కాత్)

"దైవ సందేశహరులందరికి నేను నాయకుణ్ణి. ఇది గర్వించే విషయంకాదు. నేను చిట్టచివరి దైవప్రవక్తను. (నా తరువాత మరే దైవప్రవక్త రాడు) దీనికి నేను గర్వపడడం లేదు (సరికదా నేను అల్లాహ్ యొక్క ఈ కారుణ్యానికి ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను)"

పై ఆధారాలన్నిటిని దృష్టిలో ఉంచుకుంటే, హజ్రత్ ముహమ్మద్(స) దైవప్రవక్తలు, దైవసందేశహరులకంటే ఉన్నతులు అనే విషయం తేటతెల్లమవుతుంది. కాని ఆయన గారిని పొగడడంలో అతిశయానికి పోయి మరో ప్రవక్తను తూలనాడడం, అగౌరవపర్చడం ధర్మసమ్మతంకాదు. నబువ్వత్ (దైవదౌత్యం)స్థాయిలో ప్రవక్తలంతా సమాన స్థాయి కలవారే. దైవసందేశాన్ని అందించడంలో అంతా సమానులే. అయితే వారిలో ఒకరికి మరొకరిపై ఏదైనా ప్రత్యేకత ఉంటే అది ఇతర ప్రత్యేకతల వల్లనే. అంతేగాని వారి ఈ ప్రత్యేకతల వల్ల మరొకరు ఆయనకంటే దిగువస్థాయి వారని వారిని తక్కువ దృష్టితో చూడడం తగదు. హజ్రత్ ముహమ్మద్(స)ను ప్రవక్తలందరి నాయకులు అనడం అంటే, మిగతా ప్రవక్తల్ని లేక వారిలో కొందరిని తక్కువగా అంచనా వేయడం కాదు ఈ హదీసు ఉద్దేశ్యం.

1. మీరు నన్ను హజ్రత్ యూనుస్ బిన్ మత్తా కంటే మేలైనవాడిగా ఎంచకండి. అంటే ఆయన్ను తక్కువ దృష్టితో చూడకండి.

2. ప్రవక్తల్ని ఒకరిపై మరొకరికి ప్రాధాన్యత ఇవ్వకండి, కొందరిని ఇతర ప్రవక్తల కంటే మేలైనవారుగా ఎంచకండి" అంటే కొందరు ప్రవక్తల ప్రేమాభిమానాలు, శ్రద్ధాశక్తులతో పొగడడంలో అతిశయానికి పోయి ఇతర ప్రవక్తలను అగౌరవించి చులకన చేయవద్దు.

3. నన్ను మూసా(అ) (మోసెస్)పై ప్రాధాన్యత ఇవ్వకండి అంటే, నాకంటే మూసా (అ) సామాన్యుడుగా, తక్కువవానిగా కనబడేటట్లు ఒకరితో ఒకరిని సరిపోల్చకండి అని అర్థం.

ఎందుకంటే ఓ ప్రవక్తను నిరాకరించడం లేక ఆయన్ను తూలనాడడం 'కుఫ్ర్'. అంటే దైవతిరస్కారం. కొందరు మూఢ కవులు తమ నాతియాకలాం (ప్రవక్తను ప్రశంసిస్తూ చేసే స్తుతిగానం)లో ఇతర ప్రవక్తల ఎడల అపచార వైఖరిని అవలంబిస్తారు. ప్రజల్లో పేరు సంపాదించాలనే తాపత్రయపడే ఉలమాలు కొందరు ఒక ప్రవక్తకు మరో ప్రవక్తతో సరిపోలుస్తూ ఒకరి గౌరవాన్ని పెంచుతూ మరొకరి గౌరవాన్ని మంటకలుపుతూ ఉపన్యసిస్తూ ఉంటారు. ఇలాంటి విషయాలను అడ్డుకోవడానికి దైవప్రవక్త(స) ఇలా సరి పోల్చడాన్ని నిషేధించారు. మొత్తానికి ప్రవక్తలు, సందేశహరుల స్థాయి ఎంతో గొప్పది, సున్నితమైనదీను. వారిని కించపరచడం, అగౌరవించడం వల్ల వెయ్యేళ్ళ ఆరాధన కూడా నిరర్థకం అయిపోతుంది. ముస్లిములను ఇలాంటి నేరాల నుండి అల్లాహ్ రక్షించుగాక. ఆమీన్

## సత్యం వైపునకు ఆహ్వానించేవారు

(۱۶۷) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَدَأَ الْإِسْلَامُ غَرِيْبًا
وَسَيَعُوْدُ كَمَا بَدَأَ غَرِيْبًا فَطُوْبٰى لِلْغُرَبَاءِ

(مسلم عن ابی ہریرۃ کتاب الایمان۔ ترمذی عن عبداللہ بن مسعود ابواب الایمان)

167. "ఇస్లాం ప్రారంభదశలో అపరిచితంగా ఉండింది. త్వరలో అది తన ప్రారంభదశన అపరిచితం కాబోతుంది. కాబట్టి (ఇస్లాం ధర్మం వైపునకు పిలుపునిచ్చే) ఆ అపరిచితుల జీవితం ఎంత ధన్యమైన జీవితం!" అని దైవప్రవక్త(స) ప్రవచించారు. (అబూ హురైరా(రజిఅన్)- ముస్లిం, అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజిఅన్)- తిర్మిజి)

**సంగ్రహణం:**

హదీసులోని మూలంలో 'గరీబ్' అనే పదం ఉంది. అరబీ భాషలో గరీబ్ అంటే స్వదేశానికి దూరంగా ఓ అపరిచితమైన ప్రదేశంలో ఉండేవాడని అర్థం. దైవప్రవక్త(స) మక్కాలో "లా ఇలాహ ఇల్లల్లాహ్" ఉద్యమాన్ని ప్రారంభించినప్పుడు కొన్ని పవిత్రాత్మలు మాత్రమే ఇస్లాం ధర్మాన్ని స్వీకరించాయి. వీరు పూర్తి అరేబియా దేశానికే అపరిచితులుగా విచిత్రమైన మనుషులుగా లెక్కించబడ్డారు. ప్రారంభంలో ధర్మసంస్థాపన ఉద్యమం క్రొత్తగా అపరిచితమైన విషయంగా అగుపడింది. ఓ కొత్త వస్తువును చూసినట్లు ప్రజలు దీన్ని విచిత్రంగా చూస్తారు.

మహాప్రవక్త(స) ప్రవచన సారాంశమేమిటంటే ఇస్లాం ప్రాభవం అత్యున్నత శిఖరాలనధిరోహించిన తరువాత ఓ నాటికి అది అపరిచితమై దాని అసలు రూపురేఖలేమిటో తెలియని ఓ యుగంలో ప్రవేశిస్తుంది. అప్పుడు ప్రజలు దానివైపుకు పిలుపునిచ్చే వారిని అదంటే ప్రాణాలు అర్పించే వారిని క్రొత్త వారిని చూసినట్లు విచిత్రంగా చూస్తారు. ఎందుకంటే ఆ కాలంలో అమలులో వున్న చట్టాలు, సిద్ధాంతాలే వేరు. ఆ మార్కెట్‌లో ఇస్లాం చట్టాలు, సిద్ధాంతాలకు స్థానమే ఉండదు. అది ఓ క్రొత్త వస్తువుగా, విచిత్రమైనదిగా అగుపడుతుంది. మరోవిధంగా ఇస్లామీయ వ్యవస్థను స్థాపించేవారికి, దైవతిరస్కార ధోరణి, నాస్తికత్వం ప్రబలి ఉన్న కాలంలో అనేక రకాలైన ధనప్రాణ నష్టాలను ఎదుర్కోవలసి ఉంటుంది అని, ఇలాంటి పరిస్థితుల్లో ఇస్లాం వ్యవస్థకు అనుగుణంగా జీవితం గడిపేవారికి మహాప్రవక్త(స) ఇచ్చిన శుభవార్త, అలాంటివారు ఎంతో ధన్యమైనవారు అదృష్టవంతులు అన్నదే. వీరు ప్రపంచానికి సత్యధర్మాన్ని తమ చేతల ద్వారా చాటుతారు. విచ్ఛిన్నకర కార్యకలాపాలు, రుగ్మతలకు వ్యతిరేకంగా 'జిహాద్' అంటే ధర్మసంస్థాపనార్థం అవిరళ కృషి చేస్తారు. చివరికి ఓగొప్ప బహుమానానికి అర్హత పొందుతారు.

## దైవసందేశం వైపునకు దగ్గరి వారిని ఆహ్వానించడం

(١٦٨) قَامَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ حِيْنَ اَنْزَلَ اللهُ:
وَاَنْذِرْ عَشِيْرَتَكَ الْاَقْرَبِيْنَ" قَالَ يَامَعْشَرَ قُرَيْشٍ:

4. ముస్లిమ్ పాలకులకు, నాయకులకు సంబంధించిన విషయంలో హితైషి అని అంటే ఇస్లామీయ పాలన మరియు ఇస్లామీయ సామ్రాజ్య రక్షణార్థం, సమైక్యత కోసం వారితో పూర్తిగా సహకరించాలి. శిష్టాచారాల రక్షణలో, సత్కర్మలవ్యాప్తిలో వారిని విధేయించాలి. వారే గనక తప్పుల్లో దుష్కార్యాల్లో చిక్కుకుపోతే సమర్థవంతంగా, మృదువుగా వారిని మందలించి దారికి తీసుకురావాలి తప్ప వారి అడుగులకు మడుగులొత్తే వైఖరిని అవలంబించకుండా జాగ్రత్తపడాలి అని అర్థం.

5. ముస్లిమ్ ప్రజానీకానికి సంబంధించిన విషయంలో హితైషి అంటే వారి ధన, మాన ప్రాణాలపై దాడి చెయ్యవద్దు, వారిలో వైరం సృష్టించి పరస్పరం కలహాలు, ద్వేషాలు రగిలించే వైఖరిని విడనాడాలి అని అర్థం. ఇదేకాకుండా వారు రోగగ్రస్థులయితే వారిని పరామర్శించడం, వారికి సేవ చేయడం జరగాలి. కష్టాల్లో చిక్కుకున్నప్పుడు సహాయాన్ని అందించి ఆదుకోవాలి.

## దైవగ్రంథం, ప్రవక్త(స) సంప్రదాయాల స్థాయి

(۱۷۰) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ خَيْرَ الْحَدِيْثِ كِتَابُ اللهِ وَخَيْرَ الْهَدْيِ هَدْيُ مُحَمَّدٍ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ۔

(مسلم عن جابر كتاب الجمعة)

170. “సర్వోన్నతమైన హితబోధ (అంతిమ) దైవగ్రంథం, సర్వోత్తమమైన మార్గం ముహమ్మద్(స) చూపిన మార్గమే.” అని సెలవిచ్చారు మహాప్రవక్త(స). (హజ్రత్ జాబిర్(రజిఅన్)- ముస్లిమ్)

**సంగ్రహణం:**

అంటే దైవగ్రంథం అయిన దివ్యఖుర్ఆన్, దైవప్రవక్త ఆదేశాలు, తాము స్వయంగా అవలంబించిన జీవనశైలిని అవలంబించమని చెప్పడం అన్నమాట. వాటి పరిధిని దాటి ఆవల ఏయే జీవన విధానాలైతే ఉన్నాయో అవన్నీ వక్రమైనవి, భ్రష్టమైన జీవన విధానాలే. ఇహపరలోకాల్లో విజయం సాధించడానికి దైవగ్రంథాదేశాలు, మహాప్రవక్త ముహమ్మద్(స) తమ ఇరవై మూడేళ్ళ దౌత్యకాలంలో అవలంబించిన విధానాలే మానవాళికి శిరోధార్యాలు, అనుసరణీయాలు. ఏ వ్యక్తి అయితే తన జీవితంలో తారసిల్లే చిక్కుల్ని పారద్రోలేందుకు దేవుని గ్రంథాన్ని, ఆయన ప్రవక్త సంప్రదాయాల్ని వదిలి ప్రాపంచిక రాజకీయ నాయకుల్ని ఇస్లామేతర తాత్వికుల్ని ఆశ్రయిస్తాడో అతడు మరిన్ని చిక్కుల్ని కొనితెచ్చుకుంటాడు.

దివ్యఖుర్ఆన్‌లో మానవ మార్గదర్శకానికి అత్యుత్తమైన సిద్ధాంతాలు, సూత్రాలు

1. అల్లాహ్‌కు సంబంధించిన విషయంలో
2. ఆయన గ్రంథానికి సంబంధించిన విషయంలో
3. దైవప్రవక్తకు సంబంధించిన విషయంలో
4. ముస్లిముల నాయకులు వారి పాలకులకు సంబంధించిన విషయంలో
5. ముస్లిం ప్రజానీకానికి సంబంధించిన విషయంలో

(ముస్లిమ్, అబూదావూద్)

**సంగ్రహణం:**

దీన్ (దైవధర్మం) బంధం జీవితంలోని ప్రతిరంగంతో ముడివడి ఉంది. అదే కాకుండా దేశవాసుల్లోని ప్రతి వ్యక్తితో దాని సంబంధం ఉంది. అతడు పండితుడైనా, పామరుడైనా, ధనికుడైనా, పేదవాడైనా, పాలకుడైనా, పార్టీ నాయకుడైనా ఎవరైనా సరే.

1. అల్లాహ్‌కు సంబంధించిన విషయంలో అది హితైషి అంటే అల్లాహ్‌ను సకల చరాచర సృష్టికి స్వామి, ప్రభువు, పాలకుడుగా గుర్తించడం, స్వీకరించడం జరగాలి. ఆయన ఏ ఒక్కరి సహాయసహకారాలకు అతీతంగా ఈ పూర్తి విశ్వాన్ని, విశ్వవ్యవస్థను నడుపుతున్నాడని విశ్వసించడం. ఆయన ఏ బలహీనత లేని పరిశుద్ధుడు అని నమ్మి ఆ ఏకైక ప్రభువును తన ఆరాధ్యునిగా ఎంచి ఆయనకు విధేయుడై ఉండడం. ఆయన ఆరాధనల్లో మరెవ్వరిని భాగస్వామిగా చేయకుండా ఉండడం. అలాగే ఆయన ఒసగిన వరాలను మననం చేసుకోవడం.

2. దైవగ్రంథానికి సంబంధించిన విషయంలో హితైషి అంటే, మానవ కళ్యాణానికి మార్గదర్శకానికి అల్లాహ్ ఏ గ్రంథాలనయితే అవతరింపజేశాడో అవి సత్యమైన గ్రంథాలు. వాటిలో చిట్టచివరి గ్రంథం దివ్యఖుర్‌ఆన్. దీన్ని అల్లాహ్ తన దాసుల మార్గదర్శకానికి అవతరింపజేశాడు. ఆ గ్రంథాన్ని పారాయణం చేస్తూ అందులోని జ్ఞానాన్ని పొందాలి. దాన్ని గౌరవించాలి, అనుసరించాలి. జీవితం గడపడానికి ఏ విధానం అయితే ఈ గ్రంథం సూచించిందో దాన్ని చిత్తశుద్ధితో స్వీకరించి సొంతం చేసుకోవాలి.

3. ప్రవక్త సంబంధంలో హితైషి అంటే, ఓ ముస్లిమ్ తన జీవితంలోని ప్రతి అడుగున దైవప్రవక్త(స)నే అనుసరించడం. ఆయన మార్గదర్శకత్వంలో పూర్తి విశ్వాసం ఉంచి నడుచుకోవడం అన్నమాట. అదేకాకుండా మహాప్రవక్త(స) సూచించిన మార్గంపై నడవడమే కాదు భువిలో దాన్ని విస్తరింపజేయడానికి ఆయన ఏ ప్రయత్నం అయితే జేశారో మనం కూడా ఆ అడుగుజాడల్లోనే నడుచుకొని దాన్నే మన జీవిత ధ్యేయంగా ఖరారు చేసుకోవాలి. మనమంతా ఆయన చూపిన విధానానుసారంగా జీవితం గడపాలి. ఆ ధర్మాన్ని స్థాపించడానికి జీవితాన్నే పణంగా పెట్టేయాలి.

సంబోధిస్తూ, మీరు దేవుణ్ణి విశ్వసించండి, ఆయనకు విధేయులై నరకాగ్ని నుండి రక్షించుకునే ప్రయత్నం చేయండి. కాదంటారో నాతో మీకు గల కుటుంబ సంబంధం, వంశబంధాలు ఏమాత్రం మిమ్మల్ని రక్షించలేవు అని అన్నారు. సరికదా దైవప్రవక్త(స) తాను ఎంతగానో అభిమానించి గౌరవించే తన మేనత్త సఫియా(రజిఅన్) ముద్దుల కుమార్తె హజ్రత్ ఫాతిమా(రజిఅన్) గార్లతో ఎలాంటి దాపరికం లేకుండా నా సొమ్ము నుండి ఏది తీసుకోదలిచారో దాన్ని నిర్మొహమాటంగా అడిగి తీసుకోండి. బంధుత్వపు రుణం తీర్చుకోడానికి నేను ఎప్పుడూ సిద్ధమే కాని దైవతిరస్కారం, అవిధేయతా శిక్షల నుండి మిమ్మల్ని తప్పించడం మాత్రం నాకు సాధ్యమయ్యే పనికాదు అని నిక్కచ్చిగా చెప్పేశారు.

కొంత లోతుగా ఆలోచిస్తే ఈ హదీసు ద్వారా తెలుస్తున్న విషయం ఏమిటంటే, దైవమార్గం వైపునకు ఆహ్వానించే కార్యాన్ని ప్రప్రథమంగా ఇంటి నుండే ప్రారంభిం చాలన్నది. ఆ తరువాత బంధువర్గం మిత్రులు వగైరాలను ఆహ్వానించాలి. ఏ వ్యక్తి అయినా ధర్మసంస్థాపనోద్యమం కోసం నడుము బిగించి తన కుటుంబాన్ని బంధువర్గాన్ని మరిచిపోతే అంతటి అమాయకుడు మరెవ్వరు లేరని చెప్పవచ్చు. బంధుమిత్రులకు దీని ప్రయోజనాన్ని తెలుపడం అతని ప్రప్రథమ విధి. లాభం, శ్రేయం ఇమిడేటప్పుడు ఓ వ్యక్తి దృష్టిలో ప్రప్రథమంగా మెదిలేది వీరే. అయితే చాలామంది ధార్మికులు ధర్మప్రచారంలో తమ సంతానాన్ని, సోదరులను దగ్గరి బంధువుల్ని మరిచిపోతారు. వారిని ధర్మావలంబన విషయంలో ఉపేక్షిస్తారు.

## హితాన్ని కోరే దైవధర్మం

(۱۶۹) عَنْ تَمِيْمِنِ الدَّارِيِّ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ
اَلدِّيْنُ ، النَّصِيْحَةُ قُلْنَا: لِمَنْ ؟ قَالَ لِلّٰهِ وَلِكِتَابِهٖ وَلِرَسُوْلِهٖ
وَلِاَئِمَّةِ الْمُسْلِمِيْنَ وَعَامَّتِهِمْ -

(مسلم کتاب الایمان ابوداؤد کتاب - الادب فی النصیحۃ)

169. హజ్రత్ తమీమ్‌దారి (రజిఅన్) ఉల్లేఖనం ఇది. దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారని ఆయన అన్నారు:

"దైవధర్మం ఓ హితైషి అయిన ధర్మం" అని అనగా ఎవరికి సంబం ధించిన విషయంలో హితైషి దైవప్రవక్తా! అని అడిగినదానికి తిరిగి ఇలా సెలవిచ్చారాయన.

اِشْتَرُوْا اَنْفُسَكُمْ لَا اُغْنِیْ عَنْكُمْ مِنَ اللّٰهِ شَيْئًا ، يَا بَنِیْ عَبْدِ مَنَافٍ : لَا اُغْنِیْ عَنْكُمْ مِنَ اللّٰهِ شَيْئًا . يَا عَبَّاسُ ابْنُ عَبْدِ الْمُطَّلِبِ ! لَا اُغْنِیْ عَنْكَ مِنَ اللّٰهِ شَيْئًا وَ يَا صَفِيَّةُ عَمَّةَ رَسُوْلِ اللّٰهِ لَا اُغْنِیْ عَنْكِ مِنَ اللّٰهِ شَيْئًا وَ يَا فَاطِمَةُ بِنْتَ رَسُوْلِ اللّٰهِ ! سَلِيْنِیْ مَا شِئْتِ مِنْ مَالِیْ لَا اُغْنِیْ عَنْكِ مِنَ اللّٰهِ شَيْئًا ۔

(بخاری عن ابی ہریرۃ کتاب الوصایا ۔ کتاب التفسیر)

168. "ఓ ప్రవక్తా! (దేవుడి గురించి భయపడండి అని) నీ దగ్గరి బంధువుల్ని భయపెట్టు" అన్న దైవవాణి అవతరించినపుడు మహాప్రవక్త(స) లేచి నిలబడి ఇలా సెలవిచ్చారు.

"ఓ ఖురైష్ ప్రజలారా! నరకాగ్ని నుండి మిమ్మల్ని మీరు రక్షించుకోండి. నేను మీపై పడబోయే దేవుడి శిక్షను తప్పించలేను. ఓ అబ్దెమునాఫ్ సంతానమా! నేను మీపైపడే దైవాగ్రహాన్ని మీనుండి తప్పించ జాలను. ఓ సఫియా! ప్రవక్త మేనత్తా!! నేను నిన్ను దైవాగ్రహం నుండి తప్పించలేను. ఓఫాతిమా! ప్రవక్త ముద్దుల కుమార్తె! నా సొత్తు నుండి నీకిష్టమైన దాన్ని కోరుకో ఇస్తాను కాని నిన్ను కూడా దైవాగ్రహం నుండి తప్పించలేను."

*(అబూ హురైర(రజిఅన్)– బుఖారి)*

**సంగ్రహణం:**

అంతిమదినాన నరకకూపం నుండి వెలువడే పర్వతాల్లాంటి అగ్నిజ్వాలల నుండి రక్షించుకోడానికి కేవలం ఒకే ఒక మార్గం ఉంది. అదేమనిషి సర్వేశ్వరుడైన అల్లాహ్ చూపిన మార్గం ఇస్లామ్‌ను అనుసరించడం, ప్రజల్ని ఆ మార్గం వైపునకు రమ్మని ఆహ్వానించడం. ఆ దారిని అనుసరించే వాడు దేవుడికి విధేయుడు, విశ్వాసపాత్రుడై బహుమానాలు అందుకుంటాడు. పరలోక శిక్ష నుండి తప్పించుకుంటాడు. ఇక ఎవరయితే ఆ మార్గాన్ని అనుసరించకుండా దాన్ని నిరాకరిస్తాడో దానిపై ఇతరులు నడువకుండా అడ్డుకుంటాడో లేక దానికి వ్యతిరేకంగా కుట్రలు పన్నుతాడో ఆ వ్యక్తి భగభగమండే అగ్నిగుండంలో ప్రవేశిస్తాడు. ఆ వ్యక్తి ప్రవక్త కుటుంబీకుడైనా ఆయన బంధువర్గంలో అతి దగ్గరి బంధువువైనా సరే. ఆ కారణం చేతనే మహాప్రవక్త(స) తమకు అతి దగ్గరి బంధువుల్ని

క్రోడీకరించబడి ఉన్నాయి. వీటిని మనిషి తన వ్యక్తిగత జీవితంలోనూ ఆపై తన సమిష్టి జీవితంలోనూ అనుసరిస్తే మానవ సభ్యతా సంస్కారాలు సమతూకంగా ఉంటాయి. అలాగే దైవప్రవక్త(స) తాము జీవించి ఉన్నంతకాలం ఏ జీవన మార్గాన్ని అనుసరించారో అది ఎంతో సహజమైనది, సమంజసమైనది, మానవ నైజానికి సరిపడే జీవన వ్యవస్థ.

అందుకే మనిషి ఇహంలో ప్రశాంతంగా మనుగడ సాగించాలి అంటే కేవలం ఈ రెండు విషయాలను మాత్రమే మార్గదర్శకంగా చేసుకోవాలి.

1. ఖుర్‌ఆన్ 2. సున్నత్ (ప్రవక్త సంప్రదాయం)

ఆర్థిక విషయాల్లో నైతికతలు, సభ్యతా సంస్కారాల్లో దైవగ్రంథం, దైవప్రవక్త సంప్రదాయాలతో ప్రయోజనం పొందకపోవడం మార్గభ్రష్టత్వమే అవుతుంది. జీవితంలోని ప్రతిరంగంలో దాని గురించి దైవగ్రంథం ఇచ్చిన ఆదేశం ఏమిటి? ఆ విషయంలో దైవప్రవక్త(స) సంప్రదాయం ఎలా ఉండింది అన్న విషయం తెలుసుకునే ప్రయత్నం చేయాలి.

దైవాదేశం, ప్రవక్త సంప్రదాయం ఓ నిర్దిష్టమైన మార్గం సూచించినప్పుడు ముస్లిమ్‌లు నిస్సంకోచంగా దాన్ని అనుసరించి తీరాలి. దాన్ని ధిక్కరించి పెడద్రోవ పట్టడానికి వీల్లేదు.

## ఖుర్‌ఆన్ జ్ఞానవ్యాప్తిలోని శుభాలు

(۱۷۱) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ خَيْرُكُمْ مَنْ تَعَلَّمَ الْقُرْآنَ وَعَلَّمَهُ (بخاری عن عثمان بن عفان کتاب فضائل القرآن)

171. “దివ్యఖుర్‌ఆన్ జ్ఞానాన్ని పొంది దాన్ని ఇతరులకు నేర్పేవాడే మీలో అందరికంటే శ్రేష్టుడు” అని మహాప్రవక్త(స) సెలవిచ్చారు.

(ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజిఅన్)– బుఖారి)

**సంగ్రహణం:**

ధర్మసంస్థాపన కార్యం ఏ పునాదులపై నిలబడుతుందో వాటిలో ప్రధానమైనది దైవగ్రంథ జ్ఞానాన్ని సాధ్యమైనంత అధికంగా వ్యాపింపజేయడం.

దైవగ్రంథం అయిన దివ్యఖుర్‌ఆన్‌ను చూసి పఠించగలిగేవారు లేదా దాన్ని ‘హిఫ్జ్’ (కంఠస్థం) చేసి ఇతరులకు బోధించగలవారంతా ఉన్నతమైన స్థాయికి చెందినవారే. శుభాలను పొందడంలో వారికి లోటుండదు. ఈ భూమండలంలో సృష్టికర్త ఇష్టానికి అనుగుణంగా జీవితం గడిపే విధానాన్ని కేవలం దైవగ్రంథం అయిన దివ్యఖుర్‌ఆన్ ద్వారానే

తెలుసుకోవచ్చు. దైవప్రవక్త(స) తమ ఇరవైమూడేళ్ళ ధర్మసంస్థాపన జీవనకాలంలో ఈగ్రంథం ద్వారానే మార్గదర్శకం పొందారు, ఇస్లామీయ జీవన వ్యవస్థను నెలకొల్ప నారంభించారు. చివరికి ఈ ధర్మం సంపూర్ణమై గ్రంథావతరణ పూర్తి అయిన తరువాత దైవప్రవక్త(స) పరమపదించారు. ఇలాంటి మహోన్నతగ్రంథం స్థానం ఎంతో ఉన్నతం. ఇది దైవవాణి, ఇస్లామీయ జీవన వ్యవస్థ, ఆదేశాల చట్టం, దైవప్రవక్తపై అవతరించిన అంతిమ దైవగ్రంథం- ప్రళయం వరకు ఇది మానవులకు మార్గదర్శకం.

## ఖుర్ఆన్ పండితుల హోదా

(۱۷۲) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اَلْمَاهِرُ بِالْقُرْاٰنِ
مَعَ السَّفَرَةِ الْكِرَامِ الْبَرَرَةِ وَالَّذِیْ یَتَتَعْتَعُ فِیْهِ وَهُوَ
عَلَیْهِ شَاقٌّ لَهٗ اَجْرَانِ۔

(مسلم عن عائشة کتاب فضائل القرآن - ترمذی ابواب القرآن - ابوداؤد کتاب الصلوٰة)

172. దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "(ప్రళయదినాన) ఖుర్ఆన్ పండితుడు, దైవప్రవక్తల వద్దకు దైవవాణిని, దైవాదేశాలను చేరవేసే దైవదూతల వెంట ఉంటాడు. ఎవరైతే కష్టపడుతూ ఆగిఆగి ఖుర్ఆన్ పఠిస్తాడో అతనికి రెట్టింపు పుణ్యఫలం లభిస్తుంది."

(హజ్రత్ ఆయిషా(రజిఅన్)–ముస్లిమ్, తిర్మిజి, అబూదావూద్)

**సంగ్రహణం:**

అరబిక్ మూలపదం 'మాహిర్ బిల్ ఖుర్ఆన్'కు (దాని అనువాదం ఖుర్ఆన్ పండితుడు అని చేయడం జరిగింది) అర్థం ఈక్రింది విధంగా ఉంది.

1. దివ్యఖుర్ఆన్ను ఎలాంటి ఆటంకం లేకుండా పఠించగలిగేవాడు దాని పారాయణం, నియమ నిబంధనలపై పూర్తి పటుత్వం గలవాడు.
2. ఖుర్ఆన్ను హిఫ్జ్ (కంఠస్తం) చేసినవాడు ఉత్తమమైన జ్ఞాపకశక్తి కలిగి పారాయణం, ఖిర్ఆత్(పఠనం) సులువుగా చేసేవాడు.
3. ఖుర్ఆన్ పాండిత్యం గలవాడు. దాన్ని అర్థం చేసుకుంటూ చదివేవాడు. సాలోచనగా పారాయణం చేసేవాడు. దాన్నుండి మార్గదర్శకం పొందేవాడు.

పైన హదీసులో చెప్పిన మాహిర్ బిల్ ఖుర్ఆన్లో ఈ భావాలన్నీ ఇమిడి ఉన్నాయి. అయితే, ఇతని జీవితం ఖుర్ఆన్ బోధనలకు విరుద్ధంగా ఉండకూడదు. ఏ పండితుడైతే

తన దైనందిన జీవితంలో చేతల రూపేణా దైవగ్రంథాదేశాలకు విరుద్ధంగా నడుస్తాడో, దైవాదేశాలను ధిక్కరిస్తాడో అతడికి పైన చెప్పిన ప్రయోజనాలు ఒనగూడవు.

దివ్యగ్రంథ పారాయణం, దాన్ని హిఫ్జ్ చేయడం, అంటే పూర్తిగా కంఠస్థం చేయడం, దాన్ని అనుసరించడం, వ్యాఖ్యానం రాయడం, దాన్ని చదవడం ద్వారా లభించే ప్రయోజనం కేవలం ఆ గ్రంథాదేశాల్లో పాటించడానికి లేక దాన్ని అనుసరించడానికి ప్రయత్నం చేయడం ద్వారానే సాధ్యం. ఆ గ్రంథం నుండి మార్గం పొందాలనే అభిలాష మనిషిలో ఉండడం ముఖ్యం.

ఖుర్ఆన్ పండితుడు దైవదూతల సహచర్యంలో ఉంటాడు అన్నదానికి, ప్రళయ దినాన ఖుర్ఆన్ పండితుడు దైవాజ్ఞాపాలకులైన గౌరవం కలిగిన దైవదూతలతో ఉంటాడు అని అర్థం. అతడికి అల్లాహ్ వద్ద గౌరవప్రదమైన స్థానం లభిస్తుంది. ఖుర్ఆన్‌ను పఠించడం వల్ల అల్లాహ్ పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడు. ప్రతి అక్షరానికి పదేసి పుణ్యాలు లభిస్తాయి. ఉదాహరణకు అలిఫ్ లామ్ మీమ్ అనేవి మూడక్షరాలు. వీటిని పఠించడం వల్ల అతడికి అల్లాహ్ ముప్ఫై పుణ్యాలనొసగుతాడు. అయితే ఎవరైతే నత్తిలాంటి లోపం ఉండి ఖుర్ఆన్ పదాలను సరిగా ఉచ్చరించలేడో ఆ పారాయణ సమయంలో ఇబ్బందిని అనుభవిస్తాడో అతడికి రెట్టింపు పుణ్యాలు లభిస్తాయి. పారాయణం చేసినందుకు ఆ పారాయణం చేసేటప్పుడు అనుభవించిన కష్టానికి. ఇది అలాంటి వ్యక్తి ప్రోత్సాహం కోసం, ఖుర్ఆన్‌ను చదవడం కోసం ఇచ్చిన రాయితీ. సరిగా ఉచ్చరించలేనివాళ్ళు తమకు పుణ్యఫలం లభించదేమో అని అనుకోకుండా అలా చెప్పడం జరిగింది. వారికి రెట్టింపు పుణ్యఫలాలు లభిస్తాయి.

అయితే ఇలాంటి వ్యక్తి ఖుర్ఆన్ పండితుడిని మాత్రం అధిగమించలేడు.

## ఖుర్ఆన్ సమిష్టి పారాయణం

(۱۷۳) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ سَلَكَ طَرِيْقًا يَلْتَمِسُ فِيْهِ عِلْمًا سَهَّلَ اللهُ لَهُ بِهِ طَرِيْقًا إِلَى الْجَنَّةِ وَمَا اجْتَمَعَ قَوْمٌ فِيْ بَيْتٍ مِنْ بُيُوْتِ اللهِ يَتْلُوْنَ كِتَابَ اللهِ وَيَتَدَارَسُوْنَهُ بَيْنَهُمْ إِلَّا نَزَلَتْ عَلَيْهِمُ السَّكِيْنَةُ وَغَشِيَتْهُمُ الرَّحْمَةُ وَحَفَّتْهُمُ الْمَلَائِكَةُ وَذَكَرَهُمُ اللهُ فِيْمَنْ عِنْدَهُ وَمَنْ بَطَّأَ بِهِ عَمَلُهُ لَمْ يُسْرِعْ بِهِ نَسَبُهُ۔ (مسلم عن ابی ہریرۃ کتاب الذکر والدعاء ترمذی ابواب فضائل القرآن)

173. దైవప్రవక్త(స) గారి ప్రవచనం:"ధర్మజ్ఞాన సముపార్జన కోసం ప్రయాణం కట్టేవానికి అల్లాహ్ ఆ మార్గాన్ని సులువు చేస్తాడు. విశ్వాసులు దైవగృహాలైన మస్జిద్‌లలో గ్రంథ పారాయణం కోసం, దాన్ని బోధించ డానికి, నేర్చుకోవడానికి కలిసి ఓ చోట చేరినప్పుడు వారిపై 'సకీనహ్' (స్థిమితాన్ని) అవతరింపజేస్తాడు. ఆయన కారుణ్యం వారిని కప్పివేస్తుంది. దైవదూతలు వారిని పరివేష్టిస్తాడు. అల్లాహ్ తన ప్రియదూతల మధ్య వారిని తలుచుకుంటాడు. (అంటే వారిని ప్రస్తావిస్తాడు). అదే ఎవరి ఆచరణ దీనికి భిన్నంగా ఉంటుందో అతని వంశావళి అతణ్ణి ముందుకు తీసుకువెళ్ళలేదు. (అబూహుర్రైర(రజిఅన్)– ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహాణం:**

స్వర్గప్రవేశాన్ని సులభతరం చేయడమంటే, దేవుడు తన కరుణాకటాక్షాలతో అతనికి తన ధర్మానికి సేవచేసే అవకాశం ఇస్తాడని అర్థం. ఇదే స్వర్గప్రవేశానికి మార్గం.

కీర్తిప్రతిష్టలు, గౌరవమర్యాదలు, సంపన్నత, వగైరాలు కేవలం అల్లాహ్‌ను సంతోషపర్చడానికి జ్ఞానసముపార్జన చేయడం ద్వారానే ప్రాప్తమవుతాయి. ఈ ప్రయత్నం చేసేవారికి అవి ఒసగడం జరుగుతుంది. ధర్మసంస్థాపన కోసం నడుం బిగించే ప్రతివాడు ఆ ధార్మిక జ్ఞానాన్ని తప్పకుండా సముపార్జించాలి. తాను ఏ ధర్మం కోసం పాటుపడు తున్నాడో ఆ ధర్మం గురించిన పూర్తి అవగాహన అతనికి ఉండాలి.

ధర్మానికి ప్రాణం దివ్యఖుర్‌ఆన్‌కు సంబంధించిన జ్ఞానమే. సమస్టిగా అందరు కలిసి ఖుర్‌ఆన్ పారాయణం చేసి, దాన్ని లోతుగా అధ్యయనం చేసి దాని జ్ఞానాన్ని క్షుణ్ణంగా అవగతం చేసుకునే వారికి దేవుని వద్ద ఎంతో ఉన్నతమైన స్థానం ఉంది. దివ్యగ్రంథాదేశాలను బాగా విడమర్చి చర్చించడానికి ఓ చోట చేరే వారు అందులోని నిగూఢ భావాలను వెలికి తీయడానికి చర్చలు జరిపేవారే. అలాగే దాన్ని వ్యాఖ్యానించే టప్పుడు ఒకరిని ఒకరు సంప్రదించుకునేవారే ధన్యులు. అలాంటి వారికి:

1. హృదయ స్థిమితం, ప్రశాంతత చేకూరుతాయి. అహం అనే అంధకారం నుండి వారు విముక్తులవుతారు.
2. దైవకారుణ్యం వారిని కప్పివేస్తుంది.
3. ఖుర్‌ఆన్ అధ్యయనం చేసేవారికోసం దాన్ని పారాయణం చేసే వారికోసం, ఈ భూమండలంలోని ప్రతి భాగాన్ని గాలించే దైవదూతలు తమ రెక్కలతో వారిని కప్పివేస్తారు.
4. అల్లాహ్ తన ప్రియమైన దూతలతో, చూడండి! నా ఫలానా గృహంలో (మస్జిద్‌లో) నా

భక్తుల ఓ సమూహం నా గ్రంథాన్ని పఠిస్తోంది. దాని జ్ఞానం గురించి ఆలోచించడానికి ఒకరినొకరు సహకరించుకుంటున్నారు. దాని పారాయణంలో ఎలా లీనమైపోయారో చూడండి అని, వారిని ప్రస్తావిస్తాడు.

దివ్యఖుర్‌ఆన్ పారాయణం చేసి లేక దాన్ని పఠించి ఇతరులకు దాని భావాన్ని తెలిపేవానికి లభించే ఈ వరాలు కేవలం చిత్తశుద్ధితో దాన్ని అనుసరింపగోరే వారి కోసమే. ఇక దివ్యగ్రంథాదేశాలను ధిక్కరించి దాన్ని ఓ జీవన వ్యవస్థగా స్వీకరించని వారికి ఆ వరాలు ఏమాత్రం లభించవు. వారు దానికి అర్హులు కానేకాదు. ఇలాంటి వారు ఏ వంశంలో జన్మించినా సరే.

మనకాలపు సాదాత్ (మహాప్రవక్త(స) వంశంలో జన్మించినవారుగా చెప్పుకునే వారు) లలోని అధికశాతం మంది దివ్యఖుర్‌ఆన్‌ను అనుసరించడంగాని, దైవప్రవక్త సంప్రదాయాన్ని పాటించడంగాని చేయరు. వారు కేవలం సాదాత్ (సయ్యద్ వంశానికి చెందినవారు) కావడం మూలంగా, మేము తప్పకుండా స్వర్గంలో ప్రవేశిస్తాం, మాపై నరక జ్వాలలు హరాం (నిషిద్ధం) అన్న అపోహకు గురై ఉన్నారు. ఈ హదీసులోని చివరి వాక్యాన్నీ, అదేవిధంగా క్రితం మేము సూచించిన 168వ హదీసును దృష్టిలో ఉంచుకొని చూస్తే ఎవరైనా (సయ్యద్ అయినా సరే) విశ్వాసం, సదాచరణ లేనిదే నరకాగ్ని నుండి తనను తాను రక్షించుకొని స్వర్గంలో ప్రవేశింపజాలడు.

ఈ హదీసు వల్ల మస్జిద్‌లలో సామూహికంగా దైవగ్రంథ పారాయణం చేసే ఆధారం లభిస్తోంది. ఇలాగే ధార్మిక పాఠశాలల్లో పరిశుద్ధమైన గృహభాగాల్లోను సామూహికంగా పారాయణం చేయవచ్చు.

## ఖుర్‌ఆన్ పండితుని తల్లిదండ్రుల మహర్దశ

(۱۷۴) إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنْ قَرَأَ الْقُرْاٰنَ وَ
عَمِلَ بِمَا فِيْهِ أُلْبِسَ وَالِدَاهُ تَاجًا يَوْمَ الْقِيَامَةِ ضَوْءُهُ أَحْسَنُ
مِنْ ضَوْءِ الشَّمْسِ فِيْ بُيُوْتِ الدُّنْيَا، لَوْ كَانَتْ فِيْكُمْ فَمَا
ظَنُّكُمْ بِالَّذِيْ عَمِلَ بِهٰذَا۔ (ابوداؤد عن معاذ الجهني كتاب الصلوٰة)

174. దైవప్రవక్త(స) ఇలా నుడివారు : "ఖుర్‌ఆన్ గ్రంథాన్ని పారాయణం చేసి దానికి అనుగుణంగా అనుసరించేవాని తల్లిదండ్రుల తలలపై ప్రళయదినాన ఈ భూమండలం మీద మీ ఇండ్లలో పడే సూర్యకాంతి కంటే తేజోవంతమైన కిరీటాల్ని పెట్టడం జరుగుతుంది. ఇది ఇలా ఉండగా,

ఖుర్‌ఆన్‌ను అనుసరించే వ్యక్తి ఎలా బహూకరించబడతాడో ఊహిం చుకోండి." (ముఆజుల్ జుహ్నీ(రజిఅన్)– అబూదావూద్)

**సంగ్రహణం:**

ఖుర్‌ఆన్ ఆదేశాలను అనుసరించేవాని తల్లిదండ్రులకు అత్యంత సుందరమైన కిరీటాలనలంకరించి సత్కరించగా ఆగ్రంథాన్ని బాగా అర్థం చేసుకుంటూ పఠించి, దాన్నే అనుసరించే వానికి ఎంత గౌరవం, ఔన్నత్యం లభిస్తాయో మీ పరిమితమైన మేధ దాన్ని ఊహించనైనా ఊహించలేదు అని భావం.

## ముస్లిం సమాజ ఉత్థానపతనాలకు కారణం

(۱۷۵) اِنَّ نَبِيَّكُمْ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَدْ قَالَ اِنَّ اللّٰهَ يَرْفَعُ بِهٰذَا
الْكِتَابِ اَقْوَامًا وَيَضَعُ بِهٖ اٰخَرِيْنَ۔

(مسلم عن عمر بن الخطاب کتاب فضائل القرآن)

175. "నిశ్చయంగా, అల్లాహ్ ఖుర్‌ఆన్ ద్వారా అనేకులకు గౌరవోన్నతులను ప్రసాదిస్తాడు. దాని ద్వారానే అనేకులను పతానవస్థకు గురిచేస్తాడు." అని మహాప్రవక్త(స) ప్రవచించారు.

(హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్(రజిఅన్)– ముస్లిమ్)

**సంగ్రహణం:**

అంటే ఏ వ్యక్తులు లేక సంఘాలు (జమాఅత్‌లు) ఖుర్‌ఆన్‌ను దైవగ్రంథంగా స్వీకరించి దానికి అనుగుణంగా నడుచుకుంటారో అల్లాహ్ వారికి ఇహలోకంలో గౌరవం; కలిమి అధికారం ప్రసాదించి గౌరవిస్తాడు. పరలోకంలో వారిని తనకు ప్రియమైనదాసుల జాబితాలో చేరుస్తాడు. అలాగే ఓ ప్రక్క ఈ గ్రంథాన్ని దైవగ్రంథంగా విశ్వసిస్తూ మరో ప్రక్క దాని బోధనలను ఆదేశాలను శిరసావహించకుండా తమ ఇష్టానుసారం నడుచుకునే వారు ఈ లోకంలో తుచ్ఛమైన వారుగా మనుగడ సాగిస్తారు. పరలోకంలో వారు సిగ్గుతో తలదించుకొని నరకకూపంలో ప్రవేశిస్తారు.

## ఖుర్‌ఆన్‌లో లీనమైపోయేవారికి లభించే ప్రతిఫలం

(۱۷۶) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ الرَّبُّ تَبَارَكَ
وَتَعَالٰى مَنْ شَغَلَهُ الْقُرْاٰنُ عَنْ ذِكْرِيْ وَمَسْئَلَتِيْ اُعْطِيْتُهٗ

أَفْضَلَ مَا أُعْطِيَ السَّائِلِيْنَ وَفَضْلُ كَلَامِ اللّٰهِ عَلٰى سَائِرِ الْكَلَامِ
كَفَضْلِ اللّٰهِ عَلٰى خَلْقِهٖ۔ (ترمذی عن ابی سعید ابواب القرآن)

176. మహాప్రవక్త(స)ప్రవచనం ఇలా ఉంది. "అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు. ఒక వ్యక్తి ఖుర్‌ఆన్‌లో లీనమై పోయినందువల్ల నన్ను స్మరించలేకపోయినా లేదా నన్ను వేడుకోకపోయినా నేనతనికి యాచించేవానికంటే అధికంగా ఒసగుతాను. అల్లాహ్ తన సృష్టినంతటికి ఎలా ఉన్నతుడో, దైవవాణి(దివ్యఖుర్‌ఆన్) కూడా విశ్వంలోని ప్రతివాణి (వాక్కు) కంటే ఉన్నతమైనది. (అబూహురైర (రజిఅన్)- తిర్మిజీ)

**సంగ్రహణం:**

ఖుర్‌ఆన్‌లో లీనం అవడం అంటే, ఖుర్‌ఆన్ పారాయణంలో లీనమవడం, దాని భావాన్ని లోతుగా అధ్యయనం చేయడం, దాన్ని ఇతరులకు బోధించడం, దాన్ని రాయడం, చదవడం నేర్పడం అని అర్థం.

ఏ వ్యక్తి అయితే ఖుర్‌ఆన్‌లో లీనమవుతాడో అల్లాహ్ దృష్టిలో అతని స్థాయి, అల్లాహ్‌ను సతతం స్మరించే వానికంటే, ఆయన్ను ఆరాధించే వానికంటే ఉన్నతమైనది. కాబట్టి ఖుర్‌ఆన్ సేవచేసే వానికి అల్లాహ్ అందరికంటే మిన్నగా సత్కరిస్తాడు.

## దైవధర్మ సంస్థాపన పట్ల ఉపేక్ష- దానికి శిక్ష

(١٧٧) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ وَالَّذِيْ نَفْسِيْ بِيَدِهٖ
لَتَأْمُرُنَّ بِالْمَعْرُوْفِ وَلَتَنْهَوُنَّ عَنِ الْمُنْكَرِ أَوْلَيُوْشِكَنَّ أَنْ
يَّبْعَثَ عَلَيْكُمْ عَذَابًا مِنْهُ فَتَدْعُوْنَهٗ فَلَا يَسْتَجِيْبُ لَكُمْ

(ترمذی عن حذیفہ ابواب الفتن مسند احمد)

177. మహాప్రవక్త(స) ప్రవచనం: "నా ప్రాణం ఎవరి గుప్పిట నుందో ఆ దేవుని సాక్షి! (ముస్లిములారా!) మీరు సత్కార్య సదాచారాల వైపునకు పిలుపునిస్తూ ఉండండి. చెడునుండి వారిస్తూ ఉండండి. అలా కాని పక్షంలో అల్లాహ్ మిమ్మల్ని (ఓ భయంకరమైన) శిక్షకు గురిచేస్తాడు.

దాన్నుండి విముక్తి పొందడానికి మీరు అల్లాహ్‌ను వేడుకుంటారు కాని మీ వేడికోళ్ళు మన్నింపబడవు." (హజ్రత్ హనీఫా(రజిఅన్)- తిర్మిజీ)

**సంగ్రహణం:**

ముస్లిమ్ సమాజంలోని వారు తమ వ్యక్తిగత జీవితంలోనూ, సమష్టి జీవితంలోను సత్కార్యాలను ప్రేరేపించాలని, వాటిని వ్యాపింపజేయాలని అదేవిధంగా దౌష్ట్యాలను, చెడు నడతలను ప్రబలకుండా అరికట్టాలని అల్లాహ్ ఆదేశించాడు. ఈ ఆదేశం దివ్యఖుర్‌ఆన్‌లో ప్రస్ఫుటంగా ఉంది. వారేగనక ఈ జీవిత ధ్యేయాన్ని మరిచిపోతే తీవ్రమైన శిక్షకు గురికాగలరు. ఆ తరువాత వారు దైవాన్ని ఎంత వేడుకున్నా ఫలితం ఉండదు. అంటే మంచిని వ్యాపింపజేసి చెడును నిర్మూలించే ప్రయత్నాన్ని పూర్తిగా మానుకుంటే వారిపై పడే శిక్ష ఏమిటంటే ఆ సమాజం ఇతర జాతుల పాలనలో పీడించబడటం. లేదా ముస్లిమ్ సమాజానికే చెందిన దుర్మార్గ పాలకులు, దుష్టులైన నేతలు వారిపై పెత్తనం చెలాయించి వారి జీవితాన్ని దుర్భరం చేస్తారు. ఈ పరిస్థితి అల్లాహ్ క్రోధానికి ప్రతీక. అప్పుడు దైవాన్ని ఎంత వేడుకున్నా అది తొలగిపోదు. తిరిగి ధర్మసంస్థాపనం వైపునకు దృష్టిసారిస్తే తప్ప.

ధర్మసంస్థాపనం కోసం ముఖ్యంగా నాలుగు సూత్రాలను పాటించాల్సి ఉంటుంది.

1. మనిషి ఏ ధర్మాన్నైతే ఈ భువిపై స్థాపించడానికి, దాన్ని విస్తరింపజేయడానికి కృషి చేస్తాడో అతడు ప్రప్రథమంగా ఆ ధర్మాన్ని తన అంతర్‌బాహ్యాల్లో స్థాపించాలి. అంటే అతడు పూర్తిగా ఆ ధర్మంపై నడవాలి. ఎవరయితే తాను ముస్లిమునన్న భావనకు దూరమవుతాడో అతడు తాను మనుగడ సాగించే సమాజాన్ని ఇస్లామీయ సమాజంగా మలచలేడు. ప్రజల్ని మంచివైపునకు పిలిచే, వారిని చెడు త్రోవనుండి తప్పించే ప్రయత్నం కోసం నడుంబిగించేవాడు ప్రథమంగా ఆ సత్కార్యాలను తాను స్వయంగా ఆచరించాలి. చెడుగులనుండి ప్రజలను వారించ ప్రయత్నం చేసేవాడు స్వయంగా వాటికి దూరంగా ఉండాలి.

ఏ వ్యక్తి జీవితం అతడిచ్చే సందేశానికి అనుగుణంగా ఉండదో, అతని బోధనకు అతని ఆచరణకు సంబంధమే ఉండదో అలాంటి వ్యక్తి దైవధర్మాన్ని బలహీనం చేసిన వాడవుతాడు. అదేకాకుండా అతనికి సమాజంలో విలువ కూడా లేకుండా పోతుంది.

2. ధర్మంవైపునకు పిలిచే కార్యాన్ని మొదట తన ఇంటినుండే ప్రారంభించాలి. మనిషి తన భార్యాపిల్లలకు, ఇంటిలోని ఇతర వ్యక్తులకు ఇస్లాం సందేశాన్ని అందించి వారి లోపాలను సరిదిద్దాలి. వారిని నిజమైన ముస్లిములుగా (దైవవిధేయులుగా) మలచాలి.

దివ్యఖుర్‌ఆన్‌లోని తహ్రీమ్ అధ్యాయంలో ఇలా ఉంది:

"విశ్వసించిన ఓ ప్రజలారా! మీరు మిమ్మల్ని, మీ భార్యాపిల్లలను నరకాగ్ని నుండి రక్షించుకోండి."

3. మీ దగ్గరి బంధువులకు ధార్మిక బోధనలేమిటో తెలియజేయండి. దైవధర్మం వైపునకు పిలిచేవాడు వారిని ప్రేమగా, మంచి మనస్సుతో సత్యధర్మంపై నడిచేందుకు పురికొలుపుతూ ఉండాలి. (168వ హదీసు చూడండి). కేవలం ఒకటిరెండు మార్లు వారితో కలిసి అలా చెప్పడంకాదు. ఈ లక్ష్యసాధన కోసం నిరంతరం వారితో కలిసి చెబుతూ ఉండాలి. తన పిలుపు ప్రభావం చూపాలంటే ఆ పిలిచేవాని ఆచరణ ఇస్లామీయ బోధనలకు అనుగుణంగా ఉండాలి.

4. తమ పొరుగువారిని ధర్మం గురించి పరిచయం చేయడం వారితో సత్సంబంధాలు కలిగివుండడం ముఖ్యం.

(۱۷۸) رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یَقُوْلُ مَنْ رَاٰی مِنْکُمْ مُنْکَرًا
فَلْیُغَیِّرْہُ بِیَدِہٖ فَاِنْ لَّمْ یَسْتَطِعْ فَبِلِسَانِہٖ فَاِنْ لَّمْ یَسْتَطِعْ
فَبِقَلْبِہٖ وَذٰلِکَ اَضْعَفُ الْاِیْمَانِ۔

178. దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "ఓ చెడును చూసిన మీలోని ప్రతివాడు దాన్ని తన శక్తినుపయోగించి తుడిచివేయాలి. అలా సాధ్యంకాని పక్షంలో తన నోటిద్వారా (అది చెడ్డపని అని చెప్పిదాన్ని రూపు మాపడానికి) ప్రయత్నం చేయాలి. అది కూడా సాధ్యం కాకపోతే కనీసం తన మనస్సులోనైనా అది చెడు అని భావించాలి. ఈ చివరిదశ, ఈమాన్ (విశ్వాసం) అతి బలహీనమైనదడానికి గురుతు."

*(అబూసయీద్(రజిఅన్) ముస్లిం, తిర్మిజీ, అబూదాఊద్)*

## ఇస్లామ్- సామూహికత

(۱۷۹) قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ لَوْ یَعْلَمُ النَّاسُ مَا فِی
الْوَحْدَۃِ مَا سَارَ رَاکِبٌ بِلَیْلٍ اَبَدًا۔ (مسند احمد عن عبداللہ بن عمر نمبر ۵۲۵۲)

179. "ఒంటరితనంలో ఏయే నష్టాలున్నాయో అవి తెలిస్తే మనిషి రాత్రిపూట ఎప్పుడూ ప్రయాణానికి పూనుకునే వాడేకాదు" అని దైవ ప్రవక్త(స) ప్రవచించారు. (అబ్దుల్లా బిన్ ఉమర్(రజిఅన్)– ముస్నదె అహ్మద్)

**సంగ్రహణం:**

ఒంటరిగా ప్రయాణించడం వల్ల అనేక ప్రమాదాలు సంభవించే భయం ఉంటుందని భావం.

(۱۸۰) اِنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ نَھٰی عَنِ الْوَحْدَۃِ اَنْ یَّبِیْتَ

الرَّجُلُ وَحْدَہٗ اَوْ یُسَافِرَ وَحْدَہٗ۔ (مسند احمد عن ابن عمر نمبر ۵۰۷۵)

180. "దైవప్రవక్త(స) ఇంట్లో ఒంటరిగా రాత్రి గడపడాన్ని, ఒంటరిగా ప్రయాణం చేయడాన్ని వారించారు."

(ఇబ్నెఉమర్ (రజిఅన్)– ముస్నదె అహ్మద్)

**సంగ్రహణం:**

ఒంటరిగా రేయిగడపడం, ప్రయాణించడం కాదన్నప్పుడు, ధర్మసంస్థాపన కార్యం వ్యక్తిగతంగా ఒంటరిగా చేయడం ఎలా ధర్మసమ్మతం అవుతుంది? కాబట్టి ధర్మాన్ని అనుసరించడానికి, దాన్ని ఎల్లెడలా వ్యాపింపజేయడానికి విశ్వాసులు ఓ సంఘం (జమాఅత్)గా ఏర్పడుతూ ఉంటారు.

## జమాఅత్(సంఘం)తో సంబంధం కలిగి ఉండడం

(۱۸۱) قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ عَلَیْکُمْ بِالْجَمَاعَۃِ وَ

اِیَّاکُمْ وَالْفُرْقَۃَ فَاِنَّ الشَّیْطَانَ مَعَ الْوَاحِدِ وَھُوَ مِنَ الْاِثْنَیْنِ

اَبْعَدُ، مَنْ اَرَادَ بُحْبُوْحَۃَ الْجَنَّۃِ فَلْیَلْزَمِ الْجَمَاعَۃَ،

مَنْ سَرَّتْہُ حَسَنَتُہٗ وَسَاءَتْہُ سَیِّئَتُہٗ فَذٰلِکَ

الْمُؤْمِنُ۔ (ترمذی عن عمر ابواب الفتن)

181. మహాప్రవక్త(స) ప్రవచనం ఇలా ఉంది: "మీరు జమాఅత్ (సంఘం)తో అతుక్కుపొండి. వేర్పాటు ధోరణికి దూరంగా ఉండండి. ఒంటరివానిపై షైతాన్ దాడిచేస్తాడు. ఇద్దరికి చాలాదూరంగా ఉంటాడు. ఏ వ్యక్తి (ప్రళయం రోజున) స్వర్గం నడిబొడ్డున ఉండాలను కుంటాడో అతడు జమాఅత్‌కు దూరంగా ఉండకూడదు. ఎవరు తన సత్కర్మల పట్ల

సంతోషపడుతూ ఉంటాడో దుష్కర్మల ఎడల వ్యధను అనుభవిస్తూ ఉంటాడో అతడే మోమిన్." (హజ్రత్ ఉమర్(రజిఅన్)– తిర్మిజీ)

**సంగ్రహణం:**

అంటే మీరు ఓ జమాఅత్(సంఘం)గా ఏర్పడండి, ఒంటరిగా ఉండకండి. ఒంటరివాణ్ణి షైతాన్ వదలడు అని అర్థం. వ్యక్తియైనా ఒంటరి జీవితాన్ని గడపకూడదు అనడానికి కారణం, మనిషి తనలో రకరకాల మనస్తత్వాలు కలిగి ఉన్నందుకు షైతాన్ చేసే దాడులనుండి, తన మనోవాంఛల చెడుగులనుండి తనను తాను రక్షించుకోజాలడు– సంఘవాతావరణం అతనికి సహాయపడితే తప్ప.

ఇక సామూహిక వ్యవస్థ విషయానికొస్తే, సత్కార్యాలను, దైవభీతిని ప్రేరేపించే వాతావరణం ఉంటుంది అందులో. అలాగే పాపాన్ని, అన్యాయాన్ని తుదముట్టించడానికి అందులోని ప్రతి ఒక్కడు కలిసి పనిచేస్తాడు. ఇంతేకాకుండా ఈ సామూహిక వాతావరణం అందులోని ప్రతి వ్యక్తిని మార్గం తప్పిపోకుండా చేస్తుంది. జమాఅత్, సామూహికంగా ఒకరిని ఒకరు ప్రోత్సహించడంలో, ఒకరి తప్పులను మరొకరు గుర్తు చేయడంలో, సన్మార్గంపైన నడవడంలో దోహదపడి సహకరిస్తుంది.

## జమాఅత్‌నుండి వేరుకావడం

(۱۸۲) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ وَيَدُ اللّٰهِ عَلَى الْجَمَاعَةِ

وَمَنْ شَذَّ شَذَّ اِلَى النَّارِ۔ (ترمذی عن ابن عمر ابواب الفتن)

182. "అల్లాహ్ హస్తం 'జమాఅత్' (సంఘం)పై ఉంది. (అంటే దాన్ని కాపాడుతోంది). ఎవరైతే జమాఅత్ నుండి వేరుపడతాడో ఒంటరి వాడై నరకంలోనికి పోయినవాడే" అని మహాప్రవక్త(స) సెలవిచ్చారు.

(ఇబ్నెఉమర్(రజిఅన్)– తిర్మిజీ)

**సంగ్రహణం:**

అంటే సాధారణంగా ఇస్లామ్ వ్యక్తిగత జీవితం గడపడానికి ససేమిరా ఒప్పుకోదని అర్థం. ధర్మాన్ని సంస్థాపించడం కోసం పనిచేసే జమాఅత్‌తో సహకరించడం ప్రతి ముస్లిం విధి. అలాంటి జమాఅత్ ఏదీ లేని పక్షంలో ఆ కార్యార్థం జమాఅత్‌ను స్థాపించకపోతే అతడు దేవుని వద్ద జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. ఓ వ్యక్తి తను ఉత్తమయిన నడవడిక, మేధస్సు కలిగి ఉన్నప్పటికీ షైతాన్ అతని బుద్ధిని చెడుద్రోవ పట్టించగలడు. కాబట్టి ఇస్లాంలో వ్యక్తిగత జీవితం గడిపేందుకు ప్రోత్సాహం లభించదు. దానికి భిన్నంగా, మీరు

ధర్మాన్ని స్థాపించడానికి దాన్ని నిలకడగా ఉంచడానికి జమాఅత్‌గా ఏర్పడమని, అనేక రకాలుగా బోధిస్తోంది. సంఘం మొత్తం ఏకంగా షైతాన్ మార్గంలో నడువడానికి సిద్ధపడదు కదా. అల్లాహ్ దాన్ని మార్గం తప్పనివ్వడు. అసత్యం చేసే దాడి, కుట్రలనుండి దాన్ని కాపాడుతూ ఉంటాడు. ఆయన అదృశ్య శక్తి జమాఅత్ ప్రభావాన్ని పెంచుతుంది.

## అమీర్ ఎంపిక

(۱۸۳) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اِذَا كَانَ ثَلٰثَةٌ فِيْ سَفَرٍ فَلْيُؤَمِّرُوْا اَحَدَهُمْ۔ (ابوداؤد عن ابی ہریرہ کتاب الجہاد)

183. "ముగ్గురు వ్యక్తులు ప్రయాణానికి బయలుదేరినప్పుడు, తమలో ఒకరిని అమీర్‌గా ఎంపిక చేసుకోవాలి." అని మహాప్రవక్త(స) ప్రవచించారు. (అబూహురైరా(రజిఅన్) అబూదావూద్)

**సంగ్రహణం:**

ధర్మం వైపునకు పిలిచేందుకు, దాని ప్రబోధ ప్రయత్నంలోను సామూహికత అవసరం. ఆ క్రమశిక్షణ పాటించడానికి అమీర్‌ను (నాయకుణ్ణి) ఎంపిక చేసుకునే ప్రాధాన్యత సాధారణ ప్రయాణంలోను మరింత పెరుగుతుంది. ఈ హదీసును గురించి లోతుగా ఆలోచిస్తే, జమాఅత్‌లోని వ్యక్తులు తమ ఇష్టానుసారం అమీర్‌ను ఎన్నుకోవాలి. అంతేగాని వారు ఎవరికివారే నేను అధ్యక్షుణ్ణి లేక అమీర్‌ను అని ప్రకటించడానికి వీల్లేదు. లేదా నన్నే అమీర్‌గా ఎన్నుకోండని చెప్పడానికి వీల్లేదు. జమాఅత్‌లోని వ్యక్తులు తమ సామూహిక వ్యవహారాల్లో, తమలో ఎవరు విజ్ఞానవంతుడో, దైవభీతిగలవాడో వ్యవహారాన్ని సరిగా అర్థం చేసుకొని దాన్ని పరిష్కరించగల సామర్థ్యం గలవాడో, అలాగే దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయాన్ని బాగా ఎరిగినవాడో, అందరిలోను నమ్మకస్తుడో, నీతినియమం గలవాడో ఆ వ్యక్తినే తమ అమీర్‌గా ఎన్నుకుంటారు.

## అయిదు ఆదేశాలు

(۱۸۴) قَالَ النَّبِيُّ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاَنَا اٰمُرُكُمْ بِخَمْسٍ، اَللّٰهُ اَمَرَنِيْ بِهِنَّ، السَّمْعِ، وَالطَّاعَةِ وَالْجِهَادِ وَالْهِجْرَةِ وَالْجَمَاعَةِ فَاِنَّهٗ مَنْ فَارَقَ الْجَمَاعَةَ قِيْدَ شِبْرٍ فَقَدْ خَلَعَ رِبْقَةَ الْاِسْلَامِ مِنْ عُنُقِهٖ اِلَّا اَنْ يُّرَاجِعَ (ترمذی عن الحارث الاشعری ابواب الامثال)

184. "మీకు ఈ అయిదు ఆదేశాలనిస్తున్నాను. అల్లాహుతఆలా నాకు వీటిని ఆదేశించాడు అని దైవప్రవక్త(స) ఆదేశించారు. అవి:

1. (నాయకుడు చెప్పేమాటలను) శ్రద్ధగా వినడం

2. ఆయన ఆదేశాలను శిరసావహించడం

3. ధర్మమార్గంలో నిరంతర కృషి చేయడం

4. దైవమార్గంలో స్వస్థలం వదలి వలస వెళ్ళడం

5. జమాఅత్ (సంఘం)గా ఏర్పడడం

ఎవరైతే జమాఅత్ నుండి ఓ జానెడు దూరం అవుతాడో అతడు ఇస్లాం పలుపును (మెడత్రాడును) తన మెడనుండి తీసివేసేవాడు– తిరిగి జమాఅత్‌లోనికి వచ్చి చేరితే తప్ప" *(హారిసుల్ అష్అరీ(రజిఅన్)– తిర్మిజీ)*

**సంగ్రహణం:**

మహాప్రవక్త(స) ఇస్లామ్ ధర్మప్రాబల్యం కోసమే ప్రభవించారని దైవగ్రంథం దివ్యఖుర్ఆన్ సెలవిస్తోంది. ఆయన తరువాత ఆయన ఉమ్మత్ (అనుచర సమాజం)పై ఈ గురుతర బాధ్యత మోపబడింది. కాబట్టి ఆ పని ఓ జమాఅత్‌గా ఏర్పడితే తప్ప నెరవేరదు. అందుకని

1. దైవసంతుష్టి పొందడం కోసం దైవధర్మాన్ని ఉన్నతం చేయబూనుకున్నవారు ఆ కార్యం కోసం ఓ జమాఅత్‌గా సంఘటితం కావడం అనివార్యం.

2,3. జమాఅత్ సభ్యులు తమ అమీర్(నాయకుని) ఆదేశాలను సూచనల్ని శ్రద్ధగా వినకపోతే, ఆ ఆదేశాలను పాటించకపోతే ఆ వ్యవస్థ ఒక్కరోజు కూడా మనగలగదు, నడవదు.

4. జమాఅత్‌లోని ప్రతి వ్యక్తి దైవధర్మోన్నతి కోసం తన శక్తినంతా ధారపోయాలి; తన ధనాన్ని చివరకు తన ప్రాణాలనైనా అర్పించడానికి తన మేథాసంపత్తిని ఈ మార్గంలో ఉపయోగించడానికి వెనకాడకూడదు.

5. ఇంతేకాదు, పరిస్థితులు తాను ఉంటున్న చోటును కూడా వదిలివేయమని వత్తిడి తెస్తే తన సర్వస్వాన్ని, ఆ స్థలాన్ని కూడా వదిలిపెట్టాల్సి ఉంటుంది.

అల్లాహ్ దైవప్రవక్తకు, ఆయన తన ఉమ్మత్‌కు (సమాజానికి) ధర్మసంస్థాపనోద్యమానికి సంబంధించిన ఈ అయిదు మూలసూత్రాలను సూచించి, ఆ కార్యాచరణ విధానమెటువంటిదో సెలవిచ్చారు. చివరగా ఆయన "ఎవరైతే ఓ జానెడు జమాఅత్

నుండి దూరమవుతాడో అతడు ఇస్లామ్ మెడత్రాటిని తన మెడనుండి తీసివేసిన వాడువుతాడు" అని సెలవిచ్చారు. అంటే అతడు ఇస్లాం పరిధి నుండి బయటకెళ్ళి పోయినవాడని అర్థం. ఇక్కడ 'జమాఅత్' అనే పదానికి అర్థం, దైవప్రవక్త(స) నాయకత్వంలో ఏర్పడి పనిచేసే జమాఅత్ అని అర్థం. ఇలాంటి జమాఅత్ నుండి వేరుబడడం, దాన్ని విభేదించడం అంటే ఇస్లామ్ నుండి తన సంబంధాన్ని త్రెంచేసుకోవడమే అన్నమాట.

ఇక సంఘసంస్కర్తల ద్వారా దైవధర్మం విస్తరింపజేసే ఉద్దేశ్యంతో ఏర్పడిన మిగిలిన జమాఅత్‌ల నుండి విభేదించడగాని లేదా అందులో చేరకపోవడంగాని జరిగితే అది ఇస్లామ్ పరిధినుండి వేర్పడడం కానేరదు. అయితే ఎలాంటి జమాఅత్‌లోనూ అసలు చేరకుండా ఒంటరి జీవితం గడపడం మాత్రం పాపం అవుతుంది. అలాంటి వ్యక్తి దేవుని ఎదుట జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. మొత్తానికి ఏ ధార్మిక జమాఅత్‌లోనైనా చేరకుండా షరయీ (ధర్మసమ్మతమైన) అనివార్య కారణం ఏదీ లేకుండా వేరుగా ఉండడం మక్రూహ్ (అవాంఛనీయం).

వ్యక్తిగత జీవితం గడపడడం సున్నత్‌కు (ప్రవక్త సంప్రదాయానికి) వ్యతిరేకం. దైవగ్రంథం, దైవప్రవక్త సంప్రదాయం ఇలాంటి జీవితాన్ని ప్రోత్సహించవు. ముఖ్యంగా ఇస్లామ్ శత్రువులు ఇస్లామ్‌ను సవాలు చేసే ఈ కాలంలో మరీను.

(١٨٥) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ اللّٰهَ يَرْضٰى لَكُمْ
ثَلَاثًا وَّيَكْرَهُ لَكُمْ ثَلَاثًا فَيَرْضٰى لَكُمْ اَنْ تَعْبُدُوْهُ وَلَا
تُشْرِكُوْا بِهٖ شَيْئًا وَاَنْ تَعْتَصِمُوْا بِحَبْلِ اللّٰهِ جَمِيْعًا وَّلَا
تَفَرَّقُوْا ـــــ وَيَكْرَهُ لَكُمْ قِيْلَ وَقَالَ وَكَثْرَةَ السُّؤَالِ وَ
اِضَاعَةَ الْمَالِ وَفِيْ رِوَايَةٍ عَنْ مَالِكٍ، بَعْدَ قَوْلِهٖ: وَاَنْ
تَعْتَصِمُوْا بِحَبْلِ اللّٰهِ جَمِيْعًا" وَاَنْ تُنَاصِحُوْا مَنْ وَلَّاهُ
اللّٰهُ اَمْرَكُمْ.

(مسلم عن ابی ہریرہ کتاب الاقضیۃ، المسوی من احادیث المؤطا للشاہ ولی اللہ الجزء الثانی ص ۲۹)

185. మహాప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "మీ కొరకు ఈ మూడు కార్యాలంటే అల్లాహ్‌కు ఇష్టం.

1. మీరు అల్లాహ్‌నే ఆరాధించాలి. ఆయనకు సాటి కృంచకూడదు.

2. మీరు అల్లాహ్ త్రాటిని గట్టిగా పట్టుకోవాలి. విభిన్న వర్గాలుగా ఏర్పడవద్దు.
3. మీ పాలకులకు మేలు జరిగే విధానాన్ని అవలంబించండి. ఇలాగే మీకోసం ఈ మూడు కార్యాలంటే ఆయనకు ఇష్టంలేదు.
1. అనవసరమైన సంభాషణల్లో లీనమైపోవడం.
2. అతిగా ప్రశ్నించడం.
3. ధనాన్ని వృధాగా ఖర్చుపెట్టడం." *(అబూహురైరా(రజిఅన్)– ముస్లిమ్)*

**సంగ్రహణం:**

అల్లాహ్ ఇష్టపడతాడుఅని అంటే ఆయన మిమ్మల్ని ఆదేశిస్తున్నాడు అని. ఈ పనులు చేసి మీరు ఆయన సంతుష్టిని పొందండి. అందుకు ఆయన మిమ్మల్ని బహూకరిస్తాడని. అవి ఇలా ఉన్నాయి.

1. మీరు ఆయన్నే ఆరాధించండి. ఎవ్వరినీ ఆయనకు సాటి కల్పించకండి. అంటే మీరు ఆయనకు దాసులుగా మారిపొండి. పూర్తిజీవితంలో (అది వ్యక్తిగత జీవితమైనా, సామూహిక జీవితమైనా) ఆయన్నే విధేయించండి. ఆయనే మీ ఆరాధ్యుడు. ఆయన్నే పూజించండి. ఆయన ఏకత్వంలోనూ ఆయన గుణగణాలలోను మరెవ్వరిని సాటి కల్పించకండి. ఆయన హక్కుల్లో, ఆయన అధికారాల్లో మరెవ్వరి ప్రమేయాన్ని స్వీకరించకండి.

2. "మీరంతా అల్లాహ్‌త్రాటిని దృఢంగా పట్టుకోండి" అని అంటే ప్రతివాడు ధర్మాన్ని ఒంటరిగా తన స్థాయిలో అవలంబించడం సరైనదిగా భావించకుండా, ముస్లిమ్ సమాజంలోని ప్రతివాడు కలసికట్టుగా సంఘటితంగా ధర్మంపై నడవండి, దాన్ని మీ సమాజ జీవితంలో అమలుపరచండి అని అర్థం.

"వ అతసిము బిహబ్లిల్లాహి జమీఅ" అనే వాక్యానికి ధర్మానికి మీరంతా గట్టిగా చేయూతనివ్వండి అని మరో అర్థం చెప్పుకోవచ్చు. 'హబ్లుల్లాహ్' అంటే అల్లాహ్ త్రాడు– దీన్నే మేమిక్కడ 'దీన్' లేక 'ధర్మం' అని అనువదించాం– సాధారణంగా దివ్యగ్రంథం అయిన దివ్యఖుర్‌ఆన్‌గా చెప్పుకోవచ్చు. అంటే అది ఇహలోకంలో జీవితం గడిపే జీవన వ్యవస్థ. ఈ గ్రంథం దైవప్రవక్త ముహమ్మద్(స)పై అవతరించింది. మీరు దీని ఆదేశాలకు అనుగుణంగా జీవించండి; ఇందులోని ఆదేశాలు, సిద్ధాంతాలు, చట్టాలు, హితబోధలు ప్రళయదినం వరకు మార్గదర్శకాలు. వీటిలో ఎలాంటి మార్పులు చేర్పులు చేయడానికి మరెవ్వరికీ హక్కులేదు. దాన్నే మీరు అనుసరించండి. అంతేగాని ఖుర్‌ఆన్ ఆదేశాలను అనేక భాగాలుగా విభజించి మీకు సులువైన ఇష్టమైన ఆదేశాలను పాటించి, ఇష్టంగాని

భాగాల గురించి పట్టించుకోకుండా దైవాగ్రహానికి గురికాకండి. గతంలో బనీఇస్రాయీల్ కూడా వారికిచ్చిన గ్రంథాన్ని ఖండఖండాలుగా విభజించి అల్లాహ్ క్రోధానికి గురయ్యారు. అయితే దైవప్రవక్త(స) సంప్రదాయాన్ని (సున్నత్‌ను), ఆ తరువాత ముస్లిమ్ సమాజ ఏకాభిప్రాయంతో నిర్దేశించిన ఆదేశాలను ధిక్కరించి కేవలం ఖుర్‌ఆన్‌నే అనుసరించే ప్రయత్నం చేయాలనేది కాదు దీని భావం. మహాప్రవక్త(స) సున్నత్, ఆ తరువాత ఇజ్మాయె ఉమ్మత్ (ముస్లిమ్ సమాజపు ధర్మవేత్తలు క్రితం ఏకాభిప్రాయంతో నిర్దేశించిన ఆదేశాలు) కూడా 'హబ్లుల్లాహ్'యే (అల్లాహ్ త్రాడే). వాటిని ధర్మం నుండి వేరు చేసినప్పుడు ఖుర్‌ఆన్‌ను ఇష్టమొచ్చిన రీతిన మలుచుకునే వీలుంది. దీన్ని పొందడానికే హదీసు తిరస్కారులు (మున్కిరీనె హదీస్) దైవప్రవక్త(స) సున్నత్ (సంప్రదాయం)పై దాడి చేయ పూనుకున్నారు.

"వర్గాలుగా ఏర్పడకండి" అంటే ముఠాలు కట్టే వైఖరికి దూరంగా ఉండండి. ముస్లిముల నడుమ విభేదాల్ని సృష్టించకండి అని అర్థం. ఇది అల్లాహ్ దృష్టిలో గొప్ప నేరం. ఒకరిని నిందించి లేక వారిని కాఫిర్‌గా (దైవతిరస్కారిగా) ఫాసిఖ్‌గా (పాపాత్మునిగా) నిందించడం వల్ల చెడిపోయిన వారిని సంస్కరించలేం. ప్రేమగా, వాత్సల్యంగా, చిత్తశుద్ధితో సంయమనం పాటించి ధర్మంవైపునకు పిలవడం వల్ల వారిని మీవైపునకు మరల్చుకోవచ్చు. ఫత్వాలు (ధార్మిక తీర్పులు) జారీ చేయడం వల్ల వారిలో మొండితనం పెరుగుతుంది తప్ప, మార్గం వీడినవాడు, ఇతరుల చెడు బోధనలవల్ల మోసపోయినవాడు మాత్రం తన వైఖరి గురించి పునరాలోచించుకోలేడు.

3. మీ పాలకులకు మేలు చేకూర్చే మార్గాన్ని అవలంబించండి అని అంటే, రుగ్మతలు, కలహాలు చెలరేగే వనరులను నిషేధించమని వారిపై వత్తిడి తేవడం అని అర్థం. దేశంలో సత్ఫలితాలనిచ్చే ప్రణాళికలను, కార్యక్రమాన్ని చేపట్టమని వారికి సలహానివ్వండి. వాటి వ్యాప్తికి వారితో సహకరించండి. ఇదేకాకుండా పాలకులు కూడా చిత్తశుద్ధితో ప్రజాసంక్షేమ కార్యక్రమాలు చేపట్టాలి. శాంతిసామరస్యం కోసం చిత్తశుద్ధితో పనిచేయాల్సి ఉంటుంది. పాలకులు, పాలితుల నడుమ హార్థికమైన సహాయసహకారాల వల్ల, కష్టపడి పనిచేయడం వల్ల ఇస్లామీయ రాజ్యం సుస్థిరంగా మనగలదు. ప్రగతిని సాధించగలదు.

ఇదేకాకుండా ఇస్లామీయ జమాఅత్(సంస్థ)కు చెందిన కార్యకర్తలు అల్లాహ్ ధర్మోన్నతి కోసం తమ నాయకుణ్ణి చిత్తశుద్ధితో సహకరించాలన్న భావం కూడా ఇందులో ఇమిడి ఉంది. ఈ ధ్యేయసాధన మరియు దాని వ్యాప్తిలో వచ్చే అడ్డంకుల్ని ఆయన దృష్టికి తీసుకొని రావడంలో వాటిని దూరం చేయడంలో సహకరించాల్సి ఉంటుంది. ఇస్లామీయ జమాఅత్ కార్యకర్తలు, నాయకుల నడుమ పరస్పర సహాయ సహకారాలు లేనిదే ఈ మహోన్నతమైన లక్ష్యాన్ని సాధించడం కష్టం.

"అల్లాహ్ మీకోసం ఈ మూడు కార్యాలను ఇష్టపడడు" అని అంటే వాటినుండి మిమ్మల్ని వారిస్తున్నాడు అని, వాటిని అవలంబిస్తే మీరు శిక్షకు అర్హులవుతారు అని అర్థం.

1. "అనవసర సంభాషణల్లో లీనమైపోవడాన్ని మెచ్చడు" అంటే మీరు పనికిమాలిన మాటల్లోబడి మీ విలువైన కాలాన్ని వృథాపర్చకండి అని అర్థం. మనిషి పిచ్చాపాటి కబుర్లలో మునిగిపోయి తన విలువైన కాలాన్ని వృథా చేయడం వివేకమా? ఇహలోకంలో ప్రయోజనంలేని కబుర్లు పరలోకంలో పనికిమాలినవే కదా మరి!

2. "తరుచుగా ప్రశ్నించడాన్ని అల్లాహ్ మెచ్చడు" అంటే ధర్మమార్గంపై నడవడంలోగాని, దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయాన్ని పాటించడంలో ఎలాంటి ఉత్సాహంలేదుగాని వాటి గురించిన సమస్యల్ని గ్రుచ్చిగ్రుచ్చి అడగడం వాటిని అతిగా తెలుసుకునే ప్రయత్నంలో సమయాన్ని వృథా చేయడం అన్నమాట. ఈ విషయంలో మాటిమాటికి అడిగి తెలుసుకునే అలవాటు చేసుకోవడం సరియైనదికాదు అన్నదే. ఇక్కడ చెప్పొచ్చిందేమిటంటే దేవుడు, ఆయన ప్రవక్త ఆదేశాలకు అనుగుణంగా జీవితాన్ని మలుచుకునే ప్రయత్నం చేయండి అనవసరంగా ప్రశ్నలను గుప్పించి కాలం వృథా చేసుకోకండని అర్థం.

దీనికి మరో భావం ఏమిటంటే మీరు మీ అవసరాల కోసం ఇతరులను అతిగా అడగకండి. వారి ముందు చేయి చాచకండి అల్లాహ్ దీన్ని మెచ్చడు. మీ ఉపాధికోసం ప్రతివాని ఎదుట చేయిచాచి యాచించడం అల్లాహ్‌కు ఇష్టముండదు.

3. "ధనాన్ని వృథాగా ఖర్చుపెట్టడాన్ని అల్లాహ్ మెచ్చడు"

మనిషి ధర్మసమ్మతమైన మార్గాల ద్వారా ఏదైతే సంపాదిస్తాడో అది అల్లాహ్ అతనికి ఒసగిన వరం, ఆయన తరఫున అతని దగ్గర ఉన్న అమానతు. వృథాగా ఖర్చుపెట్టేవాడు ఆ వరానికి విలువ ఇవ్వడం లేదన్నట్లే. పాపకార్యాలపై అశ్లీల వినోదంపై ఇంకా ఇతరులకు చూపడానికి చేసే ఖర్చు దుబారా ఖర్చే. ఇది అల్లాహ్ ఒసగిన అమానత్తును కొల్లగొట్టడమే అవుతుంది. ఆయన వారించిన మార్గంలో దాన్ని ఖర్చుపెట్టడానికి ఆయన మెచ్చడు. ప్రళయం రోజున ఈ నేరానికి అతడు భయంకరమైన శిక్షకు లోను కావలసిందే.

## 'అమీర్' (నాయకుని) ఆజ్ఞాపాలనా పరిధి

(۱۸۶) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا طَاعَةَ فِيْ مَعْصِيَةِ اللّٰهِ
اِنَّمَا الطَّاعَةُ فِي الْمَعْرُوْفِ۔

(مسلم عن علی کتاب الامارہ بخاری کتاب المغازی، کتاب الاحکام کتاب اخبار الاحاد
ابوداؤد کتاب الجہاد)

186. "అల్లాహ్ అవిధేయతలో ఏ ఒక్కరి ఆజ్ఞను పాటించడమూ ధర్మసమ్మతం కాదు. ఆదేశపాలన కేవలం సత్కార్యాల్లో, దైవవిధేయతలో మాత్రమే" అని దైవప్రవక్త(స) సెలవిచ్చారు.

(హ(జత్ అలి(రజిఅన్)– ముస్లిం, బుఖారి, అబూదావూద్)

**సంగ్రహణం:**

హిజ్రీ శకం తొమ్మిదిలో జరిగిన ఓ పోరాటానికి, ఓ అన్సారి నాయకత్వంలో మూడొందల మందితో కూడిన ఓ పటాలాన్ని పంపుతూ దైవప్రవక్త "మీ నాయకుని ఆజ్ఞలకు బద్ధులై మెలగండి" అని ఉద్బోధించారు. ప్రయాణ సందర్భంలో వారి నాయకుడు ఓ విషయంలో, కోపంతో మీరంతా అగ్నిలో దూకండి అని ఆదేశించాడు. ఇది విన్న సిపాయిలు సందిగ్ధంలో పడి ఒకరి ముఖాలొకరు చూసుకోనారంభించారు. వారిలో కొందరు, ఈ అగ్ని నుండి రక్షణ పొందడానికే కదా మనం దైవప్రవక్తను అనుసరిస్తోంది! ఈ అగ్ని గుండంలో ఎలా దూరగలం? అని నాయకుని ఆజ్ఞను ధిక్కరించారు. ఎట్టకేలకు ఈ కేసు మహాప్రవక్త(స)కు విన్నవించుకున్నారు వారు. ఇది విన్న మహాప్రవక్త, "వీరే గనక అమీర్ ఆదేశం మేరకు అగ్నిగుండంలో దూకిఉంటే ప్రళయం వరకు అందులోనుండి బయటపడేవారు కారు. దేవుని అవిధేయత విషయంలో నాయకుని ఆదేశాల్ని పాటించడం సరైనది కాదు. కేవలం సత్కార్యాల్లోనే అమీర్ ఆదేశాల్ని శిరసావహించాలి" అన్నారు.

అమీర్ లేక నాయకుడు తన కార్యకర్తలను దైవం, దైవప్రవక్త నిషేధించిన లేదా వారించిన పనులు చేయమని పురమాయిస్తే కార్యకర్తలు దాన్ని నిరాకరించాలి. మోమిన్ ప్రతి పనిలోనూ అల్లాహ్ ఆదేశాల్నే పాటించాలి, దైవప్రవక్త ఆదేశాలనే అనుసరించాలి. అదీ దైవాదేశ పాలనే అవుతుంది. అంతేగాని ఏ వ్యక్తి అయినా, ఏ సంస్థ అయినా దైవాదేశాలను ధిక్కరించమని ఆదేశిస్తే అలాంటి ఆదేశాన్ని తిరస్కరించాలి. ఆ ఆదేశం తన తండ్రిదైనా, మత గురువుదైనా లేదా ప్రభుత్వానిదైనా లేదా సంఘనాయకుడిదైనా సరే.

ఆ దేశపాలన కేవలం మంచి పనుల్లోనే జరుగుతుంది. సత్యానికి వ్యతిరేకంగా నడవమని ఆదేశించినవాడు, ఆ ఆదేశాన్ని పాలించినవాడు ఉభయులూ అపరాధులే. మరిన్ని వివరాలు 262వ హదీసులో రాబోతున్నాయి.

## జమాఅత్ (సంఘ వ్యవస్థలో) పరస్పర సంబంధాలు

(١٨٧) لَمَّا قَدِمَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الْمَدِيْنَةَ أَتَاهُ

الْمُهَاجِرُوْنَ فَقَالُوْا يَارَسُوْلَ اللّٰهِ ـــــ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

...مَا رَأَيْنَا قَوْمًا اَبْذَلَ مِنْ كَثِيْرٍ وَلَا اَحْسَنَ مُوَاسَاةً
مِنْ قَلِيْلٍ مِنْ قَوْمٍ نَزَلْنَا بَيْنَ اَظْهُرِهِمْ لَقَدْ كَفَوْنَا
الْمُؤْنَةَ وَاَشْرَكُوْنَا فِي الْمَهْنَاِ حَتّٰى لَقَدْ خِفْنَا اَنْ يَذْهَبُوْا
بِالْاَجْرِ كُلِّهٖ فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا، مَا
دَعَوْتُمُ اللّٰهَ لَهُمْ وَاَثْنَيْتُمْ عَلَيْهِمْ۔

(ترمذی عن انس ابواب صفة القیامة)

187. దైవప్రవక్త(స) మదీనా నగరానికి వచ్చినప్పుడు, అన్సార్ల త్యాగాన్ని, వారి చేయూతను చూసి ముహాజిర్లు (వలసవచ్చినవారు) మహాప్రవక్త(స) సన్నిధిలోకి హాజరై విన్నవించుకున్నారు.

"దైవప్రవక్తా! మాకు ఆతిథ్యం ఇచ్చినవారిలోని సంపన్నులంతా విశాల హృదయులు, దాతలే. వారిలోని నిరుపేదలంతా జాలి, కరుణ గుణంగల వారే. ఉపాధి సంపాదనకోసం స్వయంగా వారే కష్టబడు తున్నారు. అయితే వారి సంపాదనలో మమ్మల్ని కూడా భాగస్వాములుగా చేసుకున్నారు. పుణ్యాలన్నీ వారికే సొంతమవుతాయోమో అనే భయం మాకుంది"

దానికి మహాప్రవక్త(స) "కాదు! మీరు వారికోసం అల్లాహ్‌ను వేడుకుంటూ ఉన్నంతవరకు వారి శుభమే కోరుకుంటూ ఉన్నంతవరకు అలా జరగదు" అని సెలవిచ్చారు. *(అనస్ (రజిఅన్)- తిర్మిజీ)*

**సంగ్రహణం:**

అన్సార్లు (మదీనావాసులు), ముహాజిర్ల (హిజ్రత్ చేసి వచ్చినవారు) ఎడల ప్రదర్శించిన ఉత్తమ వైఖరి, ఆదర్శప్రాయమైన విధానం మానవ చరిత్రలోనే అపూర్వ మైనది. వారు, ముహాజిర్ల నివాసం కోసం తమ ఇండ్లల్లోను, ఉపాధికోసం తమ తోటల్లోను భాగస్వామ్యం ఏర్పరిచారు. సంపన్నులైన అన్సారులు ఎంతో దాతృత్వంతో వారిని ఆర్థికంగా ఆదుకున్నారు. వారిలోని నిరుపేదలు కూడా శక్తివంచనలేకుండా ముహాజిర్లకు సహాయపడ్డారు. తమ పొలాలు, తోటలపై వచ్చే ఆదాయం నుండి భాగం తీసి ముహాజిర్లకు అందించారు. అయితే దైవప్రవక్త(స) ముహాజిర్లు, అన్సారులు ఉభయవర్గాల మధ్య 'మువాఖాత్' (సోదరబంధం) నెలకొలుపుతున్నప్పుడు ముహాజిర్లు మదీనా పొలాల్లో

అన్సారులతోపాటు పనిచేయాలని నిర్ణయం అయింది. అయినా అన్సారులు, ముహాజిర్లను వ్యవసాయ పనులు చేయనిచ్చేవారు కారు. ఈ వైఖరిని దృష్టిలో ఉంచుకొని ముహాజిర్లు, అల్లాహ్ వారి పుణ్యఫలాలన్నీ– మక్కా నుండి మదీనాకు హిజ్రత్ చేసి రావడం, దైవప్రవక్తను అనుసరించడం వగైరా– వారికే దుక్కుతాయేమో అని భయపడ్డారు. మహాప్రవక్త వారి ఈ భయాన్ని పారద్రోలుతూ, 'వారి శుభం కోరుకున్నంతవరకు, వారికోసం దుఆ చేస్తూ ఉన్నంతవరకు మీ పుణ్యఫలాలను అల్లాహ్ వారికెలా ఇస్తాడు? మీ పుణ్యఫలం మీకు బహూకరిస్తాడు. ఆయనకు లోటేముంది? ఇక అన్సారులు అల్లాహ్ సంతోషాన్ని పొందడానికి మీకు చేసే సహాయసహకారాలకు ఆయన మేలైన బహుమానాల్ని వారికీ ప్రసాదిస్తాడు. వారికోసం మీరు చేసే దుఆలను మన్నిస్తాడు అని అభయమిచ్చారు.

అల్లాహ్ సంతోషం కోసమే పనిచేసే ఈ ఇరువర్గాలలో (ముహాజిర్లు, అన్సారులు) అన్సారులు, ముహాజిర్ల ఎడల ప్రదర్శించిన త్యాగం అభిమానం, సహాయసహకారాలను గురించి నేటి భౌతికవాద (Materialistic) భావాలు నిండిన మనిషి ఊహించనైనా ఊహించలేడు. సరికదా ఆ వైఖరిని ఒకే తల్లి కడుపున పుట్టిన సోదరులు కూడా అవలంబించడం కష్టం.

ఆ సోదర భావానికి సంబంధించిన ఓ ఉదాహరణ చూడండి.

ముహాజిర్లు మదీనాలో అడుగిడినప్పుడు దైవప్రవక్త వారికీ, మదీనావాసులకు (అన్సారులకు) నడుమ సోదర బంధాన్ని ఏర్పరిచారు. ఈ సందర్భంగా ఆయన అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజిఅన్) (ముహాజిర్) మరియు సఅద్ బిన్ రబీ(రజిఅన్) (అన్సారి) ఇద్దరిని సోదరులుగా ఖరారు చేశారు. సఅద్ బిన్ రబీ (రజిఅన్) అన్సారుల్లోకెల్లా సంపన్నులు. ఆయన, అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్(రజి)తో, నా ఆస్తినంతా రెండు భాగాలుగా విభజించి ఓ భాగాన్ని మీకు ఇవ్వదలిచాను; నాకు ఇద్దరు భార్యలు. వారిలో మీకు ఎవరు నచ్చుతారో చెప్పండి. ఆమెకు విడాకులు ఇచ్చేస్తాను. ఇద్దత్ కాలం గడవగానే మీరు ఆమెను వివాహం చేసుకుందురుగాని అని అన్నారు.

అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్(రజిఅన్) తన సోదరుని ఈ కోరికకు ఎంతో ప్రభావితుడయి, "బాబూ! ధన్యవాదాలు; అల్లాహ్ మీ సంపదల్ని మరింతగా వృద్ధిపరచుగాక!" అని దీవించి తన భుక్తికోసం బజారు ముఖం పట్టారు. (బుఖారి)

## మహిళా సదస్సులు

(۱۸۸) جَاءَتِ امْرَأَةٌ إِلَى رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَتْ
يَا رَسُوْلَ اللهِ ذَهَبَ الرِّجَالُ بِحَدِيْثِكَ فَاجْعَلْ لَنَا مِنْ
نَفْسِكَ نَأْتِيْكَ فِيْهِ تُعَلِّمُنَا مِمَّا عَلَّمَكَ اللهُ فَقَالَ

اِجْتَمِعْنَ فِيْ يَوْمِ كَذَا وَكَذَا فِيْ مَكَانِ كَذَا وَكَذَا فَاجْتَمَعْنَ فَاَتَاهُنَّ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَعَلَّمَهُنَّ مِمَّا عَلَّمَهُ اللّٰهُ -

(بخاری عن ابی سعید کتاب الاعتصام)

188. ఓ మహిళ దైవప్రవక్త(స) సన్నిధిలో హాజరై 'దైవప్రవక్తా! మీ బోధనలు కేవలం పురుషులకు మట్టుకే పరిమితమై వున్నాయి. (స్త్రీలు ఆ బోధనల్ని వినే అవకాశం కలగడం లేదు) మా కోసం కూడా సమయాన్ని కేటాయించండి, మేము కూడా మీ సన్నిధిలో హాజరై అల్లాహ్ మీకిచ్చిన ధర్మజ్ఞానాన్ని నేర్చుకుంటాము' అని విన్నవించుకున్నది. దైవప్రవక్త(స) "సరే మీరు (స్త్రీలంతా) ఫలానా రోజున ఫలానా స్థలంలో సమావేశం కండి" అని సెలవిచ్చారు. (కార్యక్రమం ప్రకారం) స్త్రీలంతా సమావేశం ఏర్పాటు చేసుకోగా, దైవప్రవక్త(స) వారి సదస్సులో ధర్మబోధ చేశారు.

*(అబూసయీద్(రజిఅన్)– బుఖారి)*

**సంగ్రహణం:**

ప్రవక్త కాలంలో స్త్రీలు తమ పనులవల్ల తీరికలేక ఎక్కువగా సమావేశాలకు హాజరయ్యేవారు కారు. అందుకని స్త్రీలు, తమకు ప్రత్యేక సమావేశం కావాలని కోరు కున్నారు. దీనివల్ల ముస్లిం స్త్రీలు ధర్మం విషయంలో దాని జ్ఞానసముపార్జన విషయంలో ఎంత తహతహలాడేవారో అవగతమవుతోంది. ఇస్లామీయ ధార్మిక జ్ఞానసముపార్జన కోసం మహిళలకు ప్రత్యేక సదస్సును నిర్వహించడం ఎంతో అవసరం. ప్రయోజనకరమైనది కూడాను. ఇజ్తిమా (సమావేశం) నిర్వహించడానికి ఓ స్థలాన్ని, ఓ కాలాన్ని నిర్ణయించడం కూడా మహాప్రవక్త(స)గారి సంప్రదాయమే. సత్యధర్మ సంస్థాపనకార్యార్థం స్త్రీలు కూడా సంఘటితం కావడం, దానికి సామూహిక రూపాన్ని కల్పించడం, పురుషుల వలెనే సక్రమంగా ఇజ్తిమాలు నిర్వహించడం ఇస్లామ్ ధర్మానికి అనుగుణమైన విషయమే. స్త్రీ పురుషులు విచ్చలవిడిగా అడ్డుఅదుపు లేకుండా కలిసిమెలిసి తిరగడాన్ని ఇస్లామీయ సంస్కృతి అనుమతించదు. ధార్మిక సమావేశాల్లో, పాఠశాలల్లో, క్లబ్బుల్లో, కళాశాలల్లో, సాంస్కృతిక కార్యక్రమాల్లో ఎక్కడయినా సరే స్త్రీ పురుషులు ఏకంగా కలిసిమెలిసి పాలుపంచుకోవడాన్ని ఎలా సమ్మతిస్తుంది?

## దైవధర్మం వైపునకు ఆహ్వానించడంలో సంయమనం

(١٨٩) اِنَّ اَعْرَابِيًّا بَالَ فِي الْمَسْجِدِ فَقَامُوْا اِلَيْهِ فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَا تُزْرِمُوْهُ ثُمَّ دَعَا بِدَلْوٍ مِنْ مَاءٍ فَصَبَّ عَلَيْهِ۔

(بخاری عن انس کتاب الادب مسلم کتاب الطہارۃ)

189. ఓ పల్లెవాసి (బద్వీ) మస్జిద్‌లో మూత్ర విసర్జన చేస్తుండగా సహాబా(రజిఅన్) అతణ్ణి కొట్టడానికి లేచారు. అప్పుడు దైవప్రవక్త(స) (వారిని వారించి) అతణ్ణి మూత్ర విసర్జన నుండి ఆపకండి అని చెప్పి ఓ బకెట్టు నీరు తెప్పించి దాన్ని స్వయంగా కడిగేశారు.

(హజ్రత్ అనస్(రజిఅన్) బుఖారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

దైవప్రవక్త(స) మస్జిద్‌లో కూర్చుని ఉండగా 'జుల్‌కవేస్రా' అనే పల్లెవాసి వచ్చి రెండు రకాతుల నమాజు చేశాడు. ఆ తరువాత అతడు మస్జిద్ ఓ మూలకు వెళ్ళి మూత్ర విసర్జన చేయసాగాడు. అది చూసిన సహాబా(రజిఅన్) మస్జిద్ పవిత్రతను భంగం చేస్తున్నాడన్న కోపంతో అతణ్ణి శిక్షించడానికి లేచారు. దైవప్రవక్త(స) వారిని వారించి ఆగండి, మీరు దైవధర్మం వైపునకు ఆహ్వానించేవారు. ధర్మాన్ని సులభతరం చేయడానికి పూనుకున్నవారు. కాఠిన్యాన్ని అవలంబించి ప్రజల్ని దైవమార్గానికి దూరం చేయకండి అని పలికారు.

మహాప్రవక్త(స) ఆ సమయంలో అవలంబించిన వైఖరి ద్వారా దైవధర్మాన్ని వ్యాపింపచేసే విధానం ఏమిటో అవగతమవుతుంది. ఆయన చేసిన మొట్టమొదటి పని ఆ పల్లెవాసిని శిక్షించడానికి లేచిన అనుచరులను వారించడం. రెండో పని, అతణ్ణి పూర్తిగా మూత్రవిసర్జన చేయనివ్వడం, మూత్రవిసర్జన చర్యను మధ్యలో ఆపుచేయించి ఆ వ్యక్తిని శారీరకంగా బాధించలేదు. అతనికి చీవాట్లు కూడా పెట్టలేదు. అనుచరులకు దానికి అనుమతించలేదు. 'మస్జిదె నబవీ' అపవిత్రం చేసిన ఈ తీవ్రమైన నేరానికి ఆ పల్లెవాణ్ణి శిక్షించే బదులు అతణ్ణి ఎంతో మెత్తగా, బాబూ! మస్జిద్ కేవలం నమాజు చేయడానికి, దివ్యగ్రంథ పారాయణం, దైవధ్యానం కోసమే ప్రత్యేకించబడుతుంది తప్ప ఇలా మలమూత్ర విసర్జన కోసం కాదు అని నచ్చజెప్పారు.

# ఉపద్రవ పరీక్షల కాలం

(١٩٠) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ بَادِرُوْا بِالْاَعْمَالِ فِتَنًا كَقِطَعِ اللَّيْلِ الْمُظْلِمِ يُصْبِحُ الرَّجُلُ مُؤْمِنًا وَ يُمْسِىْ كَافِرًا اَوْ يُمْسِىْ مُؤْمِنًا وَ يُصْبِحُ كَافِرًا يَبِيْعُ دِيْنَهُ بِعَرَضٍ مِّنَ الدُّنْيَا۔ (مسلم عن ابی ہریرہ کتاب الایمان ترمذی ابواب الفتن)

190. మహాప్రవక్త(స) ఇలా పలికారు: "కాళరాత్రిలో వచ్చి పడే నిరంతర అంధకారంలా మీపై వచ్చిపడే ఉపద్రవాలు దాపురించకపూర్వమే సత్కార్యాలనాచరించడంలో త్వరపడండి. (అప్పుడు)ఉదయం మోమిన్‌గా (విశ్వాసిగా) ఉన్నవాడు సాయంత్రానికల్లా దైవతిరస్కారిగా మారిపోతాడు. లేదా, సాయంత్రపు మోమిన్ తెల్లవారేకల్లా తిరస్కారి అయిపోతాడు. (ప్రాపంచిక ధనవ్యామోహంవల్ల) అతడు తన ధర్మాన్నే అమ్మేయగలడు."

(అబూహురైరా (రజిఅన్)– ముస్లిమ్; తిర్మిజీ)

**సంగ్రహణం:**

కొన్ని ఉపద్రవాల రాకను గురించి హదీసులో ఓ విశ్వాసిని సావధానపరచడం జరిగింది. ఆ ఉపద్రవాలు ఇవి: 1. విశ్వాసంపై నిలకడగా ఉండడం కష్టసాధ్యం అయి పోతుంది. ఒకే ఒక్కరోజులో పరిస్థితి మారిపోవచ్చు. డబ్బుకోసం ధర్మాన్ని అమ్ముకోవడం సర్వసాధారణమవుతుంది. ముస్లిములు భౌతిక ప్రయోజనాలకోసం త్వరలో తమ ధర్మపరాయణతను పణంగా పెట్టేస్తారు. ఇంకా ఆర్థికంగా పైకి రావాలనే తపన వల్ల అల్లాహ్ హలాల్ (ధర్మసమ్మతం) చేసిన దాన్ని హరాంగాను (నిషిద్ధమైనదిగానూ), అల్లాహ్ హరాం చేసిన దాన్ని హలాల్‌గా చేయడానికి పూనుకోవడం జరుగుతుంది. అంటే ఇచ్చిపుచ్చుకోవడాల్లో, వ్యవహారాల్లో ఇస్లామేతర విధానాలను అవలంబిస్తారు అని అర్థం.

2. వారు పరస్పర శత్రుత్వాల్లో చిక్కుకుంటారు. ధార్మిక విషయాల్లో భేదాభిప్రాయాల వల్ల ఇస్లామీయ సమాజంలో తీవ్రమయిన విభేదాలు పొడసూపి వర్గాలుగా విడిపోతారు. అజ్ఞానంతో కూడుకున్న దురభిమానాలవల్ల వారి మధ్యన వివాదాలు, తగాదాలు ప్రబలుతాయి. ఓ వర్గం మరో వర్గాన్ని చంపడం, వారి సొత్తును అపహరించడం ధర్మసమ్మతమైనదిగా తలుస్తుంది. సర్వత్రా దోపిడీలు, హత్యాకాండ ప్రబలిపోతాయి.

3. పాపాలకు పాల్పడేవారు, దౌర్జన్యపరులైనవారు అధికారాన్ని హస్తగతం

చేసుకుంటారు. వారు ముస్లిములను ఊచకోత కోస్తారు. అన్యాయంగా వారి ఆస్తిని హస్తగతం చేసుకుంటారు. వారిని బలపరిచే, ఉలమాయెసూ' (దుష్టపండితుల) స్వార్థపరమైన ధర్మవేత్తలు ఈ దౌష్ట్యాన్ని ధార్మికంగా బలపరుస్తారు.

మహాప్రవక్త(స) ఏయే ఉపద్రవాల గురించి అయితే భవిష్యవాణి పలికారో అవి ప్రస్తుతం మనకాలంలో వరదలా వచ్చిపడుతున్నాయి. ఈ సంకట పరిస్థితులను దృష్టియందుంచుకొని, ఇస్లామ్ ధ్వజవాహకులు చెడిపోయిన ముస్లిమ్ సమాజాన్ని ఉద్ధరించడం కోసం తీవ్రంగా కృషి చేయవలసి ఉంటుంది.

నేటి పరిస్థితి ప్రకారం అనేకమంది ముస్లిములు తమ ధర్మం విషయంలో డోలాయమాన వైఖరికి లోనయ్యారు. వారి విశ్వాసం ఎంతో బలహీనమయిపోయింది. ఈ ఇహలోక ప్రయోజనాలకోసం తాము అవలంబించే ధర్మాన్నే వదిలేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఇలాంటి సంక్లిష్ట సమయంలో దైవధర్మోన్నతి కోసం పాటుపడే వారి బాధ్యతలు ఎంతో పెరిగిపోతాయి. (వివరాలకు 167వ హదీసును చూడండి).

## క్రియాశూన్యుడైన ప్రబోధకుడు

(۱۹۱) عَنْ اُسَامَةَ بْنِ زَيْدٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
يَقُوْلُ يُجَاءُ بِالرَّجُلِ يَوْمَ الْقِيَامَةِ فَيُلْقٰى فِي النَّارِ فَتَنْدَلِقُ
اَقْتَابُهٗ فِي النَّارِ فَيَدُوْرُ كَمَا يَدُوْرُ الْحِمَارُ بِرَحَاهُ فَيَجْتَمِعُ اَهْلُ النَّارِ
عَلَيْهِ فَيَقُوْلُوْنَ اَيْ فُلَانُ مَا شَانُكَ اَلَيْسَ كُنْتَ تَأْمُرُنَا
بِالْمَعْرُوْفِ وَتَنْهَانَا عَنِ الْمُنْكَرِ؟ قَالَ كُنْتُ اٰمُرُكُمْ
بِالْمَعْرُوْفِ وَلَا اٰتِيْهِ وَاَنْهٰكُمْ عَنِ الْمُنْكَرِ وَاٰتِيْهِ۔
(بخاری کتاب بدء الخلق۔ کتاب الفتن مسلم کتاب الزھد)

191. దైవప్రవక్త(స) ఇలా సెలవిస్తూ ఉండగా విన్నానని హజ్రత్ ఉసామా (రజిఅన్) ఉల్లేఖించారు.

"ప్రళయం రోజున ఓ వ్యక్తిని లాగుకొనివచ్చి అగ్నిలో బడవేయడం జరుగుతుంది.

ఆ నరకంలో అతని పొట్టప్రేవులు (అతని మలద్వారం గుండా) వెంటనే బయటకు వచ్చిపడతాయి. ఆ వ్యక్తి వాటి చుట్టూరా 'గానుగ'లో తిరిగే కంచర గాడిదలా తిరుగుతూ ఉంటాడు. (అప్పుడు), నరకవాసులు

అతని చుట్టూచేరి, ఓ ఫలానా వ్యక్తి! ఏమిటి నీ పరిస్థితి, నీవు (ఇహ లోకంలో) మాకు సత్కార్యాలు చేయండి అని ఆదేశించేవాడివి, చెడుల జోలికి పోకుండా వారించేవాడివి కావా? అని అడుగుతారు. సమాధానంగా అతడు (అవును నిజమే) నేను సత్కార్యాల కోసం ఆదేశించేవాడిని. అయితే నేను మాత్రం దాన్ని అమలు చేసేవాణ్ణికాను. చెడులనుండి మిమ్మల్ని వారించేవాణ్ణి కాని ఆ చెడుల్ని స్వయంగా నేను ఆచరించేవాణ్ణి. (అందుకని) ఈ రోజీ శిక్షను అనుభవిస్తున్నాను) అని పలుకుతాడు. *(బుకారి, ముస్లిమ్)*

**సంగ్రహణం:**

మారూఫ్ అనే పదానికి అర్థం దేవుడు అవలంబించమని ఆదేశించిన ఇస్లామీయ ఆదేశాలు. మున్కర్ అంటే అల్లాహ్ వాటికి దూరంగా ఉండమని చెప్పిన పాపాలు, దుష్కార్యాలు. ధార్మిక సేవ చేస్తున్నవారు, ఇస్లాం వ్యాప్తిలో బాగా కృషి చేసేవారు సదా గుర్తుంచుకోవలసిన హదీసు ఇది. ధర్మవేత్తలు, ధార్మికసంస్థల (జమాఅత్‌ల) సభ్యులు, కార్యకర్తలు స్వయంగా మారూఫ్‌ను అవలంబిస్తూ ఇతరులకు దాన్ని అనుసరించమని ఉద్బోధిస్తారు. అలాగే మున్కర్ నుండి ప్రజలను వారిస్తున్నవారు స్వయంగా వాటికి దూరంగా ఉండాలి. అలాకాని పక్షంలో వాళ్ళు ఈ హదీసులో చెప్పబడ్డ శిక్షకు గురికాక తప్పదు.

## సందేశప్రచారం ప్రాముఖ్యత

(١٩٢) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ بَلِّغُوْا عَنِّيْ وَلَوْ آيَةً وَحَدِّثُوْا عَنْ بَنِيْ إِسْرَائِيْلَ وَلَا حَرَجَ وَمَنْ كَذَبَ عَلَيَّ مُتَعَمِّدًا فَلْيَتَبَوَّأْ مَقْعَدَهُ مِنَ النَّارِ

(بخاری عن عبداللہ بن عمرو۔ کتاب الانبیاء)

192. మహాప్రవక్త ముహమ్మద్(స) ప్రవచనం ఇలా వుంది: “నా తరఫున ప్రజలకు ఒక్కమాట (ఆయత్) అందించినా చాలు, బనీ ఇస్రాయీల్ కథనమైనా సరే. (అయితే) కావాలని ఎవరైనా నా గురించి అసత్యమాడారో, అతడు నరకంలో తన నివాసాన్ని ఏర్పరచుకున్నట్లే.”

(అబ్దుల్లా బిన్ అమ్రూ (రజిఅన్)– బుకారి)

**సంగ్రహణం:**

మనిషి జీవన రంగాలన్నింటికి సంబంధించిన సంపూర్ణ ఆదేశాలు ఇస్లాం ధర్మంలో ఉన్నాయి. వీటికి మూలం దైవగ్రంథం అయిన దివ్యఖుర్ఆన్. మహాప్రవక్తగారి సంప్రదాయం దీని ఆచరణాత్మకమైన విధానం. ఇది కూడా దివ్యఖుర్ఆన్‌లాంటి ఆదేశమే. దైవప్రవక్త(స) పై ప్రవచనానికి అర్థం ఏమిటంటే, ఖుర్ఆన్ మరియు సున్నత్ ఈ రెంటికి సంబంధించిన జ్ఞానాన్ని, బోధనలను సాధ్యమైనంత అధికంగా ప్రజానీకానికి అందించడం. మా శక్తి సామర్థ్యాలేమిటి? మా దగ్గర ఉన్న వనరులేమిటి అంటూ ఆలోచించుకుంటూ కూర్చోవద్దు; మీకంత స్తోమత లేకపోతే దివ్యఖుర్ఆన్‌లోని ఓ వాక్యాన్నైనా సరే ఇతరులకు అందించడానికి వెనుకాడకండి అని.

ఖుర్ఆన్ మరియు సున్నత్ జ్ఞానం ఏమాత్రం లేని వ్యక్తి ఇస్లామీయ ఆదేశాలను పాటించడంగాని, అదిచూపే మార్గాన్ని అవలంబించడంగాని చేయలేడు. అందుకే మహాప్రవక్త(స) తమను విశ్వసించిన ముస్లిములకు, నేను దైవం తరఫున మానవకోటికి మార్గదర్శకత్వం వహించాను. మీకు ముక్తిమార్గాన్ని చూయించాను. ఈ జ్ఞానాన్ని మీరు సాధ్యమైనంత అధికంగా ఇతరులకు చేరవేసే ప్రయత్నం చేయండి. అయితే జాగ్రత్త! ఇస్లామ్ పేరుమీద నేను చెప్పనటువంటి మాటను నా పేరున జెప్పి వ్యాపింపజేయకండి అని హెచ్చరించారు.

అందుకని ముస్లిమ్ సమాజోద్ధారకులు, నేరుగా దివ్యఖుర్ఆన్ మరియు హదీసు గ్రంథాల నుండి ధార్మికజ్ఞానాన్ని పొంది ఆపై చిత్తశుద్ధితో కష్టపడి దాన్ని ప్రజలందరికి అందజేసే బాధ్యతను కలిగి ఉన్నారు.

ఈ హదీసులో, దైవప్రవక్త(స)గారి ప్రవచనాలుగా చెప్పి కట్టుకథలు అల్లే వారికి ఓ హెచ్చరిక కూడా ఉంది.

విచారకర విషయం ఏమిటంటే కొందరు, తమ అజ్ఞానం వల్లనైతేనేమి, కావాలని అయితేనేమి తప్పుడు, కల్పితమైన ఉల్లేఖనాల్ని ప్రవక్త(స) ప్రవచనాలుగా చెప్పి ప్రజలను సంస్కరించాలని అనుకుంటారు. అయితే ఈ వైఖరి వల్ల ఇస్లాం ధర్మస్వరూపమే వికృతమైపోతోంది. సంపూర్ణమైన ఇస్లాం ధర్మానికి తప్పుడు, కల్పితమైన ఉల్లేఖనాల అవసరం, సహాయం ఏమాత్రం అవసరంలేదు. ఇది తన సంపూర్ణ స్వరూపంతో విరాజిల్లుతోంది. దీన్ని అమలుచేసి, జీవితంలోని ప్రతిరంగంలో దాన్ని అమలుచేస్తే చాలు. కావలసింది కూడా ఇదే. ఉల్లేఖనాల విషయంలో ఇలాంటి అశ్రద్ధ ప్రపంచంలో ఇస్లాం ధర్మాన్ని ఎంతో నష్టానికి గురిచేయగలదు. నిజమైన ప్రామాణికమైన హదీసుల భాండాగారం ఉండగా తలాతోకా లేని హదీసులను కల్పించడం, అర్థం పర్థం లేని మాటలను దైవప్రవక్త(స)కు ఆపాదించే అవసరం ఏమొచ్చిందని?

## చూపరి అయిన పండితుడు, దాత, శూరుడు

(۱۹۳) عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
یَقُوْلُ اِنَّ اَوَّلَ النَّاسِ یُقْضٰی عَلَیْهِ یَوْمَ الْقِیَامَةِ۔

(۱) رَجُلٌ اُسْتُشْهِدَ فَاُتِیَ بِهٖ فَعَرَّفَهَا نِعْمَتَهٗ فَعَرَفَهَا قَالَ فَمَا
عَمِلْتَ فِیْهَا؛ قَالَ قَاتَلْتُ فِیْكَ حَتّٰی اسْتُشْهِدْتُ قَالَ
كَذَبْتَ وَلٰكِنَّكَ قَاتَلْتَ لِاَنْ یُّقَالَ جَرِیْءٌ فَقَدْ قِیْلَ
ثُمَّ اُمِرَ بِهٖ فَسُحِبَ عَلٰی وَجْهِهٖ حَتّٰی اُلْقِیَ فِی النَّارِ۔

(۲) وَرَجُلٌ تَعَلَّمَ الْعِلْمَ وَعَلَّمَهٗ وَقَرَاَ الْقُرْاٰنَ فَاُتِیَ بِهٖ
فَعَرَّفَهٗ نِعَمَهٗ فَعَرَفَهَا قَالَ فَمَا عَمِلْتَ فِیْهَا؛ قَالَ
تَعَلَّمْتُ الْعِلْمَ وَعَلَّمْتُهٗ وَقَرَاْتُ فِیْكَ الْقُرْاٰنَ قَالَ
كَذَبْتَ وَلٰكِنَّكَ تَعَلَّمْتَ الْعِلْمَ لِیُقَالَ اِنَّكَ عَالِمٌ وَقَرَاْتَ
الْقُرْاٰنَ لِیُقَالَ قَارِیٌٔ فَقَدْ قِیْلَ ثُمَّ اُمِرَ بِهٖ فَسُحِبَ
عَلٰی وَجْهِهٖ حَتّٰی اُلْقِیَ فِی النَّارِ۔

(۳) وَرَجُلٌ وَسَّعَ اللّٰهُ عَلَیْهِ وَاَعْطَاهُ مِنْ اَصْنَافِ الْمَالِ كُلِّهٖ
فَاُتِیَ بِهٖ فَعَرَّفَهٗ نِعَمَهٗ فَعَرَفَهَا قَالَ فَمَا عَمِلْتَ فِیْهَا؛
قَالَ مَا تَرَكْتُ مِنْ سَبِیْلٍ تُحِبُّ اَنْ یُّنْفَقَ فِیْهَا اِلَّا اَنْفَقْتُ
فِیْهَا لَكَ قَالَ كَذَبْتَ وَلٰكِنَّكَ فَعَلْتَ لِیُقَالَ هُوَ جَوَادٌ
فَقَدْ قِیْلَ ثُمَّ اُمِرَ بِهٖ فَسُحِبَ عَلٰی وَجْهِهٖ ثُمَّ اُلْقِیَ فِی
النَّارِ۔ (مسلم عن ابی ہریرہ کتاب الامارۃ ترمذی ابواب الزھد)

193. ఈ దిగువ ముగ్గురు వ్యక్తులకు వ్యతిరేకంగా ప్రళయం రోజున తీర్పు ఇవ్వడం జరుగుతుంది అని దైవప్రవక్త (స) ప్రవచించగా నేను విన్నానని హజ్రత్ అబూహురైరా(రజిఅన్) ఉల్లేఖిస్తున్నారు.

1. ఓ షహీద్ (యుద్ధంలో అమరగతినొందిన శూరుడు)ను అల్లాహ్ సమక్షంలో హాజరుపర్చగా అల్లాహ్ తాను అతడికి ప్రసాదించిన వరాల గురించి గుర్తుచేస్తాడు. అతడు, (దేవుడు తనకు ప్రసాదించిన వరాలను, శక్తిని, ధైర్యసాహసాలను గురించి) ఒప్పుకొనగా అల్లాహ్ మరి ఈ వరాలను ఎలా సద్వినియోగం చేశావు అని ప్రశ్నిస్తాడు. దానికి ఆ షహీద్, ప్రభూ! నేను నీ మార్గంలో పోరాడుతూ నా ప్రాణాలను సైతం అర్పించి షహీద్‌నయ్యాను అని పలుకుతాడు. కాదు, నీవు అసత్యమాడుతున్నావు. ప్రజల్లో శూరుడు, పరాక్రమవంతుడుగా కీర్తించబడాలనే ఉద్ధేశ్యంతో (అంటే అసత్యానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో నన్ను మెప్పించ డానికి కాకుండా నీ కీర్తి కండూతిని కాంక్షిస్తూ) పాల్గొన్నావు, కాబట్టి నీకు శూరుడు, ధీరుడు అనే బిరుదు లభించింది అక్కడ అని అంటాడు. ఆ తరువాత అల్లాహ్, "వీడిని బోర్లా పడేసి ఈడ్చుకుంటూ వెళ్ళి నరకంలో పడేయండని" (దైవదూతల్ని) ఆజ్ఞాపిస్తాడు. చివరికి అతడు నరకంలో పారవేయబడతాడు.

2. (దైవ సాన్నిధ్యానికి) ధార్మిక జ్ఞానాన్ని ఆర్జించి దాన్ని ఇతరులకు బోధించేవాడు, దివ్యగ్రంథాన్ని పఠించేవాడూ అయిన ఓ 'ఆలిం' (పండితుడు)ను గొనిరావడం జరుగుతుంది. అల్లాహ్ తనకు ప్రసాదించిన వరాలను గురించి గుర్తుచేయగా, అవును (ఇహలోకంలో ధార్మిక విద్య నార్జించి దాన్ని బోధించే వనరులన్నింటిని సమకూర్చినట్లుగా) అతడొప్పు కుంటాడు, అప్పుడు దేవుడు, మరి నీకొసగిన ఈ వరాలన్నింటిని నీవెలా కృతజ్ఞత చూపావు? అని ప్రశ్నిస్తాడు. "ప్రభూ నేను సముపార్జించిన ఈ ధర్మజ్ఞానం, చేసిన బోధ, పారాయణం చేసిన దివ్యఖుర్‌ఆన్ అంటూ, కేవలం నీ ప్రసన్నత పొందడానికే అని విన్నవించుకుంటాడు. దానికి దేవుడు, కాదు! నీవు అబద్ధమాడుతున్నావు. అసలు విషయం ఏమిటంటే నీవో గొప్ప ఆలిమ్‌గా పేరుగాంచాలి అనే ఉద్దేశ్యంతోనే ధార్మిక జ్ఞానాన్ని

పొందావు, ఖుర్ఆన్‌ను పఠించింది ప్రజలు నిన్ను 'ఖారి' అని పిలువాలనే ఉద్దేశ్యంతోనే. కాబట్టి నీకు పేరు వచ్చేసింది. (ప్రజలు నిన్ను ఆలిమ్‌గా పొగిడారు, ఖారీగా కీర్తించారు. నీ వాంఛ ఈడేరింది). ఆ తరువాత దేవుని ఆదేశం మేరకు అతణ్ణి బోర్లా పడేసి ఈడుస్తూ నరకంలో బడవేయడం జరుగుతుంది.

3. ఓ (గొప్ప సంపన్నుడైన) వ్యక్తిని దైవసన్నిధిలోనికి తీసుకొని రావడం జరుగుతుంది. దేవుడు ఆ వ్యక్తికి ఎంతో సంపద నొసగి ఉన్నాడు. ఆయన తాను ప్రసాదించిన వరాలన్నింటిని ఒక్కటొక్కటి లెక్కించి గుర్తుచేస్తాడు. వాడు వాటన్నింటిని ఒప్పుకుంటాడు. అప్పుడు అల్లాహ్, నా ఈ అనేక వరాలను నీవెలా గౌరవించావు అని అడగ్గా, ప్రభూ! నీవు కోరినట్లుగానే నీ సంతోషం బడయడానికి దాన్ని వెచ్చించాను. (అంటే దానధర్మాలు చేయడంలో ఎలాంటి సందిగ్ధం లేకుండా ఆ ధనాన్ని పేదసాదలకు పంచిపెట్టాను) అంటాడు. అప్పుడు దేవుడు, కాదు. నీవు చెప్పేది అబద్ధం. అసలు విషయం ఏమిటంటే నీవో గొప్ప దాతగా పేరుపొందాలనే ఉద్దేశ్యంతో (నీ ఇష్టప్రకారం) ఇలా చేశావు. కాబట్టి నిన్ను మహాదాతగా చెప్పడం జరిగింది. ఆ తరువాత అల్లాహ్ ఇలా ఆదేశిస్తాడు. "ఈ (మహాదాతను) బోర్లా పడేసి ఈడ్చుకువెళ్ళండి. నరకంలో బడ వేయండి" అని. (దైవదూతలు దేవుని ఆదేశాలను వెంటనే శిరసా వహిస్తారు) (అబూహురైరా(రజిఅన్)– ముస్లిమ్, తిర్మిజీ)

**సంగ్రహణం:**

అంటే అల్లాహ్ దృష్టిలో, ఆయన సంతోషం బడయడానికి ఆచరించే కార్యాలే స్వీకరించబడేవి. ఇక కీర్తి కండూతి కోసం, గొప్పవాణ్ణనిపించుకోవాలి అనే ఉద్దేశ్యంతో చేసే సత్కార్యాలన్నీ వృధా అయిపోయేవే. వాటికి ఎలాంటి పుణ్యఫలం లభించదు సరికదా, భయంకరశిక్షకు గురవుతాడు ఆ వ్యక్తి. షహీద్, ఆలిం, దాతలకు చిత్తశుద్ధి లేకపోతే వారిని బోర్లాపడేసి ఈడ్చి నరకకూపంలో బడవేయడం ఖాయం. చిత్తశుద్ధి అంటే కేవలం దైవసంతుష్టి కోసం చేసే కర్మలు మాత్రమే.

# దైవధర్మవ్యాప్తిలో ఎదురయ్యే అడ్డంకుల్ని అధిగమించడం

(١٩٤) كَانَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَعْرِضُ نَفْسَهُ بِالْمَوْقِفِ فَقَالَ أَلَا رَجُلٌ يَحْمِلُنِي إِلَى قَوْمِهِ؟ فَإِنَّ قُرَيْشًا قَدْ مَنَعُونِي أَنْ أُبَلِّغَ كَلَامَ رَبِّي۔ (ترمذی عن جابر بن عبداللہ ابواب فضائل القرآن)

194. దైవప్రవక్త(స) 'హజ్' జరిగే కాలంలో స్వయంగా (అరేబియాకు చెందిన) తెగల వారి వద్దకు వెళ్ళి "ఖురైషీయులు నన్ను దైవవాణి వినిపించకుండా అడ్డుకున్నారు. మీలో ఎవరైనా నన్ను మీ జాతి వద్దకు చేర్చడానికి సిద్ధమేనా?" అని అడిగేవారు. (జాబిర్ బిన్ అబ్దుల్లా(రజిఅన్)– తిర్మిజీ)

**సంగ్రహణం:**

తమ బాబాయి అయిన అబూతాలిబ్ మరణానంతరం, దైవ ప్రవక్త(స) 'సకీఫ్' తెగవారికి ధర్మబోధ చేయడానికి, వారి మద్దత్తు పొందడానికి 'తాయెఫ్' అనే ప్రదేశానికి వెడతారు. అక్కడ 'సకీఫ్' తెగకు చెందిన సర్దారులు ఆయన్ను ప్రోత్సహించకపోగా గేలి చేసి కించపరిచారు. ఆ తెగలోని పోకిరి కుర్రాళ్ళు ఆయన్ను గాయపరిచి రక్తసిక్తం చేశారు. తాయెఫ్ నుండి తిరిగి వచ్చిన తరువాత, హజ్ ఆరాధన కోసం వచ్చిన దాదాపు అన్ని తెగలవారి దగ్గరకు వెళ్ళి ఆయా తెగల సర్దారులతో, "నేను మిమ్మల్ని నామాట దేనిని వినమని బలవంతపెట్టను. నాకు మీ దగ్గర శరణు ఇవ్వండి. దౌర్జన్యపరులు నన్ను హింసించకుండా ఆపండి. దేవుని దాసులకు నా దేవుని సందేశం వినిపించవీలిప్పిస్తే అంతేచాలు" అని అడిగారు. అయినా ఎవ్వరూ దీన్ని ఒప్పుకోలేదు. పైగా ఎంతో కఠినంగా ఆయన మాటల్ని త్రోసి పుచ్చుతూ, మనిషిని అతని జాతే బాగా ఎరుగు అని నిరాకరించారు. చివరకు 'రజబ్' నెలలో మదీనా అన్సారులకు చెందిన ఓ ప్రతినిధి బృందం దైవప్రవక్తను సందర్శించి ఇస్లామ్‌ధర్మాన్ని స్వీకరించి ఆయనకు తన మద్దతునిచ్చే మాటపై ప్రమాణం చేసింది.

అల్లాహ్ ధర్మాన్ని భువిపై స్థాపించి వ్యాప్తిచేయడం అంత సులువైన పనికాదు. ఈ లక్ష్యాన్ని పొందడానికి విశ్వాసపాత్రులైన దైవదాసులు

రకరకాలుగా హేళనకు, తిట్లకు, శాపనార్థాలకు గురికావలసి ఉంటుంది. అలాగే శారీరకంగా మానసికంగా బాధలను అనుభవించాల్సి ఉంటుంది. నలువైపుల నుండి సహాయనిరాకరణ ఘోష వినవస్తుంది. అయితే అల్లాహ్ ప్రేమాభిమానంలో తేలియాడే దైవదాసులు అసత్యం ముందు తమ ఓటమిని అంగీకరించరు. తమకు వ్యతిరేకంగా ఉన్న పరిస్థితుల్లో సయితం దైవధర్మాన్ని వీడరు. నిరాశానిస్పృహలకూ గురికారు.

ఎదుటివారి ఒత్తిడికి గురై, ధైర్యం వీడి మిన్నకుండా కూర్చోరు. కాగా సహనంతో, చిత్తశుద్ధితో సతతం కష్టపడుతూనే ఉంటారు. చివరికి అల్లాహ్ కారుణ్యం అనుకోకుండా వారిని విజయానికి చేరువచేస్తుంది.

## ప్రపంచ పూజారులైన ధర్మవేత్తలు

(۱۹۵) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنْ تَعَلَّمَ عِلْمًا لِغَيْرِ اللّٰهِ
اَوْ اَرَادَ بِهٖ غَيْرَ اللّٰهِ فَلْيَتَبَوَّأْ مَقْعَدَهٗ مِنَ النَّارِ۔

(ترمذی عن ابن عمر ابواب العلم)

195. "ధార్మిక జ్ఞానాన్ని దైవేతరులకోసం ఆర్జించేవాడు నరకంలో ఉన్న తన గృహంలో నివసించడానికి సిద్ధంగా ఉండాలి" అని దైవప్రవక్త(స) నుడివారు. (ఇబ్నెఉమర్ (రజిఅన్)- తిర్మిజీ)

(۱۹۶) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ تَعَلَّمَ عِلْمًا مِمَّا
يُبْتَغٰى بِهٖ وَجْهُ اللّٰهِ لَا يَتَعَلَّمُهٗ اِلَّا لِيُصِيْبَ بِهٖ عَرَضًا مِنَ
الدُّنْيَا لَمْ يَجِدْ عَرْفَ الْجَنَّةِ يَوْمَ الْقِيَامَةِ يَعْنِيْ رِيْحَهَا۔

(ابو داؤد عن ابی ہریرۃ کتاب العلم)

196. అంతిమ దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "అల్లాహ్ సంతుష్టికోసం ఆర్జించే (ఖుర్ఆన్, సున్నత్‌ల) జ్ఞానాన్ని, ధనార్జనకోసం ఆర్జించేవాడు ప్రళయదినాన స్వర్గసుగంధానికి కూడా నోచుకోడు."

(అబూ హురైరా (రజిఅన్)- అబూదావూద్)

**సంగ్రహణం:**

'ధార్మిక విద్య' అంటే దివ్యగ్రంథమయిన ఖుర్ఆన్ మరియు దైవప్రవక్త(స) సంప్రదాయ జ్ఞానం. దీన్ని ఆర్జించడానికి గల ఉద్దేశ్యం, మనిషి తన ఉనికిని, ఈ ప్రపంచంలో జీవితాన్ని గడిపే రుజుమార్గాన్ని తెలుసుకోవడం. ఇలాగే తన ఆచరణ ద్వారా తన ప్రభువు సంతుష్టిని బడయడానికి ఆ మార్గంపై నడవడం. తన వ్యక్తిగత మరియు సామూహిక వ్యవహారాల్లో ఆ జ్ఞానం ద్వారా మార్గదర్శకత్వం పొంది పరలోకంలో విజయం సాధించడం.

ఆ మహోన్నత లక్ష్యసాధనకోసమే దైవగ్రంథం మరియు సున్నత్ (ప్రవక్త ఆచరణ) జ్ఞానాన్ని ఆర్జించేది. కాని ఏ అవివేకి అయినా తన స్వంత గౌరవంకోసం లేదా ధనార్జనకోసం ఈ జ్ఞానాన్ని ఆర్జిస్తాడో లేదా భౌతిక ప్రయోజనాలు పొందే నైపుణ్యం సాధిస్తాడో అతడు 'ఆలిమెదీన్' (ధర్మవేత్త) కాజాలడు. పైగా అతడు ఓ దోపిడిదారే కాదు అల్లాహ్ శిక్షకు పాత్రుడు కూడాను. ఓ విధంగా ధర్మంపేరు చెప్పుకొని స్వార్థానికి దాసుడౌతున్నట్లే. ఈ మహానేరం పర్యవసానంగా అతడు స్వర్గం సుగంధాన్ని ఆస్వాదించక పోగా నరకకూపంలో పడిపోవడం ఖాయం.

## కపట ధర్మవేత్తల జోరు

(۱۹۷) رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اِنَّ اَكْثَرَ مُنَافِقِيْ
اُمَّتِيْ قُرَّاءُهَا۔ (مسند احمد عن عبد اللہ بن عمرو نمبر ۶۶۳۳)

197. "నా ఉమ్మత్ (సమాజం)లోని మునాఫిక్‌ల (కపటుల) అధికభాగం ఖుర్ఆన్ పారాయణం చేసేది" అని దైవప్రవక్త ప్రవచించారు.
(అబ్దుల్లా బిన్ అమ్రూ(రజిఅన్)- ముస్నదె అహ్మద్)

**సంగ్రహణం:**

దైవగ్రంథం అయిన దివ్యఖుర్ఆన్‌ను పఠించేది పుణ్యఫలాన్ని అధికంగా పొందాలని, దాని ఆదేశాల్ని మార్గదర్శకంగా తీసుకొని అనుసరించాలనే. ఇదే దివ్యగ్రంథ పారాయణం యొక్క సక్రమమైన తీరు. అలాకాక దివ్యఖుర్ఆన్‌ను ఎంతో మేలైన రీతిలో పారాయణం చేస్తూ, ప్రపంచ వ్యవహారాల్లో దాన్నుండి మార్గదర్శకం పొందనివాడు, సతతం పతనంలో నిమగ్నమై అందు ఇవ్వబడ్డ ఆదేశాలను శిరసావహించక పైపెచ్చు పెద్దపెద్ద పాపాలకు పాల్పడేవాడు కపటి లేదా మునాఫిక్ కాక మరేమవుతాడు?

ఇలాగే సతతం దైవధ్యానంలో, అదనపు ఆరాధనల్లో నిమగ్నంగా ఉంటూ తన సామాజిక వ్యవహారాల్లోను, ఇచ్చిపుచ్చుకోవడాల్లోను, వర్తక వ్యాపారాలు, నైతికతల్లోను,

దివ్యఖుర్ఆన్ చూపే నీతినియమాలను ఉల్లంఘించే 'సూఫీ' కూడా మునాఫిక్ (కపటి) అనడంలో సందేహంలేదు. మహాప్రవక్త(స), తమ సమాజంలోనే చాలా మంది ధర్మవేత్తలను, వారు ప్రజలకు ఏ ధర్మాన్నైతే బోధిస్తున్నారో దానిపై స్వయంగా అమలు చేయకపోవడం వల్ల మునాఫిక్‌లు (కపటులు)గా ఖరారు చేయడం జరిగింది.

ఇంకా ఈ హదీసు ద్వారా తెలుస్తున్న మరోవిషయం ఏమిటంటే, అల్పసంఖ్యలో ఉన్న దర్మవేత్తలు ఈ నిఫాఖ్‌కు (కాపట్యానికి) ఎంతో ఎడంగా ఉంటూ దైవప్రవక్త(స) వారసత్వ హక్కును ఎంతో బాధ్యతతో నిర్వర్తిస్తోంది. వీరి సంఖ్య నిజానికి చాలా తక్కువే. అయినా ప్రతికాలంలోను తమ బాధ్యతను గుర్తెరిగి నడవడం, ముస్లిం సమాజంపై ఓవిధంగా అల్లాహ్ కరుణాకటాక్షాలే అని అనాలి. ప్రస్తుత కాలంలోను వారు తమ విధులను, బాధ్యతలను సక్రమరీతిలో నిర్వహిస్తూ అల్లాహ్ చూపిన ధర్మాన్ని వ్యాప్తి చేయడానికి కృషి చేస్తున్నారు. ఖుర్ఆన్, సున్నత్‌లపై తమ సర్వస్వం ధారపోసే వీరిపై అల్లాహ్ కారుణ్యం వర్షిస్తుంది. దైవదూతలు వారి మన్నింపుకోసం వేడుకుంటూ వుంటారు.

## సమాజ సంస్కరణ, ధర్మప్రచార కార్యం

(١٩٨) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِعَلِيٍّ فَوَاللّٰهِ لَاَنْ يَّهْدِىَ اللّٰهُ
بِكَ رَجُلًا وَّاحِدًا خَيْرٌ لَّكَ مِنْ اَنْ يَّكُوْنَ لَكَ حُمْرُ النَّعَمِ

(بخاری عن سہل بن سعد کتاب المغازی مسلم کتاب فضائل الصحابۃ)

198. హజ్రత్ అలి(రజిఅన్)కు దైవప్రవక్త(స)గారి ఉపదేశం: "దైవసాక్షి! అల్లాహ్ నీ ద్వారా ఒక్కడికైనా రుజుమార్గంపై నడిచే భాగ్యం కలుగచేస్తే అది నీకు ఎరుపురంగు ఒంటెలు లభించే దానికంటే మేలైన విషయం." (సహెల్ బిన్ సఅద్(రజిఅన్)- బుకారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

అరేబియాలో ఎరుపురంగు ఒంటెలు ఓ గొప్ప ఆస్తిగా పరిగణించబడేవి. మహా ప్రవక్త(స)గారి ఉపదేశంలోని భావం ఏమిటంటే, విజయానంతరం విజయధనం నుండి విలువైన ఒంటెలు నీకు లభిస్తే నీవు సంబరపడిపోతావు. నీ ఆస్తిలో వృద్ధి అయిందని ఆనందిస్తావు. కాని నీ కృషి వల్ల ఏ ఒక్క వ్యక్తి అయినా రుజుమార్గాన్ని అవలంబించి, అల్లాహ్ అతణ్ణి ఇస్లామ్ ధర్మం ప్రకారం నడుచుకునే వీలు కలిపిస్తే చాలు ప్రళయదినాన నీ ఈ కృషి ఫలితంగా అల్లాహ్ ఒసిగే అమూల్యమైన బహుమతి ముందు విజయధనం నుండి నీకు లభ్యమైన మేలైన ఒంటెల విలువకు సంబంధమే ఉండదు. పరలోకంలో లభించే ఆ ప్రతిఫలం ముందు ఈ ఒంటెల విలువ దిగదుడుపే.

ఈ ఉపదేశం ప్రకారం, మోమిన్ యొక్క అసలు లక్ష్యం, ధ్యేయం, మార్గభ్రష్టులైన వారిని సంస్కరించడం, చెడిపోయిన వారిని సన్మార్గంపైకి తెచ్చే ప్రయత్నం చేయడం అన్నదే. ఈ కృషి ఫలితంగా ఎవరైనా ముస్లిమ్ (దైవ విధేయుడు)గా మారితే, అతడు అల్లాహ్ ఆదేశాలకు అనుగుణంగా నడుచుకుంటే దానికి మహోన్నతమైన సత్ఫలితాన్ని పొందగలడు.

(۱۹۹) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ مَنْ دَعَا اِلٰی ھُدًی کَانَ لَہٗ مِنَ الْاَجْرِ مِثْلُ اُجُوْرِ مَنْ تَبِعَہٗ لَا یَنْقُصُ ذٰلِکَ مِنْ اُجُوْرِھِمْ شَیْئًا وَمَنْ دَعَا اِلٰی ضَلَالَۃٍ کَانَ عَلَیْہِ مِنَ الْاِثْمِ مِثْلُ اٰثَامِ مَنْ تَبِعَہٗ لَا یَنْقُصُ ذٰلِکَ مِنْ اٰثَامِھِمْ شَیْئًا۔

(مسلم عن ابی ہریرۃ کتاب العلم ترمذی ابواب العلم)

199. మహాప్రవక్త(స) ప్రవచన సారాంశం: "ఓ వ్యక్తి (ప్రజల్ని) సన్మార్గంవైపుకు పిలిచినప్పుడు (ఆ ఆహ్వానం మేరకు వారు అతణ్ణి అనుసరించి సన్మార్గగాములైతే) వారికి లభించే పుణ్యఫలంలో ఎలాంటి లోటు రాకుండా వారందరి పుణ్యఫలానికి సమానమైన పుణ్యఫలం ఆ మార్గం వైపుకు పిలిచే వానికి లభిస్తుంది. (అలాగే ప్రజల్ని) దుర్మార్గం వైపుకు పిలిచినప్పుడు వారు దాన్ని అనుసరిస్తే వారికి లభించే పాపాల్లో ఎలాంటి లోటు రాకుండా వారందరి పాప భారమంతా అతడు మోయవలసి ఉంటుంది." (అబూహురైరా(రజిఅన్)- ముస్లిమ్, తిర్మిజి)

**సంగ్రహణం:**

సన్మార్గమంటే జీవితం గడపడానికి అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తలు చూపిన రుజుమార్గం అని అర్థం. అంటే, మీరు బ్రతికున్నంతకాలం దేవునికి విధేయులై, ఆయన చట్టాలకు అనుగుణంగా జీవితం గడపండని, ఆయన తన దాసులకోసం ఏ జీవన వ్యవస్థ లేదా మార్గాన్నైతే (ఖుర్ఆన్) అవతరింపజేశాడో దాన్నే అనుసరించండని భావం.

ఏ వ్యక్తి లేదా సమాజం ఈ పిలుపును సొంతం చేసుకొని ఉద్యమిస్తాడో ఆ వ్యక్తి లేదా సమాజం అల్లాహ్‌కు ప్రతినిధి. ఆయనకు దగ్గరివాడు. ఇలా ఆయన మార్గం వైపుకు పిలిచే వారికి అల్లాహ్ ఎంతో ఉత్తమమైన ప్రతిఫలాన్నిస్తాడు. అతని స్థాయి ఎంతో ఉన్నతమవుతుంది. సత్యధర్మం వైపుకు పిలిచే వాని కృషివల్ల సత్యమార్గాన్ని అనుసరించే వారందరూ ఉన్నతమైన పుణ్యఫలానికి అర్హులవుతారు. కాని పిలిచే వానికి మాత్రం వారం

దరి పుణ్యఫలానికి సమానమైన పుణ్యఫలం లభిస్తుంది. ఆ పిలుపును స్వీకరించినవారికి లభించే ఆ బహుమానాలనుండి మాత్రం తగ్గించడం జరుగదు. ఇది అల్లాహ్ అతని కృషికి అదనంగా ఇచ్చే ప్రతిఫలం.

దైవధిక్కారం, దుర్మార్గం వైపుకు ఆహ్వానించే వానికి దాన్ని అనుసరించే వారికి అచ్చం ఇలాంటి పరిస్థితే ఎదురవుతుంది. అల్లాహ్ మార్గాన్ని విడనాడేందుకు లేదా దైవధిక్కారం వైపుకు ఆహ్వానించి దైవదాసులను సన్మార్గంనుండి మళ్ళించే ప్రయత్నం చేసేవాడు దేవుని దృష్టిలో గొప్ప నేరస్తుడు. ఆయన ఆగ్రహానికి పాత్రుడు. అతడికి తన ఈ దుర్వ్యవహారానికి తగిన శిక్ష ఎలాగూ లభించేదే అయినా, అదనంగా తనను అనుసరించే వారందరి పాపాల శిక్షను కూడా అతడు మోయవలసి ఉంటుంది. కారణం, ఈ ఉద్యమాన్ని కాదని వారు అసత్యపు మార్గాన్ని అవలంబించారు కాబట్టి. ప్రతి మార్గభ్రష్టునికి తన నేరానికి తగిన శిక్ష లభించడం ఖాయం. వారి శిక్షలో మాత్రం ఎలాంటి తగ్గింపు ఉండదు.

## ఉత్తముడెవరు?

(۲۰۰) قِيْلَ يَا رَسُوْلَ اللّٰهِ اَىُّ النَّاسِ اَفْضَلُ؟ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مُؤْمِنٌ يُجَاهِدُ فِىْ سَبِيْلِ اللّٰهِ بِنَفْسِهٖ وَمَالِهٖ۔ (بخاری عن ابی سعید کتاب الجہاد، مسلم کتاب الامارۃ)

200. (ఒకడు మహాప్రవక్తను) దైవప్రవక్తా! అందరికంటే ఉత్తము డైన వాడెవరు? అని అడగగా:

"దైవమార్గంలో తన ప్రాణాలనర్పించి జిహాద్ చేసే మోమిన్" అని సెలవిచ్చారు దైవప్రవక్త(స) *(అబూ సయీద్(రజిఅన్)– బుకారి)*

**సంగ్రహణం:**

అంటే అల్లాహ్ ధర్మప్రాబల్యం కోసం అన్నివిధాల అవిశ్రాంత కృషి సలిపేవాడు దేవుని దృష్టిలో అధిక గౌరవానికి, హోదాకు పాత్రుడయ్యే మోమిన్(విశ్వాసి) మాత్రమే. నిర్విరామ కృషి చేస్తూ, దేవుడు తనకు ఒసగిన ధన సంపదల్ని ఈ మార్గంలో వెచ్చించే వాడు, తన శారీరక శక్తుల్ని బుద్ధికుశలతను ఈ కార్యంకోసం వినియోగించేవాడు; ఈ ధర్మప్రాబల్యం కోసం ప్రాణాలర్పించవలసిన సమయమాసన్నమైతే, దైవమార్గంలో తన తలనైనా ఇచ్చేసి అల్లాహ్ సంతృప్తిని బడయడానికి వెనకాడనివాడు అని అర్థం.

## దుష్టపాలకులకు వ్యతిరేకంగా జిహాద్

(٢٠١) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَا مِنْ نَبِيٍّ بَعَثَهُ اللّٰهُ
تَعَالٰى فِيْ اُمَّةٍ قَبْلِيْ اِلَّا كَانَ لَهٗ مِنْ اُمَّتِهٖ حَوَارِيُّوْنَ وَاَصْحَابٌ
يَأْخُذُوْنَ بِسُنَّتِهٖ وَيَقْتَدُوْنَ بِاَمْرِهٖ ثُمَّ اِنَّهَا تَخْلُفُ مِنْ بَعْدِهِمْ
خُلُوْفٌ يَقُوْلُوْنَ مَا لَا يَفْعَلُوْنَ وَيَفْعَلُوْنَ مَا لَا يُؤْمَرُوْنَ فَمَنْ
جَاهَدَهُمْ بِيَدِهٖ فَهُوَ مُؤْمِنٌ وَمَنْ جَاهَدَهُمْ بِلِسَانِهٖ فَهُوَ
مُؤْمِنٌ وَمَنْ جَاهَدَهُمْ بِقَلْبِهٖ فَهُوَ مُؤْمِنٌ وَلَيْسَ وَرَاءَ ذٰلِكَ
مِنَ الْاِيْمَانِ حَبَّةُ خَرْدَلٍ۔ (مسلم عن عبداللہ بن مسعود کتاب الایمان)

201. దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "నాకు పూర్వం దేవుడు ఏ ప్రవక్తనయితే పంపించాడో, ఆ ప్రవక్త అనుయాయులు, ఆయనకు సహాయసహకారాలందించేవారు, ఆయన చూపిన బాటపైనే నడిచి ఆయన ఆదేశాలను పాటించడంలో వెనుకాడలేదు. తరువాత వారి స్థానాన్ని దుష్టులు ఆక్రమించారు. వారు తాము స్వయంగా చెప్పిన మాటలపైన్నే నిలిచి ఆచరించేవారు కాదు. పైగా దేవుడుగాని, దైవప్రవక్త గాని ఆదేశించని విషయాల్లో నిండా మునిగిపోయారు. వారికి వ్యతిరేకంగా ఎవరైతే చేత్తో జిహాద్ చేస్తాడో అతడు మోమిన్. మరెవరైతే తన నోటిద్వారా (కలం ద్వారా కూడా) జిహాద్ చేస్తాడో అతడూ మోమినే. ఇంకా తన మనస్సులో వారికి వ్యతిరేకతను చూపి ఏవగించుకుంటాడో అతడు కూడా మోమిన్. మరెవరైతే వారి గురించి తన మనస్సులో ఏమాత్రం అసహ్యత ఏవగింపు కలిగి ఉండడో అతని వద్ద ఆవగింజంతైనా విశ్వాసం లేదు అని భావించండి." (అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజిఅన్)– ముస్లిమ్)

**సంగ్రహణం:**

ముస్లిమ్ సమాజంలోని దుష్టపాలకులకు ఉండే అవలక్షణాలు ఈ రెండు విధాలుగా ఉంటాయి.

1. నోటిమాటగా ఇస్లామ్ ధర్మఔన్నత్యాన్ని పొగుడుతారు, దాన్ని బలపరుస్తారు

కూడా. కాని వారి వ్యక్తిగత జీవితంలోను, సామూహిక జీవితంలోను, రాజకీయ కార్య కలాపాల్లోను ఇస్లామీయ లక్షణం మచ్చుకైనా అగుపడదు.

2. తమ అధికార హయాంలో వారు చేసే చట్టాల్లో దేవుడు, దైవప్రవక్త ఆదేశాలకు విరుద్ధమైన ఆదేశాలే కనబడతాయి. ఈ విషయంలో వారు తమ మనోవాంఛలకే బానిసలై ఉంటారు.

మార్గభ్రష్టులైన ఇలాంటి పాలకులకు వ్యతిరేకంగా జిహాద్ చేయడం ప్రతి ముస్లిమ్ విధి. వారి విశ్వాసం వారి నుండి కోరేది అదే. ఆ దుష్టపాలకులకు వ్యతిరేకంగా శక్తి నుపయోగించడమంటే రాజ్యాంగం లేదా చట్టం పరిధిలో ఉంటూ సక్రమరీతిలో విప్లవాన్ని తీసుకురావడం. వారిని అధికార పీఠంనుండి దింపి పరిపాలనా వ్యవస్థను దైవభీతిగల వ్యక్తులకు అందజేయడం అని అర్థం.

ఇది సాధ్యం కాని పక్షంలో నోటిద్వారా, కలం ద్వారా వారి తప్పుల్ని ఎత్తిచూపాలి. అయితే వ్యంగ్య ధోరణి అవలంబించడం లేదా వారిని కించపరిచే ఉద్దేశ్యంతో విమర్శిం చడం కాకుండా వారిని సన్మార్గంపైకి తెచ్చే ఉద్దేశ్యంతో, సుహృద్భావంతో వారి తప్పుల్ని వారి ముందుంచాలి. వారికి సరైన సలహాలిచ్చి సహకరించాలి. ఎంతో మృదువుగా, నచ్చ జెబుతూ ఖుర్‌ఆన్‌సున్నత్ బోధనల్ని వారి ముందుంచి, ఇస్లామ్ వ్యతిరేక కార్యకలా పాలేమిటో వారి దృష్టికి తీసుకురావాలి.

ఇక విశ్వాసం యొక్క చివరి బలహీనమైన దశ ఏదంటే బాహాటంగా పాపకార్యాల్లో మునిగిపోయిన పాలకులకు వ్యతిరేకంగా ఓ అసహ్యాన్ని, ఏవగింపును మనస్సులో కలిగి ఉండడం. ఇస్లామేతర వ్యవస్థకు దుష్టపాలకులకు వ్యతిరేకంగా హృదయంలో ఎలాంటి ఏవగింపు, బాధ పొడసూపకపోతే ఆ హృదయంలో ఆవగింజంతైనా విశ్వాసం లేదనే చెప్పాలి.

## సర్వోత్తమమైన జిహాద్

(۲۰۲) اِنَّ رَجُلاً سَأَلَ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ وَقَدْ وَضَعَ رِجْلَہٗ فِی الْغَرْزِ اَیُّ الْجِھَادِ اَفْضَلُ؟ قَالَ کَلِمَۃُ حَقٍّ عِنْدَ سُلْطَانٍ جَائِرٍ۔

(نسائی عن طارق بن شہاب کتاب البیعۃ)

202. (ఎక్కడికో వెళ్ళడానికి సిద్ధమై తన కాలును రికాబులో ఉంచి గుర్రం ఎక్కబోతుండగా) ఓ వ్యక్తి దైవప్రవక్త(స)ను "ఏ జిహాద్ సర్వోత్తమ మైన జిహాద్?" అని ప్రశ్నించగా ఆయన, "కఠినాత్ముడైన దుష్టపాలకుని

ఎదుట సత్యాన్ని బాహాటంగా చెప్పివేయటం" అని సెలవిచ్చారు.

(తారిక్ బిన్ షహాబ్ (రజిఅన్)- నిసాయి)

**సంగ్రహణం:**

కారణం ఏమిటంటే, తన ఆస్తిపాస్తులకు, తన ప్రాణానికి ముప్పుదాపురిస్తుంది అని తెలిసిన ఏ వ్యక్తీ ఆ దుష్టపాలకుని ఎదుట యదార్థాన్ని పలికే సాహసం చేయలేదు గనుక.

## విజయుడు లేదా షహీద్ (అమరుడు)

(۲۰۳) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ تَكَفَّلَ اللّٰهُ لِمَنْ جَاهَدَ فِىْ سَبِيْلِهٖ ـــــ لَا يُخْرِجُهٗ اِلَّا الْجِهَادُ فِىْ سَبِيْلِهٖ وَتَصْدِيْقُ كَلِمَاتِهٖ ـــــ بِاَنْ يُّدْخِلَهُ الْجَنَّةَ اَوْ يَرْجِعَهٗ اِلٰى مَسْكَنِهِ الَّذِىْ خَرَجَ مِنْهُ مَعَ مَا نَالَ مِنْ اَجْرٍ اَوْ غَنِيْمَةٍ -

(بخاری عن ابی ہریرہ کتاب التوحید)

203. మహాప్రవక్త ముహమ్మద్(స)గారి ప్రవచనం ఇలా ఉంది. "ఏ వ్యక్తి అయితే దైవమార్గంలో 'జిహాద్' (ధర్మయుద్ధం) చేస్తాడో- దైవ మార్గంలో జిహాద్ చేసే, ఆయన వచనాలను ధృవపరిచే ఉద్దేశ్యం తప్ప మరే విషయం అతడిని ఇల్లు బయలుదేరనివ్వదు- అలాంటి వ్యక్తికి (అతడు అమరగతి నొందితే) అల్లాహ్ స్వర్గంలో ప్రవేశింపజేస్తాడు లేదా అతడికి విజయ ధనం మరియు పుణ్యఫలాలతో ఇంటికి చేర్చే బాధ్యత తీసుకుంటాడు.

(అబూ హురైరా (రజిఅన్)- బుకారి)

**సంగ్రహణం:**

ఆయన వచనాలను ధృవపర్చడం అంటే, దివ్యఖుర్ఆన్‌లో 'షహీద్' అయ్యేవారి గురించి అల్లాహ్ చేసిన వాగ్దానాలు, శుభవార్తలు అన్నమాట. అల్లాహ్ మార్గంలో జిహాద్ చేయడం అనేదానికి విస్తారమైన భావం ఉంది. అయితే ఈ హదీసులో కేవలం దైవధర్మోన్నతి కోసం, దాని ప్రాబల్యం పెంచడం కోసం లేదా దైవధిక్కార ప్రభుత్వపు మోసపూరితమైన దాడిని ఎదుర్కొనేందుకు జరిగే యుద్ధం గురించి చెప్పడం జరిగింది. ముస్లిమ్ సైనికులు తమకు విజయం చేకూరినప్పుడు లేదా ప్రాబల్యం లభించినప్పుడు యుద్ధసొత్తుతో పాటు అల్లాహ్ వద్ద గొప్ప పుణ్యఫలం పొందుతారు. లేదా అమరగతి నొందగానే (షహీద్‌కాగానే) స్వర్గంలో ప్రవేశింపబడతారు.

## దైవప్రవక్త(స)గారి షహీద్ కావాలనే కోరిక

(۲۰۴) اِنَّ اَبَا هُرَيْرَةَ قَالَ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ

يَقُوْلُ ........ وَالَّذِىْ نَفْسِىْ بِيَدِهٖ لَوَدِدْتُ اَنِّىْ اُقْتَلُ فِىْ

سَبِيْلِ اللهِ ثُمَّ اُحْيٰى ثُمَّ اُقْتَلُ ثُمَّ اُحْيٰى ثُمَّ اُقْتَلُ ثُمَّ

اُحْيٰى ثُمَّ اُقْتَلُ۔ (بخاری کتاب الجهاد)

204. దైవప్రవక్త(స) ఇలా అంటూ ఉండగా నేను విన్నానని హజ్రత్ అబూహురైరా(రజి) ఉల్లేఖించారు:

"ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆయన సాక్షి! నా అభీష్టం ఇది: దైవమార్గంలో సంహరించబడడం, తిరిగి బ్రతికించబడడం, (దైవ మార్గంలో) తిరిగి చంపబడడం మళ్ళీ బ్రతికించబడడం; తిరిగి (ఆయన మార్గంలో) షహీద్ అవడం మళ్ళీ బ్రతికించబడడం; ఆ తరువాత (ఆయన మార్గంలో) షహీద్ అయిపోవడం." *(బుకారి)*

**సంగ్రహణం:**

ఆయన(స) దైవమార్గంలో మాటిమాటికి షహీద్ కావాలని కోరు కున్నారు కాబట్టి షహీద్ మరియు షహాదత్ (అమరగతినొందడం) అల్లాహ్ సంతుష్టిబడిసే గొప్ప మార్గం.

## దైవమార్గంలో ప్రాణాలర్పణకు లభించే బహుమానం

(۲۰۵) قَالَ رَجُلٌ لِلنَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَوْمَ اُحُدٍ أَرَأَيْتَ

اِنْ قُتِلْتُ فَأَيْنَ اَنَا ؛ قَالَ فِى الْجَنَّةِ فَأَلْقٰى تَمَرَاتٍ فِىْ يَدِهٖ

ثُمَّ قَاتَلَ حَتّٰى قُتِلَ۔ (بخاری عن جابر بن عبد الله کتاب المغازی مسلم کتاب الامارة)

205. ఉహద్ యుద్ధం (హిజ్రి శకం-3) రోజున ఓ వ్యక్తి దైవ ప్రవక్త(స) తో (ఓ దైవప్రవక్తా!) నేను సంహరించబడితే ఎక్కడికి వెడతానో సెలవిస్తారా అని అడగ్గా, "స్వర్గంలోనికి" అని సమాధానమిచ్చారాయన. (అంటే) అతను వెంటనే తన చేతిలోని ఖర్జూరపు పండ్లను విసిరిపారేస్తూ

మక్కా దైవధిక్కారులతో జరిగే ఆ సమరంలోనికి దూకాడతడు. చివరికి షహీద్ అయ్యాడు. *(జాబిర్ బిన్ అబ్దుల్లా (రజిఅన్)- బుకారి, ముస్లిమ్)*

**సంగ్రహణం:**

ఇస్లామ్ ధర్మోన్నతి కోసం అవసరమైతే యుద్ధం కూడా చేసే అవసరమొస్తుంది; ఈ మార్గంలో ప్రాణాలొడ్డే వారికి స్వర్గప్రవేశం లభిస్తుంది. స్వర్గాన్ని చేరేందుకు ఇది అతి దగ్గరి మార్గం.

(٢٠٥ الف) اِنْطَلَقَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاَصْحَابُهٗ حَتّٰى سَبَقُوا الْمُشْرِكِيْنَ
اِلٰى بَدْرٍ وَجَاءَ الْمُشْرِكُوْنَ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا
يَتَقَدَّمَنَّ اَحَدٌ مِنْكُمْ اِلٰى شَيْءٍ حَتّٰى اَكُوْنَ اَنَا دُوْنَهٗ فَدَنَا الْمُشْرِكُوْنَ
فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قُوْمُوْا اِلٰى جَنَّةٍ عَرْضُهَا السَّمٰوٰتُ
وَالْاَرْضُ قَالَ يَقُوْلُ عُمَيْرُ بْنُ الْحُمَامِ الْاَنْصَارِيُّ يَا رَسُوْلَ
اللّٰهِ، جَنَّةٌ عَرْضُهَا السَّمٰوٰتُ وَالْاَرْضُ قَالَ
نَعَمْ قَالَ بَخٍ بَخٍ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا
يَحْمِلُكَ عَلٰى قَوْلِكَ بَخٍ بَخٍ قَالَ لَا وَاللّٰهِ يَا رَسُوْلَ اللّٰهِ اِلَّا رَجَاءَةَ
اَنْ اَكُوْنَ مِنْ اَهْلِهَا قَالَ فَاَخْرَجَ تُمَيْرَاتٍ مِنْ قَرَنِهٖ فَجَعَلَ
يَاْكُلُ مِنْهُنَّ ثُمَّ قَالَ لَئِنْ اَنَا حَيِيْتُ حَتّٰى اٰكُلَ تَمَرَاتِيْ هٰذِهٖ
اِنَّهَا لَحَيٰوةٌ طَوِيْلَةٌ قَالَ فَرَمٰى بِمَا كَانَ مَعَهٗ مِنَ التَّمْرِ ثُمَّ
قَاتَلَهُمْ حَتّٰى قُتِلَ۔ (مسلم عن انس بن مالک کتاب الامارۃ)

205. దైవప్రవక్త(స), ఆయన అనుచరులు మదీనానుండి వెడలి మక్కా బహుదైవారాధకులకంటే ముందే 'బద్ర్' అనే మైదానంలోకి వెళ్ళి ఆగారు. మక్కాకు చెందిన దైవతిరస్కారులు ఆ మైదానానికి రాగానే దైవప్రవక్త(స) (తమ అనుచరగణాన్నుద్దేశించి) "ఏ విషయంలోనూ మీరు తొందరపడకండి. నేను ప్రారంభిస్తే తప్ప." అని ఆదేశించారు. ఆ తరువాత బహుదైవారాధకులు దగ్గరకు రాగానే.

"భూమ్యాకాశాలంత సువిశాలమైన ఆ స్వర్గాన్ని అందుకోడానికి ముందుకు ఉరకండి" అని పురమాయించారు. హజ్రత్ ఉమైర్ బిన్ హమామ్ అన్సారి అనే ఆయన (ఆశ్చర్యంగా), దైవప్రవక్తా! స్వర్గం భూమ్యాకాశాల్లా సువిశాలమైందా అని అడిగారు. జవాబుగా ఔను అన్నారు దైవప్రవక్త(స). భలే! భలే!! (ఇది ఎంత గొప్పవరం) అన్నారు ఉమైర్ (రజిఅన్). ఏమిటి నీవు 'భలే భలే' అంటున్నావు? (అంటే ఇది నీవు సీరియస్‌గా అంటున్న మాటలా లేదా అనుకోకుండా నీ నోట వెలువడ్డ మాటలా) అని అడిగారు దైవప్రవక్త(స). దానికి ఉమైర్, దైవప్రవక్తా! అల్లాహ్ సాక్షిగా చెబుతున్నాను, నేను ఆ స్వర్గాన్ని పొందాలనే ఆశతో అంటున్న మాటలే తప్ప వేరేకాదు అని అన్నారు.

"అయితే నీవు తప్పకుండా స్వర్గంలో ప్రవేశిస్తావు?" అని బలపరిచారు దైవ ప్రవక్త(స). ఆ తరువాత ఉమైర్ తన అమ్ముల పొదినుండి ఖర్జూరపు పండ్లు తీసి తిననారంభించారు. అలా తింటూ (స్వగతంలో) నేను బ్రతికుంటే ఈ ఖర్జూరపు ఫలాలను తిరిగి తినవచ్చు. (ఇంకా ఆలస్యం దేనికోసం) ఇది తింటూ పోతుంటే నా జీవితకాలం పెరిగిపోతూనే ఉంటుంది. (ఇక ఎందుకు ఎదురు చూడాలి) అని మిగిలిన ఖర్జూరాలను విసిరికొట్టి (యుద్ధ మైదానంలోనికి ఉరికి 'ముష్రిక్'లతో) యుద్ధం ప్రారంభించారు. చివరికి (అలా యుద్ధం చేస్తూ) 'షహీద్' అయి పోయారు. *(అనస్ బిన్ మాలిక్(రజిఅన్)- ముస్లిమ్)*

**సంగ్రహణం:**

"స్వర్గాన్ని అందుకోడానికి పరుగెత్తండి" అంటే మీరు వెంటనే దైవమార్గంలో జిహాద్ చేయండి. దీనికి నగదుగా లభించే బహుమానం స్వర్గం అని భావం.

## అనస్ బిన్ నజ్ర్ (రజిఅన్)- అమరగతి నొందాలనే కోరిక

(٢٠٦) قَالَ اَنَسٌ، عَمِّیْ ـــــ سُمِّیْتُ بِهٖ ـــــ لَمْ یَشْهَدْ مَعَ رَسُوْلِ
اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ بَدْرًا فَشَقَّ عَلَیْهِ قَالَ اَوَّلُ مَشْهَدٍ
شَهِدَهٗ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ غِبْتُ عَنْهُ وَاِنْ

اَرَانِيَ اللّٰهُ مَشْهَدًا فِيْهَا بَعْدُ مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
لَيَرَانِيَ اللّٰهُ تَعَالٰى مَا اَصْنَعُ قَالَ فَهَابَ اَنْ يَقُوْلَ غَيْرَهَا فَشَهِدَ
مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَوْمَ اُحُدٍ فَقَالَ
فَاسْتَقْبَلَ سَعْدَ بْنَ مَعَاذٍ فَقَالَ لَهُ اَنَسٌ يَا اَبَا عَمْرٍو اَيْنَ؟
فَقَالَ وَاهًا لِرِيْحِ الْجَنَّةِ اَجِدُهُ دُوْنَ اُحُدٍ قَالَ فَقَاتَلَهُمْ
حَتّٰى قُتِلَ قَالَ فَوُجِدَ فِيْ جَسَدِهٖ بِضْعٌ وَّثَمَانُوْنَ مِنْ بَيْنِ
ضَرْبَةٍ وَطَعْنَةٍ وَرَمْيَةٍ قَالَ فَقَالَتْ اُخْتُهُ عَمَّتِي الرُّبَيِّعُ
بِنْتُ النَّضْرِ فَمَا عَرَفْتُ اَخِيْ اِلَّا بِبَنَانِهٖ وَنَزَلَتْ هٰذِهِ
الْاٰيَةُ رِجَالٌ صَدَقُوْا مَا عَاهَدُوا اللّٰهَ عَلَيْهِ فَمِنْهُمْ
مَنْ قَضٰى نَحْبَهُ وَمِنْهُمْ مَنْ يَنْتَظِرُ وَمَا بَدَّلُوْا تَبْدِيْلًا
قَالَ فَكَانُوْا يَرَوْنَ اِنَّهَا نَزَلَتْ فِيْهِ وَفِيْ اَصْحَابِهٖ۔

(مسلم کتاب الامارۃ ترمذی ابواب التفسیر بخاری کتاب الجہاد)

206. అనస్ బిన్ మాలిక్(రజిఅన్) ఉల్లేఖనం: (ఆయన పేరు, ఆయన బాబాయి (తండ్రి సోదరుడు) పేరూ ఒక్కటే)

"మా బాబాయి హజ్రత్ అనస్ బిన్ నజ్ర్(రజిఅన్) దైవప్రవక్త(స) వెంట 'బద్ర్' యుద్ధంలో పాల్గొనలేకపోయినందుకు ఎంతో నొచ్చుకుంటూ, (ఇస్లామ్ పరిరక్షణకోసం) మహాప్రవక్త(స) వెంటరాగా జరిగిన మొదటి యుద్ధంలో పాల్గొనలేకపోయాను (అంటే బద్ర్ యుద్ధం గురించి నా పరిస్థితి ఎంతో విచారకరమైనది మరియు బాధాకరమైనదీను). ఒకవేళ అల్లాహ్ నన్ను ఇంకెప్పుడైనా దైవప్రవక్త వెంట యుద్ధరంగానికి పంపే అవకాశం కల్పిస్తే మాత్రం అల్లాహ్ నా పరాక్రమాన్ని అక్కడ చూడగలడు అనేవారు. (అంటే చిత్తశుద్ధితో పోరాడి ఆ యుద్ధంలో అమరగతి నొందుతాడు అని అర్థం). ఆయన ఇంతకంటే ఇంకేమీ అనడానికి సాహిసించలేదు.

(ఓ సంవత్సరం గడిచిన) తరువాత దైవప్రవక్త(స)గారి నాయకత్వాన 'ఉహద్' యుద్ధంలో పాల్గొనే భాగ్యం కలగగా ఆయన, హ(జత్ సఅద్ బిన్ ముఆజ్(రజిఅన్) ఎదుటికి వచ్చి అబూఅమ్ర్! (ఇది ఆయన మరోపేరు) ఎక్కడికి? అని అడిగి జవాబు రాకపూర్వమే వెంటనే "స్వర్గసుగంధం ఎంత ఆహ్లాదకరమైంది! ఉహద్‌కొండ క్రింద దాన్ని ఆఘ్రాణిస్తున్నాను" అంటూ (యుద్ధ రంగంలోనికి ఉరికారు)

మక్కా దైవధిక్కారులతో తలపడి దైవమార్గంలో షహీద్ అయ్యారు. ఈ సంఘటనను ఉల్లేఖిస్తున్న అనస్ బిన్ మాలిక్ ప్రకారం, ఆయన శరీరంపై ఖడ్గాలు, బరిసెలు, బాణాలకు సంబంధించిన దాదాపు తొంభై గాయాలు కనబడ్డాయి. హతుని సోదరి రబ్బీ బిన్తె నజ్ర్, నా సోదరుణ్ణి ఆయన చేతివ్రేళ్ళను చూసి గుర్తించాను అన్నారు. (ఎందుకంటే చని పోయిన తరువాత ముష్రిక్‌లు ఆయన ముఖాన్ని గుర్తుపట్టకుండా గాయపరిచారు కాబట్టి).

దివ్యఖుర్ఆన్ అహ్జాబ్ అధ్యాయంలో అవతరించిన 33వ ఆయత్, అనస్ బిన్ నజ్ర్ మరియు ఆయనతోపాటు పోరాడిన వారి గురించే అవతరించిందని చాలామంది సహాబీల అభిప్రాయం. ఆ ఆయత్ భావం ఇది:

"విశ్వాసుల్లో అల్లాహ్‌కు తాముచేసిన వాగ్దానాన్ని నిజంచేసి చూపిన వారూ ఉన్నారు. వారిలో కొందరు తమ మొక్కుబడిని తీర్చుకున్నారు. మరికొందరు సమయం కోసం నిరీక్షిస్తున్నారు. వారు తమ వైఖరిని ఏమాత్రం మార్చుకోలేదు. (ముస్లిమ్, తిర్మిజీ, బుకారి)

**సంగ్రహణం:**

హ(జత్ అనస్ బిన్ నజ్ర్ (రజిఅన్)గారి చిత్తశుద్ధి, దైవంతో ఆయన బంధం ఎంతో మహోన్నతమైనది. సత్యధర్మ ప్రాబల్యం కోసం యుద్ధమైదానంలో తన ప్రాణాలనర్పిం చడానికి దృఢచిత్తంతో బయలుదేరారాయన. దైవప్రవక్త(స) నాయకత్వంలో జరిగిన బద్ర్ యుద్ధం కుఫ్ర్ (దైవధిక్కారం) మరియు ఇస్లామ్ (దైవవిధేయత)కు నడుమ జరిగిన నిర్ణయాత్మకమైన యుద్ధం. ఆ యుద్ధంలో తాను పాల్గొనలేకపోతినే అన్న చింత, బాధ ఆయన్ను కలిచివేసింది. ఆ కలత కారణంగా, ఇక ముందు దైవప్రవక్త (స) వెంటరాగా

ఏదైనా యుద్ధం జరిగితే దైవసంతుష్టిని బడయడానికి తన సర్వశక్తి సామర్థ్యాలను, చివరికి తన ప్రాణాలనైనా ధారపోస్తానని అల్లాహ్‌తో ప్రతిన పూనారు. ఎలాంటి తాత్సారాన్ని ప్రదర్శించకుండా ఆ యుద్ధంలో పాల్గొంటానని నిశ్చయించుకున్నారు. అదే ఆ ప్రతిజ్ఞ. దైవ విశ్వాసం ఆయన నుండి కోరేది కూడా అదే. ఆత్మఘోషే ఆయనను ఆ ప్రతిన బూనడానికి ఒత్తిడి చేసింది.

హజ్రత్ సఅద్(ర)తో, "ఉహద్ మైదానం నుండి స్వర్గసుగంధం నా ముక్కుపుటాలను తాకుతోంది" అని అన్నారు. ఈ మాటలు ఆయన ఏదో ఉత్ప్రేక్ష భాషలోనో, భావగర్భితంగానో అన్నవికావు. యదార్థంగా ఆ స్వర్గ సుగంధం ఆయన జ్ఞానేంద్రియాలను తాకింది. ఇందులో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. విశ్వాసపు ఆధ్యాత్మిక శక్తి అసత్య పర్వతాన్నైనా లెక్కచేయదు. ఇక మరణమంటే భయపడే ప్రశ్నే ఉత్పన్నం కాదు. దైవానురాగం, ఆయనంటే అభిమానం దైవదాసుల నరనరాల్లో రక్తంలా పరుగెడుతుంది. ఈ మార్గంలో స్వర్గాన్నే త్యజించినా ఇంకా ఏమీ చేయలేదు అనే తపన మిగిలిపోతుంది. చివరకు ప్రాణాన్నైనాసరే. హజ్రత్ అనస్ (రజిఅన్) అనేకమంది అసత్యవాదుల శిరస్సులను ఖండించారు. అనేకులను నేల కూల్చారు. చివరికి స్వర్గాన్ని పొందే ఉత్సాహంతో అమరగతి నొందారు. దైవతిరస్కార ధ్వజవాహకుల ఖడ్గాలు ఆయనపై పెద్దఎత్తున బడ్డాయి. బల్లాలు బరిసెలు శరీరాన్ని తూట్లుగా పొడిచాయి. శరపరంపరలతో ఆయన శరీరం జల్లెడైంది. ఈ గాయాలతో ఆయన్ను గుర్తించే వీలులేకపోయింది. శరీరంలోని ఏ అవయవం దాని అసలు స్థితిలో మిగల్లేదు. కేవలం ఆయన చేతివ్రేళ్ళు తప్ప. ప్రియసోదరి అయిన రబ్బీ బిన్తె నజ్ర్(ర) ఆ వ్రేళ్ళను గుర్తించి, దైవమార్గంలో ధైర్యంగా పోరాడి ప్రాణాలొడ్డి స్వర్గాన్ని అందుకున్న నా ప్రియ సోదరుడు హజ్రత్ అనస్ బిన్ నజ్ర్ (రజిఅన్) ఈయనే అంటూ గుర్తుపట్టగలిగారు.

## స్వర్గం- ఖడ్గాల నీడల్లో

(٢٠٧) اِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ وَاعْلَمُوْا اَنَّ الْجَنَّةَ
تَحْتَ ظِلَالِ السُّيُوْفِ. (بخاری عن عبداللہ بن ابی اوفی کتاب الجہاد)

207. "ఖడ్గాల నీడల్లోనే స్వర్గం ఉందని తెలుసుకోండి" అని దైవ ప్రవక్త(స) సెలవిచ్చారు. *(అబ్దుల్లా బిన్ ఉబై ఔఫీ-(రజి) బుఖారి)*

**సగ్రహణం:**

కుఫ్ర్ (దైవతిరస్కారం) మరియు ఇస్లాం నడుమ జరిగే సంగ్రామంలో పాల్గొనేవాడు ముజాహిద్, విజయం సాధించి అతడు వెనక్కు మరలినా, దైవమార్గంలో 'షహీద్' అయినా

స్వర్గప్రవేశానికి అర్హుడే. చిత్తశుద్ధితో ధర్మంకోసం ప్రాణాలను పణంగా పెట్టడమే స్వర్గప్రవేశానికి మార్గం (అంటే ఆధారం).

## సత్యధర్మ వ్యాప్తిలో పయనించే వానికి అంటుకునే దుమ్ము

(۲۰۸) عَنْ اَبِیْ عَبْسٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
یَقُوْلُ مَنِ اغْبَرَّتْ قَدَمَاہُ فِیْ سَبِیْلِ اللّٰہِ حَرَّمَہُ اللّٰہُ عَلَی
النَّارِ۔ (بخاری کتاب الجمعۃ)

208. మహాప్రవక్త(స) ఇలా ప్రవచిస్తూఉండగా విన్నానని అబూ అబస్(రజిఅన్) ఉల్లేఖించారు: "దైవమార్గంలో బయలుదేరినప్పుడు ఎవరి పాదాలైతే దుమ్ము ధూళి దూసరితమవుతాయో అతడిపై అల్లాహ్ నరకాగ్నిని హరాం చేశాడు. (నిషేధించాడు) (బుకారి)

**సంగ్రహణం:**

'దైవమార్గం' అనేది కేవలం దైవప్రసన్నత పొందడానికి చేసే కార్యం. ఉదాహరణకు, ధర్మజ్ఞానాన్ని సముపార్జించడం, జనాజా నమాజ్ చేయడానికి వెళ్ళడం, రోగిని పరామర్శించబోవడం హజ్ చేయడంలాంటి విధులను నిర్వహించడానికి ప్రయాణం కట్టడం లాంటి విషయాల్లో వాడడం జరుగుతోంది.

'పాదాల దుమ్ము ధూళి దూసరితమవడం' అంటే అతని శరీరంపై దుమ్ము పేరుకుపోవడం లేదా శారీరక కష్టాలు ఎదురవడం అని అర్థం.

ఈ హదీసు భావం ఏమిటంటే, ఏ వ్యక్తయితే దైవధర్మ ప్రాబల్యం కోసం నిర్విరామంగా కృషి సల్పుతాడో ఆ మార్గంలో ఎదురయ్యే కష్టాలను, కడగండ్లను ధైర్యంగా ఎదుర్కొంటాడో అలాంటి వ్యక్తి దైవకృప వల్ల నరకాగ్నిలో ప్రవేశింపజాలడు అని అర్థం.

## దైవమార్గంలో గాయపడడం

(۲۰۹) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ وَالَّذِیْ نَفْسِیْ بِیَدِہٖ
لَا یُکْلَمُ اَحَدٌ فِیْ سَبِیْلِ اللّٰہِ ـــــ وَاللّٰہُ اَعْلَمُ بِمَنْ یُّکْلَمُ
فِیْ سَبِیْلِ اللّٰہِ ـــــ اِلَّا جَاءَ یَوْمَ الْقِیَامَۃِ وَاللَّوْنُ لَوْنُ
الدَّمِ وَالرِّیْحُ رِیْحُ الْمِسْکِ۔ (بخاری عن ابی ہریرہ کتاب الجہاد)

209. మహాప్రవక్త ముహమ్మద్(స) ప్రవచనం: "ఎవరి గుప్పెటనైతే నా ప్రాణాలున్నాయో ఆయన సాక్షి! ఆయన మార్గాన గాయపడినవాడు - ఆయన మార్గంలో ఎవరు గాయపడింది ఆయన బాగా ఎరుగు - ప్రళయం రోజున ఆ గాయాల నుండి రక్తం కార్తూ ఉండగా వస్తాడు. (అతని శరీరం నుండి) కస్తూరి సుగంధం గుబాళిస్తూ ఉంటుంది.'

(అబూహురైరా(రజిఅన్)- బుకారి)

**సంగ్రహణం:**

తన మార్గంలో గాయపడిన వారికి అల్లాహ్ ప్రళయ దినాన, ఆ గాయాలు రక్తం ఓడుతూ ఉండగా లేపుతాడు. దైవమార్గంలో, సత్యపథంలో వారు ఎలాంటి బాధలు భరించారన్నది చూపడానికి ఓ దృష్టాంతం ఇది. వారికి ఈ కారణంగా ఏ సన్మానం లభించనుందో ఈ హదీసులో చెప్పడం జరుగులేదు. అయితే అతని శరీరంనుండి చీము, రక్తం వల్ల వచ్చే దుర్గంధాలకు బదులు కస్తూరి సువాసనలు గుబాళిస్తాయి.

ఎవరైనా, నేను దైవమార్గంలోనే గాయపడ్డాను అని అంటే అతడు నిజంగా అల్లాహ్ మార్గంలో గాయపడ్డాడా? లేదా? అన్నది నిర్ణయించేది ఆ పరోక్ష జ్ఞానం గలవాడే.

మనస్సులో దాగి ఉన్న కోరిక గురించి ఆయన బాగా ఎరుగు. 'జిహాద్' కేవలం దేవుడి కోసమే అయితే ప్రశంసించదగ్గ విషయమే. కాని దాని ధ్యేయం, తన తక్వాను ప్రదర్శించడం లేదా ప్రాపంచిక భోగభాగ్యాలు, సంపదలను సంపాదించడమే అయితే అది దేవుని దృష్టిలో ఓ దోమ రెక్కంత విలువ కూడా పొందదు. దైవ వచనాలను వ్యాపింపచేయడానికి ఆయన ధర్మాన్ని భువిలో స్థాపించడానికి జరిగే కృషి వెనుక అల్లాహ్ సంతుష్టిని ఆయన ప్రసన్నతను పొందాలనే కోరికే ఉత్ప్రేరణగా ఉండాలి. ధర్మసంస్థాపనం దేవుని ప్రసన్నత కోసం కాకుండా భౌతిక ప్రయోజనాల కోసం అయితే అది గొప్ప ముప్పుకు కారణభూతమవుతుంది. ప్రళయం రోజున ధర్మాన్ని అమ్ముకునే ఈలాంటి 'వేషగాళ్ళు' నరకంలో దారి తెన్నూలేకుండా తిరుగుతూ ఉంటారు. ఇక బహుమానం సంగతి సరేసరి.

## షహీద్ కావాలనే కోరిక

(۲۱۰) اُصِيبَ حَارِثَةُ يَوْمَ بَدْرٍ وَهُوَ غُلَامٌ فَجَاءَتْ أُمُّهُ إِلَى
النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَتْ يَا رَسُولَ اللهِ قَدْ
عَرَفْتَ مَنْزِلَةَ حَارِثَةَ مِنِّي فَإِنْ يَكُ فِي الْجَنَّةِ أَصْبِرْ

وَاَحْتَسِبْ وَاِنْ تَكُنِ الْاُخْرٰى تَرٰى مَا اَصْنَعُ فَقَالَ وَيْحَكِ

اَوَهَبِلْتِ اَوَجَنَّةٌ وَاحِدَةٌ هِيَ اِنَّهَا جِنَانٌ كَثِيْرَةٌ وَاِنَّهٗ

لَفِيْ جَنَّةِ الْفِرْدَوْسِ۔ (بخاری عن انس کتاب الجهاد۔ کتاب المغازی)

210. బద్ర్ యుద్ధంలో హజ్రత్ హారిసా(రజిఅన్) అనే ఓ నవ యువకుడు షహీద్ కాగా ఆయన తల్లిగారు దైవప్రవక్త(స) దగ్గరకొచ్చి దైవప్రవక్తా! హారిసా అంటే నేనెంత పడి చస్తానో మీకు బాగా తెలుసు. అతడు స్వర్గంలో ప్రవేశిస్తే సహనం వహించి అల్లాహ్ ఒసగే పుణ్యఫలాన్ని ఆశిస్తాను. అలా కాలేదంటే నేనేం చేయగలనో మీరే చూస్తారుగా అన్నారు. దానికి మహాప్రవక్త(స), "ఏమిటీ నీకేమైనా మతిపోయిందా! కేవలం ఒకే ఒక స్వర్గం ఉందనుకుంటున్నావా? అనేకమైన స్వర్గాలున్నాయి. హారిసా మాత్రం 'ఫిర్దౌస్' అనే స్వర్గంలో ఉన్నాడు" అని సెలవిచ్చారు.

*(హజ్రత్ అనస్(రజి)– బుఖారి)*

**సంగ్రహణం:**

హారిసా బిన్ సురాకా(రజిఅన్) అప్పుడే నూనూగు మీసాలు వచ్చిన నవయువకుడు. తల్లి సేవలోనే సతతం నిమగ్నమై ఉండే తనయుడు. ఓసారి దైవప్రవక్త(స) ఆయన్నుద్దేశించి హారిసా! ఏమిటి విశేషాలు, క్షేమమేనా అని పలుకరించారు. అప్పుడాయన దైవప్రవక్తా! నేను ముస్లిమ్‌గా మారిపోతాను. అల్లాహ్ నాకు దైవమార్గంలో షహీద్ (అమరగతి నొందే) అయ్యే భాగ్యం కలగచేయమని ప్రార్థించండి అని కోరాడు.

బద్ర్ యుద్ధం రోజున ఈ యుద్ధంలో పాల్గొన్న ఆ అన్సారీ యువకుడు నీటి చెలమ దగ్గరకు నీటికై వెళ్ళగా హబ్బాస్ బిన్ ఆరికా అనేవాడు అతనిపై ఓ బాణం వేశాడు. అది అతని మెడలో దిగబడి అతని 'షహదత్'కు (అమరగతికి) కారణభూతం అయింది.

బద్ర్ యుద్ధం ముగిశాక దైవప్రవక్త(స) మదీనా చేరారు. ఆ యువకుని తల్లి అతడు దైవమార్గంలో ప్రాణాలొడ్డారన్న సంగతి తెలిసి మహాప్రవక్త(స) దగ్గరకు వచ్చి ప్రవక్తా! హారిసా గురించి చెప్పండి అని అడిగారు. హారిసా 'ఫిర్దౌస్' అనే స్వర్గంలో ఉన్నాడని వినగా ఆమె ఎంతో ఆనందంతో శభాష్ హారిసా! అంటూ ఇంటికి వెళ్ళిపోతారు. ఆ అన్సారీ యువకుడు దైవమార్గంలో అమరగతి నొందాలి అని కోరుకోగా బద్ర్ యుద్ధంలో అతని ఆ కోరిక ఈడేరింది. అతని తల్లి, ధైర్యసాహసాలు, పట్టుదలలు కూడా ఓ ఆదర్శమే. నవయువకుడైన కొడుకు షహీద్ అయ్యాడు అన్న వార్త వినగానే మూర్ఛపోలేదామె, గగ్గోలు పెట్టలేదు, దైవప్రవక్త నోట శుభవార్త వినగానే ఆనందం పట్టలేక నవ్వుతూ ఇంటిదారి

పట్టింది. హారిసా తల్లిగారైన హజ్రత్ 'రుబీ బిన్తె నజ్ర్' లాంటి మహిళామణుల సంతానమే దైవమార్గంలో ప్రాణాలర్పించడానికి సిద్ధమవుతుంది మరి!

## షహీద్ అభిలాష

(۱۱۱) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَا أَحَدٌ يَدْخُلُ الْجَنَّةَ
يُحِبُّ أَنْ يَرْجِعَ إِلَى الدُّنْيَا وَلَهُ مَا عَلَى الْأَرْضِ مِنْ شَيْءٍ
إِلَّا الشَّهِيْدُ يَتَمَنّٰى أَنْ يَرْجِعَ إِلَى الدُّنْيَا فَيُقْتَلَ عَشْرَ مَرَّاتٍ
لِمَا يَرٰى مِنَ الْكَرَامَةِ۔ (بخاری عن انس، کتاب الجهاد مسلم کتاب الامارة)

211. దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: స్వర్గంలోనికి ప్రవేశించిన వ్యక్తి ఎవరైనా, ఇహలోకంలోనికి తిరిగి రావాలని కోరుకోడు; ఈ భూలోకం లోని సమస్త ఒనరుల్ని, సిరిసంపదలన్నింటిని అతనికి ధారా దత్తం చేసినా సరే. ఒక్క షహీద్ తప్ప. అతడు తనకు లభించిన గౌరవాన్ని గాంచి ఇహ లోకంలోనికి తిరిగి రావాలని ఇక్కడ దైవమార్గంలో పది మార్లైనా సంహ రించబడాలని ఆశిస్తాడు." (అనస్(రజిఅన్)– బుకారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

దైవమార్గంలో ప్రాణాలర్పించి సత్యం అంటే కేవలం ఇదొక్కటే అని సాక్ష్యమిచ్చిన వాడే 'షహీద్': దైవదూతలు అతడి పవిత్రాత్మను వెంటనే స్వర్గంలోనికి ప్రవేశింపజేస్తారు. 'షహాదత్ (అమరగతి) ప్రతిఫలం, తనకు లభించిన గౌరవాన్ని చూసి అతడు తిరిగి భూలోకానికి రావాలని ఎంతమాత్రం కోరుకోడు. దైవమార్గంలో మాటిమాటికి సంహరింపబడాలని, ఇలాంటి గౌరవాన్ని మరింతగా పొందాలని అతడు ఆకాంక్షిస్తాడు.

అయితే స్వర్గంలో ప్రవేశించిన మరో వ్యక్తి మాత్రం, అక్కడి సుఖభోగాలను, అతనికోసం అక్కడ సమకూర్చబడ్డ వరాలను చూసి తిరిగి భూలోకంలోనికి రావాలని కోరుకోవడం జరుగనే జరుగదు. కాగా, భూలోకంలోనికి వెళ్ళు, అక్కడి సమస్త భోగ భాగ్యాలు నీ పరంచేయడం జరుగుతుంది అని చెప్పినా అతడు దాన్ని ససేమిరా ఒప్పుకోడు.

## అమరవీరుల నివాసం ఆకుపచ్చని గుమ్మటం

(۲۱۲) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الشُّهَدَاءُ عَلٰى بَارِقٍ
نَهْرٍ بِبَابِ الْجَنَّةِ فِيْ قُبَّةٍ خَضْرَاءَ يَخْرُجُ عَلَيْهِمْ رِزْقُهُمْ
مِنَ الْجَنَّةِ بُكْرَةً وَّ عَشِيًّا۔ (مسند احمد نمبر ۲۳۹۰)

212. మహాప్రవక్త(స) ప్రవచనం ఇలా ఉంది: "స్వర్గంలో ఓ ద్వారం దగ్గర 'బారిక్' అనే సెలయేరు ప్రవహిస్తోంది. (దైవమార్గంలో) అమరగతినొందిన వారికి (ఆత్మలకు) దాని ఒడ్డున ఉన్న అత్యంత ఆకుపచ్చని రంగుగల గుమ్మటంలో ఉంచటం జరుగుతుంది. ఉదయం, సాయంకాలం వారికి స్వర్గంనుండి భుక్తి అందుతుంది."

**సంగ్రహణం:**

అమరవీరులు (షహీదులు) ప్రళయంవరకు అల్లాహ్ వద్ద గౌరవనీయులైన అతిథులుగా ఉంటారు.

## బర్జక్ (ఆత్మలలోకం)లో షహీద్‌లకు ఆహారం లభిస్తుంది

(۲۱۳) عَنْ مَسْرُوْقٍ، قَالَ سَأَلْنَا عَبْدَ اللّٰهِ عَنْ هٰذِهِ الْاٰيَةِ ـ وَلَا
تَحْسَبَنَّ الَّذِيْنَ قُتِلُوْا فِيْ سَبِيْلِ اللّٰهِ اَمْوَاتًا بَلْ اَحْيَآءٌ عِنْدَ
رَبِّهِمْ يُرْزَقُوْنَ ۞ قَالَ اَمَا اِنَّا قَدْ سَأَلْنَا عَنْ ذٰلِكَ فَقَالَ:
اَرْوَاحُهُمْ فِيْ جَوْفِ طَيْرٍ خُضْرٍ لَهَا قَنَادِيْلُ مُعَلَّقَةٌ بِالْعَرْشِ
تَسْرَحُ مِنَ الْجَنَّةِ حَيْثُ شَاءَتْ ثُمَّ تَأْوِيْ اِلٰى تِلْكَ
الْقَنَادِيْلِ فَاطَّلَعَ اِلَيْهِمْ رَبُّهُمْ اِطِّلَاعَةً فَقَالَ هَلْ
تَشْتَهُوْنَ شَيْئًا؟ قَالُوْا اَيَّ شَيْءٍ نَشْتَهِيْ وَنَحْنُ نَسْرَحُ مِنَ
الْجَنَّةِ حَيْثُ شِئْنَا فَفَعَلَ ذٰلِكَ بِهِمْ ثَلَاثَ مَرَّاتٍ
فَلَمَّا رَأَوْا اَنَّهُمْ لَنْ يُتْرَكُوْا مِنْ اَنْ يُسْأَلُوْا قَالُوْا يَا رَبِّ

اَنْ تَرُدَّ اَرْوَاحَنَا فِىْ اَجْسَادِنَا حَتّٰى نُقْتَلَ فِىْ سَبِيْلِكَ
مَرَّةً اُخْرٰى فَلَمَّا رَاٰى اَنْ لَّيْسَ لَهُمْ حَاجَةٌ تُرِكُوْا۔
(مسلم كتاب الامارة)

213. దివ్యఖుర్ఆన్‌లో అవతరించిన ఈ ఆయత్- "అల్లాహ్ మార్గంలో హతులైన వారిని మరణించారని అనుకోకండి. వారు (యదార్థంగా జీవించే ఉన్నారు) తమ పోషకుని ద్వారా ఆహారాన్ని పొందుతున్నారు" (ఆలిఇమ్రాన్). దాని భావం ఏమిటి అని హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజిఅన్)ను 'మస్రూక్' అనే ఆయన అడిగారు.

ఈ ఆయత్ భావం ఏమిటీ అని దైవప్రవక్త(స) గారిని మేమూ అడిగాం. ఆయన ఇలా సెలవిచ్చారని అబ్దుల్లా బిన్ మస్ఊద్ ఉల్లేఖించారు.

"వారి ఆత్మలు ఆకు పచ్చని రంగుగల పక్షుల్లో ఉంటాయి. వాటి కోసం ఆకాశం నుండి వ్రేలాడే దీపపు గూళ్ళు ఉంటాయి. అవి తమకు ఇష్టమైన చోటికి వెళ్ళి తిరిగి వస్తాయి. తిరిగి ఆ దీపపు గూళ్ళలోకి వచ్చి చేరుతాయి. అల్లాహ్(అంటే దైవ తేజస్సు) వారివైపు తొంగిచూసి ఇంకా మీ ఆకాంక్ష ఏమిటి? అని అడుగుతాడు. (అప్పుడవి) ప్రభూ! ఇంకా మేం కోరుకునేదేముంటుంది? స్వర్గంలో మా ఇష్టమొచ్చిన చోటుకు వెళ్ళి ఆహారం పొందుతున్నాం కదా అని విన్నవించుకుంటాయి. (అయినా) దైవతేజస్సు వారివైపు అలానే ముమ్మార్లు తొంగిచూసి వాటి అభీష్టమేమిటో అడుగుతూ ఉండగా, అవి దేవునితో:

ప్రభూ! నీ మార్గంలో హతులయ్యేందుకు మమ్ములను మా శరీరాల్లోనికి ప్రవేశపెట్టు అని విన్నవించుకుంటాయి. మరే కోరిక లేనందువల్ల అడగడం మానేస్తాడు దేవుడు." (ముస్లిమ్)

**సంగ్రహణం:**

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్(రజిఅన్) దైవప్రవక్తను, "అల్లాహ్ మార్గంలో షహీద్ అయ్యేవాడు సజీవుడు" అని చెప్పబడ్డ ఆయత్ గురించి తెలుసుకోగోరి, 'ఈ లోకంలో

శరీరంనుండి ఆత్మ వేరవగానే మరణం సంభవిస్తుంది, మరి షహీద్‌లు సజీవులు, ఆపై వారు ఆహారాన్ని కూడా పొందుతున్నారు. అన్న దానికి భావం ఏమిటి? అని అడిగారు. ఈ ప్రశ్న విన్న దైవప్రవక్త(స) షహీదులు ఆత్మల లోకంలో (ఆలమెబర్జక్) సజీవులుగా ఉన్నారు అంటే వారి ఆత్మలకు ఆకుపచ్చని పక్షుల దేహం ఒసగబడుతుంది, అర్ష్(ఆకాశం) నుండి వ్రేలాడే దీపపు గూళ్ళలో అవి నివసిస్తాయి. స్వర్గంలో స్వేచ్ఛగా తిరిగి రావడంలో వాటికి ఎలాంటి అడ్డంకులుండవు. అవి తమకు యిష్టమైన ఆహారాన్ని తీసుకొని అక్కడి సుందర దృశ్యాలను తిలకించడంలో లీనమవుతాయి. ఆహారం పొందిన తరువాత తిరిగి అవి తమ గూళ్ళలోనికి వచ్చి చేరతాయి. వాటికి దేవుని సారూప్యం లభిస్తుంది. ఆయన కారుణ్యం కారణంగా వాటి హోదా పెరుగుతూ ఉంటుంది. ఈ క్రమం ప్రళయం వరకు కొనసాగుతుంది. ప్రళయం ఆసన్నమైనప్పుడు ఈ ఆత్మలు తమ సొంత శరీరాల్లోనికి తిరిగి ప్రవేశిస్తాయి.

## ఉహద్ అమరుల సందేశం

(۲۱۴) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَمَّا اُصِيْبَ اِخْوَانُكُمْ
بِاُحُدٍ جَعَلَ اللهُ اَرْوَاحَهُمْ فِيْ جَوْفِ طَيْرٍ خُضْرٍ تَرِدُ اَنْهَارَ
الْجَنَّةِ تَأْكُلُ مِنْ ثِمَارِهَا وَتَأْوِيْ اِلٰى قَنَادِيْلَ مِنْ
ذَهَبٍ مُعَلَّقَةٍ فِيْ ظِلِّ الْعَرْشِ فَلَمَّا وَجَدُوْا طِيْبَ
مَأْكَلِهِمْ وَمَشْرَبِهِمْ وَمَقِيْلِهِمْ قَالُوْا مَنْ يُبَلِّغُ
اِخْوَانَنَا عَنَّا اَنَّا اَحْيَآءٌ فِى الْجَنَّةِ نُرْزَقُ لِئَلَّا يَزْهَدُوْا
فِى الْجِهَادِ وَلَا يَنْكُلُوْا عِنْدَ الْحَرْبِ فَقَالَ اللهُ تَعَالٰى
اَنَا اُبَلِّغُهُمْ عَنْكُمْ قَالَ وَاَنْزَلَ اللهُ عَزَّ وَجَلَّ:
وَلَا تَحْسَبَنَّ الَّذِيْنَ قُتِلُوْا فِيْ سَبِيْلِ اللهِ اِلٰى اٰخِرِ الْاٰيَات

(ابوداؤد عن ابن عباس کتاب الجہاد)

214. దైవప్రవక్త(స) ప్రవచనం: “ఉహద్ యుద్ధంలో (హిజ్రి శకం మూడు) మీ సోదరులను షహీద్ చేయడం జరిగినప్పుడు అల్లాహ్ వారి ఆత్మల్ని ఆకుపచ్చని రంగుగల పక్షుల్లో వేశాడు. అవి స్వర్గంలోని ఫలాలను తినడానికి (అక్కడి పానీయాలైన పాలు, తేనె, నీరు త్రాగడానికి) స్వర్గ

సెలయేళ్ళకు వస్తూ ఉంటాయి. 'అర్ష్' నీడల్లో వ్రేలాడే బంగారు దీపాల గూళ్ళల్లోనికి తిరిగి వస్తాయి. ఆ అమరవీరులు మేలైన ఆహారాన్ని ఉత్తమమైన పానీయాల్ని, హాయిగొలిపే విడుదలను అనుభవించినప్పుడు దేవుణ్ణి, మేము బ్రతికే ఉన్నామని, స్వర్గంలో ఆహార పానీయాలను పొందుతున్నామని మా సందేశాన్ని అందించు, ఇలా వారు యుద్ధం నుండి విముఖత చూపకుండా, భీరుత్వాన్ని పాటించకుండా ఉంటారు అని విన్నవించుకుంటాయి.

అప్పుడు అల్లాహ్, మీ సందేశాన్ని వారి దాకా చేరవేస్తాను అని ఈ క్రింది ఖుర్ఆన్ వచనాలను అవతరింపజేశాడు.

"దైవమార్గంలో హతులైనవారిని మృతులుగా తలచకండి, వారు యదార్థంగా సజీవులే. తమ ప్రభువు నుండి భుక్తిని పొందుతున్నారు. అల్లాహ్ వారికి ఒసగిన దానికివారు సంతుష్టులై తృప్తిపడ్డారు. ఏ విశ్వాసు లైతే ఇంకా అక్కడికి చేరకుండా ఇహలోకంలోనే ఉండిపోయారో వారికి కూడా ఎలాంటి భయం, బాధ అనుభవించే అవకాశం ఉండదు. వారు అల్లాహ్ ఒసగిన బహుమానాలకు ఆయన కటాక్షానికి సంబరపడు తున్నారు. ఇలాగే అల్లాహ్ విశ్వాసుల ప్రతిఫలాన్ని వృధా చేయడు అన్న యదార్థం వారికి అవగతమైంది." *(ఆలిఇమ్రాన్- 169 నుండి 171 వరకు)*

**సంగ్రహణం:**

ధర్మానికి అధర్మానికి నడుమ జరిగే యుద్ధంలో పిరికితనాన్ని ప్రదర్శించడం క్షమించరాని గొప్ప నేరం. అందుకే ఉహద్ యుద్ధ అమరవీరులు, మేము సజీవులై ఉన్నాం, స్వర్గంలో తింటూ ఉన్నాం. త్రాగుతున్నాం. మీరు మరణ భయం వల్ల 'జిహాద్' పట్ల విముఖత చూపకండి, భీరత్వాన్ని ప్రదర్శించి సత్యధర్మానికి నష్టం వాటిల్లజేయకండి అని సందేశమిచ్చారు.

## జిహాద్‌లో ఉపయోగపడే వస్తుసామగ్రి విలువ

(٢١) قَالَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مَنِ احْتَبَسَ فَرَسًا فِي
سَبِيلِ اللهِ إِيمَانًا بِاللهِ وَتَصْدِيقًا بِوَعْدِهِ فَإِنَّ شِبَعَهُ

وَرِيَّهُ وَرَوْثَهُ وَبَوْلَهُ فِي مِيزَانِهِ يَوْمَ الْقِيَامَةِ.

(بخاری عن ابی ہریرہ کتاب الجہاد)

215. "దేవుడి మీద విశ్వాసం, ఆయన చేసిన వాగ్దానం సత్యమైన వాగ్దానమే అని రుజువు చేయడానికి ఎవరైతే ఆయన మార్గంలో గుర్రాన్ని కడతాడో (అంటే ఆ ధ్యేయసాధన కోసమే దాన్ని సిద్ధంగా ఉంచి దాని గురించి శ్రద్ధ తీసుకుంటాడో) ప్రళయం రోజున ఆ గుర్రానికి పెట్టిన మేత, నీరు, దాని లద్దె(పేడ) మరియు మూత్రం ఇత్యాదులు అతని 'తరాజు'లో వేయడం జరుగుతుంది." ఇది దైవప్రవక్త(స) గారి ప్రవచనం.

*(అబూహురైరా(రజి)– బుకారి)*

**సంగ్రహణం:**

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు. "మీరు మీ శక్తిమేరకు అత్యధిక బలాన్నీ, కట్టివేసి సిద్ధంగా ఉన్న గుర్రాలను వారిని ఎదుర్కోవటానికి సమాయత్తపరచు కోండి, తద్వారా అల్లాహ్ శత్రువులనూ మీ శత్రువులనూ, ఇంకా మీరు ఎరుగని, కాని అల్లాహ్ ఎరిగిన ఇతర శత్రువులనూ భయకంపితులుగా చెయ్యండి. అల్లాహ్ మార్గంలో మీరు ఏది ఖర్చుచేసినా దాని పూర్తి ప్రతిఫలం మీవైపునకు మళ్ళించబడుతుంది. మీకు ఎంతమాత్రం అన్యాయం జరగదు." (అల్ అన్ఫాల్– 60)

దేవుడు పై ఖుర్ఆన్ వచనం ద్వారా ముస్లిములను, మీరు యుద్ధ ఆయుధాలను, యుద్ధానికి సంబంధించిన వస్తుసామగ్రిని సమకూర్చే కార్యక్రమాన్ని కొనసాగించండి. ఈ విషయంలో విశాల హృదయంతో డబ్బును వెచ్చించండి. ఈ ఆదేశాన్ని శిరసావహించే వారికి అల్లాహ్ ప్రళయం రోజున దాని పూర్తి ప్రతిఫలాన్నిస్తాను అని వాగ్దానం చేస్తున్నాడు.

మహాప్రవక్త(స) ప్రవచన సారాంశం ఏమిటంటే ఎవరైతే అల్లాహ్ ఆదేశాన్ని పాటిస్తూ కేవలం ఆయన ప్రసన్నత కోసం గుర్రాన్ని కట్టి దైవమార్గంలో జిహాద్ కోసం సిద్ధంగా ఉంచుతాడో పైగా, దేవుని ఆదేశాలను అమలు చేసి, వారి కోసం అల్లాహ్ ఏ వాగ్దానం అయితే చేశాడో ఆ వాగ్దానం పై పూర్తి విశ్వాసం ఉంచుతాడో అలాంటి వారికోసం ప్రళయం రోజున గొప్ప ప్రతిఫలం ఉంది. గుర్రపు లద్దె మరియు దాని మూత్రాన్ని త్రాచులో వేయడం అంటే గుర్రానికి సంబంధించిన వాటన్నింటికి పుణ్యఫలం లభిస్తుంది అని అర్థం. నిజంగా వాటినిత్రాచులో వేసి బరువు తూయడం అని కాదు భావం.

దైవమార్గంలో పనికివచ్చే వాహనాల బాగోగుల్ని చూడడం, వాటిమీద అయ్యే ఖర్చుమీద దేవుడు పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడని ఆశించవచ్చు.

ఈ కాలంలో జీపులు, కార్లు, స్కూటర్లు, లారీలు కూడా ఈ కోవకు చెందినవే. దైవ మార్గంలో అవిరళంగా కృషి చేయడానికి వాటిని వాడడం కూడా పుణ్యఫలాన్ని సంపాదించి పెడుతుంది. అయితే ఓ షరతు. దైవమార్గంలో కృషి చేయడం కేవలం ఆయన ప్రసన్నత పొందటమే వీటన్నిటి ధ్యేయంగా ఉండాలి తప్ప వేరే కాకూడదు.

## ముజాహిద్‌లకు సహాయ సహకారాలనందించడం

(٢١٦) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ مَنْ جَھَّزَ غَازِیًا فِیْ سَبِیْلِ اللّٰہِ فَقَدْ غَزَا وَمَنْ خَلَفَہٗ فِیْ اَھْلِہٖ بِخَیْرٍ فَقَدْ غَزَا۔

(مسلم عن زید بن خالد الجہنی کتاب الامارۃ ۔ بخاری کتاب الجہاد)

216. "అల్లాహ్ మార్గంలో జిహాద్ చేసేవానికి ప్రయాణ సామగ్రిని సమకూర్చినవాడు జిహాద్‌లో పాల్గొన్నట్లే. (ఇంకా) ఎవరైతే అతని భార్యాపిల్లలను పోషిస్తూ సత్ప్రవర్తన కలిగి ఉంటాడో అతడూ ముజాహిదే." అని దైవప్రవక్త(స) సెలవిచ్చాడు.

**సంగ్రహణం:**

ఏ వ్యక్తి అయినా తాను (కార్యరూపేణ జిహాద్‌లో పాల్గొనలేకపోయి) ముజాహిద్ కోసం-ప్రయాణ సౌకర్యాలు, నగదు, ఆయుధాలు, వస్త్రాలు, ఆహారం ఇత్యాదులు-సమర్పించుకుంటాడో లేదా అతని కుటుంబ సంరక్షణ బాధ్యతలను మీదేసుకొని సదుద్దేశ్యంతో వారిని పరిరక్షిస్తాడో వారి మాన మర్యాదల్ని కాపాడుతాడో అతడికి ముజాహిద్‌కు లభించే పుణ్యఫలం లభిస్తుంది.

అలాకాకుండా ఎవరైనా కుత్సితబుద్ధితో ఆ ముజాహిద్ భార్యాపిల్లల బాధ్యత తీసుకొని వారి మానమర్యాదల్ని మంట గలుపుతాడో ప్రళయం రోజున అతడు తన జీవితంలో చేసిన పుణ్యఫలమంత ఆ ముజాహిద్‌కు ఇవ్వడం జరుగుతుంది.

(జైద్ బిన్ ఖాలిదుల్ జుహ్నీ(రజిఅన్)- ముస్లిం, బుకారి)

## ధర్మప్రాబల్యార్థం నిస్వార్థ సేవ

(٢١٧) عَنْ وَاثِلَۃَ بْنِ الْاَسْقَعِ قَالَ نَادٰی رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ فِیْ غَزْوَۃِ تَبُوْکَ فَخَرَجْتُ اِلٰی اَھْلِیْ فَاَقْبَلْتُ وَقَدْ

خَرَجَ اَوَّلُ صَحَابَةِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَطَفِقْتُ
فِي الْمَدِيْنَةِ اُنَادِيْ اَلَا مَنْ يَحْمِلُ رَجُلًا لَهُ سَهْمُهُ فَنَادٰى
شَيْخٌ مِنَ الْاَنْصَارِ فَقَالَ لَنَا سَهْمُهُ عَلٰى اَنْ نَحْمِلَهُ عُقْبَةً وَ
طَعَامُهُ مَعَنَا قُلْتُ نَعَمْ قَالَ فَسِرْ عَلٰى بَرَكَةِ اللّٰهِ قَالَ
فَخَرَجْتُ مَعَ خَيْرِ صَاحِبٍ حَتّٰى اَفَاءَ اللّٰهُ عَلَيْنَا فَاَصَابَنِيْ
قَلَائِصُ فَسُقْتُهُنَّ حَتّٰى اَتَيْتُهُ فَخَرَجَ فَقَعَدَ عَلٰى حَقِيْبَةٍ
مِنْ حَقَائِبِ اِبِلِهِ ثُمَّ قَالَ سُقْهُنَّ مُدْبِرَاتٍ ثُمَّ قَالَ
سُقْهُنَّ مُقْبِلَاتٍ فَقَالَ مَا اَرٰى قَلَائِصَكَ اِلَّا كِرَامًا قَالَ
اِنَّمَا هِيَ غَنِيْمَتُكَ الَّتِيْ شَرَطْتُ قَالَ خُذْ قَلَائِصَكَ يَا ابْنَ
اَخِيْ فَغَيْرَ سَهْمِكَ اَرَدْنَا۔ (ابوداؤد كتاب الجهاد)

217. హజ్రత్ వాసిలా బిన్ అస్కా(రజిఅన్) గారి ఉల్లేఖనం దైవ ప్రవక్త(స) తబూక్ యుద్ధం గురించి ప్రకటన చేసినప్పుడు నేను నా భార్యా పిల్లలను చూడ్డానికి వెళ్ళి ఉన్నాను. మదీనాకు తిరిగి వచ్చేటప్పటికే సహాబీల మొదటి పటాలం 'తబూక్'కు వెళ్ళిపోయింది. నేను మదీనా నగరమంతా తిరిగి, ఎవరైనా నాకో వాహనం సమకూరిస్తే యుద్ధానంతరం నాకు లభించే విజయధనం నుండి అతడికి భాగం ఇస్తానని ప్రకటించాను. జవాబుగా ఓ వృద్ధ అన్సారీ దీనికి సమ్మతించి ఓ షరతు పెట్టాడు. దాని ప్రకారం ఆ వాహనంపై వంతుల వారీగా ఎక్కి ప్రయాణం చేయాల్సి ఉంటుంది. భోజనం గూడా ఆయనదే. అయితే పద, అల్లాహ్ శుభాన్నే కలగజేస్తాడు అన్నాడు ఆ వృద్ధ అన్సారీ. ఇలా నేనో ఉత్తమ సహచరుని వెంట (మదీనా నుండి తబూక్‌కు) బయలుదేరాను. చివరికి అల్లాహ్ మాకు ఆ యుద్ధంలో విజయధనంతో సత్కరించాడు. వయస్సులో ఉన్న కొన్ని ఒంటెలు నా భాగానికి వచ్చాయి. వాటిని తోలుకొని మదీనా నగరానికి వచ్చాను. రాగానే వృద్ధ అన్సారీ ఇంటికి వెళ్ళాను. ఆయన

బయటకు వచ్చి అరుగుపై కూర్చొని, ఏదీ! ఆ ఒంటెల్ని వెనకా ముందు భాగాలు కనబడేటట్లు తోలు అన్నాడు. (నేనలా చేసిన తరువాత)

మీ ఒంటెలు ఎంతో మేలైనవి అని పొగిడాడు. ఆయన ఇవి మీతో చేసిన వాగ్దానం ప్రకారం మీ భాగానికి వచ్చిన ఒంటెలు ఇవి విజయధనం నుండి లభించినవి. (దయచేసి వాటిని స్వీకరించండి) అన్నాను. అప్పు డాయన, "కుమారా! నీ ఒంటెల్ని తీసుకెళ్ళు, నీక్కావలసింది పుణ్యఫలంలో భాగం, నా అభిలాష అదే" అన్నాడాయన. (అబూదావూద్)

## ప్రవక్త కాలంనాటి యుద్ధ వీరులు

(۲۱۸) قَالَ الزُّبَيْرُ بْنُ الْعَوَّامِ مَا مِنِّيْ عُضْوٌ اِلَّا وَقَدْ جُرِحَ مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ حَتَّى انْتَهٰى ذٰلِكَ اِلٰى فَرْجِهٖ۔ (ترمذی ابواب المناقب)

218. హజ్రత్ జుబైర్ బిన్ అవామ్(రజిఅన్) ఇలా అంటారు: నేను దైవప్రవక్త(స)వెంట (జిహాద్‌లో) ఎన్నిసార్లు పాల్గొన్నానంటే నా శరీరంలోని ఏ అవయవం కూడా గాయపడకుండా ఉండలేదు. చివరికి నా మర్మాంగం కూడా గాయపడక తప్పలేదు." (తిర్మిజీ)

(۲۱۹) عَنْ عَلِيٍّ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ مَا سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عليه وَسَلَّمَ جَمَعَ اَبَوَيْهِ لِاَحَدٍ اِلَّا لِسَعْدِ بْنِ مَالِكٍ فَاِنِّيْ سَمِعْتُهٗ يَقُوْلُ يَوْمَ اُحُدٍ يَاسَعْدُ اِرْمِ فِدَاكَ اَبِيْ وَاُمِّيْ (بخاری کتاب المغازی باب غزوۂ احد)

219. హజ్రత్ అలి(రజిఅన్) గారి ఉవాచ: "దైవప్రవక్త(స) నోట సఅద్ బిన్ అబీ వఖాస్(రజిఅన్) తప్ప మరెవరికీ తమ తల్లిదండ్రులను అర్పణ చేసినట్లు నేను వినలేదు."

ఉహుద్ యుద్ధం రోజున దైవప్రవక్త(స), హజ్రత్ సఅద్‌ను ఉద్దేశించి

"సఅద్! బాణాలు కురిపించు, నా తల్లిదండ్రులు నీకై అర్పితం" అన్నారు.
(బుకారి)

**సంగ్రహణం:**

ఉహుద్ యుద్ధంలో హజ్రత్ సఅద్(రజిఅన్) ఎంతో శౌర్యపరా క్రమాలు ఉట్టిపడేలా బాణాలను కురిపించి దైవధిక్కారుల సర్దారులను నేలకూల్చారు. ఓ ఉల్లేఖనం ప్రకారం ఆయన ఆ రోజు వెయ్యి బాణాలను శత్రువులపై ఉపయోగించారు.

## జిహాద్ ధ్యేయం

(۲۲۰) سُئِلَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنِ الرَّجُلِ يُقَاتِلُ شُجَاعَةً وَيُقَاتِلُ حَمِيَّةً وَيُقَاتِلُ رِيَاءً اَيُّ ذَالِكَ فِي سَبِيْلِ اللّٰهِ؟ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ قَاتَلَ لِتَكُوْنَ كَلِمَةُ اللّٰهِ هِيَ الْعُلْيَا فَهُوَ فِيْ سَبِيْلِ اللّٰهِ۔

(مسلم عن ابی موسیٰ کتاب الامارۃ ترمذی ابواب الجہاد)

220. మహాప్రవక్త(స)ను ఇలా అడగడం జరిగింది: "దైవప్రవక్తా! ఓ వ్యక్తి తన శౌర్య పరాక్రమాలు ప్రదర్శించడానికి యుద్ధంలో పాల్గొం టాడు. మరోవ్యక్తి తన ఆత్మాభిమానం, జాతి రక్షణ, భద్రతల కోసం ఖడ్గమెత్తుతాడు. ఇంకో వ్యక్తి ప్రదర్శనాబుద్ధితో యుద్ధంలో పాల్గొంటాడు. వీరిలో దైవమార్గంలో పోరాడేవారెవరు? అని.

"ఎవరైతే అల్లాహ్ సద్వచనం (దైవధర్మ) ప్రాబల్యం కోసం పోరాడు తాడో అతడే దైవమార్గంలో పోరాడే ముజాహిద్" అని బదులిచ్చారాయన.

(అబూ మూసా(రజిఅన్)– ముస్లిమ్, తిర్మిజీ)

**సంగ్రహణం:**

పోరాటంగాని, ఎన్నికల పోటీగాని దాని ఉత్ప్రేరకం కేవలం దైవనామ ఔన్నత్యం కోసమే అయితే, దేవుడు చూపిన సత్యధర్మాన్ని ఈ భువిలో స్థాపించడం కోసమే అయితే ఇది నిజంగా దైవమార్గంలో జిహాద్ చేయడమే. అలాకాకుండా దానికి విరుద్ధంగా తన స్వార్థం, వర్ణం, వర్గం, భౌతిక ప్రయోజనాల కోసం యుద్ధం చేస్తే అది దైవమార్గంలో జిహాద్

చేయడం క్రిందికి రాదు. కేవలం స్వప్రయోజనాల కోసం యుద్ధంలో పాల్గొనేవాడు ఓరకంగా కల్లోలాన్ని సృష్టించి దానికి ఆజ్యం పోస్తున్నట్లే.

## ధనప్రాప్తి కోసం చేసే జిహాద్

(۲۲۰) الف إِنَّ رَجُلاً قَالَ يَا رَسُوْلَ اللّٰهِ. رَجُلٌ يُرِيْدُ الْجِهَادَ فِيْ سَبِيْلِ
اللّٰهِ وَهُوَ يَبْتَغِيْ عَرَضًا مِنْ عَرَضِ الدُّنْيَا فَقَالَ النَّبِيُّ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا أَجْرَ لَهٗ فَأَعْظَمَ ذَالِكَ النَّاسُ
وَقَالُوْا لِلرَّجُلِ عُدْ لِرَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
فَلَعَلَّكَ لَمْ تُفْهِمْهُ فَقَالَ يَا رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ، رَجُلٌ يُرِيْدُ الْجِهَادَ فِيْ سَبِيْلِ اللّٰهِ وَهُوَ يَبْتَغِيْ عَرَضًا
مِنْ عَرَضِ الدُّنْيَا قَالَ لَا أَجْرَ لَهٗ فَقَالُوْا لِلرَّجُلِ عُدْ
لِرَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ لَهُ الثَّالِثَةَ
فَقَالَ لَهٗ لَا أَجْرَ لَهٗ۔ (ابوداؤد عن ابی ہریرۃ کتاب الجہاد)

220/1. ఓ వ్యక్తి మహాప్రవక్త(స) సన్నిధికి హాజరై : "దైవప్రవక్తా! ఓ వ్యక్తి ప్రాపంచిక భోగభాగ్యాలు పొందేందుకు దైవమార్గంలో జిహాద్ చేయదలుస్తాడు" (అతని గురించి తమ అభిప్రాయం ఏమిటి) అని అడగగా, మహనీయ ముహమ్మద్(స), "అతనికి ఎలాంటి పుణ్యఫలం ప్రాప్తించదు" అని బదులిచ్చారు. అక్కడున్నవారు ఆ విషయానికి ఎంతో ప్రాముఖ్యతనిచ్చి ఆ అడిగిన వ్యక్తితో, నీవు మరోసారి దైవప్రవక్తను ఈ ప్రశ్న అడుగు. బహుశా నీవు నీ భావాన్ని ఆయనకు అర్థమయ్యేటట్లు అడగలేదేమో అని ఒత్తిడి తెచ్చారు. (తిరిగి ఆ వ్యక్తి) దైవప్రవక్తా! ఓ వ్యక్తి ప్రాపంచిక ప్రయోజనాలను పొందడానికి దైవమార్గంలో 'జిహాద్' చేయ దలిచాడు (అతని గురించి తమ అభిప్రాయం ఏమిటి?) అని విన్నవించు కున్నాడు. "అతనికి ఎలాంటి పుణ్యఫలం ప్రాప్తించదు" అన్నారు దైవ ప్రవక్త(స). ప్రజల ప్రోద్బలంతో ఆ వ్యక్తి మళ్ళీ దైవప్రవక్తను మూడోసారి

అదే విషయం అడుగుతాడు. దానికి కూడా దైవప్రవక్త(స) అతడికి ఎలాంటి పుణ్యఫలం ప్రాప్తించదు అని బదులిచ్చారు. *(అబూహురైరా(రజి)-అబూదావూద్)*

**సంగ్రహణం:**

ఏ వ్యక్తి తన భౌతిక ప్రయోజనాలకోసం దైవమార్గంలో జరిగే జిహాద్‌లో పాల్గొంటాడో అతడు పరలోకంలో లభించే పుణ్యఫలం జారవిడుచుకుంటాడు.

## మూర్ఖుడైన ముజాహిద్ ఎవరు?

(۲۲۰/۲) جَاءَ رَجُلٌ اِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ اَرَأَيْتَ رَجُلاً غَزَا يَلْتَمِسُ الْاَجْرَ وَالذِّكْرَ مَالَهُ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا شَيْءَ لَهُ فَاَعَادَهَا ثَلَاثَ مَرَّاتٍ يَقُوْلُ لَهُ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَا شَيْءَ لَهُ ثُمَّ قَالَ اِنَّ اللّٰهَ لَا يَقْبَلُ مِنَ الْعَمَلِ اِلَّا مَا كَانَ لَهُ خَالِصًا وَابْتُغِيَ بِهِ وَجْهُهُ۔

(نسائی عن ابی امامہ کتاب الجہاد)

220/2. ఓ వ్యక్తి దైవప్రవక్త(స) సన్నిధికి హాజరై, దైవప్రవక్తా! పుణ్యఫలం మరియు కీర్తి (రెండూ) కోరి జిహాద్ చేస్తే అతని గురించి తమ అభిప్రాయం ఏమిటి? అని అడగ్గా మహాప్రవక్త(స) "అతడికెలాంటి పుణ్యఫలం లభించదు" అని సెలవిచ్చారు. ఆ వ్యక్తి మూడుసార్లు ఇదే ప్రశ్నను రెట్టిస్తే ఆయన "అతడికి ఎలాంటి పుణ్యఫలం లభించదు" అంటూ, కేవలం ఆయన కోసం, ఆయన ప్రసన్నత బడయడానికి చేసే కార్యాన్నే అల్లాహ్ స్వీకరిస్తాడు" అని సెలవిచ్చారు.

*(అబూఉమామా(రజిఅన్)- నిసాయి)*

**సంగ్రహణం:**

జిహాద్ చేసినందుకు ప్రతిఫలాన్ని, బహుమానాన్ని అల్లాహ్ నుండి కోరుకుంటూనే, ఆయన సృష్టితాల నుండి కూడా ఆ ప్రతిఫలాన్ని కోరుకునేవాడు నిజంగా 'షిర్క్' (బహుదైవారాధన) చేస్తున్నట్లే. జిహాద్‌లో పాల్గొని, ప్రతిఫలంగా అల్లాహ్ వానికి పుణ్యఫలం

ఇవ్వాలని కోరుకుంటూనే ఇటు ప్రజలు అతని శౌర్యపరాక్రమాలను గుర్తించాలని, తనను వేనోళ్ళా పొగడాలని దశదిశలు తన కీర్తిప్రతిష్టలు వ్యాపించాలని కోరుకునేవాడ్ని మూర్ఖుడైన ముజాహిద్ అనాలి. ఇలాంటి ముజాహిద్‌కు తాను కోరుకున్నది ఈ ప్రపంచంలో లభించినా లభించకపోయినా అల్లాహ్ దగ్గర మాత్రం ఎలాంటి విలువ ఉండదు. ప్రతిఫలం మాట అటుంచి కఠినశిక్షకు గురవడం ఖాయం.

## దైవమార్గంలో కాపలా కాచేవాని మహర్దశ

(۲۲۱) عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ عَيْنَانِ لَا تَمَسُّهُمَا النَّارُ عَيْنٌ بَكَتْ مِنْ خَشْيَةِ اللّٰهِ وَعَيْنٌ بَاتَتْ تَحْرُسُ فِيْ سَبِيْلِ اللّٰهِ۔ (ترمذی ابواب الجهاد)

221. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజిఅన్) మహాప్రవక్త(స) ఇలా సెలవిస్తూ ఉండగా నేను విన్నానని ఉల్లేఖిస్తున్నారు.

"ఇద్దరు వ్యక్తుల నేత్రాలు నరకాగ్ని కీలలకు బహు దూరంగా ఉంటాయి. (అంటే వాటికి ఆ అగ్ని తాకదు)

1. దైవభీతి వల్ల రోదించే నేత్రాలు 2. దైవమార్గంలో పహరా కాయడానికి మేల్కొనే వ్యక్తి నేత్రాలు (తిర్మిజీ)

**సంగ్రహణం:**

చిత్తశుద్ధితో దేవుని దాస్యం, ఆయన ఆదేశ పాలన చేస్తూనే ఆయన ఎడల భయభీతుల వల్ల రోదించే వారు నరకంలో ప్రవేశించరు.

యుద్ధ వాతావరణం అలుముకున్నప్పుడు శత్రువు ఆకస్మికంగా ఎక్కడ దాడిచేస్తాడో అని అప్రమత్తంగా ఉండి వెయ్యికళ్ళతో పహరా కాచేవారు, ధార్మిక సంస్థలను, ఆ సంస్థలను నడిపే నాయకులను రక్షించడానికి పహరా కాచే వారి నేత్రాలకు అగ్ని అంటదు. అంటే వారు నరకంలో ప్రవేశించరు అని అర్థం.

## జిహాద్ వదిలేయడం వల్ల ఎదురయ్యే పరిణామం

(۲۲۲) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَئِنْ تَرَكْتُمُ الْجِهَادَ وَ اَخَذْتُمْ بِاَذْنَابِ الْبَقَرِ وَتَبَايَعْتُمْ بِالْعِيْنَةِ لَيُلْزِمَنَّكُمُ

اِلٰهٗ مَذَلَّةً فِیْ رِقَابِكُمْ لَا تَنْفَكُّ عَنْكُمْ حَتّٰی تَتُوْبُوْا اِلَی اللّٰهِ
وَتَرْجِعُوْا عَلٰی مَا كُنْتُمْ عَلَیْهِ۔ (مسند احمد عن ابن عمر نمبر ۵۰۰۷)

222. మహాప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "మీరే గనక జిహాద్‌ను వదిలి ఎడ్ల తోకలను పట్టుకున్నారో! 'ఈనా' వ్యాపారంలో పడ్డారో!! (జాగ్రత్త) అల్లాహ్ మీ మెడలో అవమానమనే బంధాన్ని వేయగలడు. అల్లాహ్ వైపు మొగ్గితే, ఆయన మార్గంవైపుకు తిరిగి వస్తే తప్ప. అప్పటి వరకు ఈ అవమానం మిమ్మల్ని అంటుకునే ఉంటుంది.

(ఇబ్నె ఉమర్(రజిఅన్)– ముస్నదె అహ్మద్)

**సంగ్రహణం:**

ఎడ్ల తోకల్ని పట్టుకోవడం అంటే మీరు రేయింబవళ్ళు వ్యవసాయ పనుల్లోనే నిమగ్నులై ఉండడం అని అర్థం. 'ఈనా' అంటే, అమ్మిన వస్తువును తిరిగి తక్కువ ధరకు కొనడం అన్నమాట.

ఉదాహరణకు, ఖాలిద్ అనేవాడు రషీద్ అనే వ్యక్తి దగ్గర ఓ సంవత్సరం గడువు పెట్టి ఓ గడియారాన్ని మూడొందల రూపాయలకు అమ్మాడనుకుందాం. తిరిగి ఆ గడియారాన్ని అతడే రషీద్ దగ్గర నుండి రెండొందలు పెట్టి కొంటాడు. ఖాలిద్, రషీద్ దగ్గర ఓ సంవత్సరం అయిన తరువాత తిరిగి మూడొందలు వసూలు చేస్తాడు. అతడిచ్చింది నిజంగా రెండొందల రూపాయలే. ఈ సాకు మీద అతడు రషీద్ దగ్గర అదనంగా వంద రూపాయలు వసూలు చేస్తున్నాడు. ఇస్లామ్ ఇలాంటి వ్యాపారంలో గల వడ్డీవ్యాపార ధోరణిని అనుమతించదు. ఏ సమాజంలోనైనా ఇలాంటి ధోరణి కనబడితే ఆ వ్యక్తుల ధ్యేయం కేవలం డబ్బు గడించడమే అవుతుంది. ధర్మాధర్మాలు చూడకుండా అధిక డబ్బును సంపాదించడాన్నే ఫిఖా పరిభాషలో 'ఈనా వ్యాపారం' అంటారు.

అల్లాహ్ మీ మెడల్లో అవమాన బంధాన్ని వేస్తాడు అని అంటే, ముస్లిమేతరుల దృష్టిలో మీకెలాంటి విలువా, గౌరవం ఉండదు. వారి హృదయాల్లో మీ ఎడల ఎలాంటి మంచి అభిప్రాయం ఉండదు అని అర్థం.

దైవప్రవక్త(స) గారి ఈ ప్రవచనం సారాంశం ఏమిటంటే మీరు జిహాద్ (దైవ మార్గంలో అవిరళ కృషి) అనే మహోన్నత కార్యాన్ని వదిలేసి రేయింబవళ్ళు వ్యవసాయ పనుల్లోనే నిండా మునిగి ఉంటే డబ్బు సంపాదించడంలో హరాం హలాల్ నడుమగల తేడాను కూడా గుర్తించకపోతే మీరు అగౌరవం, అవమానం అనే గోతిలో పడిపోతారు. అందుండి బయటపడడానికి కేవలం ఒకే ఒక మార్గం ఉంది. మీరు చేసిన పాపాలకు పశ్చాత్తాపం నొంది 'తౌబా' చేసి దేవుణ్ణి క్షమించమని కోరుకోవడం, తిరిగి ఆయన

ఆదేశాలను పాలించి ఇస్లామీయ ఆదేశాలకు అనుగుణంగా నడుచుకోవడం, ఇస్లామ్ ధర్మోన్నతి కోసం, దాని ప్రాబల్యం కోసం 'జిహాద్' చేయడం ఒక్కటే ఆ ఏకైక మార్గం. కాబట్టి జిహాద్ అనే మహోన్నత కార్యాన్ని త్యజించకండి. దీన్ని వదిలేసినందుకు భయంకరమైన పరిణామాల్ని ఎదుర్కోవలసి వస్తుంది జాగ్రత్త!

## ఆపేక్షించదగ్గ రెండు కార్యాలు

(۲۲۳) قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ لَا حَسَدَ اِلَّا فِیْ اِثْنَیْنِ رَجُلٌ اٰتَاہُ اللّٰہُ مَالًا فَسَلَّطَہٗ عَلٰی ھَلَکَتِہٖ فِی الْحَقِّ وَ رَجُلٌ اٰتَاہُ اللّٰہُ حِکْمَۃً فَھُوَ یَقْضِیْ بِھَا وَیُعَلِّمُھَا۔

(مسلم عن ابن مسعود کتاب فضائل القرآن، بخاری کتاب العلم)

223. దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "అసూయ పడడం సరైనది కాదు కాని ఈ ఇరువురు వ్యక్తుల గూర్చి అసూయ పడడంలో తప్పులేదు. వారిలో ఒకడు, అల్లాహ్ తనకు ఒసిగిన బోలెడంత (హలాల్) ఆస్తి, ధన సంపదను దైవమార్గంలో వెచ్చించేవాడైతే మరొకడు దేవుడొసిగిన ధార్మిక జ్ఞానాన్ని తన క్రియాశీల జీవితంలో ఆచరణలో పెడుతూ దాని వెలుగులో (అన్ని రకాల స్పర్థలను, జగడాలను గురించి) తీర్పునిచ్చేవాడు మరియు ప్రజలకు ధార్మిక విద్యను గరిపేవాడు.'

(ఇబ్నె మస్ఊద్(రజిఅన్)- ముస్లిమ్, బుకారి)

**సంగ్రహణం:**

దైవమార్గంలో ఖర్చుపెట్టడం లేదా వెచ్చించడమంటే అతడు దైవధర్మోన్నతి కోసం, దాని ప్రాబల్యం కోసం డబ్బును వెచ్చించడం అన్నమాట. తన ఆస్తిలోని ఒక్క పైసా కూడా పాపకార్యాల్లో ఖర్చుచేయనివాడు అంటే అల్లాహ్ మార్గంలో తన సంపదలో జిహాద్ చేసేవాడని అర్థం.

అలాగే ఎవరికైతే అల్లాహ్ కేవలం తన కారుణ్యకటాక్షాలతో ఖుర్ఆన్, సున్నత్ (ప్రవక్త సంప్రదాయం) జ్ఞానాన్ని ఒసిగినప్పుడు దాన్ని తన క్రియా జీవితంలో ఆచరణలో పెడుతూ ఆ జ్ఞానాన్ని ఇతరుల్లో వ్యాపింపజేస్తాడో, ఏవైనా స్పర్థలు, జగడాలు వచ్చినప్పుడు ఖుర్ఆన్ మరియు సున్నత్ వెలుగులో తీర్పునిచ్చి వాటిని దూరం చేస్తాడో అలాంటి ధార్మికవేత్త కూడా అదృష్టవంతుడే.

ఇస్లాం దృష్టిలో ఇలాంటి సంపన్నులు, ఉలమాల గురించి అసూయపడవచ్చు. ముస్లిములు వారిని అనుసరించి వారి నడవడికను మార్గదర్శకంగా చేసుకోవాలి.

## సదఖా (దానం) ఎప్పుడు స్వీకరించబడుతుంది?

(۲۲۴) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ تَصَدَّقَ بِعَدْلِ تَمْرَةٍ مِنْ كَسْبٍ طَيِّبٍ ـــ وَلَا يَقْبَلُ اللّٰهُ اِلَّا الطَّيِّبَ ـــ اِنَّ اللّٰهَ يَتَقَبَّلُهَا بِيَمِيْنِهٖ ثُمَّ يُرَبِّيْهَا لِصَاحِبِهَا كَمَا يُرَبِّيْ اَحَدُكُمْ فَلُوَّهٗ حَتّٰى تَكُوْنَ مِثْلَ الْجَبَلِ۔

(بخاری عن ابی ہریرہ کتاب الزکوٰۃ مسلم کتاب الزکوٰۃ)

224. మహాప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు. "ఎవరైనా తన హలాల్ (ధర్మసమ్మతమైన) సంపాదన నుండి ఓ ఖర్జూర ఫలాన్ని దానం చేస్తాడో- అల్లాహ్ కేవలం హలాల్ మరియు పరిశుద్ధమైన వాటినే స్వీకరిస్తాడు- దేవుడు దాన్ని తన కుడిచేతితో తీసుకుంటాడు. తరువాత దాన్ని దానం చేసిన వ్యక్తి కోసం వృద్ధిపరుస్తాడు. చివరికి మీరు మీ పశువుల దూడల్ని ఎలా పెంచి పెద్దచేస్తారో అలా ఆ ఖర్జూరపు పుణ్యఫలం కొండంతగా పెరిగి వృద్ధి పొందుతుంది." (అబూ హురైరా(రజిఅన్)- బుకారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

దైవమార్గంలో డబ్బును కూడా వెచ్చించాల్సి ఉంటుంది. కేవలం దైవప్రసన్నత బడయడానికి ధర్మసమ్మతమైన సంపాదన నుండి ఏది ఖర్చుచేసినా- అది ఓ ఖర్జూర ఫలానికి సంబంధించిన విలువైనా సరే- అల్లాహ్ దాని పుణ్యఫలాన్ని ఎన్నోరెట్లు పెంచి దాతకు బహూకరిస్తాడు. ఓ ఖర్జూర ఫలం విలువ ఉహద్ కొండ అంత పుణ్యఫలాన్ని గొని వస్తుంది. దేవుడు హరాం (ధర్మం దృష్టిలో నిషిద్ధం) అయిన సొత్తును అసలే స్వీకరించడు. హరాం మార్గాల ద్వారా లక్షలాధి రూపాయలు దానం చేసినా అవన్నీ వ్యర్థమై పోతాయి. కొందరు అధర్మ సంపాదనాపరులు లక్షలాది రూపాయల్ని మసీదుల నిర్మాణం కోసం, ధార్మిక విద్యాసంస్థలు నడపడానికి చందాలుగా ఇస్తారు. కొందరు హజ్ చేయడానికి, మరికొందరు దానధర్మాలకు తమ అధర్మసంపాదన నుండి కొంత భాగాన్ని కేటాయించి ఖర్చు చేస్తూ స్వర్గానికి వారసులమైపోయామనే అత్యాశకు గురి అవుతారు. ఈ రకం అన్యాయసంపాదనాపరులు దేవుని దృష్టిని తప్పించుకోగలరా?

ఎవరైనా సరే, దైవమార్గంలో హరాం సొత్తును దానం చేసి సర్వజ్ఞాని, సర్వ విషయాలపై అజమాయిషి గల దేవుణ్ణి మోసపుచ్చలేడు.

## దైవమార్గంలో ధన వినియోగానికి పోటీపడడం

(۲۲۵) عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ يَقُوْلُ اَمَرَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَنْ نَتَصَدَّقَ وَوَافَقَ ذٰلِكَ عِنْدِيْ مَالًا فَقُلْتُ اَلْيَوْمَ اَسْبِقُ اَبَا بَكْرٍ اِنْ سَبَقْتُهٗ يَوْمًا قَالَ فَجِئْتُ بِنِصْفِ مَالِيْ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا اَبْقَيْتَ لِاَهْلِكَ فَقُلْتُ مِثْلَهٗ وَاَتٰى اَبُوْبَكْرٍ بِكُلِّ مَا عِنْدَهٗ فَقَالَ يَا اَبَا بَكْرٍ مَا اَبْقَيْتَ لِاَهْلِكَ؟ فَقَالَ اَبْقَيْتُ لَهُمُ اللّٰهَ وَرَسُوْلَهٗ قُلْتُ لَا اَسْبِقُهٗ اِلٰى شَيْءٍ اَبَدًا۔

(ترمذی ابواب المناقب، ابوداؤد کتاب الزکوٰۃ)

225. హజ్రత్ ఉమర్(రజిఅన్) గారి ఉవాచ : మహాప్రవక్త(స), దైవమార్గంలో మీ సంపదను వెచ్చించండి అని ఆదేశించినప్పుడు అదృష్ట వశాత్తు నా దగ్గర (బోలెడు) సంపద ఉంది. అప్పుడు (నా మనస్సులో) నేనిలా అనుకున్నాను. అబూబక్ర్(రజిఅన్) గారిని ఈ విషయంలో మించిపోవాలంటే ఇదే అదను; ఈ రోజు నేనాయన్ను మించిపోగలను అని. చివరికి నా దగ్గర ఉన్న సంపదలోని సగభాగం తీసుకువచ్చాను. మహాప్రవక్త(స) నన్నుద్దేశించి (ఉమర్)! నీవు నీ భార్యాపిల్లల కోసం ఎంత మిగిల్చావు అని అడిగారు. జవాబుగా దైవప్రవక్తా! ఇక్కడకు తెచ్చినంత అని విన్నవించుకున్నాను.

హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) తన దగ్గర సంపదనంతా ఎత్తు కొచ్చారు. దైవప్రవక్త ఆయన్నుద్దేశించి (అబూబక్ర్!) 'మీ భార్యాపిల్లల కోసం ఎంత ఉంచి వచ్చారు?' అని అడిగారు.

సమాధానంగా ఆయన దేవుడు, దేవుని ప్రవక్త ప్రసన్నత మాత్రమే అని విన్నవించుకున్నారు. (ఈ సంఘటన జరిగిన తరువాత) నేనను కున్నాను నేనెప్పుడు ఆయన్ను మించిపోలేనని. *(తిర్మిజీ, అబూదావూద్)*

**సంగ్రహణం:**

మహాప్రవక్త అల్లాహ్ మార్గంలో వెచ్చించమని ఆదేశించారు. ఓ మోమిన్(విశ్వాసి) తన ఇంట నున్నదంతా, మరో మోమిన్ తన సొత్తులోని సగభాగం తెచ్చి దైవప్రవక్త పాదాల చెంత ఉంచారు. వారిలో ప్రతివాడూ, దేవుని ప్రసన్నత, దైవప్రవక్త సంతుష్టిని కోరుకున్న వాడే. ఈ ప్రసన్నత బడయడంలోనూ ఒకరిని మించిపోవాలని మరొకరు తాపత్రయ పడ్డారు.

## హజ్రత్ ఉస్మాన్(రజిఅన్) దైవమార్గంలో వెచ్చించిన వైనం

(٢٢٦) عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ سَمُرَةَ قَالَ جَاءَ عُثْمَانُ إِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بِأَلْفِ دِينَارٍ فِي كُمِّهِ حِيْنَ جَهَّزَ جَيْشَ الْعُسْرَةِ فَنَثَرَهَا فِي حِجْرِهِ قَالَ عَبْدُ الرَّحْمٰنِ فَرَأَيْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُقَلِّبُهَا فِي حِجْرِهِ وَيَقُولُ مَا ضَرَّ عُثْمَانَ مَا عَمِلَ بَعْدَ الْيَوْمِ مَرَّتَيْنِ۔ (ترمذی ابواب المناقب)

226. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమ్రా(రజిఅన్) ఉల్లేఖనం: దైవ ప్రవక్త(స) 'తబూక్' యుద్ధానికి వెళ్ళే సైనిక దళానికి యుద్ధ వస్తు సామగ్రిని సిద్ధం చేస్తున్నప్పుడు హజ్రత్ ఉస్మాన్(రజిఅన్)ఒక వేయి దీనారాలు (అంటే 291తులాల బంగారు నాణేలు) తన చొక్కా జేబుల్లో ఎవరికీ కనబడకుండా దాచుకొని తెచ్చి ప్రవక్త(స) ఒళ్ళో పోశారు. ఆ దృశ్యాన్ని చూసిన అబ్దుర్ర హ్మాన్(రజిఅన్) ఇలా అంటారు: "దైవప్రవక్త(స) ఆ దీనారాల్ని తన ఒళ్ళోనే ఉంచుకొని అటుఇటు త్రిప్పి చూసి 'ఈరోజు తరువాత ఉస్మాన్ ఏ తప్పి దమూ ఆయన్ను నష్టపెట్టజాలదు' ఇలా రెండుమార్లు అన్నారాయన. *(తిర్మిజి)*

(۲۲۷) عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ خَبَّابٍ قَالَ شَهِدْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ يَحُثُّ عَلٰى جَيْشِ الْعُسْرَةِ فَقَامَ عُثْمَانُ بْنُ عَفَّانَ فَقَالَ يَا رَسُوْلَ اللّٰهِ عَلَيَّ مِائَةُ بَعِيْرٍ بِأَحْلَاسِهَا وَأَقْتَابِهَا فِيْ سَبِيْلِ اللّٰهِ ثُمَّ حَضَّ عَلَى الْجَيْشِ فَقَامَ عُثْمَانُ فَقَالَ يَا رَسُوْلَ اللّٰهِ عَلَيَّ مِائَتَا بَعِيْرٍ بِأَحْلَاسِهَا وَأَقْتَابِهَا فِيْ سَبِيْلِ اللّٰهِ ثُمَّ حَضَّ عَلَى الْجَيْشِ فَقَامَ عُثْمَانُ فَقَالَ عَلَيَّ ثَلٰثُمِائَةِ بَعِيْرٍ بِأَحْلَاسِهَا وَأَقْتَابِهَا فِيْ سَبِيْلِ اللّٰهِ فَأَنَا رَأَيْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَنْزِلُ عَنِ الْمِنْبَرِ وَهُوَ يَقُوْلُ مَا عَلٰى عُثْمَانَ مَا عَمِلَ بَعْدَ هٰذِهٖ مَا عَلٰى عُثْمَانَ مَا عَمِلَ بَعْدَ هٰذِهٖ۔ (ترمذی ابواب المناقب)

227. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఖబ్బాబ్(రజిఅన్) గారి ఉల్లేఖనం: ఆయన ఇలా అంటారు. నేను దైవప్రవక్త(స) సన్నిధికి వెళ్ళినప్పుడు ఆయన తబూక్ యుద్ధ సైనిక దళ సహాయనిధి కోసం అప్పీలు చేస్తున్నారు. (ఆ అప్పీలును విన్న) హజ్రత్ ఉస్మాన్(రజిఅన్) లేచి నిలబడి, దైవప్రవక్తా! దైవమార్గంలో నూరు ఒంటెలు వాటి జ్యూలు (జీనుపై కప్పే మేలిమి వస్త్రం Housing), గంత (Packsaddle) తో సహా సమర్పించడం నా వంతు అని ప్రకటించారు. (ఆ తరువాత) మహాప్రవక్త (స) యుద్ధ నిధి కోసం మళ్ళీ అప్పీలు చేయగా హజ్రత్ ఉస్మాన్(రజిఅన్) లేచి నిలబడి దైవప్రవక్తా! అల్లాహ్‌మార్గంలో రెండొందల ఒంటెలు వాటి జ్యూలు, గంతలతో సహా సమర్పించుకోవడం నా వంతు అని ప్రకటించారు. దైవప్రవక్త తిరిగి (మూడోసారి) అదే అప్పీలు చేయగా ఆయన లేచి నిలబడి మహాప్రవక్తా! అల్లాహ్ మార్గంలో మూడొందల ఒంటెలు వాటి జ్యూలు, గంతలతో సహా సమర్పించుకోవడం నా వంతు అని విన్నవించుకున్నారు. ఈసంఘటనను

తిలకించిన హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఖబ్బాబ్ (రజిఅన్) ఇలా అంటారు:

దైవప్రవక్త(స) మెంబర్ (ప్రసంగ వేదిక) నుండి దిగుతూ రెండుసార్లు అన్నారు. "ఈ పుణ్యకార్యం పిదప ఉస్మాన్ ద్వారా ఏదైనా తప్పిదం జరిగి పోతే అల్లాహ్ ఆయన్ను అడుగడు" అని. (తిర్మిజీ)

**సంగ్రహణం:**

తబూక్ యుద్ధానికి బయలుదేరే సైనిక దళాన్ని 'జైషుల్ ఉస్ర్' (పేదరికపు సైనికదళం) అని పిలిచేవారు. ఎందుకంటే నడి ఎండాకాలం మదీనా నగరానికి చాలాదూరం జిహాద్ కోసం వెళ్ళవలసి ఉంటుంది. పైగా కరువు ఏర్పడిన ఉన్న ఆ గడ్డుకాలంలో ఖర్జూరపు పంట కోతకు సిద్ధంగా వచ్చి ఉంది. దీనికితోడు ముస్లిముల వద్ద ప్రయాణం చేయడానికి ఒంటెలుగాని గుర్రాలుగాని లేవు. తినడానికి తిండికూడా లేదు.

ముప్ఫైవేల మంది ముజాహిద్‌ల ఈ సైనిక దళంలో కేవలం పదివేల మందికే ప్రయాణ వాహనాలున్నాయి. ఈ యుద్ధం హిజ్రిశకం రజబ్ మాసం తొమ్మిదిన జరిగింది. యుద్ధ సరంజామాను సిద్ధం చేసుకోవడానికి ప్రతి వ్యక్తి పాటుపడ్డాడు. హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) ఒక వెయ్యి దీనారాలు, ఆరువందల ఒంటెల్నిచ్చి సహాయపడ్డారు. హజ్రత్ ఉమర్(రజి) తన అర్థసంపదను తెచ్చిచ్చారు. హజ్రత్ అబూబక్ర్(రజి) అయితే తన సర్వస్వాన్నే ఈ మహత్కార్యం కోసం ధారపోశారు.

మొత్తానికి సహాబీలంతా, తమ స్తోమతకు మించే దైవమార్గంలో తమ సొత్తును ఖర్చుబెట్టారు.

## ధన వినియోగానికి ఉత్తమమైన మార్గాలు

(۱۰۲۸) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَفْضَلُ دِيْنَارٍ يُنْفِقُهُ الرَّجُلُ دِيْنَارٌ يُنْفِقُهُ عَلٰى عِيَالِهٖ وَدِيْنَارٌ يُنْفِقُهُ الرَّجُلُ عَلٰى دَابَّتِهٖ فِيْ سَبِيْلِ اللّٰهِ وَدِيْنَارٌ يُنْفِقُهُ عَلٰى اَصْحَابِهٖ فِيْ سَبِيْلِ اللّٰهِ۔ (مسلم عن ثوبان کتاب الزکوة)

228. మనిషి వినియోగించే ఉత్తమమైన దీనారం:

1. తన భార్యాపిల్లలపై వినియోగించేది 2. అల్లాహ్ మార్గంలో ప్రయాణించే జంతువుపై (వాహనంపై) ఖర్చు పెట్టేది.
3. దైవమార్గంలో తనకు సహకరించే సహచరులపై ఖర్చుబెట్టేది ఇది దైవప్రవక్త(స)గారి ప్రవచనం. (సూబాన్(రజిఅన్)– ముస్లిమ్)

**సంగ్రహణం:**

దీనారం అంటే మూడున్నర కాసుల బరువుగల బంగారు నాణెం. అంటే ధన సంపద అని అర్థం. డబ్బును వెచ్చించే పలు ధర్మబద్ధమైన మార్గాలున్నా, మూడు విషయాలపై ఖర్చుపెట్టడమే దాని ఉత్తమమైన విధానం.

1. తన భార్యాపిల్లల ధర్మబద్ధమైన అవసరాలు తీర్చడానికి అంటే వారి తిండి, బట్ట, ఆరోగ్యం, విద్య, శిక్షణలపై ఖర్చుపెట్టడం. ఓవిధంగా ఈ అవసరాలు తక్కిన అవసరాలన్నింటికంటే ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. ఆ అవసరాన్ని పూరించడమే ముఖ్యం.
2. దైవమార్గంలో 'జిహాద్' చేయడం కోసమే ప్రత్యేకించిన జంతువుపై ఖర్చుబెట్టడం. ఇది సంపద యొక్క సరైన, ఉత్తమమైన మరియు ప్రయోజనకరమైన వినియోగం. వాహనానికి ఉపయోగించే జంతువుపై సంపదను వెచ్చించడమంటే దాన్ని కొనడం, దాని మేత, దాణాల కొనుగోలు, వాటి సంరక్షణ కూడాను. దైవమార్గంలో ఉపయోగించడానికి కొనే నేటి సైకిళ్ళు, స్కూటర్లు, మోటారు సైకిళ్ళు, జీపులు, కార్లు, ట్రక్కులు వగైరాలు వాటి మెయిన్టేనెన్సు కోసం ఖర్చుపెట్టడం కూడా ఈ కోవకు చెందినవే.
3. నిర్విరామంగా, పూర్తికాలం అల్లాహ్ యొక్క ధర్మప్రాబల్యం కోసం, దాన్ని పరిచయం చేయడం కోసం పాటుపడే మిత్రులు ఎలాంటి చీకూచింతా లేకుండా తమ పనిలో నిమగ్నమై ఉండేందుకు వారి సహాయార్థం చేసే ఖర్చు కూడా దైవమార్గంలో ఖర్చుపెట్టడమే అవుతుంది.

## దైవమార్గంలో ఖర్చుపెట్టినందుకు లభించే ప్రతిఫలం

(۲۲۹) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ اَنْفَقَ نَفَقَةً فِيْ سَبِيْلِ اللّٰهِ كُتِبَتْ لَهٗ سَبْعُمِائَةِ ضِعْفٍ.

(ترمذی عن خریم بن فاتک ابواب الجہاد)

229. "అల్లాహ్ మార్గంలో (తక్కువైనా, ఎక్కువైనా) తన ధనాన్ని వినియోగించేవాడికి (అతని కర్మలపత్రంలో) ఏడువందల రెట్ల వరకు పుణ్యఫలం లిఖించబడుతుంది." అని దైవప్రవక్త(స) ప్రవచించారు.

(ఖురైమ్ బిన్ ఆతిక్(రజి)– తిర్మిజీ)

**సంగ్రహణం:**

అల్లాహ్ మార్గంలో ముస్లిమ్ తన ధనసంపదను వెచ్చించడంపై అతనికి లభించే కనీస ప్రతిఫలం ఇది. అయితే అంతకంటే అధికంగా లభించే ప్రతిఫలం ఎంతో మనిషి ఊహించనైనా ఊహించలేడు. పరలోక విషయాలు దాని వాస్తవికత మనిషి యొక్క ఈ చిన్న మెదడులో ఎలా ఎక్కగలవు?

## 'సదఖా' (దానం) చేయడం వల్ల సొమ్ము తరగదు

(۲۳۰) اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَا نَقَصَتْ صَدَقَةٌ مِنْ مَالٍ وَمَا زَادَ اللّٰهُ عَبْدًا بِعَفْوٍ اِلَّا عِزًّا وَمَا تَوَاضَعَ اَحَدٌ لِلّٰهِ اِلَّا رَفَعَهُ اللّٰهُ۔

(مسلم عن ابی ہریرہ کتاب البر والصلۃ ترمذی ابواب الصلۃ)

230. దైవప్రవక్త(స) ప్రవచనం: "అల్లాహ్ మార్గంలో సదఖా చేయడం వల్ల సొమ్ము తరగదు. క్షమించేవాన్ని అల్లాహ్ గౌరవిస్తాడు. కేవలం అల్లాహ్ కోసమే నమ్రతను పాటించే వాడిని అల్లాహ్ పైకి తెస్తాడు." (అబూహురైరా(రజిఅన్)- ముస్లిమ్)

**సంగ్రహణం:**

దానం చేయడం వల్ల జ్ఞానేంద్రియాలకు కూడా తట్టని వృద్ధి వికాసం జరుగుతుంది. పరలోకంలో జరిగే వృద్ధి గురించి ఆలోచిస్తే, ఓ ఖర్జూరపు పండుకు లభించే ప్రతిఫలం ఉహద్ కొండంత.

'అఫూ' అంటే క్షమించడం. తన హక్కును వదులుకోవడం, చూసీ చూడకుండా ఉండడం, తప్పును ఉపేక్షించడం, అంటే ఏ వ్యక్తి అయితే తనకు లభించనున్న హక్కును వదులుకుంటాడో, శక్తికలిగి ఉండి కూడా తనపై జరిగిన దౌర్జన్యాన్ని, అన్యాయ అక్రమాల్ని గురించి పగతీర్చుకోడో, ఇతరుల తప్పిదాలను క్షమించివేస్తాడో అతడు ప్రజల దృష్టిలో గౌరవం పొందుతాడు. ప్రతి వ్యక్తి అతణ్ణి సద్భావంతో గౌరవిస్తాడు. ఇక పరలోకంలో మరింత గౌరవానికి పాత్రుడవుతాడు.

నమ్రత కలిగి ఉండడమంటే అతడు తన స్థాయి, తన హోదాను తన గొప్పదనాన్ని చూసి మురిసిపోడు, అంటే తన స్థాయి, హోదా కంటే క్రిందనున్న వారిని నీచంగా చూడడు, కసురుకోడు. అంటే ఎవరైతే అల్లాహ్ కోసమే ఒకరి ఎడల నమ్రతగా మెలుగుతాడో అల్లాహ్ అతని స్థాయిని హోదాను ఈలోకంలో మరింత పెంచుతాడు. ప్రజల

మనస్సుల్లో అతడు చిరస్థాయిగా నిలిచిపోతాడు. ఇక ప్రళయదినాన అతనిస్థాయి మరింత పెరిగిపోతుంది.

## సదఖా చేయడానికి చివరి ఘడియల కోసం ఎదురు చూడకండి

(٢٣٠) اَنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ لَاَنْ يَّتَصَدَّقَ

الْمَرْءُ فِيْ حَيَاتِهٖ بِدِرْهَمٍ خَيْرٌ لَّهٗ مِنْ اَنْ يَّتَصَدَّقَ بِمِائَةٍ

عِنْدَ مَوْتِهٖ۔ (ابوداؤد عن ابی سعید الخدری کتاب الوصایا)

231. "చనిపోయే సమయంలో ఓ వంద దిర్హములు దానం చేసే దానికంటే మనిషి తన జీవితంలోనే ఓ దిర్హం దానం చేయడం మేలు" అని మహాప్రవక్త(స) ఉపదేశించారు.

(అబూసయీద్ ఖుద్రి(రజిఅన్)- అబూదావూద్)

**సంగ్రహణం:**

ఆరోగ్యంగా ఉన్నప్పుడు సదఖా (దానధర్మాలు) చేయడంలో లభించే పుణ్యఫలం, మనిషి మరణశయ్యపై ఉండి చేసే దానధర్మాలకంటే వంద రెట్లు అధికం అని భావించాలి. ఇక చనిపోతున్న వ్యక్తికి తాను ఇక ఈ లోకం వీడిపోతున్నాననే పూర్తినమ్మకం ఏర్పడిన తరువాత చేసే దానానికి ఎలాంటి ప్రయోజనం ఉండదు. ఒకవేళ ప్రయో జనం లభించినా, సాధారణ పరిస్థితుల్లో మనిషి దైవమార్గంలో ఖర్చు పెడితే మరింత పుణ్యఫలం లభించగలదు. తాను బ్రతికి ఉండగా దాన ధర్మా లంటే పిసినారితనాన్ని ప్రదర్శించే కొందరు, మరణ సూచనలు కాన రాగానే విశాల హృదయంతో ఖర్చుపెడుతూ ఉంటారు.

## దైవమార్గంలో మహిళల దానధర్మాలు

(٢٣١) اَنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ خَرَجَ وَمَعَهٗ بِلَالٌ

فَظَنَّ اَنَّهٗ لَمْ يُسْمِعِ النِّسَآءَ فَوَعَظَهُنَّ وَاَمَرَهُنَّ بِالصَّدَقَةِ

فَجَعَلَتِ الْمَرْاَةُ تُلْقِى الْقُرْطَ وَالْخَاتَمَ وَبِلَالٌ يَاْخُذُ فِيْ

طَرَفِ ثَوْبِهٖ۔ (بخاری عن ابن عباس کتاب العلم مسلم کتاب صلوۃ العیدین)

232. దైవప్రవక్త(స), హ్రజత్ బిలాల్(రజిఅన్) గారి వెంట (మస్జిద్ నుండి) బయటకు వచ్చినప్పుడు స్త్రీలు తన బోధనలను గ్రహించలేదని ఆయన భావించారు. (తరువాత ఆయన వారిని సమావేశపరిచి) ఉద్బోధించారు. సదఖా(దానం) చేయమని ఆదేశించారు. ఆ మహిళలు తమ తమ చెవిపోగుల్ని,ఉంగరాలను (ఆభరణాలను) తీసి హ్రజత్ బిలాల్‌కు అప్పజెప్పారు. ఆయన వాటిని తన అంగవస్త్రం చెరుగులో ప్రోవు చేసుకున్నారు." (ఇబ్నె అబ్బాస్(రజిఅన్)- బుకారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

మహాప్రవక్త(స) ఈద్ ప్రసంగం ముగించి బయటకు రాగా, ఈ ప్రసంగం ద్వారా మహిళలు దూరంగా కూర్చొని ఉండడం వల్ల ప్రయోజనం పొందలేకపోయారని గ్రహించారు. ఆయన హ్రజత్ బిలాల్(రజిఅన్)ను వెంటబెట్టుకొని వారి దగ్గరకు వెళ్ళారు. నరకకూపంలో పడవేసే పాపాలకు దూరంగా ఉండమని వారికి హితవు చెబుతూ దైవమార్గంలో సదఖా చేయమని ఆదేశించారు. ధర్మసమ్మతమైన సంపాదన నుండి దైవమార్గంలో వెచ్చించడం వల్ల నరకంలో బడవేసే తీవ్రమైన పాపాలు సైతం సమసిపోతాయని ప్రమాద సంఘటనల్లో, కష్టాల్లో చిక్కుకోకుండా తమను కాపాడుకోవచ్చని ఉద్బోధించారు. దైవకారుణ్యాన్ని, కరుణాకటాక్షాలను ఈ సదఖా ఆహ్వానిస్తుంది అనడంలో సందేహం లేదు. కాబట్టి స్త్రీలు తమ సొత్తునుండి వీలైనంత అధిక మొత్తంలో అల్లాహ్ మార్గంలో సదఖాచేసి దేవుని ప్రసన్నత పొందే ప్రయత్నం చేయాలి.

## ఏ ఆస్తి మన స్వంత ఆస్తి?

(۲۳۳) قَالَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَيُّكُمْ مَالُ وَارِثِهٖ اَحَبُّ اِلَيْهِ مِنْ مَالِهٖ ؟ قَالُوْا يَا رَسُوْلَ اللهِ مَا مِنَّا اَحَدٌ اِلَّا مَالُهٗ اَحَبُّ اِلَيْهِ قَالَ فَاِنَّ مَالَهٗ مَا قَدَّمَ وَمَالُ وَارِثِهٖ مَا اَخَّرَ

(بخاری عن ابن مسعود کتاب الرقاق)

233. "మీ స్వంత ఆస్తికంటే వారసుల ఆస్తినే ప్రేమించేవాడు మీలో ఎవరున్నారు? అని మహాప్రవక్త(స) అడగ్గా, అక్కడున్న వారు దైవప్రవక్తా!

మాలో ఎవడూ తన సొంత ఆస్తిని అభిమానించకుండా ఉండడు అని విన్నవించుకున్నారు. అప్పుడు దైవప్రవక్త(స), "పరలోకంలో పదిలంగా ఉండడానికి ముందు పంపించిందే మనిషి యొక్క సొంత సంపద. (ఇక తాను చనిపోయిన తరువాత) మిగిలివున్న ఆస్తి సంపదలన్నీ వారసులకు చెందినవే" అని సెలవిచ్చారు.

**సంగ్రహణం:**

మరణించిన తరువాత ప్రతి మనిషికి సంబంధించిన ఆస్తులు, సంపద అతని వారసుల హస్తగతమై పోతాయి. ఇదే తీరూను. దైవమార్గంలో ఆయన ప్రసన్నత బడయడానికి వీలైనంత అధికంగా, మేలైన సంపదను ఖర్చు పెట్టేదే పరలోకంలో అతని వాటాలో సురక్షితంగా ఉండే సంపద.

పరలోకం కోసం సొత్తును కూడబెట్టదలిచినవాడు ధర్మసమ్మతమైన ఆదాయం కోసం సొత్తును కూడబెట్టదలిచినవాడు ధర్మసమ్మతమైన ఆదాయం నుండి మేలైన సంపదనే అల్లాహ్‌మార్గంలో ఖర్చుపెట్టాలి. మరో హదీసు సారాంశమేమిటంటే మనిషి చనిపోయిన తరువాత దైవదూతలు, ఏయే సత్కార్యాలను ఈ రోజు కోసం పంపించి ఉంచారు? అని అతణ్ణి అడుగుతారు. దీనికి భిన్నంగా, ప్రపంచంలో అతను చనిపోయిన తరువాత ప్రజలు అనుకునేది అతడు ఎంత డబ్బు మిగిల్చిపోయాడు? ఎంత ఆస్తి ఉంచిపోయాడు అన్నదే. (మిష్కాత్)

## అధర్మ సంపాదన (హరాం సంపాదన) దానానికి పనికిరాదు

(۲۳۴) عَنِ ابْنِ عُمَرَ قَالَ اِنِّیْ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَ سَلَّمَ یَقُوْلُ لَا تُقْبَلُ صَلٰوةٌ بِغَیْرِ طُهُوْرٍ وَّلَا صَدَقَةٌ مِّنْ غُلُوْلٍ۔ (مسلم کتاب الطہارۃ)

234. శుచి- శుభ్రత (తహారత్) లేకుండా నమాజ్ చేస్తే అది ఎలా స్వీకరించబడదో, ఖియానత్ (కొల్లగొట్టిన) ధనంతో సదఖా(దానం) స్వీకరించబడదు" అని దైవప్రవక్త(స) సెలవిస్తూ ఉండగా నేను విన్నానని హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్(రజిఅన్) ఉల్లేఖించారు. (ముస్లిమ్)

**సంగ్రహణం:**

దైవమార్గంలో ధర్మసమ్మతమైన (హలాల్) సంపాదనే ఖర్చుబెట్టాలి. హరాం(నిషిద్ధ) మార్గాల నుండి సంపాదించగా వృద్ధి చెందిన డబ్బుతో చేసిన హజ్ ఆరాధనగాని, దానంగాని స్వీకరించబడవు. ఆ డబ్బుతో చేసే ఏ ఆరాధనకైనా పుణ్యం లభిస్తుంది అని అనుకోవడం అవివేకం. అల్లాహ్ కేవలం హలాల్ మార్గాల ద్వారా సంపాదించిన డబ్బు నుండి చేసిన దానధర్మాలనే స్వీకరిస్తాడు. వడ్డీ వ్యాపారస్తులు హరాం మార్గాల ద్వారా సంపాదించిన ధనవంతులు నిరుపేదల్ని పీడించే సంపన్నులు, జూదరులు, బందిపోట్లు, లూటీకోర్లు కొందరు దానం చేయడం వల్ల వారు చేసిన పాపాలన్నీ పరిహరింపబడతాయి, మన్నించబడతాయి అని అపోహకు గురవుతారు. ప్రళయం రోజున ఈ ఘోరమైన పాపాలకు తాము పట్టుబడమని తలుస్తూ ఉండడం మూలంగానే వారు తాము కూడబెట్టిన ఖజానాపై నాగుపాములై కూర్చుని సంరక్షించుకుంటున్నారు.



# దైవధర్మం వైపునకు ఆహ్వానించడమంటే కష్టాలను ఆహ్వానించడమే

(۲۳۵) قَالَ عَبْدُ اللهِ كَأَنِّيْ أَنْظُرُ إِلَى النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَحْكِيْ نَبِيًّا مِنَ الْأَنْبِيَاءِ ضَرَبَهُ قَوْمُهُ فَأَدْمَوْهُ وَهُوَ يَمْسَحُ الدَّمَ عَنْ وَجْهِهِ وَيَقُوْلُ اَللّٰهُمَّ اغْفِرْ لِقَوْمِيْ فَإِنَّهُمْ لَا يَعْلَمُوْنَ

(بخاری کتاب الانبیاء مسلم کتاب الجہاد)

235. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్(రజిఅన్), దైవప్రవక్త ఇలా సెలవిస్తూ ఉండగా విన్నానని ఉల్లేఖించారు.

"దైవప్రవక్తల్లో ఒకరి పరిస్థితి నా కళ్ళముందరే ఉంది. (దైవమార్గం వైపుకు పిలిచిన నేరానికి) ఆ ప్రవక్త జాతి ఆయన్ను శరీరం అంతా రక్తసిక్తమైపోయేటట్టు కొట్టి హింసించింది. అయినా ఆయన తన ముఖం నుండి కారుతూ వున్న రక్తాన్ని తుడుచుకుంటూ 'ఓ దేవా! నా ఈ జాతిని క్షమించు. దానికి అసలు యదార్థం ఏమిటో తెలియదు' అని ప్రార్థించారు.

(ముస్లిమ్, బుకారి)

**సంగ్రహణం:**

సత్య ప్రబోధం గావించేవారు తమ జాతి సంస్కరణ, దాని విముక్తి గూర్చే ఎల్లవేళలా ఆరాటపడుతూ ఉంటారు. తమ ప్రబోధ ప్రచారం ద్వారా చెడిపోయిన వారిని సన్మార్గం వైపుకు త్రిప్పడానికి వారిని నరకాగ్ని యాతన నుండి తప్పించడానికి ప్రయత్నం చేస్తారు. జాతి వారి ఎడల ఎన్ని దురాగతాలు, దుండగాలు చేసినా వారిని ఎంత హింసించినా సహనం పాటించి వారికి విముక్తి ప్రసాదించమని, సన్మార్గంపై పెట్టమని దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటారు.

ఈ హదీసులో పేర్కొన్న 'నబి' (దైవప్రవక్త) పేరు తెలియకపోయినా, ఈయన బనీ ఇస్రాయీల్ సంతతికి చెందినవాడు. కొన్ని ఉల్లేఖనాల ప్రకారం హజ్రత్ నూహ్(అస) (నోవా) ఇలా దుఆ చేసినట్లు ఉంది. ఆయన జాతివారు ఆయన్ను హింసించి స్పృహ లేకుండా చేశారు. స్పృహ వచ్చిన తరువాత ఈ ప్రార్థనే ఆయన నోట వెలువడింది.

మరికొన్ని ఉల్లేఖనాల ప్రకారం ఉహద్ యుద్ధం (హి(జీ శకం- 3) మరియు హునైన్ యుద్ధం (హి(జీశకం- 8)లలో మహాప్రవక్త ముహమ్మద్(స)కు కూడా ఇలాంటి దుఆయే చేసినట్లు ఆధారాలున్నాయి.

దీనిప్రకారం, జాతియొక్క ఎడతెగని హింస, జులుమును సహిస్తూ దైవధర్మ ప్రచారం చేసేవాడు ఆశలు వదులుకోవడంగాని, జాతిని శపించడంగాని చేయకూడదు అని తెలుస్తోంది.

## లక్ష్యసాధన మార్గం కష్టాలమయం

(۲۳۶) عَنْ خَبَّابِ بْنِ الْاَرَتِّ قَالَ شَكَوْنَا اِلَى رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ مُتَوَسِّدٌ بُرْدَةً لَهٗ فِيْ ظِلِّ الْكَعْبَةِ فَقُلْنَا اَلَا تَسْتَنْصِرُ لَنَا اَلَا تَدْعُوْ لَنَا فَقَالَ قَدْ كَانَ مَنْ قَبْلَكُمْ يُؤْخَذُ الرَّجُلُ فَيُحْفَرُ لَهٗ فِي الْاَرْضِ فَيُجْعَلُ فِيْهَا فَيُجَاءُ بِالْمِنْشَارِ فَيُوْضَعُ عَلٰى رَاْسِهٖ فَيُجْعَلُ نِصْفَيْنِ وَيُمْشَطُ بِاَمْشَاطِ الْحَدِيْدِ مَا دُوْنَ لَحْمِهٖ وَعَظْمِهٖ فَمَا يَصُدُّهٗ ذٰلِكَ عَنْ دِيْنِهٖ وَاللّٰهِ لَيَتِمَّنَّ هٰذَا الْاَمْرُ حَتّٰى يَسِيْرَ الرَّاكِبُ مِنْ صَنْعَاءَ اِلٰى حَضْرَ مَوْتَ لَا يَخَافُ اِلَّا اللّٰهَ وَالذِّئْبَ عَلٰى غَنَمِهٖ وَلٰكِنَّكُمْ تَسْتَعْجِلُوْنَ۔

(بخاری کتاب الاکراہ)

236. హజ్రత్ ఖబ్బాబ్ బిన్ అరత్(రజిఅన్) ఉల్లేఖనం ఇలా ఉంది: దైవప్రవక్త(స) తమ దుప్పటిని తలక్రింద పెట్టుకొని పడుకొని ఉండగా మేము ఆయన వద్దకుహాజరై (మక్కా బహుదైవారాధకుల ఆగడాల గురించి) విన్నవిస్తూ దైవప్రవక్తా! (ఇప్పటికైనా) మనల్ని ఆదుకొమ్మని అల్లాహ్‌ని ప్రార్థించరా? అని విన్నవించుకున్నాము. దానికి ఆయన, మీకు పూర్వం దైవధర్మంవైపు పిలిచేవారి పరిస్థితి ఎలా ఉందో తెలుసా (దైవ మార్గం వైపు ప్రజల్ని ఆహ్వానించిన నేరానికి గాను) వారిలో ఒకరిని పట్టుకొని లోతైన గోతి త్రవ్వి అతణ్ణి ఆ గోతిలో నిలబెట్టేవారు. ఆ తరువాత

అతని తలమీద రంపం పెట్టి రెండు ముక్కలై పోయేలా నిలువుగా చీల్చే వారు. మరొకరి శరీరంపై ఇనుప దువ్వెనలు గ్రుచ్చి ఎముకల నుండి అతని మాంసాన్ని వేరుపరిచేవారు. (అయితే) ఈ శిక్షలు వారిని వారి ధర్మసందేశ ప్రచారం నుండి ఆపేవికాదు. అల్లాహ్ సాక్షి! (ఓరోజు వస్తుంది) ఈ కార్యం పరిపూర్ణమై తీరుతుంది. చివరికి ఓ బాటసారి తన వాహనమెక్కి 'సన్అ' అనే ప్రదేశం నుండి హజర్మౌత్ వరకు ఎలాంటి భయం లేకుండా ప్రయాణం చేయగలడు. అయితే అతడు భయపడేదల్లా అల్లాహ్‌కు మరియు తన మేకను ఎక్కడ ఎత్తుకుపోతుందో అని తోడేలుకు మాత్రమే. కాని మీరు తొందర పడుతున్నారు. (బుకారి)

**సంగ్రహణం:**

హజ్రత్ ఖబ్బాబ్ బిన్ అరత్ అనే ఆయన మక్కా ఇస్లామీయ ఉద్యమంలో ఆరవ సహచరులు. ఆయనకు పూర్వం మహాప్రవక్త(స) సందేశ ప్రచారానికి ప్రభావితమై మరో అయిదుగురు ఇస్లాం స్వీకరించారు.

దైవవిశ్వాసులపై మక్కా బహుదైవారాధకుల ఆగడాలు అధికమైనప్పుడు హజ్రత్ ఖబ్బాబ్ ఎంతో వ్యాకులత చెందారు. కాబా గృహం క్రీనీడలో మేనువాల్చి సేద తీర్చు కుంటున్న దైవప్రవక్త(స) దగ్గరికెళ్లి, అయ్యా వీరి ఆగడాల గురించి మాకు విముక్తి కలిగించమని అల్లాహ్‌ను వేడరా? సహాయాన్ని అర్థించరా! అని విన్నవించుకున్నారు. వారి ఈ విన్నపాలు విని దైవప్రవక్త(స) దైవమార్గం వైపునకు ప్రజల్ని ఆహ్వానించే కార్యం, పూలసజ్జ కాదు, పూర్వ సమాజాలు ఈ పరీక్షల్ని చవిచూశాయని చెబుతూ ఇలా దైవమార్గం వైపు ఆహ్వానించే వారి కోసం గోతులు త్రవ్వబడేవి. వారిని అందు నిలబెట్టి వారి తలపై రంపాలు బెట్టి నిలువునా చీల్చేవారు. కొన్ని సందార్భాల్లో పదునైన మొనదేలిన ఇనుప దువ్వెనలు వారి శరీరంలో గ్రుచ్చి ఎముకలనుండి మాంసం వేరయ్యేట్లు దువ్వేవారు. అయినా వారు తమ ప్రాణాలను సయితం అల్లాహ్‌కు అర్పించారు గాని వారు నడుస్తున్న సత్యమార్గాన్ని ఇసుమంతైనా తప్పలేదు అని అన్నారు.

దైవప్రవక్త(స) ఈ ఉదాహరణల్ని చూపుతూ దైవధర్మ సంస్థాపన కార్యం కేవలం ప్రార్థనలు చేయడం వల్ల వేడికోళ్ళ వల్ల సాధ్యం అయ్యే కార్యం కాదని, ఈ కార్యకారణ ప్రపంచంలో అలాంటి ఘట్టాలనేకం ఎదురవుతాయి. పరీక్షలు, కష్టాల ఈ కొలిమిలో కరగకుండా విశ్వాసం చిత్తశుద్ధి అనే మేలిమి బయటకు రాదు అనే ఓ సూత్రాన్ని అప్పటి సహచరుల మనస్సుల్లో నాటారు.

# సత్యధర్మ మార్గంలో ఎదురయ్యే కఠిన పరీక్షలు

(۲۳۷) عَنْ عُرْوَةَ بْنِ الزُّبَيْرِ قَالَ قُلْتُ لِعَبْدِ اللّٰهِ بْنِ عَمْرِو بْنِ
الْعَاصِ أَخْبِرْنِيْ بِأَشَدِّ مَا صَنَعَ الْمُشْرِكُوْنَ بِرَسُوْلِ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ؟ قَالَ بَيْنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ يُصَلِّيْ بِفِنَاءِ الْكَعْبَةِ إِذْ أَقْبَلَ عُقْبَةُ بْنُ أَبِيْ مُعَيْطٍ
فَأَخَذَ بِمَنْكِبِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَلَوٰى
ثَوْبَهُ فِيْ عُنُقِهِ فَخَنَقَهُ خَنْقًا شَدِيْدًا فَأَقْبَلَ أَبُوْ بَكْرٍ
فَأَخَذَ بِمَنْكِبِهِ وَدَفَعَ عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ وَقَالَ أَتَقْتُلُوْنَ رَجُلًا أَنْ يَقُوْلَ رَبِّيَ اللّٰهُ وَقَدْ جَاءَكُمْ
بِالْبَيِّنَاتِ مِنْ رَبِّكُمْ۔ (بخاری کتاب التفسیر۔ کتاب الانبیاء)

237. మక్కా ముష్రిక్‌లు దైవప్రవక్త(స)ను అతిగా హింసించిన ఆ సంఘటన వివరాలను గురించి హజ్రత్ అనస్(రజిఅన్) గారిని హజ్రత్ ఉర్వా బిన్ జుబైర్ అడిగినప్పుడు ఆయన ఇలా వివరించారు.

“దైవప్రవక్త(స)అప్పుడు కాబాప్రాంగణంలో నమాజ్ చేస్తున్నారు. ఉక్బాబిన్ అబీ ముఅయిత్ అనే దుండగుడు వచ్చీరాగానే ఆయన భుజం గట్టిగా పట్టుకొని తన అంగవస్త్రం మెడలో వేసి గట్టిగా నులమనారంభించాడు. హజ్రత్ అబూబక్ర్(రజిఅన్) వచ్చి ఆ దైవవిరోధి భుజంపై చేయివేసి నెట్టిపారేస్తూ (ఓరి దురదృష్టుల్లారా!) ఎవరినిరా మీరు చంపాలనుకుంటుంది) నా దేవుడు ఒక్కడే అని ప్రకటిస్తూ ఉన్న ఈయన్నా!! మిమ్మల్ని పోషిస్తూ ఉన్న ఆ దేవుని తరపునుండి ప్రస్ఫుటమైన సూచనలు తెచ్చే వ్యక్తినా!!! అని నిలదీశారు. (బుకారి)

**సంగ్రహణం:**

ఉక్బా బిన్ అబీ ముఅయిత్ బద్ర్ యుద్ధం (హిజ్రీశకం 2)లో పట్టుబడ్డాడు.

దైవప్రవక్త ఆదేశం మేరకు హజ్రత్ ఖుబైబ్(రజిఅన్) బద్ర్ యుద్ధమైదానానికి మూడు మైళ్ళదూరంలో ఇర్కున్ నుత్‌బియా అనేచోట ఆ దురదృష్టవంతుణ్ణి హతమార్చారు.

## అసత్యవాదుల ఆగడాలు

۲۳۸) عَنْ عَبْدِ اللهِ بْنِ مَسْعُوْدٍ قَالَ اِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ كَانَ يُصَلِّيْ عِنْدَ الْبَيْتِ وَاَبُوْ جَهْلٍ وَاَصْحَابٌ لَهُ جُلُوْسٌ اِذْ قَالَ بَعْضُهُمْ لِبَعْضٍ، اَيُّكُمْ يَجِيْءُ بِسَلَا جَزُوْرِ بَنِيْ فُلَانٍ فَيَضَعُهُ عَلٰى ظَهْرِ مُحَمَّدٍ اِذَا سَجَدَ فَانْبَعَثَ اَشْقَى الْقَوْمِ فَجَاءَ بِهٖ فَنَظَرَ حَتّٰى اِذَا سَجَدَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَضَعَهُ عَلٰى ظَهْرِهٖ بَيْنَ كَتِفَيْهِ وَاَنَا اَنْظُرُ لَا اُغْنِيْ شَيْئًا لَوْ كَانَتْ لِيْ مَنَعَةٌ قَالَ فَجَعَلُوْا يَضْحَكُوْنَ وَيُحِيْلُ بَعْضُهُمْ عَلٰى بَعْضٍ وَرَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ سَاجِدٌ لَا يَرْفَعُ رَأْسَهُ حَتّٰى جَاءَتْهُ فَاطِمَةُ فَطَرَحَتْهُ عَنْ ظَهْرِهٖ فَرَفَعَ رَأْسَهُ۔ (بخاری کتاب الوضوء مسلم کتاب الجهاد والسیر)

238. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌ఊద్(రజిఅన్) ఉల్లేఖనం: దైవప్రవక్త(స) కాబా గృహం దాపులో నమాజ్ చేస్తూ ఉన్నారు. అబూ జహ్లె కూడా తన మిత్ర పరివారంతో కూర్చుని ఉన్నాడు. వాడు మిత్రుల నుద్దేశించి, మీలో ఫలానా వారి ఒంటెకు సంబంధించిన తడిచర్మపు పొరను తెచ్చి (మరో ఉల్లేఖనం ప్రకారం రక్తంతో ముద్దగా తడిసిన ఆ తోలు పొరలో దాని పొట్టలో వదరు కూడావేసి అని ఉంది) ముహమ్మద్(స) సజ్దాలో తన తలను భూమిపై ఆనిచ్చుగానే ఆయన రెండు భుజాల మధ్య వీపుమీద (ఆ అశుద్ధ పదార్థపు బరువైన మూటను) ఎవరుంచుతారు? అని అడిగాడు. ఓ దుష్టాతి దుష్టుడు (ఉక్బాబిన్ అబూ ముఅయిత్) లేచి దాన్ని

తీసుకొచ్చాడు. మహాప్రవక్త మళ్ళీ సజ్దా ఎప్పుడు చేస్తారా అని ఎదురు చూడనారంభించాడు. ఆయన సజ్దాలో తన నొసలును భూమికి ఆనిచ్చి ఆనిచ్చక ముందే ఆ అశుద్ధ పదార్థంతో నిండిన మూటను ఆయన వీపుపై రెండుభుజాల నడుమ ఉంచేశాడు. (ఈసంఘటనను వివరిస్తూ ఉన్న) హజ్రత్ అబ్దుల్లా బిన్ ముస్ఊద్(రజిఅన్) ఇలా అంటారు (ఆవేదనగా):

ఆ దురాగతం నా కళ్ళముందే జరుగుతోంది. కాని అసహాయుణ్ణి అవడం మూలంగా నేనేమీ చేయలేక పోయాను. (మక్కాలో) నా తెగ లేదా వంశం ఏదైనా ఉంటే ధైర్యంగా వెళ్ళి ఆ అశుద్ధ పదార్థాన్ని వెంటనే ప్రవక్త వీపుపై నుండి తొలగించేవాణ్ణి. వాళ్ళు పాశవికంగా నవ్వుతూ కేక పెడుతున్నారు. ఒకరిపై ఒకరు పడిపోతున్నారు. మహాప్రవక్త(స) తన తలను సజ్దా నుండి పైకి లేపలేకపోయారు. చివరికి (ఓ వ్యక్తి ద్వారా విషయాన్ని తెలుసుకున్న) హజ్రత్ ఫాతిమా(రజిఅన్) (పరుగున వచ్చి) దైవప్రవక్త(స) వీపుపై నుండి ఆ అశుద్ధాన్ని ఎత్తి దూరంగా పారవేశారు. అప్పుడుగాని ఆయన తన తలను పైకి లేపలేదు. (బుకారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

ఈ సంఘటన జరిగినప్పుడు ప్రవక్త ముద్దుల పట్టి సయ్యిదా ఫాతిమా(రజిఅన్) పదిహేనేళ్ళ అమ్మాయి. ఈ అసభ్య ప్రవర్తనకు ఖురైషీ నాయకుల్ని బాగా విమర్శిస్తూ చివాట్లు పెట్టారామె. కాని వారు ఎదురు మాట్లాడలేకపోయారు.

ఈ అసభ్యకర చర్య మక్కా బహుదైవారాధన దుండగుల నీతి నిజాయితీలు ఎలాంటివో చాటిచెబుతూ ఉంది. వారికి కారుణ్యమూర్తి అయిన ప్రవక్త ఏ నష్టం కలిగించారని? ఆయన ఏనాడైనా ఎవరినీ పల్లెత్తు మాట అనలేదు. ఎవరి హక్కుల్ని దోచుకోలేదు. సత్యం,న్యాయం, ధర్మం, శాంతి శుభాల ప్రతిరూపం అయిన ఆ సత్యవాక్కునే కదా చాట ప్రయత్నించారాయన! కొన్నేళ్ళ నిర్విరామ కృషి అనంతరం అల్లాహ్ కరుణాకటాక్షాల మూలంగా ఆయన పలికిన ఆ సద్వచనం 'మీ దేవుడొక్కడే ఆయనవైపుకే మీరు మరలండి' అన్న దాన్ని ఉన్నతం చేసి చూపెట్టారు. దాని ఫలితంగా ఏర్పడిన సమాజం శాంతి న్యాయం, సంపన్నతను సంతరించుకొని మహోన్నత మార్గదర్శకమైన ధర్మంగా రూపుదాల్చింది.

## సత్యధర్మ ప్రబోధకుడు ఎప్పుడూ నిరాశకు లోనుకాడు

(۲۳۹) اِنَّ عَائِشَةَ زَوْجَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ حَدَّثَتْ اَنَّهَا قَالَتْ لِرَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَا رَسُوْلَ اللّٰهِ! هَلْ اَتٰى عَلَيْكَ يَوْمٌ كَانَ اَشَدَّ مِنْ يَوْمِ اُحُدٍ؟ فَقَالَ لَقَدْ لَقِيْتُ مِنْ قَوْمِكِ وَكَانَ اَشَدَّ مَا لَقِيْتُ مِنْهُمْ يَوْمُ الْعَقَبَةِ اِذْ عَرَضْتُ نَفْسِيْ عَلَى ابْنِ عَبْدِ يَالِيْلَ بْنِ عَبْدِ كُلَالٍ فَلَمْ يُجِبْنِيْ اِلٰى مَا اَرَدْتُ، فَانْطَلَقْتُ ـــ وَاَنَا مَهْمُوْمٌ ـ عَلٰى وَجْهِيْ فَلَمْ اَسْتَفِقْ اِلَّا بِقَرْنِ الثَّعَالِبِ فَرَفَعْتُ رَأْسِيْ فَاِذَا اَنَا بِسَحَابَةٍ قَدْ اَظَلَّتْنِيْ فَنَظَرْتُ فَاِذَا فِيْهَا جِبْرَئِيْلُ عَلَيْهِ السَّلَامُ فَنَادَانِيْ فَقَالَ اِنَّ اللّٰهَ عَزَّ وَجَلَّ قَدْ سَمِعَ قَوْلَ قَوْمِكَ لَكَ وَمَا رَدُّوْا عَلَيْكَ، وَقَدْ بَعَثَ اِلَيْكَ مَلَكَ الْجِبَالِ لِتَاْمُرَهُ بِمَا شِئْتَ فِيْهِمْ قَالَ فَنَادَانِيْ مَلَكُ الْجِبَالِ وَسَلَّمَ عَلَيَّ ثُمَّ قَالَ يَا مُحَمَّدُ اِنَّ اللّٰهَ قَدْ سَمِعَ قَوْلَ قَوْمِكَ لَكَ وَاَنَا مَلَكُ الْجِبَالِ وَقَدْ بَعَثَنِيْ رَبُّكَ اِلَيْكَ لِتَاْمُرَنِيْ بِاَمْرِكَ فَمَا شِئْتَ؟ اِنْ شِئْتَ اَنْ اُطْبِقَ عَلَيْهِمُ الْاَخْشَبَيْنِ فَقَالَ لَهٗ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَلْ اَرْجُوْ اَنْ يُّخْرِجَ اللّٰهُ مِنْ اَصْلَابِهِمْ مَنْ يَّعْبُدُ اللّٰهَ وَحْدَهٗ لَا يُشْرِكُ بِهٖ شَيْئًا۔

(مسلم کتاب الجہاد والسیر۔ بخاری کتاب بدء الخلق)

239. దైవప్రవక్త సతీమణి హజ్రత్ ఆయిషా(రజిఅన్), మహా ప్రవక్త(స)ను అడిగారు.

"దైవప్రవక్తా! 'ఉహద్' రోజుకంటే కఠినమైన రోజు మరెప్పుడైనా అనుభవించారా' మీరు? అని. జవాబుగా ఆయన ఇలా సెలవిచ్చారు.

"ఆయిషా! నీ వంశం ఖురైష్‌వల్ల నాకు అనేక బాధలు కలిగాయి. అన్నింటికంటే కఠినమైన దినం 'అల్బ్‌' దినం. ఆ రోజు నేను ఇబ్నె అబీయాలైల్ దగ్గరకు వెళ్ళాను. నేను అడిగిన దాన్ని అతడు నిరాకరిం చాడు. (అంటే నన్నతడు మాట వరుసకైనా ధైర్యం చెప్పలేదు) అలా ఆవేదనాభరిత హృదయంతో నా దారిపట్టాను. 'ఖుర్‌నిస్సాలిబ్' అనే ప్రదేశానికి వెళ్ళాక నా గుండె బరువు కొంత తగ్గింది. (ఆకాశం వైపు) తలెత్తి చూడగా మబ్బులు కనబడ్డాయి. నాపై నీడ కలిగించాయి. వాటి మధ్య హజ్రత్ జిబ్రీల్(అస) ఉన్నారు. నన్ను పిలిచి ఆయన, "నీ జాతి నీతో అన్న మాటలన్నీ నీ పిలుపుకు వారు చూపిన తిరస్కారం అంతా అల్లాహ్ విన్నాడు. మీ దగ్గరకు పర్వతాలపై అజమాయిషీ కలిగిన దైవదూతను పంపాడు. వారిగురించి మీరు ఏ ఆదేశమిస్తారో ఈ దైవదూత దాన్ని నెరవేరుస్తాడు" అని చెప్పి కనుమరుగయ్యారు.

ఆ తరువాత పర్వతాల వ్యవస్థకై అజమాయిషీ గల దైవదూత ప్రత్యక్షమై సలాం చేస్తూ, "ముహమ్మద్ (స) మీ జాతి మీకిచ్చిన సమాధానం ఏమిటో అల్లాహ్ విన్నాడు. నేను పర్వతాల అజమాయిషీ కోసం నియమించబడ్డ దైవదూతను. దేవుడు నన్ను తమవద్దకు పంపాడు. మీ ఆదేశం కోసం ఎదురు చూస్తున్నాను. మీరనుకుంటే (మక్కా నగరానికి ఇరువైపులున్న) పర్వతాలను (అబూ కుబీస్ మరియు జబ్లె అహ్మద్)ను పరస్పరం ఢీకొట్టించి ఈ మక్కా వాసులందరిని పిండిపిండి అయ్యేలా చేస్తాను" అన్నాడు.

దైవప్రవక్త(స) ఆ దైవదూతతో (అలా జరగడానికి వీల్లేదు) "అల్లాహ్ ఈ జాతినుండే ఓ సంతతిని ఉనికిలోనికి తెస్తాడు. అది కేవలం అల్లాహ్‌నే ఆరాధిస్తుంది. మరెవ్వరినీ ఆయనకు సహవర్తులుగా నిలబెట్టదు అనే ఆశ ఉంది నాకు" అని పలికారు. (బుకారి, ముస్లిమ్)

**సంగ్రహణం:**

మహాప్రవక్త ముహమ్మద్(స)ఖురైషీ తెగవాళ్ళు తమపై జరిపిన దౌర్జన్యాలను, దుండగాలను, జులుమ్‌ను సహించలేక తాయెఫ్ అనే ప్రదేశానికి బయలుదేరి వెళ్ళారు. అక్కడి ఓ పేరుమోసిన సర్దారు అయిన 'ఇబ్నె అబ్దె యాలైల్'కు ఇస్లాం సందేశాన్నిచ్చి సహాయపడమని కోరారు. కాని అతడు ఆయన మాటలను వినకపోవడమే కాకుండా పోకిరి కుర్రాళ్లను ఆయన మీదికి ఉసి కొలిపాడు. వాళ్ళు రాళ్ళతో మట్టి పెడ్డల్తో ఆయన్ని గాయపరిచారు. ఆ గాయాల నుండి కారిన రక్తంతో ఆయన పాదరక్షలు సయితం తడిసిపోయాయి. అక్కడే ఆయన స్పృహతప్పి పడిపోయారు కూడా.

ధర్మప్రచార కార్యాన్ని చేపట్టినవారు అన్నిరకాల కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది. అనుకూలంగాని పరిస్థితిని గాంచి తమ కార్యాన్ని వదిలేసి నిరాశగా మిన్నకుండా ఉండిపోరువారు. సతతం కష్టపడుతూ ధైర్యసాహసాలతో ముందడుగు వేస్తారేగాని నిరాశ చెందడంగాని, ప్రజలను శపించడంగాని చేయరు. సరికదా, వారిని రుజుమార్గంపై పెట్టమని దేవుణ్ణి ఎల్లప్పుడూ వేడుకుంటూనే ఉంటారు.

## అల్లాహ్ మార్గంలో దీక్షా స్థర్యాలు

(۲۴۰) قَالَ ابْنُ عَبَّاسٍ قَالَ اَبُوْجَهْلٍ لَئِنْ رَأَيْتُ مُحَمَّدًا يُصَلِّيْ عِنْدَ الْكَعْبَةِ لَاَطَأَنَّ عَلٰى عُنُقِهٖ فَبَلَغَ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ لَوْ فَعَلَ لَأَخَذَتْهُ الْمَلَائِكَةُ۔

(بخاری کتاب التفسیر ترمذی ابواب التفسیر)

240. "ముహమ్మద్(స)ను 'కాబా'దగ్గర నమాజు చేస్తూ ఉండగా చూస్తే నా కాలితో అతని మెడను నులిమేస్తాను" అని అన్న అబూజహ్లా మాటలు దైవప్రవక్త(స) చెవిన పడగానే ఆయన, అతడే అలా చేస్తే అతణ్ణి దైవదూతలు పట్టుకుంటారు అని సెలవిచ్చారు.

(అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజిఅన్)– బుకారి, తిర్మిజీ)

**సంగ్రహణం:**

అబూజహ్లా అందరి సమక్షంలో ఈ రెచ్చగొట్టే మాటలన్నాడు. మరో ఉల్లేఖనంలో ఈ సంఘటన కొంత వివరంగా చెప్పబడింది.

"అతడు దైవప్రవక్త(స)ను నమాజ్ చేసే స్థితిలో, నేను నిన్నిక్కడ నమాజ్

చేయవద్దని చెప్పానా? అని మూడుసార్లు అన్నాడు. నమాజ్ ముగించిన తరువాత దైవప్రవక్త(స) లేచి అతణ్ణి గద్దించారు.

దీనిపై అబూజహ్ల్, ఏ అండజూసుకొని నన్ను గద్దిస్తున్నావు? మక్కా వాసుల్లో అత్యధికులు నా మద్దతుదారులు. (అంటే నా ఎదురుగా నిలబడి నన్ను గద్దిస్తున్నావా నీ వెంత చేసినా నన్ను మించిపోలేవు. ఈ లోయలో ఉన్నవారంతా నా అనుయాయులే నీ వైపున్నవారెంతమంది? అని అడగడం అన్నమాట) ఈ సందర్భంలోనే దివ్యవాణి ఇలా అవతరించింది.

"ఒక దాసుడు నమాజ్ చేస్తుంటే అతణ్ణి నిరోధించే వ్యక్తిని నీవు చూశావా? ఒకవేళ (ఆ దాసుడు) రుజుమార్గంలో ఉంటే, లేదా జనానికి భయభక్తులను గురించి బోధిస్తూ ఉంటే, అప్పుడు నీ అభిప్రాయం ఏమిటి? (నిరోధిస్తున్న ఈ వ్యక్తి) ఒకవేళ సత్యాన్ని తిరస్కరిస్తూ ఉంటే(దాన్నుండి) విముఖుడు అవుతూ ఉంటే అప్పుడు నీ అభిప్రాయం ఏమిటి? అల్లాహ్ చూస్తున్నాడనే విషయం అతనికి తెలియదా? అలా ఎంతమాత్రం జరగదు. అతడుగనక మానకపోతే మేము అతణ్ణి అతని నుదిటి వెంట్రుకలు పట్టి ఈడుస్తాము. అబద్ధానికి ఘోరపాపానికి పాల్పడిన నుదురతనిది. అతడు తన మద్దతు దారుల మూకలను పిలుచుకోమను. మేము కూడా మా శిక్షించే దూతల్ని పిలుచు కుంటాము." (అలఖ్, 9-18)

ఈ హదీసు ఉల్లేఖన కర్త అయిన హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజిఅన్) "దైవసాక్షి! అతడే తన మద్దతుదారుల్ని పిలిస్తే అల్లాహ్ దూతలు అతణ్ణి పట్టుకొని శిక్షించేవారే" అన్నారు. (ముస్నదె అహ్మద్, తిర్మిజీ)

## దైవధర్మప్రబోధ మార్గంలోని అడ్డంకులు

(۲۴۱) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَقَدْ اُخِفْتُ فِى اللّٰهِ وَمَا يُخَافُ اَحَدٌ وَلَقَدْ اُوْذِيْتُ فِى اللّٰهِ وَمَا يُؤْذٰى اَحَدٌ، وَلَقَدْ اَتَتْ عَلَىَّ ثَلَاثُوْنَ مِنْ بَيْنِ يَوْمٍ وَلَيْلَةٍ وَمَالِىْ وَلِبِلَالٍ طَعَامٌ يَاْكُلُهٗ ذُوْكَبِدٍ اِلَّا شَىْءٌ يُوَارِيْهِ اِبْطُ بِلَالٍ۔ (ترمذی ابواب صفۃ القیامۃ)

241. మహాప్రవక్త(స) ఇలా ప్రవచించారు: "నేను అల్లాహ్ మార్గంలో భయపెట్టబడ్డాను, హింసించబడినాను. నాలా మరెవ్వరినీ

భయపెట్టడంగాని, హింసించడంగాని జరుగలేదు. నేనూ, బిలాల్ ఇద్దరం కలిసి ఏ ప్రాణీ తినగలిగే ఆహారం లేకుండా వరుసగా ముప్ఫై రోజులు గడపవలసి వచ్చింది; బిలాల్ తన చంకన పెట్టుకొని వచ్చింది తప్ప."

(తిర్మిజీ)

**సంగ్రహణం:**

దేవుడు తన సత్యధర్మ ప్రాబల్యం కోసం దైవప్రవక్త(స)ను ప్రభవింపజేశాడు. మక్కా దైవతిరస్కారులు ప్రవక్త ప్రారంభించిన ఈ సత్కార్యాన్ని అడ్డుకోవడానికి ఆయన్ను చంపుతామని బెదిరించారు. కఠినాతికఠినంగా హింసించి ఆయన్ను జంకగొట్టే ప్రయత్నంచేశారు. శారీరకంగాను, మానసికంగాను ఆయన్ను బాధించారు. వారికి చేతనైనంతమట్టుకు అన్ని ప్రయత్నాలు చేశారు. ఆయనను వ్యతిరేకంగా అన్నిరకాల ఉపాయాలను పన్నారు. ఇలాంటి కఠిన పరిస్థితులు దైవప్రవక్త(స) గారికి తప్ప మరే ధర్మప్రచారకునికి ఎదురుకాలేదు.

మహాప్రవక్త(స) ప్రారంభంలో ఈ అడ్డంకులు, కష్టాలు భరిస్తూనే ఒంటరిగా ఈ కార్యాన్ని కొనసాగించారు. దీనికితోడు అప్పుడు ఆయన ఆర్థికంగా చెప్పలేనంత దెబ్బతిని ఉన్నారు కూడా. ఓ నెల వరకు ఎడతెగకుండా పస్తులుండాల్సి వచ్చింది. అప్పుడు ఆయన వెంట హజ్రత్ బిలాల్(రజిఅన్) కూడా ఉన్నారు. బిలాల్ కొంత తినుబండారాన్ని తన వెంట తెచ్చుకున్నది తప్ప తినదగిన మరే ఆహారపదార్థం లభించలేదు వారిరువురికి. అన్నిరోజులు దాన్నే సరిపుచ్చుకోవాల్సి వచ్చింది వారిద్దరు. బహుశా ఇది మక్కానుండి తాయఫ్‌కు దైవప్రవక్త ధర్మప్రబోధం చేయడానికి వెళ్ళినప్పటి కాలం కావచ్చు.

## దైవమార్గంలో శారీరక యాతనలు

(۲۴۲) جاءَ خبّابٌ اِلیٰ عُمَرَ فقَالَ اُدْنُ، فَمَا اَحَدٌ اَحَقُّ بِهٰذَا
الْمَجْلِسِ مِنْكَ اِلَّا عَمَّارٌ فَجَعَلَ خَبَّابٌ يُرِيهِ اٰثَارًا
بِظَهْرِهٖ مِمَّا عَذَّبَهُ الْمُشْرِكُوْنَ۔ (ابن ماجہ، فضائل خباب)

242. ఖబ్బాబ్ బిన్ అరత్ (రజిఅన్) ఓసారి ముస్లిముల ఖలీఫా అయిన హజ్రత్ ఉమర్(రజిఅన్)ను కలుసుకోవడానికి వచ్చారు. అప్పుడు ఆయన, "ఖబ్బాబ్! రండి నా దగ్గరగా వచ్చి కూర్చొండి. ఈ స్థలంలో కూర్చో డానికి మీకంటే అర్హుడైన వ్యక్తి మరొకరు లేరు అమ్మార్ బిన్ యాసిర్ (రజిఅన్) తప్ప" అని పలికారు. హజ్రత్ ఖబ్బాబ్ ఈ మాట విని మక్కా

బహుదైవారాధకుల హింసలు, యాతనల ఫలితంగా తమ వీపుపై నిలిచి పోయిన చెరగని గురుతులను చూపెట్టారు. (ఇబ్నెమాజా)

**సంగ్రహణం:**

హజ్రత్ ఖబ్బాబ్(రజిఅన్) అలా ఉమర్(రజిఅన్) దగ్గర కూర్చోగానే ఆయనకు ఇదివరకు మక్కాలో అనుభవించిన సంఘటనలు గుర్తుకువచ్చాయి. మక్కా ముష్రికులు ఆయన్ను కణకణలాడే నిప్పుకణికలపై ఎలా పరుండబెట్టారో, ఆ వేడికి తన క్రొవ్వు కరిగి ఎలా నిప్పు కణికలను చల్లార్చిందో ఒక్కొక్కటిగా గుర్తుకురాసాగాయి. ఇన్ని హింసలకు గురైన ఆ ఇస్లామీయ కార్యకర్త అల్లాహ్ పట్ల ఆయన ప్రవక్తపట్ల ఉన్న ప్రేమాభిమానాలను మాత్రం విడువలేదు. ఆ విషయాలు గుర్తుకు రాగానే ముస్లిముల రెండో ఖలీఫా అయిన హజ్రత్ ఉమర్(రజిఅన్)గారికి, మక్కా బహుదైవారాధకుల ఆగడాలకు తన వీపుపై నిలిచిపోయిన లోతైన గాయాల గురుతులను చూపెట్టారాయన.

## సత్యమార్గంలో ఎదురయ్యే కష్టాలు

(۲۴۳) اِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ كُسِرَتْ رَبَاعِيَتُهُ يَوْمَ اُحُدٍ وَشُجَّ فِيْ رَأْسِهِ فَجَعَلَ يَسْلُتُ الدَّمَ عَنْهُ وَيَقُوْلُ كَيْفَ يُفْلِحُ قَوْمٌ شَجُّوْا نَبِيَّهُمْ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَكَسَرُوْا رَبَاعِيَتَهُ وَهُوَ يَدْعُوْهُمْ اِلَى اللهِ فَاَنْزَلَ اللهُ تَعَالٰى، لَيْسَ لَكَ مِنَ الْاَمْرِ شَيْءٌ۔

(مسلم عن انس کتاب الجہاد و السیر)

243. ఉహద్ (యుద్ధం జరిగిన) రోజున (హిజ్రీ శకం-3) దైవ ప్రవక్త(స) మునిపల్లు విరిగాయి. ఆయన తల గాయపడింది. ముఖంపై నుండి కారే రక్తాన్ని తుడుచుకుంటూ ఇలా అన్నారు:

“అల్లాహ్ మార్గం వైపుకు పిలుస్తున్న ప్రవక్తను గాయపరిచి ఆయన మునిపల్లను విరిచిన ఆ జాతి ఎలా సంస్కరించబడుతుంది?” అని. ఈ సందర్భంలోనే ఈ దైవవాణి ఆయనపై అవతరించింది.

“ఓ ప్రవక్తా! వారు అసత్యవాదులే అయినా వారిపై నీకెలాంటి

అధికారం లేదు. వారిని మన్నించడం (అంటే తౌబా చేసే వీలు కల్పించడం) లేదా శిక్షించడం అల్లాహ్ ఇష్టం." *(ఆలి ఇమ్రాన్- 8)*

(అనస్(రజిఅన్) ముస్లిమ్)

**సంగ్రహణం:**

ఉహద్ యుద్ధంలో దైవప్రవక్త(స) నొసలు చెక్కిళ్ళు, క్రింది పెదవి గాయపడ్డాయి. క్రింది మునిపల్లు కూడా విరిగాయి. శిరస్త్రాణం కూడా ముక్కముక్కలైపోయింది. ముఖమంతా రక్తంతో తడిసిపోయింది. హజ్రత్ ఫాతిమా(రజిఅన్) ఆ గాయాలను కడగ ప్రయత్నం చేస్తూ ఉంటే ఆ గాయాల నుండి మరింత రక్తస్రావం జరగనారంభించింది. అప్పుడామె చాపముక్కల్ని కాల్చి దాని బూడిదను గాయాలపై పెట్టి అద్దారు. వెంటనే రక్తం ఆగిపోయింది. ఈ సందర్భంలోనే ఆయన జాతిని శపించింది. అప్పుడు దేవుడు ఆయన్ను హెచ్చరిస్తూ ఈ విషయంలో నిర్ణయం చేయవలసిన అధికారం నీకు లేదు; అల్లాహ్, వారిని క్షమించి వదిలిపెడతాడో లేదా శిక్షిస్తాడో అది ఆయన ఇష్టం అని దివ్యవాణి ద్వారా తెలియజేస్తాడు. కొంతసేపైన తరువాత దైవప్రవక్త వారికోసం ఇలా ప్రార్థించారు. "ఓ దేవా! నా జాతిని క్షమించు. దీనికి (యదార్థం ఏదో) తెలియదు" అని.

## దైవమార్గంలో ధీరత్వం అవసరం

(۲۴۴) اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ کَانَ فِیْ بَعْضِ الْمَشَاھِدِ
وَقَدْ دَمِیَتْ اِصْبَعُہٗ فَقَالَ
ھَلْ اَنْتِ اِلَّا اِصْبَعٌ دَمِیْتِ
وَفِیْ سَبِیْلِ اللّٰہِ مَا لَقِیْتِ

(بخاری عن جندب بن سفیان کتاب الجہاد مسلم کتاب الجہاد)

244. "ఓ యుద్ధంలో మహాప్రవక్త(స) చేతివ్రేలు గాయపడి రక్తసిక్తమైంది. ఆ వ్రేలినుద్దేశించి ఆయన, నీవెంత! (నీ విలువెంత?) కేవలం రక్తంతో తడిసిపోయిన ఓ వ్రేలివే కదా!! నీకు దగిలిన ఈ గాయం దైవమార్గంలో తగిలిందే." *(జుందుబ్ బిన్ సుఫ్యాన్(రజిఅన్)- బుకారి, ముస్లిమ్)*

**సంగ్రహణం:**

ఉహద్ యుద్ధంలో దైవప్రవక్తకు రాయి తగిలి క్రిందపడిపోవడం వల్ల వ్రేలు గాయపడింది. ఆ గాయం నుండి రక్తం కారుతూ ఉండగా దాన్ని సంబోధిస్తూ అబ్దుల్లా

బిన్ రవాహా(రజిఅన్)గారు పైనుదాహరించిన పద్యపాదాన్ని చదివారు. దాని అర్థం ఏమిటంటే అల్లాహ్ మార్గంలో సర్వం త్యజించవలిసి ఉంటుంది. చేయి అన్నది శరీరంలోని ఓ అంగమే. నీవు ఆ అంగంలోనుండి తెగిపోయి వేరైపోలేదు. కేవలం రాయి తగలడం వల్ల గాయపడ్డావు. రక్తంతో తడిశావు అంతే. దైవమార్గంలో ఏమంత గొప్ప త్యాగం చేయలేదు. ఈ బాధను నీవు దైవమార్గంలో సహించావు అంతే.

## దైవమార్గంలో సహాబీల స్థైర్యం

(۲۴۵) عَنْ قَيْسٍ قَالَ سَمِعْتُ سَعِيْدَ بْنَ زَيْدٍ يَقُوْلُ لِلْقَوْمِ لَقَدْ رَأَيْتُنِيْ وَإِنَّ عُمَرَ مُوْثِقِيْ عَلَى الْإِسْلَامِ أَنَا وَأُخْتَهُ وَمَا أَسْلَمَ۔ (بخاری کتاب المناقب باب اسلام عمر بن الخطاب)

245. హజ్రత్ ఖైస్(రజిఅన్) గారి ఉల్లేఖనం : "హజ్రత్ ఉమర్ (రజిఅన్) నన్ను, తన సోదరిని (ఫాతిమాను) త్రాళ్ళతో కట్టిపడేశారు. అప్పటికి ఇంకా ఆయన ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించలేదు అని హజ్రత్ సయీద్ బిన్ జైద్(రజిఅన్) చెప్పారు." (బుకారి)

**సంగ్రహణం:**

హజ్రత్ సయీద్ బిన్ జైద్(రజిఅన్) హజ్రత్ ఉమర్‌గారి బాబాయి కుమారుడే కాదు, ఆయన చెల్లెలి భర్త కూడా. సయీద్, ఫాతిమాలుభయులు ఇస్లామ్ స్వీకరించి నందుకు ఉగ్రుడై ఆయన వాళ్ళను త్రాళ్ళతో కట్టిపడేశాడు. మరో ఉల్లేఖనం ప్రకారం బనీ జొహ్రా తెగకు చెందిన ఓ వ్యక్తి హజ్రత్ ఉమర్(రజిఅన్)తో మీ చెల్లెలు, బావగారు ఇద్దరూ ఇస్లామ్ స్వీకరించారు అని చెప్పగానే కోపోద్రిక్తుడై వారి ఇంటికి వెళ్ళారు. ఆరా తీయగా తాను విన్నది నిజమని గ్రహించి సయీద్‌ను పట్టి తన కాళ్ళతో ఇష్టమొచ్చినట్లు తన్నారు. తన భర్తను విడిపించాలని అడ్డు వచ్చిన ఫాతిమాను కూడా ఆయన బాగా కొట్టారు. గట్టిగా కొట్టిన ఓ చెంప దెబ్బవల్ల ఆమె ముఖమంతా రక్తంతో తడిసిపోయింది. ఈ హింసను అనుభవిస్తున్న ఆ భార్యాభర్తలిరువురు, తాము విశ్వసించిన ధర్మాన్ని విడువడానికి ససేమిరా ఒప్పుకోలేదు. వారు తమ ధర్మంపై స్థిరంగా నిలబడి ఉండడం చూసి హజ్రత్ ఉమర్ ఓ క్షణం ఆలోచించారు. అప్పుడు ఆయన మనస్సులో ఓ క్రొత్త మలుపు తిరిగింది. ఏ ధర్మాన్నైతే ఓ క్షణంపాటు కూడా సహించడానికి ఇష్టపడలేదో ఆ ధర్మాన్నే ఆయన స్వీకరించడానికి దృఢంగా సంకల్పం చేసి వెంటనే దైవప్రవక్త(స) సన్నిధికి హాజరై ఇస్లామ్ స్వీకరించారు.

## ఇస్లామ్ స్వీకరించడం కష్టాలను ఆహ్వానించడమే

(٢٤٦) فَقَالَ يَا اَبَا ذَرٍّ اُكْتُمْ هٰذَا الْاَمْرَ وَارْجِعْ اِلٰى بَلَدِكَ فَاِذَا
بَلَغَكَ ظُهُوْرُنَا فَاَقْبِلْ فَقُلْتُ. وَالَّذِىْ بَعَثَكَ بِالْحَقِّ
لَاَصْرُخَنَّ بِهَا بَيْنَ اَظْهُرِهِمْ فَجَاءَ اِلَى الْمَسْجِدِ وَقُرَيْشٌ
فِيْهِ فَقَالَ يَا مَعْشَرَ قُرَيْشٍ! اِنِّىْ اَشْهَدُ اَنْ لَّا اِلٰهَ اِلَّا اللّٰهُ
وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ فَقَالُوْا قُوْمُوْا اِلٰى
هٰذَا الصَّابِىءِ فَقَامُوْا فَضُرِبْتُ لِاَمُوْتَ فَاَدْرَكَنِى
الْعَبَّاسُ فَاَكَبَّ عَلَىَّ فَقَالَ وَيْلَكُمْ تَقْتُلُوْنَ رَجُلًا مِنْ
غِفَارٍ وَمَتْجَرُكُمْ وَمَمَرُّكُمْ عَلٰى غِفَارٍ فَاَقْلَعُوْا عَنِّىْ فَلَمَّا
اَصْبَحْتُ الْغَدَ رَجَعْتُ فَقُلْتُ مِثْلَ مَا قُلْتُ بِالْاَمْسِ
فَقَالُوْا قُوْمُوْا اِلٰى هٰذَا الصَّابِىءِ فَصُنِعَ بِىْ مِثْلَ مَا صُنِعَ
بِالْاَمْسِ فَاَدْرَكَنِى الْعَبَّاسُ فَاَكَبَّ عَلَىَّ وَقَالَ
مِثْلَ مَقَالَتِهٖ بِالْاَمْسِ.

(بخاری عن ابن عباس کتاب المناقب۔ باب بنیان الکعبہ مسلم کتاب الفضائل)

246. హజ్రత్ అబూజర్(రజిఅన్)గారి ఉల్లేఖనం. "దైవప్రవక్త(స) నన్నుద్దేశించి ఇలా సెలవిచ్చారు. "అబూజర్! ఈ కార్యం(ఇస్లాం) రహస్యంగా ఉండనీ. నీవు నీ స్వస్థలానికి వెళ్ళిపో (అక్కడ నీ తెగకు ఇస్లాం ధర్మాన్ని ఉపదేశించు).మనం ప్రాబల్యం పొందిన తరువాత తిరిగి వద్దువు గాని," నేను దైవప్రవక్తను అడిగాను. ప్రవక్తా! మిమ్మల్ని సత్యధర్మంతో పంపించిన అల్లాహ్ సాక్షి! నేను వారి ముందుకు వెళ్ళి నా ఇస్లామ్ స్వీకరణ విషయాన్ని గట్టిగా బహిరంగంగా ప్రకటిస్తాను అని చెప్పి కాబా గృహం లోనికి ప్రవేశించాను. (అక్కడ ఖురైష్ తెగవాళ్ళు సభ తీర్చివున్నారు) అక్కడకు రాగానే ఖురైషీయులారా! అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడు లేడు

అని, ముహమ్మద్(స) ఆయన దాసుడు మరియు ప్రవక్త అని నేను సాక్ష్యమిస్తున్నాను అని గట్టిగా ప్రకటించాను. ఖురైషీయులంతా ఒకరిని ఒకరు పురమాయించుకొని లెండి లేచి ఆ మత భ్రష్టుణ్ణి పట్టుకోండి అని చెబుతూ నన్ను పట్టుకొని తమ ఇష్టమెుచ్చినట్లు కొట్టారు. హజ్రత్ అబ్బాస్(రజిఅన్) వారికి అడ్డం రాకపోతే నేను నా ప్రాణాలను పోగొట్టుకునే వాణ్ణి. ఆయన నా దగ్గరకు వచ్చి వంగి చూసి అయ్యో! మీరు కొట్టే ఈ వ్యక్తి గిఫ్ఫార్ తెగకు చెందినవాడు. మీ వాణిజ్య కేంద్రం(సిరియా) వైపునకు వెడుతూ ఈ తెగవారున్న మార్గం గుండానే మీరు వెళ్ళాలి అని అనగానే నన్ను వదిలేసి వెళ్ళిపోయారు. మరునాడు ఉదయాన్నే దైవగృహ ప్రాంగణంలోనికి వెళ్ళి అవే మాటలను చాటాను. (దైవ ఏకత్వం, ప్రవక్త(స) గారి దైవదౌత్యం గురించిన ప్రకటన) ఖురైషీయులంతా (నిన్నటిలా) తిరిగి నా మీద విరుచుకుపడ్డారు. నిన్నటిలాగానే చావుదెబ్బలు కొట్టారు. హజ్రత్ అబ్బాస్(రజిఅన్) అడ్డొచ్చి నన్ను ఆదుకున్నారు. నిన్నటిలాగానే చీవాట్లు పెట్టారు. *(బుకారి, ముస్లిమ్)*

**సంగ్రహణం:**

'కలిమయే షహాదత్' (దైవ ఏకత్వం, దైవదౌత్యాన్ని గురించి చాటి చెప్పే వచనం)ను బాహాటంగా ప్రకటించినందుకు హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి(రజిఅన్) కాబా గృహ ప్రాంగణంలో రెండుమార్లు చావుదెబ్బలు తిన్నారు. ప్రజలు ఆయనపై విరుచుకొని పడ్డారు. హజ్రత్ అబ్బాస్(రజిఅన్) ఆయన్ను ఆదుకోకపోతే ఆ అసత్యవాదుల మూక ఆయన ప్రాణాలను సైతం తీసేవారే. కాని ఆయన అడ్డుపడి కృద్ధులైన దైవతిరస్కార గుంపును రాబోయే ఆర్థిక ప్రమాదాన్ని చూపెట్టి విడిపించారు. మక్కా నుండి సిరియాకువెళ్ళే వర్తక బిడారాలు గిఫ్ఫార్ తెగ నివసించే ప్రదేశాలనుండే పోవలసి వుంది. అబూజర్ (రజిఅన్)ని హింసిస్తే, లేదా ఆయన్ను అవమానిస్తే మీ వర్తక బిడారాలు ఆ మార్గంగుండా ప్రయాణించలేవు జాగ్రత్త! అని హెచ్చరించారు.

## పరీక్షల బట్టీలో నుగ్గిన సహాబాల స్థయిర్యం

(۲۸۷) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ مَسْعُوْدٍ قَالَ اَوَّلُ مَنْ اَظْهَرَ اِسْلَامَهٗ

سبعة، رسول الله صلى الله عليه وسلم وابو بكر وعمار
وامه سمية وصهيب وبلال والمقداد فاما رسول
الله صلى الله عليه وسلم فمنعه الله بعمه ابي طالب
واما ابو بكر فمنعه الله بقومه واما سائرهم فاخذهم
المشركون فالبسوهم ادراع الحديد وصهروهم
في الشمس فما منهم انسان الا وقد واتاهم على ما
ارادوا الا بلال فانه هانت عليه نفسه في الله وهان
على قومه فاعطوه الولدان واخذوا يطوفون به
في شعاب مكة وهو يقول احد، احد۔

(مسند احمد نمبر ۳۸۳۲ - ابن ماجہ فضل سلمان و ابی ذر)

247. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్(రజిఅన్)గారి ఉవాచ: "మక్కాలో ప్రప్రథమంగా ఇస్లామ్ స్వీకరించినవారు ఈ ఏడుగురు. 1. దైవప్రవక్త(స) 2. అబూబక్ర్ సిద్దీక్(రజిఅన్) 3. అమ్మార్ బిన్ యాసిర్(రజిఅన్) 4. సుమయ్యా (రజిఅన్) (ఈమె అమ్మార్‌గారి మాతృమూర్తి) 5. హజ్రత్ సుహైబ్(రజిఅన్) 6. హజ్రత్ బిలాల్(రజిఅన్) 7. హజ్రత్ మిగ్దాద్(రజిఅన్)

దేవుడు దైవప్రవక్త(స)ను బహుదైవారాధకుల ఆగడాల నుండి రక్షించాడు. ఆయన బాబాయి అబూ తాలిబ్ కారణంగా. అబూబక్ర్‌గారి తెగ ఆయనకు రక్షణగా నిలిచింది. మిగతా వారిని ఆ బహుదైవారాధకులు పట్టుకొని ఇనుప సంకెళ్ళు వేసి బంధించారు. (ఈ అసాధారణ హింసలకు వారు తట్టుకోలేకపోయారు) ముష్రిక్‌ల ముందు వారు ఓటమిని అంగీకరించినా హజ్రత్ బిలాల్(రజిఅన్) మాత్రం వారి ముందు తలవంచడానికి ససేమిరా ఒప్పుకోలేదు. దైవమార్గంలో ఆయన తన ఉనికిని అతి స్వల్పమైనదిగా భావించారు. జాతి యావత్తూ ఆయనను అస్పృశ్యునిగా ఎంచి పోకిరి కుర్రాళ్ళకు అప్పజెప్పింది. వారు ఆయన్ను మక్కావీధుల్లో పడేసి

ఈడ్చుకుంటూ తిరిగేవారు. (వారి ఈ ఆగడాలు సహిస్తూ) ఆయన నోటమాత్రం వెలువడిన పలుకు ఒక్కటే. అహద్, అహద్ (దేవుడొక్కడే, దేవుడొక్కడే)అని. (ముస్నదె అహ్మద్- ఇబ్నెమాజా)

**సంగ్రహణం:**

బహుదైవారాధనకు నిలయమైన మక్కా నగరంలో ఇస్లామ్ ఊసెత్తడం అంత సులువైన విషయంకాదు. మక్కా ఖురైషీయులు దైవప్రవక్తపై చేయి చేసుకోకపోవడానికి కారణం ఆయన బాబాయి అబూతాలిబ్. ఆయనంతటి తెలివిగలవాడు, పేరుగల రాజకీయవేత్త ఆనాడు మరొకడు లేడు. అందుకని వారు జంకారు. ఇక హజ్రత్ అబూబక్ర్(రజిఅన్) జోలికి పోవడమంటే ఆయన తెగతో వైరం కొనితెచ్చుకోవటమే. దీనికి వారు సిద్ధంగా లేరు.

ఎటొచ్చి హజ్రత్ అమ్మార్ (రజిఅన్), ఆయన మాతృమూర్తి హజ్రత్ సుమయ్యా (రజిఅన్), సుహైబ్, మిగ్దాద్, హజ్రత్ బిలాల్(రజిఅన్)లు ఇస్లాం స్వీకరించినందుకు ఘోర హింసలకు గురిచేయబడ్డారు. వారికి ఇనుప కవచనాలను తొడిగి అరేబియా లాంటి ఎడారిలో మిట్ట మధ్యాహ్నం మండుటెండలో నిలబెట్టేవారు. ఆ వేడిని భరించడం ఊహించనైనా ఊహించలేం. ఓ వైపు వేడెక్కిన ఇనుప కవచం పైగా ఎండ ఈ రెండూ కలిసి శరీరంలోని క్రొవ్వును కరగదీసేవి. ఈ భయంకర యాతనలను ఓర్చుకోలేక వారిలోని నలుగురు వారు పలికించిన పలుకుల్ని నోటితో పలికారు. అయినా వారి హృదయాలు మాత్రం సత్య ధర్మం ఎడల సంతృప్తి చెందే ఉన్నాయి. ఇలాంటి భయంకర శిక్షలనిచ్చి బహుదైవారాధకులు వారి నోటితో ఒప్పించుకున్నారు. పరిస్థితి ఎప్పుడైనా అలా మారితే అలా పలుకవచ్చు అనే అనుమతి ఉంది. దైవగ్రంథం అయిన దివ్యఖుర్ఆన్‌లో వారి గురించి మన్నింపు ప్రకటన వెలువడింది. హింసలను సహించలేక ఎవరినోటనైనా, కేవలం తమ ప్రాణాలను రక్షించుకోవడానికి దైవధిక్కార వచనం (కలిమయే కుఫ్ర్) వెలువడితే, మనస్సులు మాత్రం దైవధిక్కార భావాలకు దూరంగా ఉంటే మాత్రం వారికి మన్నింపు ఉంది. (నహ్‌- 25)

కాని చివరికివారు హజ్రత్ బిలాల్(రజిఅన్) స్థయిర్యాన్నే ఎంచుకున్నారు. దైవ మార్గంలో ప్రాణాలైనా అర్పిస్తానుగాని నోటితో మాత్రం ఎలాంటి దైవ ధిక్కార వచనాల్ని పలుకను అని నిశ్చయించారు దృఢంగా. మరోవిధంగా చెప్పాలంటే దైవధిక్కారుల హింసలకు వెరచి నోటితో దైవధిక్కార వచనాలను పలికే కంటే అల్లాహ్ మార్గంలో ప్రాణాల్ని వదిలేయడం నాకు సులువైన విషయం. అల్లాహ్ సద్వచనాన్ని పలికిన నేరానికి నా ప్రాణాలు బలైపోయినా ఫరవాలేదు. మహోన్నతమైన దైవమార్గంతో పోలిస్తే నా ప్రాణాలకు వీసమెత్తు విలువ కూడా లేదే! నేను అల్లాహ్‌మార్గంలో సంహరించబడడం సర్వసాధారణమైన

విషయం. ఇదీ ఆయన నిర్ణయం ఇదే ఆయన అవలంబించిన వైఖరికి పునాదిగా నిలిచింది.

అయితే ఖురైషీయులు, ఉమియ్యా బిన్ ఖల్ఫ్ యొక్క ఓ నీగ్రో బానిస అయిన హ(జత్ సయ్యిలినా బిలాల్(రజిఅన్)ను స్వయంగా దండించడం, హింసించడం ఓ నామోషిగా తలచి మక్కాలోని పోకిరి యువకులకు అప్పగించారు. ఎండలో బాగా మండే రాతినేలపై ఆయన్ను పడుకోబెట్టి ఈడ్చుకుంటూపోయేవారు. రకరకాలుగా హింసించారు. కాని ఆ ధీరుడు స్థిరంగా ఒకే మాటను పలుకుతుండేవాడు. అహద్, అహద్ అని. (దేవుడొక్కడే, దేవుడొక్కడే అని).

కొన్నాళ్ళకు అబూజహ్ల్ హజ్రత్ సుమయ్యా(రజిఅన్)ను చంపేశాడు. ఆమె ఇస్లాంలో వీరమరణం పొందిన ప్రథమ షహీదా.

## పదుగురు సహాబీలను చుట్టుముట్టిన శత్రుమూక

(۲۴۸) بَعَثَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَشَرَةً عَيْنًا وَاَمَّرَ
عَلَيْهِمْ عَاصِمَ بْنَ ثَابِتٍ الْاَنْصَارِيَّ جَدَّ عَاصِمِ بْنِ عُمَرَ
ابْنِ الْخَطَّابِ حَتّٰى إِذَا كَانُوْا بِالْهَدَأَةِ ـــ بَيْنَ عُسْفَانَ
وَمَكَّةَ ـــ ذُكِرُوْا لِحَيٍّ مِنْ هُذَيْلٍ يُقَالُ لَهُمْ بَنُوْ لِحْيَانَ
فَنَفَرُوْا لَهُمْ بِقَرِيْبٍ مِنْ مِائَةِ رَجُلٍ رَامٍ فَاقْتَصُّوْا
اٰثَارَهُمْ حَتّٰى وَجَدُوْا مَأْكَلَهُمُ التَّمْرَ فِيْ مَنْزِلٍ نَزَلُوْهُ
فَقَالُوْا تَمْرُ يَثْرِبَ فَاتَّبَعُوْا اٰثَارَهُمْ فَلَمَّا حَسَّ بِهِمْ
عَاصِمٌ وَاَصْحَابُهُ لَجَئُوْا اِلٰى مَوْضِعٍ فَأَحَاطَ بِهِمُ الْقَوْمُ
فَقَالُوْا لَهُمْ اِنْزِلُوْا فَاَعْطُوْا بِاَيْدِيْكُمْ وَلَكُمُ الْعَهْدُ وَ
الْمِيْثَاقُ اَنْ لَّا نَقْتُلَ مِنْكُمْ اَحَدًا فَقَالَ عَاصِمُ بْنُ ثَابِتٍ
اَيُّهَا الْقَوْمُ أَمَّا اَنَا فَلَا اَنْزِلُ فِيْ ذِمَّةِ كَافِرٍ ثُمَّ قَالَ اَللّٰهُمَّ اَخْبِرْ
عَنَّا نَبِيَّكَ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَرَمَوْهُمْ بِالنَّبْلِ فَقَتَلُوْا
عَاصِمًا وَنَزَلَ اِلَيْهِمْ ثَلَاثَةُ نَفَرٍ عَلَى الْعَهْدِ وَالْمِيْثَاقِ
مِنْهُمْ خُبَيْبٌ وَزَيْدُ بْنُ الدَّثِنَةِ وَرَجُلٌ اٰخَرُ فَلَمَّا اسْتَمْكَنُوْا

مِنْهُمْ اَطْلَقُوْا اَوْتَارَ قِسِيِّهِمْ فَرَبَطُوْهُمْ بِهَا قَالَ الرَّجُلُ
الثَّالِثُ هٰذَا اَوَّلُ الْغَدْرِ وَاللّٰهِ لَا اَصْحَبُكُمْ، اِنَّ لِيْ
بِهٰؤُلَاءِ اُسْوَةً ـــ يُرِيْدُ الْقَتْلٰى ـــ فَجَرَّرُوْهُ وَعَالَجُوْهُ
فَاَبٰى اَنْ يَّصْحَبَهُمْ فَانْطُلِقَ بِخُبَيْبٍ وَزَيْدِ بْنِ الدَّثِنَةِ
حَتّٰى بَاعُوْهُمَا بَعْدَ وَقْعَةِ بَدْرٍ فَابْتَاعَ بَنُوا الْحَارِثِ بْنِ
عَامِرِ بْنِ نَوْفَلٍ خُبَيْبًا ـــ وَكَانَ خُبَيْبٌ هُوَ قَتَلَ الْحَارِثَ
ابْنَ عَامِرٍ يَوْمَ بَدْرٍ ـــ فَلَبِثَ خُبَيْبٌ عِنْدَهُمْ اَسِيْرًا
حَتّٰى اَجْمَعُوْا قَتْلَهٗ فَاسْتَعَارَ مِنْ بَعْضِ بَنَاتِ الْحَارِثِ
مُوْسٰى يَسْتَحِدُّ بِهَا فَاَعَارَتْهُ فَدَرَجَ بُنَيٌّ لَهَا وَهِيَ غَافِلَةٌ
عَنْهَا حَتّٰى اَتَاهُ فَوَجَدَتْهُ مُجْلِسَهٗ عَلٰى فَخِذِهٖ وَالْمُوْسٰى
بِيَدِهٖ قَالَتْ فَفَزِعْتُ فَزْعَةً عَرَفَهَا خُبَيْبٌ فَقَالَ
اَتَخْشَيْنَ اَنْ اَقْتُلَهٗ مَا كُنْتُ لِاَفْعَلَ ذٰلِكَ قَالَتْ
وَاللّٰهِ مَا رَاَيْتُ اَسِيْرًا قَطُّ خَيْرًا مِنْ خُبَيْبٍ وَاللّٰهِ لَقَدْ
وَجَدْتُهٗ يَوْمًا يَاْكُلُ قِطْفًا مِنْ عِنَبٍ فِيْ يَدِهٖ وَاِنَّهٗ
لَمُوْثَقٌ بِالْحَدِيْدِ وَمَا بِمَكَّةَ مِنْ ثَمَرَةٍ وَكَانَتْ تَقُوْلُ اِنَّهٗ
لَرِزْقٌ رَزَقَهُ اللّٰهُ خُبَيْبًا فَلَمَّا خَرَجُوْا بِهٖ مِنَ الْحَرَمِ
لِيَقْتُلُوْهُ فِي الْحِلِّ قَالَ لَهُمْ خُبَيْبٌ، دَعُوْنِيْ اُصَلِّيْ رَكْعَتَيْنِ
فَتَرَكُوْهُ فَرَكَعَ رَكْعَتَيْنِ فَقَالَ وَاللّٰهِ لَوْلَا اَنْ تَحْسَبُوْا اَنَّ
مَا بِيْ جَزَعٌ لَزِدْتُ ثُمَّ قَالَ اللّٰهُمَّ اَحْصِهِمْ عَدَدًا وَ
اقْتُلْهُمْ بَدَدًا وَلَا تُبْقِ مِنْهُمْ اَحَدًا ثُمَّ اَنْشَاَ يَقُوْلُ

فَلَسْتُ اُبَالِيْ حِيْنَ اُقْتَلُ مُسْلِمًا
عَلٰى اَيِّ جَنْبٍ كَانَ فِي اللّٰهِ مَصْرَعِيْ

وَذٰلِكَ فِيْ ذَاتِ الْاِلٰهِ وَاِنْ يَّشَأْ

يُبَارِكْ عَلٰى اَوْصَالِ شِلْوٍ مُمَزَّعٍ

ثُمَّ قَامَ اِلَيْهِ اَبُوْسِرْوَعَةَ عُقْبَةُ بْنُ الْحَارِثِ فَقَتَلَهٗ

—وَكَانَ خُبَيْبٌ هُوَ سَنَّ لِكُلِّ مُسْلِمٍ قُتِلَ صَبْرًا

الصَّلٰوةَ وَاَخْبَرَ اَصْحَابَهٗ يَوْمَ اُصِيْبُوْا خَبَرَهُمْ وَبَعَثَ

نَاسٌ مِنْ قُرَيْشٍ اِلٰى عَاصِمِ بْنِ ثَابِتٍ حِيْنَ حُدِّثُوْا اَنَّهٗ

قُتِلَ اَنْ يُّؤْتَوْا بِشَيْءٍ مِّنْهُ يُعْرَفُ وَكَانَ قَتَلَ رَجُلًا عَظِيْمًا

مِنْ عُظَمَائِهِمْ فَبَعَثَ اللّٰهُ لِعَاصِمٍ مِثْلَ الظُّلَّةِ مِنَ

الدَّبْرِ فَحَمَتْهُ مِنْ رُسُلِهِمْ فَلَمْ يَقْدِرُوْا اَنْ يَّقْطَعُوْا

مِنْهُ شَيْئًا۔ (بخاری عن ابی ہریرہ کتاب المغازی کتاب الجہاد)

248. దైవప్రవక్త(స) ఖురైషీయుల యుద్ధసన్నాహాలను పసిగట్ట డానికి ఆసిమ్ బిన్ సాబిత్(రజిఅన్) నాయకత్వంలో పదిమందితో కూడిన ఓ బృందాన్ని పంపారు. వారు 'హదాఅ' అనే ప్రదేశానికి చేరగానే (ఈ ప్రదేశం ఉస్ఫాన్‌కు పదిమైళ్ళ దూరంలో ఉంది) బనూ లహ్యాన్‌కు వారి ఆచూకి తెలిసింది. దాదాపు వందమంది విలుకాండ్రు బయలుదేరి వారు వెళ్ళిన అడుగుజాడలను వెంటాడుతూ చివరికి ఆ పదిమంది కూర్చొని ఖర్జూరపు పళ్ళు తిన్న ప్రదేశానికి చేరారు. (ఖర్జూరపు గింజల్ని చూసి) ఇవి యస్రిబ్ (మదీనా) ఖర్జూరాలు అని గుర్తించి తిరిగి వారి అడుగు జాడ లను పట్టుకొని వెంబడించి వారిని చేరుకున్నారు.

హజ్రత్ ఆసిమ్(రజిఅన్) ఆయన సహచరులు విలుకాండ్రు తమను చుట్టుముట్టారని గ్రహించి ఓ ఎత్తైన కొండగట్టుపైకెక్కి దాక్కున్నారు. విలుకాండ్రు వారిని నలువైపుల నుండి చుట్టుముట్టి, క్రిందికి దిగివచ్చి లొంగిపొండి మేమెరిని హతమార్చము అని మాటిస్తున్నాం అని హెచ్చరిం చారు. దానికి ఆసిమ్(రజిఅన్) లేదు నేను మీలాంటి సత్య తిరస్కారులెవ్వరి మాటలను నమ్మి దిగను అంటూ, ఆయన అల్లాహ్‌ను "ఓ అల్లాహ్! మా

పరిస్థితి గురించి నీ ప్రవక్తకు అవగతం చెయ్యి" అని వేడుకున్నారు. ఆ తరువాత సత్య తిరస్కారులు బాణాలు విడిచి ఆసిమ్‌ను (ఆయన వెంట ఉన్న ఆరుగురు సహచరుల్ని) హతమార్చారు.

హజ్రత్ ఖుబైబ్(రజిఅన్), జైద్ బిన్ దస్నా(రజిఅన్), అబ్దుల్లా బిన్ తారిక్(రజిఅన్)లు వారి ప్రమాణాన్ని నమ్మి గట్టుపై నుండి క్రిందికి దిగివచ్చారు. వెంటనే వింటినారులతో బంధించివేయడం జరిగింది వారిని. అబ్దుల్లాబిన్ తారిక్ పరిస్థితిని గమనించి వారితో ఇలా అన్నారు. "ఇది మీ మొదటి వాగ్దాన భంగం. దైవసాక్షి! నేను మీ వెంట అసలే రాను. అమరగతినొందిన నా సహచరుల్నే అనుసరిస్తాను' అని నిక్కచ్చిగా చెప్పే శారు. వారు ఆయన్ను తమ శక్తినంతా ఉపయోగించి లాక్కెళ్ళ ప్రయత్నిం చారు. కాని అబ్దుల్లా బిన్ తారిక్ మాత్రం వాళ్ళవెంట వెళ్ళడానికి ససేమిరా సిద్ధపడలేదు. (తరువాత దుండగులు ఆయన్ని కూడా హతమార్చి వేశారు).

ఖుబైబ్ బిన్ అద్దీ, జైద్ బిన్ దసినా(రజిఅన్)లను వారు మక్కాకు తీసుకెళ్ళి బానిసలుగా అమ్మివేశారు. (ఇది బద్ర్ యుద్ధం తరువాత జరగిన సంఘటన) హారిస్ బిన్ అమిర్ సంతానం, ఖుబైబ్‌ను వారి తండ్రి పగ తీర్చుకోవడానికి కొన్నారు. బద్ర్ యుద్ధంలో వాళ్ళ తండ్రిని ఈయన సంహరించారు. ఈ ఖైదు కాలంలో హజ్రత్ ఖుబైబ్ తన నాభి క్రింది వెంట్రుకలను గొరగడానికని హారిస్ కుమార్తె నుండి ఓ మంగలి కత్తిని అడిగి తీసుకున్నారు.

ఆమె చిన్న కుమారుడు (అబుల్ హుసైన్) తప్పటడుగులు వేసు కుంటూ ఖుబైబ్(రజిఅన్) దగ్గరకు వెళ్ళాడు. ఆయన ఆ బాలుణ్ణి తన తొడపై కూర్చోబెట్టుకున్నారు. (ఈ హటాత్పరిణామాన్ని చూసి ఆ తల్లి భయంతో వణికిపోయింది. హజ్రత్ ఖుబైబ్ ఆమె ఆందోళనను గమనించి, నేను నీ బాలుణ్ణి చంపుతాననుకున్నావా? ఇంత నీచమైన పని నేనెప్పుడు చేయను అని ఆ తల్లికి ధైర్యం చెప్పారు.

ఆమె (బహుశా ఆమె పేరు జైనబ్ బిన్తె హారిస్ అయి ఉండొచ్చు) ఇలా చెబుతోంది:

"అల్లాహ్ సాక్షి! నేను ఖుబైబ్ కంటే ఉత్తమమైన ఖైదీని ఎప్పుడూ చూళ్ళేదు. ఓరోజు ఆయన ఇనుప సంకెళ్ళతో బంధించబడి ఉన్నా, ఆయన చేతిలో ఓ ద్రాక్ష గుత్తి ఉంది దాన్ని ఆయన తింటూ ఉన్నారు. మక్కాలో ఈ పండ్లు లభించడం అసంభవం. (అంటే అప్పుడు ద్రాక్షపళ్ళ సీజన్ కూడా కాదు) అల్లాహ్ ఖుబైబ్‌కు ఒసగిన భోజనమిది.

ఆయన్ను హతమార్చడానికి మక్కా నుండి బయలుదేరి 'తన్ఈమ్' అనే ప్రదేశానికి చేరగానే ఖుబైబ్ వారితో నన్ను వదలండి రెండు రకాత్‌ల నమాజ్ చేసుకుంటాను అని అడిగారు. ఆయన నమాజ్ చేసుకోవడానికి గాను ఆయన బంధనాలను విప్పడం జరిగింది. రెండు రకాత్‌ల నమాజ్ చేసిన తరువాత వారిని ఉద్దేశించి ఇలా పలికారాయన. "అల్లాహ్ సాక్షి! నేను చావు అంటే భయపడుతున్నానని మీరు అనుకోకపోతే ఇంకా కొంతసేపటి వరకు నమాజ్‌ను కొనసాగించేవాణ్ణి" అంటూ ఆయన అల్లాహ్‌ను ఇలా వేడుకున్నారు.

ఓ ప్రభూ! వీరిని నాశనం చేసేయి. వీరిలో ప్రతి ఒక్కణ్ణి సంహరించు. ఒక్కరిని కూడా మిగిల్చి ఉంచకు అంటూ ఆయన ఓ పద్యపాదం చదివారు. దాని భావం ఇలా ఉంది.

"నేను ముస్లిమ్‌గా సంహరించబడుతున్నప్పుడు అల్లాహ్ మార్గంలో ఏ ప్రక్కన పడ్డా ఫరవాలేదు. అల్లాహ్ ప్రసన్నత కోసమే నా ప్రాణాన్ని అర్పిస్తున్నాను. ఆయన అనుకుంటే నా తెగిపోయిన శరీరావయవాలకు శుభాన్ని చేకూరుస్తాడు."

ఉక్బా బిన్ హారిస్ లేచి ఆయన్ను చంపేశాడు. బంధించి చంపబడే ప్రతి ముస్లిమ్ కొరకు హజ్రత్ ఖుబైబ్ ఓ సంప్రదాయాన్ని నెలకొల్పారు. అదే చనిపోయే ముందు రెండు రకాతుల నమాజ్ చేయడం.

ఏనాడైతే ఆయన అమరగతి సంఘటన జరిగిందో దాన్ని గురించి దైవప్రవక్త తమ అనుచరగణానికి ఈ విషయం ఆ రోజే తెలియజేశారు.

ఆసిమ్ చనిపోయారన్న వార్త మక్కాలో వ్యాపించగానే ఖురైషీయులు కొందరు ఆసిమ్ మృతదేహం పడి ఉన్న చోటుకు బయలుదేరారు. ఆయన

శరీర అవయవాల ద్వారా ఆయన మరణాన్ని ధృవపరుచుకోవడానికి ఆసిమ్ వీరి గొప్ప నాయకుడైన ఉక్బా బిన్ అబీ ముఅయిత్‌ను దైవప్రవక్త(స) ఆదేశం మేరకు బద్ర్ యుద్ధం నుండి వెనక్కు మరిలేటప్పుడు 'ఇర్కుజ్జుబియా' అనే ప్రదేశంలో సంహరించారు. కాని అల్లాహ్ ఆసిమ్ మృతదేహాన్ని సంరక్షించడానికి కందరీగల దండును కప్పుగా చేసి పంపాడు. కందిరీగలు వారిని దగ్గరకు కూడా రాకుండా చేశాయి. ఎన్ని ప్రయత్నాలు చేసినా వారు ఆయన శరీరంలోని ఏ ఒక్క భాగాన్ని కూడా ఖండించి తీసుకొని వెళ్ళలేకపోయారు. (అబూహురైరా(రజిఅన్)- బుకారి)

**సంగ్రహాణం:**

బనీ హుజైల్‌కు చెందిన ఖాలిద్ బిన్ సుఫ్యాన్ (ముహర్రం నెల హిజ్రీ శకం నాల్గు) దైవప్రవక్త(స)కు వ్యతిరేకంగా ఓ గొప్ప సైనిక బలాన్ని సమీకరించాడు. దాన్ని అణచడానికి మహాప్రవక్త, అబ్దుల్లా బిన్ అనీస్‌ను పంపారు. అబ్దుల్లా బిన్ అనీస్ ఆ సైన్యాన్ని ఘోర పరాజయానికి గురిచేసి అతని తల నరికి దైవప్రవక్తముందు తెచ్చి పడేశారు.

ఖాలిద్ బిన్ సుఫ్యాన్ పగ తీర్చుకోడానికి బనీ హుజైల్ ఓ కుట్ర పన్ని మరుసటి నెల 'అజ్ల్' మరియు 'ఖారా' తెగలకు సంబంధించిన కొందరిని మదీనాకు పంపించారు. వారు దైవప్రవక్తను మా గ్రామాల్లో ఇస్లామ్ స్వీకరణ జరిగింది. ఖుర్‌ఆన్ జ్ఞానం, ధార్మిక జ్ఞానాలను బోధించడానికి కొందరు చదువుకున్న సహబీలను మా వెంట పంపించండి అని ప్రాధేయపడ్డారు. దైవప్రవక్త(స) హజ్రత్ ఆసిమ్ బిన్ సాబిత్(రజిఅన్) నాయకత్వంలో పదుగురు సహాబీలను ఆయన వెంట పంపిస్తూ వారికి ఇస్లామ్ ధర్మాన్ని బోధిస్తూనే ఖురైషీయుల సైనిక కదలికల గురించి కూడా కొంత సమాచారాన్ని సేకరించండి. వారి యుద్ధ సన్నాహాలను ఓ కంట కనిపెడుతూ ఉండండి అని ఆదేశించారు. 'రజీ' అనే ప్రదేశానికి చేరగానే 'అజ్ల్' మరియు ఖారా తెగలకు చెందిన మనుషుల మోసం బయటపడింది. వీళ్ళు హుజైల్ మనుషుల్ని కేకవేసి పిలిచారు. ఈ పదుగురు సహబీలు వారి నుండి వేరై దాక్కున్నారు. రాత్రి పూట ప్రయాణం చేస్తూ పగలు విశ్రమిస్తూ ప్రయాణించారు. చివరికి 'హుజైల్' తెగలకు చెందిన దాదాపు వందమంది విలుకాండ్రు వారిని వెంటాడి చుట్టుముట్టారు. ఆ పదుగురిలో ఏడుగురి పేర్లు ఇవి.

1. ఆసిమ్ బిన్ సాబిత్ 2. సాబిత్ బిన్ అబిల్ కల్హా 3. ముర్సద్ బిన్ అబీ ముర్సదుల్ గనవీ 4. ఖాలిద్ బిన్ బలేర్ 5. అబ్దుల్లా బిన్ తారిక్ 6. జైద్ బిన్ దశినా 7. ఖుబైబ్ బిన్ అద్దీ(రజి అల్లాహు అన్‌హుమ్).

జైద్ బిన్ దశినా(రజిఅన్)ను సుఫ్యాన్ బిన్ ఉమయ్యా, తన తండ్రి పగ

తీర్చుకోవడానికని కొన్నాడు. జైద్, బద్ర్ యుద్ధంలో ఉమయ్యాను హతమార్చి ఉన్నారు కాబట్టి.

ఆసిమ్(రజిఅన్), బద్ర్ యుద్ధంలో మరో ఇద్దరు యువకుల్ని సంహరించారు. ఆ యువకుల తల్లి, 'సలాకా బిన్తె సఅద్' వీలైతే ఆసిమ్ పుర్రెలో సారాయి పోసుకొని త్రాగుతానని ప్రతినబూని ఉంది.

ఆసిమ్ అమరగతినొందారన్న వార్త మక్కా నగరానికి చేరగానే కొందరు ఖురైషీయులు ఆయన తలను లేదా శరీరావయవాల్లో దేన్నైనా నరికి తీసుకొని రావడానికి కొందరిని పంపించారు. అయినా వారికి ఆ పని సాధ్యం కాక వెనక్కు మరలి రావలసి వచ్చింది.

చెప్పుకోవలసిన మరో విషయం ఏమిటంటే 'తన్ఈమ్' అనే ప్రదేశంలో ఖుబైబ్‌ను ఆయన్ను సంహరించడానికి ముందు బహుదైవారాధకులు అడిగారు.

"ఖుబైబ్! మేమిక్కడ నీ స్థానంలో ముహమ్మద్ మెడను నరికి, నీవు నీ భార్యాపిల్లల్తో సుఖంగా గడుపుకోవడం నీకిష్టమేనా"అని. దానికి జవాబుగా

"కల్ల! అల్లాహ్‌సాక్షిగా!! నేను నా భార్యాపిల్లల్తో సుఖంగా కూర్చోవడం, దైవప్రవక్తకు ఆయన స్వంత ఇంట్లో ఓ చిన్న ముల్లు గుచ్చుకోవడానికి కూడా నేను సహించను అని తెలుసుకోండి" అని అన్నారు ఖుబైబ్ (రజిఅన్).

## ధర్మసంస్థాపనలో పస్తుల ఘట్టం

(۲۴۹) عَنْ جَابِرِبْنِ عَبْدِاللّٰهِ رَضِیَ اللّٰهُ عَنْهُمَا قَالَ خَرَجْنَا وَ
نَحْنُ ثَلَاثُمِائَةٍ نَحْمِلُ زَادَنَا عَلٰی رِقَابِنَا فَفَنِیَ زَادُنَا
حَتّٰی كَانَ الرَّجُلُ مِنَّا یَأْكُلُ فِیْ كُلِّ یَوْمٍ تَمْرَةً۔

(بخاری کتاب الجہاد۔کتاب المغازی)

249. దైవప్రవక్త(స) ఇలా ఉల్లేఖించారు. "(ఖురైష్ వ్యాపార బిడారాన్ని వెంటాడుతూ) మేము మూడొందల మందిమి దారిబత్తెం మా నెత్తిన పెట్టుకొని బయలుదేరాం. ఆ బత్తెం అంతా అయిపోయింది. మాలో ప్రతి వ్యక్తి కేవలం రోజుకు ఒక్క ఖర్జూరం తోనే సరిపుచ్చుకోవలసి వచ్చింది." (బుకారి)

**సంగ్రహణం:**

ఈ పోరాటం 'సైపుల్ బహ్ర్'గా పేరుగాంచింది. సులహ్ హుదైబియా (హుదైబియా సంధి హిజ్రీశకం ఆరు) కంటే ముందు జరిగిన పోరాటం ఇది. కొన్ని ఉల్లేఖనాల ద్వారా మరింత సమాచారం అందుతోంది. ఆ ఉల్లేఖనాల ప్రకారం:

"మా అమీర్(నాయకుడు) అబూ ఉబైదాబినుల్ జర్రాహ్' (రజిఅన్) మాలో ప్రతి ఒక్కడికి ఒక్కొక్క ఖర్జూరమే తినడానికి ఇచ్చేవారు. ఆ ఖర్జూరాన్ని చిన్న పిల్లలు చప్పరించినట్లు చప్పరించి మంచినీళ్ళు త్రాగే వాళ్ళం అంటే ఆ ఒక్క ఖర్జూరంతోనే ఆ రోజు మేము సరిపెట్టుకునేవాళ్ళం అన్నమాట. క్షుద్బాధను సహించలేక మాచేతి కర్రల్తో చెట్ల ఆకుల్ని రాల్చి వాటిని నీళ్ళల్లో నాన్చి తినేవాళ్ళం." (అబూదావూద్)

ఇస్లాం ప్రారంభం కాలంనాటి ముస్లిముల త్యాగనిరతి, చిత్తశుద్ధి, ఉన్నంతలోనే సరిపుచ్చుకునే అలవాటు లాంటి మహోన్నత సుగుణాల గాథలు చదివి ఆశ్చర్యం వేస్తుంది. ధర్మాన్ని సంస్థాపించేందుకు నడుము కట్టి చివరకు దాన్ని స్థాపించి చూపించిన ఆ ఘనత వారికే దక్కుతుంది. ధర్మసంస్థాపనలో ఇలాంటి ఘట్టాలనేకం వస్తాయి అనే విషయాన్ని ధర్మసంస్థాపన కోసం నడుము కట్టిన ప్రతి ముజాహిద్ ఎన్నడూ మరిచిపోరాదు.

(٢٥٠) عَنْ جَابِرٍ قَالَ: سِرْنَا مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَكَانَ قُوْتُ كُلِّ رَجُلٍ كُلَّ يَوْمٍ تَمْرَةً فَكَانَ يَمُصُّهَا ثُمَّ يَصُرُّهَا فِي ثَوْبِهٖ وَكُنَّا نَخْتَبِطُ بِقِسِيِّنَا وَنَأْكُلُ حَتّٰى قَرِحَتْ اَشْدَاقُنَا فَاُقْسِمُ اُخْطِئَهَا رَجُلٌ مِنَّا يَوْمًا فَانْطَلَقْنَا بِهٖ نَنْعَشُهٗ فَشَهِدْنَا لَهٗ اَنَّهٗ لَمْ يُعْطَهَا فَاُعْطِيَهَا فَقَامَ فَاَخَذَهَا

(مسلم كتاب الزهد)

250. హజ్రత్ రుబిల్(రజిఅన్)గారి ఉల్లేఖనం: "(ఓ పోరాటంలో పాల్గొనేందుకు) మేము దైవప్రవక్త(స) వెంట వెళ్ళే అవకాశం లభించింది. మాలోని ప్రతివానికి రోజుకు ఒక్క ఖర్జూరం మాత్రమే తినడానికి లభించేది. దాన్ని అతడు నోట్లో వేసుకొని చప్పరించి తిరిగి తన అంగవస్త్రంలో ముడేసుకొని దాచుకునేవాడు. మేము మా విల్లుకర్రల్తో చెట్ల ఆకుల్ని రాల్చి తినేవాళ్ళం. అలా తిన్నందుకు మా పెదాల ప్రక్కలు తెగి గాయపడ్డాయి.

ఆ తరువాత ఈ హదీసును ఉల్లేఖించిన హజ్రత్ జాబిర్(రజిఅన్) ప్రమాణ పూర్వకంగా ఇలా పలికారు. ఖర్జూరాలు పంచే వ్యక్తి పొరపాటు వల్ల మా సహచరుడు ఒకడికి అతని భాగం లభించలేదు. మేము అతణ్ణి పంచే వాని దగ్గరకు తీసుకెళ్ళాం. అందరం కలిసి అతనికి ఖర్జూరం లభించలేదు అని సాక్ష్యం పలికాం. అప్పుడుగాని అతడు మా సహచరునికి ఓ ఖర్జూరం ఇవ్వలేదు. వెంటనే తన భాగపు ఖర్జూరాన్ని వసూలు చేసుకున్నాడు మా సహచరుడు." (ముస్లిమ్)

**సంగ్రహణం:**

బస్రా గవర్నరు హజ్రత్ అక్బా బిన్ గజ్వాన్(రజిఅన్) గారి ప్రసంగంలో ఓ భాగం ఇది. ఆయన ఇలా అన్నారు. "దైవప్రవక్త(స)తో సహా ఏడుగురు కలిసిన ఓ బృందంలో నేనూ ఒక్కణ్ణి. మా దగ్గర తినడానికి ఏమీ మిగలలేదు కేవలం చెట్ల ఆకులు తప్ప. వాటిని తిన్న మాకు నోటి పెదాల ప్రక్కలన్నీ గాయపడ్డాయి. నా మనస్సులో నేను గొప్పోడిని అనే ఊహ రాకుండా నేను అల్లాహ్‌ను శరణువేడుతున్నాను. అల్లాహ్ దృష్టిలో నేను ఎంతో అల్పుణ్ణి."(ముస్లిమ్)

ధర్మ ప్రచార కార్యం, ధర్మ సంస్థాపనం పిల్లల ఆటకాదు. ఇందులో రకరకాల పరీక్షలు ఎదురవుతాయి. చివరికి చెట్ల ఆకులు తిని నోటిని గాయపరుచుకునే పరిస్థితి కూడా వచ్చిపడవచ్చు. ఎవరైతే ఈ మార్గంలో తన ధన ప్రాణాలను త్యజించే ధైర్యంలేనివాడు ఈ మార్గంపై అడుగు పెట్టకూడదు. దారిద్ర్యం, లేమి ఓవైపు పీడిస్తున్నా జబ్బ చరిచి అసత్యానికి ఎదురొడ్డి నిలిచే వారి ఆత్మలు ఎంత పరిశుద్ధమైన ఆత్మలు! ఎలాంటి భౌతిక అడ్డంకి కూడా వారిని అడ్డగించలేకపోయింది. అయినా దైవభీతి, నమ్రత, శ్రద్ధాశక్తులు ఎలాంటి వంటే వారు ఎల్లవేళలా దైవాన్ని ఇలా వేడుకునేవాళ్ళు.

"కరుణామయా! మమ్ములను, మా మనస్సు చేసే మోసాన్నుండి కాపాడు. దీనికి నీ శరణు వేడుతున్నాం. నీవు మాకు ఇచ్చిన ఈ గౌరవాన్ని చూసి ఊహాలోకంలో విహరించకుండా, నీ ధర్మకార్యంలో నేనే ఓ గొప్ప వ్యక్తిని అనే గర్వం రాకుండా మమ్ము కాపాడు. అసలు నీ దృష్టిలో నేను ఓ అల్పుణ్ణి. విలువలేనివానిగానే ఉండనివ్వు."

తన దగ్గరనున్నదంతా దైవమార్గంలో త్యజించిన తరువాత కూడా వారి భయం, భీతి, వారి వేడికోలు చూస్తే ఓ రోజున దైవం ఎదుట నిలిచి తాము చేసిన కర్మలకు జవాబు చెప్పుకోవలసి ఉంది అనే భావం వారి మనస్సులో మెదలడమే. వారు ఆ బాధ్యతల్ని విస్మరించలేదు.

## ధర్మసంస్థాపనా కార్యం- శారీరక వ్యథలు

(۲۵۱) عَنْ اَبِیْ مُوْسٰی قَالَ خَرَجْنَا مَعَ رَسُوْلِ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ
وَسَلَّمَ فِیْ غَزَاۃٍ وَنَحْنُ سِتَّۃُ نَفَرٍ بَیْنَنَا بَعِیْرٌ نَعْتَقِبُہٗ
قَالَ فَنَقِبَتْ اَقْدَامُنَا فَنَقِبَتْ قَدَمَایَ وَسَقَطَتْ
اَظْفَارِیْ فَکُنَّا نَلُفُّ عَلٰی اَرْجُلِنَا الْخِرَقَ فَسُمِّیَتْ غَزْوَۃَ
ذَاتِ الرِّقَاعِ لِمَا کُنَّا نَعْصِبُ عَلٰی اَرْجُلِنَا مِنَ الْخِرَقِ۔

(مسلم کتاب الجہاد۔ بخاری کتاب المغازی)

251. హజ్రత్ అబూ మూసా అష్అరి(రజిఅన్) ఉల్లేఖనం ఇలా ఉంది: "మేము ఓ పోరాటం కోసం దైవప్రవక్త(స) వెంట బయలుదేరాం. మేము మొత్తం ఆరుగురం ఒకే ఒంటెపై వంతుల వారీగా ఎక్కి స్వారీ చేశాం. (నడిచేవాళ్ళం) పాదాలకు గుడ్డ పేలికలు చుట్టి మరీ నడిచేవాళ్ళం. ఈ పోరాటాన్ని 'గజ్వయే జాతుర్రిఖా' అని పిలవడానికి గల కారణం. మేము మా గాయపడ్డ పాదాలకు పట్టీలు చుట్టుకొని ప్రయాణం చేయడమే." *(ముస్లిమ్- బుకారి)*

**సంగ్రహణం:**

ఈ పోరాటానికి వెళ్ళేటప్పుడు మండే ఎండలో ప్రయాణం చేయడం వల్ల ముజాహిద్‌ల పాదాలు గాయపడి బొబ్బలెక్కాయి. కాని దైవధర్మాన్ని వ్యాప్తి చేసే సంకల్పానికి ఎలాంటి పరీక్షలు శారీరక బాధలు అడ్డంకులు లేకపోయాయి.

## సహాబీలు ఎదుర్కొన్న దారిద్ర్యం

(۲۵۲) عَنْ خَبَّابٍ، قَالَ ھَاجَرْنَا مَعَ النَّبِیِّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
نَلْتَمِسُ وَجْہَ اللّٰہِ فَوَقَعَ اَجْرُنَا عَلَی اللّٰہِ فَمِنَّا مَنْ مَاتَ
وَلَمْ یَاْکُلْ مِنْ اَجْرِہٖ شَیْئًا مِنْھُمْ مُصْعَبُ بْنُ عُمَیْرٍ وَ
مِنَّا مَنْ اَیْنَعَتْ لَہٗ ثَمَرَتُہٗ فَھُوَ یَھْدِبُھَا قُتِلَ یَوْمَ

أُحُدٍ فَلَمْ نَجِدْ مَا نُكَفِّنُهُ بِهٖ إِلَّا بُرْدَةً، إِذَا غَطَّيْنَا
بِهَا رَأْسَهُ خَرَجَتْ رِجْلَاهُ وَإِذَا غَطَّيْنَا رِجْلَيْهِ خَرَجَ
رَأْسُهُ فَأَمَرَنَا النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أَنْ نُغَطِّيَ
رَأْسَهُ وَأَنْ نَجْعَلَ عَلٰى رِجْلَيْهِ مِنَ الْإِذْخِرِ۔

(بخاری کتاب الجنائز۔ کتاب المغازی)

252. హజ్రత్ ఖబ్బాబ్(రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: మేము కేవలం దైవప్రసన్నత కోసం దైవప్రవక్త(స) వెంట హిజ్రత్ చేశాం. దానికి అల్లాహ్ మాకు ప్రతిఫలం ఇస్తాడు. మాతో కొందరు తాము పడిన శ్రమకు ఫలితం అనుభవించకుండానే ఈ లోకాన్ని వదలివెళ్ళారు. (అప్పటికి రాజ్యవిస్తరణ గాని, యుద్ధ ధనం లభించడంగాని ప్రారంభం కాలేదు) వారిలో ఒకరు ముస్అబ్ బిన్ ఉమైర్(రజిఅన్). ఆయన ఉహద్ యుద్ధంలో అమరగతినొందారు. ఆయనకు 'కఫన్' తొడగడానికి ఎలాంటి వస్త్రమూ లభించలేదు. ఓ అంచుగల దుప్పటి తప్ప. ఆ దుప్పటితో ఆయన తలను కప్పితే కాళ్ళు బయటకు కనబడేవి. కాళ్ళ మీదికి లాగితే తల బయటకు కనబడేది. మహాప్రవక్త(స) ఆయన తలను కప్పి, కాళ్ళపై సువాసనగల గడ్డిని వేయమని ఆదేశించారు. మాలో కొందరికి (ఈ ప్రపంచంలోనే) ఫలితం లభించింది. వాటిని వారు అనుభవించారు కూడా." (బుకారి)

**సంగ్రహణం:**

ముస్అబ్ బిన్ ఉమైర్(రజిఅన్) ఇస్లాం స్వీకరణకు పూర్వం (అజ్ఞానకాలంలో) ఖరీదైన వస్త్రాలను ధరించేవారు. మంచి ధనవంతుడు కూడా. కాని దైవప్రవక్త(స) గారి బృందంలో చేరిన తరువాత సత్యధర్మ ప్రాబల్యం కోసం చిత్తశుద్ధితో పనిచేశారు. ఆయన సర్వస్వం ఓ అంచుగల దుప్పటిగానే మిగిలిపోయింది. ధర్మప్రాబల్యం కోసం సాగిన ఉద్యమంలో సర్వాన్నీ పణంగా పెట్టేశారు. అలా ఆయన తన తలను సైతం అల్లాహ్ మార్గానికి అంకితం చేశారు.

ఇస్లామ్‌కు అరేబియాలో రాజకీయంగా ఎలాంటి ప్రాబల్యం లభించనప్పటి మాట అది. ముస్లిమ్‌ల ఆర్థిక పరిస్థితి, దారిద్ర్యం మరియు వలసపోవడం కారణంగా ఎంతో బలహీనంగా ఉండింది.

## సహాబా (ప్రవక్త అనుచరగణం) సుఖాలంటే భయపడేవారు

(۲۵۳) إِنَّ عَبْدَ الرَّحْمٰنِ بْنَ عَوْفٍ أُتِيَ بِطَعَامٍ وَكَانَ صَائِمًا
فَقَالَ قُتِلَ مُصْعَبُ بْنُ عُمَيْرٍ وَهُوَ خَيْرٌ مِّنِّيْ كُفِّنَ فِيْ
بُرْدَةٍ إِنْ غُطِّيَ رَأْسُهُ بَدَتْ رِجْلَاهُ وَإِنْ غُطِّيَ رِجْلَاهُ
بَدَا رَأْسُهُ ــــ وَأُرَاهُ قَالَ ــــ وَقُتِلَ حَمْزَةُ وَهُوَ
خَيْرٌ مِّنِّيْ ثُمَّ بُسِطَ لَنَا مِنَ الدُّنْيَا مَا بُسِطَ أَوْ قَالَ أُعْطِيْنَا
مِنَ الدُّنْيَا مَا أُعْطِيْنَا وَقَدْ خَشِيْنَا أَنْ تَكُوْنَ حَسَنَاتُنَا
عُجِّلَتْ لَنَا ثُمَّ جَعَلَ يَبْكِيْ حَتّٰى تَرَكَ الطَّعَامَ۔

(بخاری کتاب الجنائز۔ کتاب المغازی)

253. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్(రజిఅన్) రోజా పాటిస్తున్నారు. ఆయన కోసం ఇఫ్తార్ చేయడానికని భోజనం వచ్చింది. (దాన్ని చూసి) ఆయన ఇలా పలికారు:

"హజ్రత్ ముస్అబ్ బిన్ ఉమైర్(రజిఅన్) (ఉహద్ యుద్ధంలో) సంహరించబడ్డారు. ఆయన నాకంటే మేలైనవాడు. ఆయనకు కఫన్ తొడగడానికి ఓ అంచుగల దుప్పటి మాత్రమే లభించింది. దానితో ఆయన తలను కప్పితే కాళ్ళు బయటపడేవి. కాళ్ళను కప్పితే తల బయటకు కనబడేది. హజ్రత్ హమ్జా(రజిఅన్) కూడా (ఉహద్ యుద్ధంలో) చంపబడ్డారు. ఆయన కూడా నాకంటే గొప్పవాడు. మా పరిస్థితి చూస్తే ధనరాసులు పడిఉన్నాయి. మేము చేసిన త్యాగాలకు ప్రతిఫలం మాకు ఇంత తొందరగా లభిస్తోందే అని భయంగా ఉందినాకు"– ఆ తరువాత ఆయన దుఃఖించనారంభించారు. (అలాగే ఏడుస్తూ) భోజనం కూడా చేయలేదాయన. *(బుకారి)*

**సంగ్రహణం:**

హజ్రత్ హమ్జా(రజిఅన్)కు కూడా కఫన్ తొడగడానికి కేవలం ఓ దుప్పటి మాత్రం లభ్యమైంది.

## అస్హాబె సుఫ్ఫా (సుఫ్ఫావారి) దారిద్ర్యం తీరు

(۲۵۴) عَنْ مُحَمَّدٍ، قَالَ كُنَّا عِنْدَ اَبِيْ هُرَيْرَةَ وَعَلَيْهِ ثَوْبَانِ
مُمَشَّقَانِ مِنْ كَتَّانٍ فَتَمَخَّطَ فَقَالَ بَخْ بَخْ اَبُوْهُرَيْرَةَ يَتَمَخَّطُ
فِي الْكَتَّانِ لَقَدْ رَاَيْتُنِيْ وَاِنِّيْ لَاَخِرُّ فِيْمَا بَيْنَ مِنْبَرِ رَسُوْلِ
اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِلٰى حُجْرَةِ عَائِشَةَ مَغْشِيًّا عَلَيَّ
فَيَجِيْءُ الْجَائِيْ فَيَضَعُ رِجْلَهٗ عَلٰى عُنُقِيْ وَيُرٰى اَنِّيْ مَجْنُوْنٌ
وَمَابِيْ مِنْ جُنُوْنٍ مَابِيْ اِلَّا الْجُوْعُ۔

254. ముహమ్మద్ బసీరీస్(రహ్మాలై) (ప్రసిద్ధ తాబయీా) ఉల్లేఖనం ప్రకారం, ఆయన హ(జత్ అబూహురైరా(రజిఅన్) దగ్గర కూర్చొని ఉన్నప్పుడు తన ఒంటిపై కాషాయ రంగు ఉన్న రెండు 'కతాన్' వస్త్రాలు ధరించియున్నారు. ఆయన (వాటితో) ముక్కు శుభ్రం చేస్తూ ఇలా పలికారు.

"శభాష్ అబూహురైరా! కతాన్ వస్త్రంతో ముక్కు శుభ్రం చేసుకుంటున్నావా? నాకు బాగా గుర్తుంది. నేను మహాప్రవక్త (స) గారి మెంబర్ లగాయతు హ(జత్ ఆయిషా(రజిఅన్)గారి ఇంటివరకు గల ప్రదేశంలో ఎక్కడో ఓ చోట స్పృహ తప్పి పడిపోయేవాణ్ణి. వచ్చిపోయేవాళ్ళు నాకు మూర్ఛ వచ్చిందని అనుకొని నా మెడపై కాలుపెట్టి మరీ వెళ్ళేవారు. నిజం చెప్పాలంటే అలా పడిపోవడం మూర్ఛవల్ల కాదు. ఆకలి బాధ వల్ల నేనలాపడిపోయి స్పృహ తప్పేవాణ్ణి.

**సంగ్రహణం:**

ఇంత జరిగినా ఆత్మాభిమానం నోటితో ఆ పరిస్థితిని వివరించడానికి కూడా ఒప్పుకునేది కాదు.

(۲۵۵) عَنْ فَضَالَةَ بْنِ عُبَيْدٍ اَنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
كَانَ اِذَا صَلّٰى بِالنَّاسِ يَخِرُّ رِجَالٌ مِنْ قَامَتِهِمْ فِي الصَّلٰوةِ
مِنَ الْخَصَاصَةِ وَهُمْ اَصْحَابُ الصُّفَّةِ حَتّٰى تَقُوْلَ الْاَعْرَابُ

هٰؤُلَاءِ مَجَانِيْنَ اَوْ مَجَانُوْنَ فَاِذَا صَلّٰى رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ اِنْصَرَفَ اِلَيْهِمْ فَقَالَ لَوْ تَعْلَمُوْنَ مَا لَكُمْ
عِنْدَ اللّٰهِ لَاَحْبَبْتُمْ اَنْ تَزْدَادُوْا فَاقَةً وَحَاجَةً قَالَ
فَضَالَةُ اَنَا يَوْمَئِذٍ مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ۔ (ترمذی ابواب الزھد)

255. హజ్రత్ ఫజాలా బిన్ ఉబైద్(రజిఅన్) ఉల్లేఖనం: మహా ప్రవక్త(స) నమాజు చేయించేటప్పుడు అస్హాబె సుఫ్ఫా క్షుద్బాధ వల్ల ఏర్పడ్డ బలహీనత కారణంగా నమాజులోనే క్రిందపడిపోయేవారు. పల్లె వాసులు ఇది చూసి వీరు మూర్ఛ రోగం వల్ల పడిపోతున్నారని అనుకునే వారు. నమాజు పూర్తి అయ్యాక మహాప్రవక్త వారిని (అస్హాబెసుఫ్ఫా) ఉద్దేశించి "అల్లాహ్ దృష్టిలో మీకుగల గౌరవం, మీకు లభించబోయే బహుమానాన్ని గనక మీరు ఎరిగి ఉంటే ఈ దారిద్ర్యాన్నే కావాలని మీరు కోరుకుంటారు."

ఆరోజు నేను దైవప్రవక్త(స) వెంటే ఉన్నాను అని హజ్రత్ ఫజాలా (రజిఅన్) అంటారు. *(తిర్మిజీ)*

**సంగ్రహణం:**

అరబీ భాషలో 'సుఫ్ఫా' అంటే ప్రాంగణం లేదా హాలు అని అర్థం. ఇదేకాకుండా ఖర్జూరపు ఆకులతో కప్పబడిన గుడిశ అని కూడా అర్థం ఉంది. మస్జిదెనబవీ అరుగుపై డెబ్బై మంది సహాబీలు నివాసం ఉంటూ ఉండేవారు. పరిస్థితుల కనుగుణంగా వారి సంఖ్య పెరుగుతూ తరుగుతూఉండేది. వీరినే 'అస్హాబె సుఫ్ఫా' అంటారు. వీరంతా తమ ఇల్లూ వాకిలి వదిలి 'మదీనా నగరాన్నే' తమ నివాస ప్రాంతంగా చేసుకున్నారు. ఎల్లవేళలా దైవప్రవక్త(స) సన్నిధిలో ఉండేవారు. దైవప్రవక్త వారిని యుద్ధాలకు కూడా పంపిస్తూ ఉండేవారు. ఇతర ధార్మిక కార్యకలాపాలు కూడా అప్పజెప్పేవారు. 'బయీరె మూనా' అనే యుద్ధంలో వారిలో చాలామంది అమరగతినొందారు.

వీరు ప్రజలకు దివ్యగ్రంథ బోధనలు చేయడమే కాకుండా ఖుర్ఆన్ మరియు 'సున్నత్' జ్ఞానాన్ని ఆర్జించేవారు. మొత్తానికి వీరంతా తమ సమయాన్నంతా అల్లాహ్ కోసమే కేటాయించినవాళ్ళు. పగలు మస్జిదె నబవీ అరుగుపై ఉండి రాత్రిళ్ళు మస్జిద్‌లో నిద్రించేవారు. ప్రవక్త కనుసన్నల్లో మెలిగే ఈ పరిశుద్ధ ధార్మిక విద్యార్థులు, ఇస్లాం కోసం

పనిచేసే ఈ స్వచ్ఛంద సేవకులు, అత్యంత దారిద్ర్యం వెంటాడుతున్నా ఒకరి ముందు చేయిజాపి అడిగేవారు కాదు. ఎడతెగని పస్తులు వారిని బలహీనంగా చేసివేశాయి. అందుకేవారు అప్పుడప్పుడు నమాజులోనే స్పృహ తప్పిపడిపోయేవారు.

(٢٥٦) عَنْ اَبِىْ هُرَيْرَةَ اَنَّهُمْ اَصَابَهُمْ جُوْعٌ فَاَعْطَاهُمْ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ تَمْرَةً تَمْرَةً۔

(ترمذی ابواب القیامۃ)

256. "అస్హాబెసుఫ్ఫా ఆకలిబాధను తాళలేకపోతే మహాప్రవక్త(స) (ఓసారి) వారికి ఒక్కొ ఖర్జూర ఫలాన్నొసిగారు." అని అబూహురైరా (రజిఅన్) ఉవాచ.

## ధర్మసంస్థాపనా మార్గంలోని ఆర్థిక బాధలు

(٢٥٧) عَنْ قَيْسٍ قَالَ سَمِعْتُ سَعْدًا رَضِىَ اللهُ عَنْهُ يَقُوْلُ اِنِّىْ لَاَوَّلُ الْعَرَبِ رَمٰى بِسَهْمٍ فِىْ سَبِيْلِ اللهِ، وَكُنَّا نَغْزُوْ مَعَ النَّبِىِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَمَا لَنَا طَعَامٌ اِلَّا وَرَقُ الشَّجَرِ حَتّٰى اِنَّ اَحَدَنَا لَيَضَعُ كَمَا يَضَعُ الْبَعِيْرُ اَوِ الشَّاةُ مَالَهٗ خِلْطٌ ثُمَّ اَصْبَحَتْ بَنُوْ اَسَدٍ تُعَزِّرُنِىْ عَلَى الْاِسْلَامِ لَقَدْ خِبْتُ اِذًا وَضَلَّ عَمَلِىْ وَكَانُوْا وَشَوْا اِلٰى عُمَرَ قَالُوْا لَا يُحْسِنُ يُصَلِّىْ

(بخاری کتاب الرقاق۔ کتاب الاطعمۃ مسلم کتاب الزھد)

257. "నేను హజ్రత్ సఅద్ బిన్ అబీ వకాస్(రజిఅన్) ఇలా అంటూ ఉండగా విన్నాను" అని ఖైస్ ఉల్లేఖిస్తున్నారు.

నేను అల్లాహ్ మార్గంలో బాణం వేసిన ప్రథమ అరబ్బును. మేము దైవప్రవక్త(స) వెంట యుద్ధానికి వెడితే మాకు చెట్ల ఆకులు తప్ప తినడానికి ఏమీ లభించకపోయేది. చివరికి (ఆహారలేమి వల్ల) మా మలం ఒంటె (లేదా

ఆయన ఉల్లేఖనం ప్రకారం మేక) పెంటికల్లా (ఎండిపోయి గుండ్రంగా) ఉండేది. ఇక బనూ అసద్ గురించి చెప్పాలంటే వీళ్ళు నాకు నమాజు ఎలా చేయాలో నేర్పుతున్నారాయె. వాళ్ళు చెప్పిందే సత్యమైతే నేను వైఫల్యం చెందినవాణ్ణే. నేను ఆచరించిందంతా బూడిదలో పోసిన పన్నీరే."

బనూ అసద్ తెగవారు హ(జత్ ఉమర్(రజిఅన్)తో, హ(జత్ సఅద్ బిన్ అబీ తవకాస్‌కు నమాజు చేయించడం రాదు అని ఆరోపించారు. గనక ఆయన పైవిధంగా ఉల్లేఖించారు. *(బుకారి, ముస్లిమ్)*

**సంగ్రహణం:**

హ(జత్ సఅద్ బిన్ అబి వొస్ తన పదిహేడో ఏట దైవప్రవక్త(స) పిలుపుపై ఇస్లాం స్వీకరించారు. ఆయన ఏడవ ముస్లిం. ఈయన, "మీరు స్వర్గ ప్రవేశం చేస్తారు" అని దైవప్రవక్త(స) నుడివిన ఆ పదుగురు సహాబీల్లో ఒకరు.

"నేను అల్లాహ్ మార్గంలో బాణం వేసిన ప్రథమ అరబ్బును" అని అంటే ఆయన అన్నది సురియాబిన్ ఉబైద్ బిన్ హారిస్ విషయం గురించి. దైవప్రవక్త(స) (హి(జీ శకం ఒకటిలో) ఉబైద్ బిన్ హారిస్ నాయకత్వంలో 'ఖురైష్' బిడారాన్ని వెంటాడడానికి అరవై మంది యోధుల్ని పంపించారు. రాబిగ్ అనే ప్రదేశంలో వారు ఎదురుపడ్డారు. ఇది ముస్లిములకు, ము(షిక్‌లకు (బహుదైవారాధకులకు) నడుమ జరిగిన మొదటి యుద్ధం. ఈ యుద్ధంలో ముస్లిమ్‌ల వైపు నుండి ప్రథమంగా బాణం వదిలింది హ(జత్ సఅద్ బిన్ అబీ వకాస్(రజిఅన్)- హ(జత్ ఉమర్(రజిఅన్)గారి ఖిలాఫత్ (దైవప్రాతినిధ్య పరిపాలన)లో ఈయన కూఫా నగరానికి గవర్నరు. ఆర్థికంగా చితికిపోయి పస్తులు ఉంటూనే దైవారాధన అభ్యున్నతి కోసం ఈ సహాబీలు చేసిన కృషి ఎలాంటిదో కొంత ఆలోచిస్తే, ధర్మసంస్థాపనా మార్గం ఎంత కష్టతరమైనదో, సహనంతో కూడుకున్నదో అర్థం అవుతున్నది. అల్లాహ్ మార్గంలో జిహాద్ చేయడం మాటలు కాదు. ఈ మార్గంలో రకరకాల కష్టాలను, కడగండ్లను ఎదుర్కొవలసి వస్తుంది.

సహాబీలు (రజిఅన్)యదార్థమైన కృషి చేసి ఈ భూమ్మీద దైవధర్మాన్ని నెలకొలిపారు. ఇక ఈ కార్యం కోసం నడుముకట్టే వారికి ఆ సహాబీల్లాంటి దైవవిశ్వాసం, అల్లాహ్‌తో దృఢ సంబంధం, చిత్తశుద్ధిని సమకూర్చుకోవలసి ఉంటుంది. ఈ మార్గంలో ఎదురయ్యే సవాళ్ళను స్వీకరించాల్సి ఉంటుంది మరి.



# ఇస్లాం రాజకీయ వ్యవస్థ

## ఇస్లామీయ పరిపాలనా వ్యవస్థ శుద్ధ ప్రజాస్వామికం

(۲۵۸) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَوْكُنْتُ مُؤَمِّرًا اَحَدًا دُوْنَ مَشُوْرَةِ الْمُؤْمِنِيْنَ لَاَ مَّرْتُ ابْنَ اُمِّ عَبْدٍ۔

(مسند احمد عن علی نمبر ۵۶۶ ترمذی ابواب المناقب)

258. మహాప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "నేనేగనక ముస్లిముల సలహాలేకుండా ఒకరిని 'అమీర్'గా (అధ్యక్షు నిగా) చేస్తే అబ్దుల్లా బిన్ మస్ఊద్(రజిఅన్)ను అమీర్‌గా నియమించేవాణ్ణి" అలీ(రజిఅన్)

(ముస్నదె అహ్మద్, తిర్మిజీ)

**సంగ్రహణం:**

అంటే, పరిపాలనా వ్యవస్థ ప్రజాస్వామికమై ఉండాలన్నమాట. రాజ్యాధ్యక్షుని ఎంపిక ముస్లిములందరి సలహా సంప్రతింపులతో జరగాలి. కారణం, ఈ వ్యవస్థలో రాచరికానికిగాని, నియంతృత్వానికి (డిక్టేటర్‌షిప్)గాని తావులేదు. మహాప్రవక్త(స) ఇస్లామీయ పరిపాలనా వ్యవస్థ, రాజకీయ విధానపు ఈ మౌలిక సూత్రాన్ని విడమర్చి చెప్పి ఏ ఒక్కరికీ, ముస్లిముల సలహా సంప్రతింపులు లేకుండా అధికారాన్ని హస్తగతం చేసుకోవడంగాని బలప్రయోగం ద్వారా తన ఇష్టాన్ని ఇతరులపై రుద్దే ప్రయత్నంగాని చేయడానికి వీల్లేదు అని అన్నారు. అందుకే దైవప్రవక్త(స) తన ఉత్తరాధికారినెవ్వరిని నియమించలేదు (నామినేట్ చేయలేదు). కాగా, ఈ విషయాన్ని ముస్లిం సమాజం ఇష్టంపై వదిలేసి వారు పరస్పర సలహా సంప్రతింపులతో ఎవరు దానికి అర్హులో వారిని పాలకునిగా ఎంపిక చేసుకొమ్మని సెలవిచ్చారు.

## ప్రళయదినం రోజున పాలకుల్ని ప్రశ్నించడం జరుగుతుంది

(۲۵۹) قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ كُلُّكُمْ رَاعٍ وَكُلُّكُمْ مَسْئُوْلٌ فَالْاِمَامُ رَاعٍ وَهُوَ مَسْئُوْلٌ وَالرَّجُلُ رَاعٍ عَلٰى اَهْلِهٖ وَهُوَ

مَسْئُوْلٌ۔ وَالْمَرْأَةُ رَاعِيَةٌ عَلٰى بَيْتِ زَوْجِهَا وَهِيَ مَسْئُوْلَةٌ
وَالْعَبْدُ رَاعٍ عَلٰى مَالِ سَيِّدِهٖ وَهُوَ مَسْئُوْلٌ اَلَا وَكُلُّكُمْ رَاعٍ
وَكُلُّكُمْ مَسْئُوْلٌ۔ (بخاری عن ابن عمر کتاب النکاح)

259. దైవప్రవక్త(స) ఇలా ప్రవచించారు:ట "మీలో ప్రతి ఒక్కరూ కాపలాదారుడే. ఇంకా (అల్లాహ్ సమక్షంలో) దాన్ని గురించి జవాబు చెప్పుకోవలసినవాడే.

1. ఇస్లామీయ రాజ్యాధిపతి ఆ రాజ్యానికి కాపలాదారుడు (సంరక్షకుడు). (ప్రళయం రోజున) అతణ్ణి (అతని అధీనంలో ఉన్న ప్రజల గురించి) అడగడం జరుగుతుంది.
2. ప్రతివాడు తన భార్యాపిల్లలకు పాలకుడు, జవాబు చెప్పుకోవలసినవాడు.
3. భార్య తన ఇంటికి సంరక్షకురాలు. ఇంటి వ్యవస్థ గురించి ఆమెను అడగడం జరుగుతుంది.
4. సేవకుడు తన యజమాని సొత్తుకు కాపలాదారు, అల్లాహ్ వద్ద అతడు దానికి జవాబు చెప్పుకోవలసి ఉంది.

జాగ్రత్త! ఇలా మీలో ప్రతి ఒక్కడు ఓ అధిపతిగా బాధ్యతలను మోస్తున్నాడు. ఆ బాధ్యతల గురించి అతణ్ణి ప్రశ్నించడం జరుగుతుంది."

*(ఇబ్నె ఉమర్(రజిఅన్)– బుకారి)*

**సంగ్రహణం:**

అంటే ఇస్లామీయ రాజ్యం అధ్యక్ష పదవి లేదా మంత్రి పదవి గొప్ప హోదాలేమీ కావు. సరికదా ఇవి భయంకరమైన బాధ్యతాబరువులు. ప్రళయం రోజున ఈ బాధ్యతలను మోసేవాడు వాటికి జవాబు చెప్పుకోవలసిందే. కాగా ఆ ప్రభుత్వం, న్యాయపాలనకు సంబంధించిన చిన్నాపెద్దా అధికారి, ఉద్యోగస్తుడు తనకు కేటాయించిన అధికారాలను సంరక్షించేవాడు. ప్రళయం రోజున ఒక్కొక్కరిని నిలబెట్టి అతని అధికార దుర్వినియోగం గురించి అడగడం జరుగుతుంది. వారిలో ఎవరు అవినీతిపరుడో, లంచగొండో, దొంగో, ప్రజలను పీడిస్తాడో అలాంటి వ్యక్తులు కఠినమైన, సుదీర్ఘశిక్షలకు లోనుకావలసిందే.

లెక్కప్రకారం, ప్రతి బాధ్యతకు ఓ హోదా ఉంది. బాధ్యతల నిష్పత్తి ప్రకారమే జవాబు కూడా చెప్పుకోవలసి ఉంది. ఎంత గొప్ప బాధ్యతో అంతే గొప్ప జవాబుదారీను. ఇది రూలు. జవాబుదారీ నుంచి ఎవరూ తప్పించుకోలేరు. (ఇంకా వివరంగా తెలుసుకోవాలంటే 68వ హదీసును చూడండి)

## ఇస్లామ్ రాజకీయ వ్యవస్థలో పౌరహక్కులు

(۲۶۰) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ (فِيْ حِجَّةِ الْوَدَاعِ) اِنَّ اللهَ حَرَّمَ عَلَيْكُمْ دِمَاءَكُمْ وَاَمْوَالَكُمْ وَاَعْرَاضَكُمْ كَحُرْمَةِ يَوْمِكُمْ هٰذَا فِيْ شَهْرِكُمْ هٰذَا فِيْ بَلَدِكُمْ هٰذَا۔

(بخاری عن ابن عمر کتاب الاضاحی)

260. దైవప్రవక్త(స) తను చివరి హజ్ సందర్భంలో ఇలా సెలవిచ్చారు : అల్లాహ్ ఈ నగరం(మక్కా)లో ఈ మాసం(జుల్‌హజ్జ)లో ఈ రోజును ఎలా పవిత్రమైనదిగా చేశాడో అలా మీ రక్తాన్ని, మీ ధన మానాలను కూడా పవిత్రమైనవిగా చేశాడు."

(ఇబ్నె ఉమర్(రజిఅన్- బుకారి)

**సంగ్రహణం:**

దీని భావం ఏమిటంటే

1. తోటి ముస్లిమ్‌ను సంహరించడం 2. అతని సొత్తును కాజేయడం 3. అతని మానమర్యాదల్ని మంటగలపడం, మక్కానగరంలో పదవ జుల్‌హజ్జా రోజున మనిషిని చంపడం హరాం (నిషిద్ధం).

మక్కాకాకుండా ఎక్కడైనా హత్య గొప్ప పాపమే. అయినా ఎవరైనా మక్కాలాంటి పవిత్ర నగరంలో ఓ వ్యక్తిని సంహరిస్తే ఆ నేరం మరింత తీవ్రమైనది. అలాగే ఎవరైనా జుల్‌హజ్జా మాసం పదవ తారీఖున రక్తపాతం సృష్టించి ఒకరిని చంపితే అది మరింత తీవ్రమైన నేరంగా పరిగణించబడుతుంది. కారణం మక్కానగరం లాంటి పరిశుద్ధ నగర పవిత్రతను మంట కలిపాడు, జుల్‌హజ్జా మాసపు పరిశుద్ధతను నాశనం చేశాడు, అదేకాకుండా ఆ నెల పదవ తేదీకున్న విలువను చెడగొట్టాడన్నమాట.

మహాప్రవక్త(స) ప్రవచన సారాంశమేమిటంటే మీరేగనక

1. ఓ ముస్లిమ్ను సంహరిస్తే 2. అతన్నుండి అతని సొత్తును లాగివేసుకుంటే 3. అతని మానమర్యాదల్ని మంటగలిపితే

వాటిలో ప్రతిపాపం, మక్కాలాంటి పవిత్ర నగరంలో అదిగాక పదవ జుల్‌హజ్జా నాడు ఎవర్నయినా హతమార్చినంత ఘోరమైన పాపంలాంటిది. దైవప్రవక్త(స) తన చివరి హజ్ సందర్భంలో సెలవిచ్చిన సమయం, సందర్భంపై గురించి కొంత ఆలోచిస్తే, ఇస్లామీయ రాజ్యం ప్రతి ముస్లిమ్ యొక్క ధనమాన ప్రాణాలను కాపాడేదని, వాటిని సంరక్షించే బాధ్యత కలిగి ఉందని, ఇస్లామీయ రాజ్యంలోని ప్రతి వ్యక్తికి తన ధర్మసమ్మత మైన సంపాదనతో ఆస్తిపాస్తులను సమకూర్చుకునే హక్కు ఉందని, అతని ఆ ఆస్థి హక్కులు గుర్తించబడడమే కాకుండా అది ఇస్లామీయ సమాజంలో అతని ప్రాణంలా సంరక్షించబడే హక్కును కూడా కలిగి ఉండాలన్నది అతి ముఖ్యం అని ద్యోకతమవుతోంది.

## ముస్లిమ్‌లకు వ్యతిరేకంగా పోరాటానికి దిగడం

(۲۶۱) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنْ حَمَلَ عَلَيْنَا السِّلَاحَ فَلَيْسَ مِنَّا۔ (مسلم عن ابن عمر کتاب الایمان۔ بخاری کتاب الدیات کتاب الفتن)

261. మనకు వ్యతిరేకంగా పోరాటానికి దిగేవాడు, (కత్తికట్టేవాడు) మనలోనివాడు కాదు (అంటే మన విధానాలపై నడిచేవాడు కాదు) అని దైవప్రవక్త(స) సెలవిచ్చారు. (ఇబ్నె ఉమర్(రజిఅన్) ముస్లిమ్, బుకారి)

**సంగ్రహణం:**

అంటే ఏ వ్యక్తి (లేదా సంఘం) ముస్లిములకు వ్యతిరేకంగా పోరాటానికి సిద్ధపడ తాడో లేదా వారి వినాశనానికి పూనుకుంటాడో లేదా వారిని దోచుకోవడం లూటీచేసే ఉద్దేశ్యంతో వారిపై దాడి చేస్తాడో లేదా రాజకీయ ముఠా తగాదాల కారణంగా ముస్లిములపై హింసా దౌర్జన్యాలు చేస్తాడో అలాంటి వ్యక్తిగాని, సంస్థలుగాని ఘోరమైన నేరం చేస్తున్నట్లే లెక్క. అలాంటివారు దైవప్రవక్త(స) ప్రవచనం ప్రకారం ఇస్లామీయ సమాజం నుండి వేరైపోతారు.

ముస్లిములను హతమార్చడం, వారి ఇండ్లను తగులపెట్టడం, వారిపై దాడి చేయడం, వారిని భయభీతులను చేయడానికి లేదా వారిపై పెత్తనం చెలాయించడం పాపం. పాపమే కాదు హరామ్ కూడా. ఇస్లామీయ రాజ్యంలో నివసించే ప్రజల(పౌరుల)

ధనమాన ప్రాణాలకు ముప్పు కలిగించే ఇలాంటి వ్యక్తుల్ని, సంస్థల్ని ఏరి వారిని కఠినంగా శిక్షించి అణిచివేసే బాధ్యత ఇస్లామీయ రాజ్యం భుజస్కందాలపై ఉంది.

## ఇస్లామీయ రాజ్యాన్ని విధేయించడం

(۲۶۲) اِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَنْ اَطَاعَنِيْ فَقَدْ اَطَاعَ اللهَ وَمَنْ عَصَانِيْ فَقَدْ عَصَى اللهَ وَمَنْ يُّطِعِ الْاَمِيْرَ فَقَدْ اَطَاعَنِيْ وَمَنْ يَّعْصِ الْاَمِيْرَ فَقَدْ عَصَانِيْ۔

(بخاری عن ابی ہریرہ کتاب الجہاد مسلم کتاب الامارۃ)

262. మహాప్రవక్త(స) ఇలా సెలవిస్తూ ఉండేవారు.

"నాకు విధేయత చూపినవాడు అల్లాహ్‌కు విధేయత చూపేవాడు, ఎవరైతే నన్ను ధిక్కరిస్తాడో నిశ్చయంగా అతడు అల్లాహ్‌ను ధిక్కరించినట్లే. ఇంకెవరైతే 'అమీర్' (నాయకుడు) ఆజ్ఞనుపాలించాడో అతడు నా ఆజ్ఞను శిరసావహించినట్లే. (అలాగే) అమీర్ ఆజ్ఞల్ని ధిక్కరించేవాడు నా ఆదేశాలను ధిక్కరించినట్లు." (అబూహురైరా(రజిఅన్)- బుకారి, ముస్లిం)

**సంగ్రహణం:**

దైవప్రవక్త(స) సాధారణ వ్యక్తికాదు. ఆయన అల్లాహ్ తరఫున వచ్చిన ప్రతినిధి. ప్రతి మనిషి అల్లాహ్ ఆజ్ఞల్ని శిరసావహించడం విధి. అల్లాహ్ ఆజ్ఞాపాలన చేయించు కున్నవాడు, ఆయన ఆదేశాలను అమలు చేయదలచినవాడు తన జీవితంలోని అన్నిరంగాల్లోను దైవప్రవక్త(స)ను విధేయించాల్సిందే. కారణం ధర్మంలో ఆయనే అథారిటీ కాబట్టి. ఆయన అథారిటీ కాదు అని, ఆయన ఆదేశాలను శిరసావహించకపోవడమంటే అల్లాహ్ విధేయతను ధిక్కరించినట్లే.

దైవప్రవక్త(స) అల్లాహ్ ప్రవక్తే కాకుండా ఇస్లామీయ రాజ్యానికి పాలకుడు కూడా. ఆయన ప్రవచన భావం ఏమిటంటే అరేబియా ఇస్లామీయ రాజ్యంలో నేను ఎవరిని అమీర్‌గా నియమించానో మీరు ఆయన్ను విధేయించండి. అతనికి విధేయత చూపినవాడే నాకు విధేయత చూపినవాడవుతాడు. మరోవిధంగా చెప్పాలంటే వారిని ధిక్కరించిన వారు నన్ను ధిక్కరించినట్లే. కారణం వారిని నేనే అమీర్‌గా నియమించాను కాబట్టి.

ఈ ప్రవచనం నుండి మరో విషయాన్ని కూడా గ్రహించవచ్చు. అదేమిటంటే ఎక్కడైనా 'ఇస్లామీయ రాజ్యం' ఏర్పడినట్లయితే ఆ రాజ్యపాలకుని ఆజ్ఞాపాలన- ఆ ఇస్లామీయ రాజ్యం నియమించే అధికార్ల ఆజ్ఞాపాలన- ప్రథమ విధి. వారు అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త ఆజ్ఞల్లే శిరసావహిస్తూ ఉన్నంతమట్టుకు, షరీఅత్ ప్రకారం రాజ్యవ్యవస్థను నడుపుతున్నంత మట్టుకు వారిని ధిక్కరించడం పాపం.

(٢٦٣) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِسْمَعُوْا وَاَطِيْعُوْا وَ اِنِ اسْتُعْمِلَ عَلَيْكُمْ عَبْدٌ حَبَشِيٌّ كَاَنَّ رَأْسَهٗ زَبِيْبَةٌ۔

(بخاری عن انس بن مالک کتاب الاحکام)

263. "ప్రజలారా! మీరు మీ నాయకుని మాట(జాగ్రత్తగా) వినండి. అతని ఆజ్ఞలను పాలించండి. అతడు ఓ బట్టతల గల నీగ్రో బానిస అయినా సరే."

**సంగ్రహణం:**

అయితే అతడు పాపం చేయమని ఆదేశించనంతమట్టుకు, అతడే గనక దైవాన్ని దైవప్రవక్తను ధిక్కరించే ఆదేశమిస్తే ఏ పరిస్థితిలోనూ అతని విధేయత ధర్మసమ్మతం కాదు.

## అధికార పర్యవసానం- పశ్చాత్తాపం

(٢٦٤) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اِنَّكُمْ سَتَحْرِصُوْنَ عَلَى الْاِمَارَةِ وَسَتَكُوْنُ نَدَامَةً يَوْمَ الْقِيَامَةِ فَنِعْمَ الْمُرْضِعَةُ وَبِئْسَتِ الْفَاطِمَةُ۔ (بخاری عن ابی ہریرہ کتاب الاحکام)

264. మహాప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "మీరు అతి త్వరలో పరిపాలనా అత్యాశకు లోనవుతారు. ప్రళయం రోజున అది మిమ్మల్ని సిగ్గుపడేలా చేస్తుంది. పాలుపట్టే స్త్రీ ఎంత మేలైనది! పాలుపట్టని స్త్రీ ఎంత చెడ్డది?" (అబూహురైరా(రజిఅన్)- బుకారి)

**సంగ్రహణం:**

ఎవరి పరిపాలనా కాలంలో ఎవరి సంరక్షణలోనైతే హక్కుల అపరహారణ

జరిగిందో, ప్రజలు పీడించబడ్డారో, సామాజిక రుగ్మతలకు ప్రోత్సాహం లభించిందో ప్రళయం రోజున ఆ పాలకుడు తన అధికార దుర్వినియోగానికి సిగ్గుపడతాడో, అతడు కేవలం తాను చేసిన పాపాలకే కాకుండా, అతని రాజ్యంలో పెరిగి పోషించబడ్డ చెడుగులన్నింటి దుష్ఫలితాల్ని కూడా అనుభవించవలసి ఉంటుంది. ఇలాగే ఆ పాలకుడు కూడా అల్లాహ్ సన్నిధిలో శిక్షలకు గురికావలసి ఉంటుంది. ఎవరికాలంలోనైతే న్యాయాన్ని నెలకొల్పడంలోను, సత్కార్యాలను ప్రోత్సహించడంలోను విఫలమవుతాడో పాలనాధికారం ప్రారంభంలో ఎంతో గొప్పదైనదిగా అగుపిస్తుంది. కారణం, ఇది ఆర్థిక స్తోమతను పెంచుతుంది. గౌరవోన్నతులు లభించడానికి ఓ మార్గం అవుతుంది. అయితే దీని పర్యవసానం మాత్రం అతి భయంకరంగా ఉంటుంది.

తన దురాగతాల కారణంగా హత్యకు గురికావడమో లేదా బలవంతంగా పదవీచ్యుతునిగా చేయబడడమో జరిగిన ఆ పాలకుడు ఎంత దురదృష్టవంతుడు! ఇక పరలోకంలో అలాంటి దుష్టపాలకుడు తాను చేసిన పాపాల పత్రం చదివి ఎంత సిగ్గుపడతాడు! తన దురాగతాల శిక్ష అనుభవించేందుకు నరకంలోకి విసరివేయబడతాడు.

## విధేయతా పరిధులు

(۲۶۵) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ إِنْ أُمِّرَ عَلَيْكُمْ عَبْدٌ مُجَدَّعٌ يَقُوْدُكُمْ بِكِتَابِ اللهِ فَاسْمَعُوْا لَهُ وَاَطِيْعُوْا۔

(مشکوۃ عن ام الحصین کتاب الامارۃ بحوالہ مسلم)

265. 'ఓ నల్లటి ముక్కు తెగిన బానిస మీకు 'అమీర్'గా (నాయకునిగా) నియమించబడితే అతని మాటలను శ్రద్ధగా వినండి. అతణ్ణి విధేయించండి. అయితే అతడు దైవగ్రంథం (ఖుర్ఆన్) ఆదేశాల ప్రకారం మిమ్మల్ని పాలించేవాడై ఉండాలి" అని మహాప్రవక్త(స) ప్రవచించారు.

(ఉమ్ముల్ హుసేన్-ముస్లిం)

**సంగ్రహణం:**

అంటే ప్రభుత్వ ఆదేశాలను పాటించడం అతి ముఖ్యం. అది వాజిబ్. ఇస్లామీయ రాజ్యంలో పనిచేసే అధికారులు, ఎగ్జిక్యూటివ్‌లతో సహకరించాలి. పరిపాలనలోను సామూహిక కార్యకలాపాల్లోనూ వారితో సహకరించాలి. అయితే వారు తమ వైఖరి, పాలసీ, సిద్ధాంతాల్లో దివ్యఖుర్ఆన్‌ను వ్యతిరేకిస్తూ ఉంటే అలాటి దుష్టపాలకుల్ని రాజ్యాంగం

పరిధిలో ఉంటూ పదవీచ్చుతుల్ని చేసే ప్రయత్నం చేయాలి. వారిని విధేయించడం జరుగదు.

(۲۶۶) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ السَّمْعُ وَالطَّاعَةُ حَقٌّ مَا لَمْ يُؤْمَرْ بِمَعْصِيَةٍ فَإِذَا أُمِرَ بِمَعْصِيَةٍ فَلَا سَمْعَ وَلَا طَاعَةَ۔ (بخاری عن عبداللہ بن عمر کتاب الجہاد)

266. "(ఇస్లామీయ రాజ్యపాలకుని మాట) వినడం (అతనిని) విధేయించడం అత్యంత అవసరం, వాజిబ్ కూడా. (అతని ఆదేశాన్ని పాలించడం, విధేయించడం ఎంత బాధాకరమైనదైనా సరే). మొత్తానికి అతని ఆదేశాలను పాటించాలి. (అయితే ప్రభుత్వం తరఫున) తగని పని చేయమని ఆదేశం అందితే మాత్రం ఆ మాటలను వినడంగాని, ఆ ఆదేశాల్ని ఆచరణలో పెట్టటంగాని చేయకూడదు" అని దైవప్రవక్త(స) ప్రవచించారు. *(అబ్దుల్లా బిన్ ఉమర్(రజిఅన్)– బుకారి)*

**సంగ్రహణం:**

కారణం ఏమిటంటే "ఓ ముస్లిమ్" తన జీవితంలోని అన్ని వ్యవహారాల్లోను కేవలం అల్లాహ్ ఆదేశాలను, ఆయన చట్టాన్ని శిరసావహించడమే తన ప్రథమ కర్తవ్యంగా భావిస్తాడు. అతడు ఇస్లామీయ రాజ్యపాలకుని ఆదేశాలను శిరసావహించేది కేవలం అతడు అల్లాహ్ అవతరింపజేసిన జీవన వ్యవస్థ ప్రకారమే పాలనా వ్యవహారాలను చూస్తున్నాడు కాబట్టి. కాని ఆ పాలకుడే దైవగ్రంథాన్ని కాదని తన అధికార బలంతో బాహాటంగా పాపాలను, దుష్కార్యాలను ప్రోత్సహించే ప్రయత్నం చేస్తూ ఉంటే అలాంటి పాలకుడు ప్రజల విధేయతకు అర్హుడు కాదు. ముస్లిమ్ సమాజం అతడిని అధికార పీఠంనుండి దింపే గట్టి ప్రయత్నం చేయాల్సి ఉంటుంది. అల్లాహ్‌కు విధేయత చూపే మరో వ్యక్తి చేతికి ఆ అధికార పగ్గాలనివ్వాల్సి ఉంటుంది.

## సామూహిక జీవితపు మూడుసూత్రాలు

(۲۶۷) عَنِ الْعِرْبَاضِ بْنِ سَارِيَةَ قَالَ وَعَظَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَوْمًا بَعْدَ صَلٰوةِ الْغَدَاةِ مَوْعِظَةً بَلِيْغَةً ذَرَفَتْ

مِنْهَا الْعُيُوْنُ وَوَجِلَتْ مِنْهَا الْقُلُوْبُ فَقَالَ رَجُلٌ اِنَّ هٰذِهٖ
مَوْعِظَةُ مُوَدِّعٍ فَمَاذَا تَعْهَدُ اِلَيْنَا يَارَسُوْلَ اللّٰهِ قَالَ اُوْصِيْكُمْ
بِتَقْوَى اللّٰهِ وَالسَّمْعِ وَالطَّاعَةِ وَاِنْ عَبْدٌ حَبَشِيٌّ فَاِنَّهٗ مَنْ
يَّعِشْ مِنْكُمْ يَرَ اخْتِلَافًا كَثِيْرًا وَاِيَّاكُمْ وَمُحْدَثَاتِ الْاُمُوْرِ
فَاِنَّهَا ضَلَالَةٌ فَمَنْ اَدْرَكَ ذٰلِكَ مِنْكُمْ فَعَلَيْهِ بِسُنَّتِيْ وَ
سُنَّةِ الْخُلَفَاءِ الرَّاشِدِيْنَ الْمَهْدِيِّيْنَ عَضُّوْا عَلَيْهَا
بِالنَّوَاجِذِ۔ (ترمذی ابواب العلم۔ ابوداؤد کتاب السنۃ)

267. హజ్రత్ ఇర్బాజ్ బిన్ సారియా(రజిఅన్) గారి ఉల్లేఖనం: "ఓ రోజు ఉదయపు నమాజు ముగించిన తరువాత దైవప్రవక్త(స) ఎంతో సూటిగా, బోధనాత్మకమైన ప్రసంగం చేశారు. (దాని ప్రభావం చేత అక్కడున్నవారి) కళ్ళనుండి అశ్రువులు జలజలరాలాయి. భయం చేత హృదయాలు కంపించిపోయాయి. (ఈ పరిస్థితిని చూసి) ఒకరు, దైవ ప్రవక్తా! ఈ ప్రసంగం మీ చివరి ప్రసంగంలా అగుపిస్తుంది. (ఓ దైవ ప్రవక్తా!) మీరు మాకు ఇచ్చే చివరి 'వసీయత్' (ఉపదేశం) ఏమిటి అని అడగగా మహాప్రవక్త(స) "మీకు నేను ఇచ్చే చివరి వసీయత్ (ఉపదేశం).

1. (సర్వావస్థల్లో) అల్లాహ్‌కు భయపడండి. 2. (ఇస్లామీయ రాజ్య పాలకుని మాట) శ్రద్ధగా విని అతని ఆదేశాలను పాటించండి. అతడు నలుపు రంగుగల నీగ్రో బానిస అయినా సరే. (నా తదుపరి) మీలో బ్రతికివున్నవాడు అనేక అభిప్రాయభేదాల్ని చూస్తాడు. 3. ధర్మంలో క్రొత్త ఆచారాలను ప్రవేశపెట్టకండి. ఎందుకంటే ఇది మార్గభ్రష్టత్వం. మీలో ఎవరైతే ఈ మార్గభ్రష్టత్వాన్ని చూస్తాడో అతడు నా మార్గంపైనే నడవాలి. ఇంకా సన్మార్గం పొందిన నలుగురు ఖలీఫాల మార్గాన్నే అవలంబించాలి. నా ఖలీఫాల మార్గాన్ని పల్లతో గట్టిగా పట్టుకోండి." (తిర్మిజీ, అబూదావూద్)

**సంగ్రహణం:**

ఈ హదీసులో ఇస్లాం ధర్మానికి సంబంధించిన కొన్ని ప్రాథమిక సూత్రాలను సూచించడం జరిగింది అవి:

1. మీరు ప్రపంచంలో అప్రమత్తంగా జీవితం గడపండి. కళ్ళెంలేని గుర్రంలా జీవించడం అతి ప్రమాదకరం. పరలోకంలో జవాబు చెప్పుకోవలసి ఉంది అన్న భావన మీకు ప్రతి నిమిషం జ్ఞప్తికి రావాలి. అన్నివేళలా మీరు దైవాగ్రహానికి దూరంగా ఉండే ప్రయత్నంచేయండి. ఆయన ఆదేశాలను ధిక్కరించకండి. జాగ్రత్త! నరకంలో పడవేయబడతారు. 2. ఇస్లామీయ రాజ్యపాలకునికి పూర్తి సహకారం ఇవ్వండి. ఆయన ఆదేశాలను శిరసావహించండి. మీ సహాయనిరాకరణ వల్ల సామూహిక వ్యవస్థకు విఘాతం కలిగి అది బలహీనపడుతుంది.

3. సత్యధర్మం పరిపూర్ణమైంది. అందులో ఎలాంటి మార్పులు చేర్పులు చేసే ప్రయత్నం చేయకండి. మీరు ఈ ధర్మంలో కొంగ్రొత్త ఆచారాలను ప్రవేశపెట్టారో దీని రూపమే మారిపోతుంది. అసలు మార్గం ఏదో మీకు తోచదు. 4. ఎప్పుడైనా సంకటం ఏర్పడి ధర్మంలో ప్రజలు తాము కల్పించుకున్న మార్గాలనే ఇస్లాంగా ప్రచారం చేస్తూ ఉంటే మీరు ఆ మోసాలకు గురికాకండి. సందిగ్ధంలో పడి ఎటూ పాలుపోకుండా ఉన్నప్పుడు మీరు దైవప్రవక్త(స) మరియు ఆయన ఖులీఫాయెరాషిదీన్ నడిచిన మార్గాన్నే నడవండి.

## మహాప్రవక్త(స) ఆర్థికస్థితి

(۲٦٨) قَالَ اَبُوْهُرَيْرَةَ، وَالَّذِىْ نَفْسُ اَبِىْ هُرَيْرَةَ بِيَدِهٖ مَا شَبِعَ
نَبِىُّ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَاَهْلُهٗ ثَلٰثَةَ اَيَّامٍ تِبَاعًا
مِنْ خُبْزٍ حَتّٰى فَارَقَ الدُّنْيَا۔ (مسلم عن ابى هريره كتاب الزهد)

268. హజ్రత్ అబూహురైరా(రజి) ఉల్లేఖనం: "ఎవరి గుప్పిటనైతే నా ప్రాణాలున్నాయో ఆ దైవం సాక్షి! మహాప్రవక్త(స), ఆయన కుటుంబం వరుసగా మూడు రోజుల వరకు గోధుమ రొట్టెలను ఎప్పుడు భుజించ లేదు. ఆ పరిస్థితిలోనే ఆయన ఈ లోకాన్ని వదిలారు."

**సంగ్రహణం:**

హజ్రత్ ఆయిషా(రజిఅన్) గారి ఉవాచ "మదీనాలో దైవప్రవక్త(స) అడుగిడి నప్పటి నుండి చనిపోయే వరకు, ముహమ్మద్(స) కుటుంబ సభ్యులు వరుసగా మూడు రాత్రుల వరకు గొధమరొట్టెను కడుపారా భుజించి ఎరుగరు."

ఇదండి ఇస్లామీయ ప్రప్రథమ పాలకుని ఆర్థికస్థితి! ఆయనే తలిస్తే ఎంతో సులువుగా భోగభాగ్యాలతో కూడిన జీవితం గడపగలిగేవారు. ఆయన తరువాత వచ్చిన

నలుగురు ఖలీఫాలు కూడా బైతుల్‌మాల్ (ముస్లిముల ధనాగారం)ను జాతి అమానతుగా తలిచారు. ఆ తరువాత వచ్చిన ముస్లిం పాలకుల జీవితం ఎలా గడిచిందో అందరూ ఎరుగుదురు. వీరు 'బైతుల్‌మాల్'ను తమ సొంత ఆస్తిగా తలిచారు. ముస్లిం సమాజ మాతృమూర్తి హజ్రత్ ఆయిషా(రజిఅన్) ఇలా అంటారు:

"దైవప్రవక్త(స) భార్యాపిల్లలకు ఓ పూటభోజనంలో ఖర్జూరం లేకుండా ఉన్న రోజులేదు."

16వ నెంబరు హదీసులో ఈ విషయం మరింత వివరంగా చెప్పడం జరిగింది.

(۲۶۹) تُوُفِّيَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَدِرْعُهُ مَرْهُوْنَةٌ عِنْدَ يَهُوْدِيٍّ بِثَلَاثِيْنَ يَعْنِيْ صَاعًا مِنْ شَعِيْرٍ۔

(بخاری عن عائشۃ۔ کتاب المغازی۔ مسند احمد ابن عباس)

269. హజ్రత్ ఆయిషా (రజిఅన్) గారి ఉల్లేఖనం: "దైవప్రవక్త ముహమ్మద్(స) పరమపదించేనాడు ఆయన కవచం, రెండు మణుగుల ఇరవై అయిదు శేర్ల ఓట్ల క్రింద ఓయూదుని దగ్గర తాకట్టుగా పెట్టబడి ఉంది." *(హజ్రత్ ఆయిషా(రజిఅన్)- బుకారి, ముస్నదె అహ్మద్)*

**సంగ్రహణం:**

ఈ ధాన్యం ఆయన తమ భార్యాపిల్లల అవసరాల కోసం తీసుకున్నది. అప్పుడు మహాప్రవక్త(స) ఇస్లామీయ రాజ్యపు అధినేత, అధ్యక్షులూను. ఇస్లామీయ వ్యవస్థను నడిపే పాలకులు, సంరక్షకులు ఎంత నిరాడంబరంగా, ఎంత పొదుపుగా జీవితం గడపాలో ఆయన నడవడి చాటిచెబుతూ ఉంది. దేశ ధనాగారాన్ని ప్రజల సంక్షేమం కొరకు వారి శ్రేయం కొరకే ఖర్చుచేయవలసి ఉంటుంది. ఈ ఉల్లేఖనం గురించి ప్రతినిత్యం మహాప్రవక్త(స) నామాన్నే ఉచ్చరిస్తూ ఆయన మార్గాన్నే ఉచ్చరిస్తూ ఆయన మార్గాన్నే అవలంబించమని బోధిస్తూ, స్వయంగా ఆ మార్గంపై నడవడానికి వెరిచే ధార్మిక గురువులు, రాజకీయ నాయకులు ఎంతో ఆలోచించాల్సి ఉంది.

## అధికార వాంఛ

(۲۷۰) عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ سَمُرَةَ قَالَ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَا عَبْدَ الرَّحْمٰنِ لَا تَسْأَلِ الْإِمَارَةَ فَإِنَّكَ إِنْ أُعْطِيْتَهَا عَنْ مَسْئَلَةٍ وُكِلْتَ إِلَيْهَا وَإِنْ أُعْطِيْتَهَا عَنْ غَيْرِ

مَسْئَلَةٍ أُعِنْتَ عَلَيْهَا۔ (بخاری کتاب الاحکام مسلم کتاب الامارۃ)

270. హ(జత్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమురా(రజిఅన్) దైవప్రవక్త(స) తనసుద్దేశించి చెప్పిన మాటలను ఇలా ఉల్లేఖిస్తున్నారు.

"అబ్దుర్రహ్మాన్! పాలనాధికారాన్ని కోరకు. నీవు స్వయంగా దాన్ని కోరితే నిన్ను దానికి అప్పగించడం జరుగుతుంది. (దాని బాధ్యత భారం నీవే మోయాలి. అల్లాహ్ సహాయసహకారాలు నీకు లభించవు) కోరకుండా పాలనాధికారం లభించే అవకాశం నీకు లభిస్తే అల్లాహ్ (ప్రభుత్వ వ్యవస్థను నడపడంలో)నీకు సహాయపడతాడు." *(బుకారి, ముస్లిమ్)*

**సంగ్రహణం:**

రాజ్యాన్ని ఏలడం, అధికార పీఠం అధిరోహించడం ప్రమాదకరమైన బాధ్యత. ఏ బుద్ధిమంతుడూ దాన్ని కోరుకోడు. ప్రయత్నం లేకుండా ఈ బాధ్యత నెత్తిపై బడితే ఓ దైవభీతిగల పాలకుడు తన బాధ్యతలను నిర్వర్తించేటప్పుడు దైవకారుణ్యం, తన పరిపాలనలో సహాయసహకారాలు అందించేదిగా కనుగొంటాడు. అయితే, ఈ బాధ్యత బరువును దృష్టిలో పెట్టుకోకుండా తన శక్తియుక్తులతో అధికారాన్ని, రాజ్యాన్ని చేజిక్కించుకున్న వ్యక్తి ఆ బాధ్యతా బరువును మోయడం రాజ్యభారాన్ని నడపడంలో కేవలం తన మీదే భరోసా పెట్టుకుంటాడు. దైవసహాయసహకారాలు, మార్గదర్శకత్వం అతనికి లభించవు.

## హోదాను కోరడం అసమర్థతకు చిహ్నం

(۲۷۱) عَنْ اَبِیْ مُوْسٰی رَضِیَ اللّٰهُ عَنْهُ قَالَ دَخَلْتُ عَلَی النَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ أَنَا وَرَجُلَانِ مِنْ قَوْمِیْ فَقَالَ اَحَدُ الرَّجُلَیْنِ اَمِّرْنَا یَارَسُوْلَ اللّٰهِ وَقَالَ الْاٰخَرُ مِثْلَهٗ فَقَالَ اِنَّا لَا نُوَلِّیْ هٰذَا مَنْ سَأَلَهٗ وَلَا مَنْ حَرَصَ عَلَیْهِ (بخاری کتاب الاحکام)

271. హ(జత్ అబూ మూసా అష్అరి(రజిఅన్) ఇలా అంటారు: "నేను నా జాతికి చెందిన ఇద్దరు వ్యక్తుల వెంట మహాప్రవక్త(స) సన్నిధికి వెళ్లాను. (వచ్చినవారిలో) ఒకడు ప్రవక్తా! మమ్మ పాలకునిగా చేయండి

అని విన్నవించుకున్నాడు. మరొకడు కూడా అదే కోరాడు. అప్పుడు మహాప్రవక్త(స): "దాన్ని గురించి అడిగేవాణ్ణి, దాన్ని ఆశించేవాణ్ణి మేము పాలకునిగా చేయం" అని చెప్పి పంపారు. (బుకారి)

**సంగ్రహణం:**

ఎందుకంటే, పాలనాధికారం పొందడానికి ప్రయత్నించేవాడు, అధికార పీఠాన్ని చేజిక్కించుకునే కోరిక గలవాడు లేదా అది కావాలని అభ్యర్థించేవాడు లేదా ఫలానా హోదా నాకిమ్మని అడిగేవాడు బాధ్యతా భావన కరువైనవాడు. ప్రజాసేవ కాకుండా తన స్వార్థం కోసమే ఈ ముళ్ళబాటపై అడుగు పెడుతున్నాడనేది అతని వైఖరే రుజువు చేస్తుంది కాబట్టి.

## 'అమారత్' (నాయకత్వ) బాధ్యత

(٢٧٢) عَنْ أَبِي ذَرٍّ قَالَ قُلْتُ يَا رَسُولَ اللهِ أَلَا تَسْتَعْمِلُنِي؟ قَالَ فَضَرَبَ بِيَدِهِ عَلَى مَنْكِبِي ثُمَّ قَالَ يَا أَبَا ذَرٍّ إِنَّكَ ضَعِيفٌ وَإِنَّهَا أَمَانَةٌ وَإِنَّهَا يَوْمَ الْقِيَامَةِ خِزْيٌ وَنَدَامَةٌ إِلَّا مَنْ أَخَذَهَا بِحَقِّهَا وَأَدَّى الَّذِي عَلَيْهِ فِيهَا (مسلم كتاب الامارة)

272. హజ్రత్ అబూజర్(రజిఅన్)గారి ఉల్లేఖనం: "ఓ రోజు నేను దైవప్రవక్త(స)ను అడిగాను. ఓ దైవప్రవక్తా! నన్ను అమిర్ (ఓ ప్రాంతానికి గవర్నరు)గా చేయరా' అని, దైవప్రవక్త(స) ప్రేమగా నా భుజంపై చెయ్యివేసి తట్టి ఇలా ప్రవచించారు.

'అబూజర్! నీవు బలహీనుడివి. పరిపాలన(అల్లాహ్) అమానత్తు (ఊజీతిరీశి). ప్రళయం రోజున ఇది నిన్ను సిగ్గుపడేలా చేస్తుంది. అయితే ఎవరైతే పాలించే సమర్థత కలిగి పాలిస్తాడో, దాని బాధ్యతలను నిర్వహిస్తాడో అతని కోసం(అది సిగ్గుబడడానికి కారణభూతం) కాదు. (ముస్లిమ్)

**సంగ్రహణం:**

ప్రభుత్వ హోదాలు, పదవులు (అవి చిన్నవైనా పెద్దవైనా) అన్నీ అల్లాహ్ అమానతులు. అసమర్థుడైనా సరే ఆ ప్రభుత్వ పదవులను స్వీకరించేవాడు లేదా సామర్థ్యం కలిగి ఉండి కూడా ఆ బాధ్యతల్ని నిర్వహించనివాడు, అమానత్తును కొల్లగొట్టేవాడు.

ప్రళయం రోజున అలాంటివాడు సిగ్గుకు నిందకు గురికావలసిందే. దానికి తోడు శిక్షను కూడా అనుభవిస్తాడు.

అయితే ఎవరైతే రాజ్యాన్ని పాలించే, దాన్ని చక్కగా నడిపే సామర్థ్యం కలిగి ఆ ప్రభుత్వ పదవుల్ని అలంకరించి న్యాయంగా కష్టపడి తన విధుల్ని నిర్వర్తిస్తాడో అలాంటివాడు ప్రళయం రోజున సిగ్గుపడడంగాని, నిందకు లోనుకావడంగాని జరుగదు. కాగా తన సామర్థ్యం వల్ల ఆ ప్రభుత్వాన్ని చక్కగా నడిపినందుకు దైవం ఒసిగే బహుమానాలకు అర్హుడు కాగలడు.

న్యాయంగా, ధర్మంగా కష్టపడి విధులను నిర్వర్తించడమంటే, న్యాయాన్ని కోరి అతని దగ్గరికి వచ్చేవారికి అన్యాయం చేయకుండా ఉండడం. వారినుండి లంచం తీసుకొనకుండా ఉండడం. ఎల్లవేళలా న్యాయంగా ధర్మంగా ఉంటూ తన పదవి నుండి అక్రమ ప్రయోజనాలు పొందకుండా ఉండడం అన్నమాట.

(۲۷۳) عَنْ اَبِیْ ذَرٍّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
یَا اَبَا ذَرٍّ اِنِّیْ اَرَاكَ ضَعِیْفًا وَ اِنِّیْ اُحِبُّ لَكَ مَا اُحِبُّ
لِنَفْسِیْ فَلَا تَاَمَّرَنَّ عَلٰی اِثْنَیْنِ وَلَا تُوَلِّیَنَّ مَالَ یَتِیْمٍ۔
(مسلم کتاب الامارة - ابوداؤد کتاب الوصایا)

273. అబూజర్(రజిఅన్) గారి ఉల్లేఖనం, ఆయన ఇలా అంటారు. దైవప్రవక్త(స) నాతో ఇలా అన్నారు.

"అబూజర్ నీవో బలహీనుడివని తలుస్తున్నాను. నా గురించి నేను దేన్నైతే కోరుకుంటానో నీ గురించి కూడా అదే కోర్తాను. నీవు ఇద్దరు వ్యక్తు లకు కూడా 'అమీర్' (నాయకుడు) కాబోకు. అలాగే ఓ అనాధకు చెందిన సొత్తుకు కూడా సంరక్షకుడివి కాబోకు." (ముస్లిమ్, అబూదావూద్)

**సంగ్రహణం:**

మనమీ లోకంలో చేసేదంతా గాలిలో కలిసిపోదు. అల్లాహ్ ఆజ్ఞ మేరకు కొన్ని పరోక్ష శక్తులు మన జీవితపు ప్రతికదలికను రికార్డు చేస్తూ భద్రపరిచి ఉంచుతున్నాయి. ప్రళయంనాడు అల్లాహ్ న్యాయస్థానంలో ఆ రికార్డు ప్రకారమే మన జీవితపు ఒక్కో క్షణం విచారించబడుతుంది.

అందుకే మహాప్రవక్త(స) హ్రజత్ అబూజర్(రజిఅన్)కు, నీవో బలహీనమైన వాడివి. ఓ ప్రాంతానికి గవర్నరుగా కాదుకదా ఇద్దరు వ్యక్తులకు అమీర్‌గా నిన్ను నియమిస్తే

వెంటనే నిరాకరించు. అమీర్ అవడం మూలంగా ఏ బాధ్యతలైతే వచ్చిపడతాయో వాటిని నిర్వర్తించలేవు. ఇదే కాదు ఓ అనాథకు చెందిన ఆస్తిపాస్తులకు సంబంధించిన సంరక్షణా భారం కూడా నీ బలహీనమైన భుజస్కంధాలపై పెట్టుకోకు అని సలహా ఇచ్చారు. ఈ సలహా ప్రళయంనాడు అల్లాహ్ సన్నిధిలో జవాబు చెప్పుకోవలసి ఉంది అనే బాధ్యతకు సంబంధించిన సలహా.

## దౌర్జన్యపరుని క్రూరత్వాన్ని అడ్డుకోవాలి

(۲۷۴) اِنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یَقُوْلُ اِذَا رَأَوُا الظَّالِمَ فَلَمْ یَاْخُذُوْا عَلٰی یَدَیْہِ اَوْشَکَ اَنْ یَّعُمَّہُمُ اللّٰہُ بِعِقَابٍ۔ (مسند احمد نمبر ۳۰۔ ترمذی ابواب الفتن) عن ابی بکر

274. “దౌర్జన్యపరుని ఆగడాలను అతని చెయ్యిపట్టి వారించని వారిపై (అంటే దౌర్జన్యాలను సహించి మిన్నకుండా ఉండేవారు లేదా ఆ అగడాల్లో అతనికి సహాయపడేవారు). అతి త్వరలో అల్లాహ్ వేసే సార్వత్రిక యాతనలకు గురికావలసి ఉంటుంది. (జాగ్రత్త).” అని మహాప్రవక్త(స) సెలవిచ్చారు. *(అబూబక్ర్(రజిఅన్)- తిర్మిజి)*

**సంగ్రహణం:**

తన బలం చూసుకొని అల్లాహ్, ఆయన ప్రవక్త(స) ఆదేశాలను బాహాటంగా నిరోధించే క్రూర పాలకుని కంటే దౌర్జన్యపరుడింకెవరై ఉంటారు? దైవదాసుల ధనమాన ప్రాణాలు ఇలాంటి పాలకుని పాలనలో సురక్షితంగా ఉండలేవు. ఈ హదీసువల్ల తేలిందేమిటంటే క్రూరపాలకుని హింసల గురించి అతని దౌర్జన్యం గురించి విమర్శించక పోవడం, దాన్ని ఖండించకపోవడం గొప్ప నేరం. ఇలాంటి సమాజం అల్లాహ్ శిక్షకు గురయిపోతుంది. చెడిపోయిన పాలకుల ఇస్లామేతర మార్గావలంబనం, వారి దుర్మార్గాలను చూస్తూ మిన్నకుండిపోవడం, నోటిద్వారా, కలం ద్వారా ఆ పాలకులను విమర్శించే వారిని “రాజకీయం” అని పేరుపెట్టి కేవలం దైవనామస్మరణలో లీనమై ఉండడం ఎలాంటి పుణ్యకార్యం కానేరదు. సరికదా సత్సమాజం అయినందున ప్రతి ముస్లిం, దౌర్జన్యపరుణ్ణి, పీడించి రాజ్యమేలే నియంతలను అధికారపీఠం నుండి దింపడానికి సమయానుకూలంగా కృషి సల్పవలసి ఉంటుంది. మరో ఉల్లేఖనంలో ఈ విషయం ఇలా సెలవీయబడింది.

"ప్రజలు ఓ చెడును చూసినప్పుడు దాన్ని అంతం చేయడానికి ప్రయత్నించకపోతే అల్లాహ్ శిక్ష వారందరిని పెనవేస్తుంది" (అబూబక్ర్(రజిఅన్)- ముస్నదె అహ్మద్)

(۲۷۵) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا ظَهَرَتِ الْمَعَاصِيْ فِيْ اُمَّتِيْ عَمَّهُمُ اللّٰهُ بِعَذَابٍ مِنْ عِنْدِهٖ فَقُلْتُ يَارَسُوْلَ اللّٰهِ اَمَا فِيْهِمْ اُنَاسٌ صَالِحُوْنَ؟ قَالَ بَلٰى قَالَتْ فَكَيْفَ يَصْنَعُ اُولٰئِكَ قَالَ يُصِيْبُهُمْ مَا اَصَابَ النَّاسَ ثُمَّ يَصِيْرُوْنَ اِلٰى مَغْفِرَةٍ مِنَ اللّٰهِ وَرِضْوَانٍ۔

(تفسیر ابن کثیر جلد ۲ صفحہ ۳۰۰ بحوالہ مسند احمد ام سلمۃ مطبوعہ مصر)

275. ముస్లిములు వెనుకబడడానికి, వారి పతనానికి గల కారణం, మహాప్రవక్త(స) ప్రవచనం ఇలా ఉంది.

"నా సమాజంలో బాహాటంగా పాపకార్యాలు పొడసూపితే అల్లాహ్ వారినందరిని యాతనలకు గురిచేస్తాడు. దానికి (హజ్రత్ ఉమ్మె సల్మా (రజిఅన్) ఇలా అడిగారు) ఓ దైవప్రవక్తా (స)! పుణ్యాత్ములు మిగిలి ఉన్నా వారిని శిక్ష చుట్టుముడుతుందా అని. (ఈ పుణ్యాత్ములు ఎప్పుడు పాపాల జోలికి పోలేకపోయినా?) సమాధానంగా దైవప్రవక్త ఇలా సెలవిచ్చారు. అవును ఆ పుణ్యపురుషులు వారి నడుమ ఉన్నా సరే అని. అయితే మరి ఆ పుణ్యపురుషుల పరిస్థితి ఎలా ఉంటుంది అని తిరిగి ప్రశ్నించారు ఆమె. దానికి మహాప్రవక్త(స), వీరు కూడా సాధారణ ప్రజలకు మల్లే ఆ శిక్షలో చిక్కుకుంటారు. అయితే వారిని అల్లాహ్ ప్రళయ దినాన తన కారుణ్యం చేత క్షమిస్తాడు అని బదులిచ్చారు."

*(తఫ్సీర్ ఇబ్నె కసీర్ సంపుటం 2, పుట 300- ముస్నదె అహ్మద్)*

**సంగ్రహణం:**

పాపాల ప్రాబల్యం, వాటిని సగర్వంగా చెప్పుకోవడం, బాహాటంగా దైవధిక్కారాన్ని ప్రోత్సహించడం, వాటి ఎడల గర్వపడడం కారణంగా దైవక్రోధం ఓ ఉప్పెనలా సాక్షాత్కరించి తుడిచి వేస్తుంది. పుణ్యాత్ములు కూడా దానికి ఆహుతి కాక తప్పదు. పరలోకంలో వారు క్షమించబడినా ఈ ఇహలోకంలో మాత్రం వారి ఉనికి ఆ శిక్షను అడ్డుకోజాలదు.

## యథాప్రజా తథా రాజా

(۲۷۶) قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ کَمَا تَکُوْنُوْنَ کَذٰلِکَ یُؤَمَّرُ عَلَیْکُمْ۔ (مشکوٰۃ کتاب الامارۃ عن ابی اسحٰق)

276. "మీ చేష్టలకు తగిన విధంగానే మీపై పాలకులు నియమించబడతారు" అని మహాప్రవక్త(స) ప్రవచించారు. (అబూ ఇస్లామ్- మిష్కాత్)

**సంగ్రహణం:**

అంటే మీరు పాలలాంటి వారైతే మీ పాలకులు వెన్నలాంటివారు. మీ చేష్టలు చెడ్డవయితే మీపై నియమింపబడే పాలకులు నిర్దయులు, దౌర్జన్యపరులుగా ఉంటారు. మీ నడత సక్రమమై ఉంటే అల్లాహ్ మిమ్మల్ని పాలించడానికి జాలిగుండె గల న్యాయశీలురైన పాలకుల్ని నియమిస్తాడు అని భావం.

## చెడ్డపాలకుని గుర్తు

(۲۷۷) عَنْ عَائِذِ بْنِ عَمْرٍو قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یَقُوْلُ اِنَّ شَرَّ الرِّعَاءِ الْحُطَمَۃُ۔ (مسلم کتاب الامارۃ)

277. దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారని ఆయిజ్ బిన్ అమ్రు (రజిఅన్) ఉల్లేఖించారు: "కఠినాత్ముడు, కోపిష్టి అయినందున ప్రజలపై దౌర్జన్యం చేసేవాడు, నిర్దయగా వారిని అణిచివేసేవాడే అతి చెడ్డపాలకుడు." (ముస్లిం)

## క్రూరుడు, అవినీతిపరుడైన పాలకుని గతి

(۲۷۸) قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ وَیْلٌ لِّلْاُمَرَاءِ وَیْلٌ لِّلْعُرَفَاءِ وَیْلٌ لِّلْاُمَنَاءِ لَیَتَمَنَّیَنَّ اَقْوَامٌ یَوْمَ الْقِیَامَۃِ اَنَّ نَوَاصِیَھُمْ مُعَلَّقَۃٌ بِالثُّرَیَّا یَتَجَلْجَلُوْنَ بَیْنَ السَّمَاءِ وَالْاَرْضِ وَاَنَّھُمْ لَمْ یَلُوْا عَمَلًا۔

(مشکوٰۃ عن ابی ہریرۃ کتاب الامارۃ بحوالہ مسند احمد)

278. మహాప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు.

1. ఉమరా (అంటే పాలకులు) కొరకు వినాశనముంది. 2. ఉరఫా (అంటే సర్దారులు) కొరకు కష్టాలున్నాయి. 3. ఉమ్నా (అమానత్తులు కోరేవారి) కోసం చెడుగు ఉంది. ప్రళయం రోజున పలుకుబడి కలవారు, తాము ప్రపంచంలో అధికారం, పెత్తనం చెలాయించకుండా ఉంటే బాగుం డేదని తలపోస్తారు. కాగా అక్కడ వారి తల వెంట్రుకలను ఆకాశానికేసి కట్టి వ్రేలాడదీయడం జరుగుతుంది. భూమికి ఆకాశానికి నడుమ ఊగులాడుతుంటారు వారు." (అబూ హురైరా(రజిఅన్)- మిష్కాత్)

**సంగ్రహణం:**

1. ఉమరా అనేది అమీర్ అనే పదానికి బహువచనం. రాజ్యంలోని కీలకమైన హోదాలు అలంకరించినవారు అని అర్థం. ఉదాహరణకు: దేశాధ్యక్షుడు, మంత్రులు, గవర్నరు పాలననడిపే సెక్రటరీలు న్యాయస్థాన పీఠాల్ని అలంకరించి ప్రజలకు న్యాయం చేకూర్చే బాధ్యతగల న్యాయాధిపతులు, మెజిస్ట్రేటులు వగైరా.

2. ఉరఫా, అరీఫ్ అనే పదానికి బహువచనం. అరీఫ్ అంటే ప్రాంతాలు, తెగలు, బస్తీల సర్దారులు, చౌధరీలు. వీరు ప్రజలకు ప్రభుత్వానికి నడుమ వారధులుగా ఉంటారు. వీరు పలుకుబడిగల పెద్దలు. వీరికి ప్రభుత్వానికి నడుమ గట్టి సంబంధాలుంటాయి. ప్రభుత్వం వీరి మాటలను నమ్ముతుంది. పేదలైన ప్రజలు సాధారణంగా తమ పనులు చేయించుకోడానికి వారినే ఆశ్రయిస్తారు.

3. ఉమ్నా. ఇది అమీన్ అనే పదానికి బహువచనం. అమీన్ అంటే అమానతు దారుడు (Trusty). వీరు రెవెన్యూ శాఖకు సంబంధించినవారు. పన్నులు వసూలు చేసేవారు (తహసీలుదారు, రెవెన్యూ అధికారులు), ట్రెజరీ, వక్ఫ్‌బోర్డు ఆఫీసర్లు, వితంతువులు, అనాథల ఆస్తుల సంరక్షకులు, ఇతరుల సొత్తును తమ వద్ద అమానత్తుగా ఉంచి దాచేవారు.

పైన పేర్కొన్న శాఖలు, వాటిలో పనిచేసేవారు లేకుండా ప్రభుత్వ వ్యవస్థ నడవజాలదు. ఈ వ్యక్తులు తమ బాధ్యతలనెరిగి తమ విధులను కష్టపడి చిత్తశుద్ధితో, న్యాయంగా నిర్వర్తించినప్పుడే దేశం స్వర్గధామంగా అలరారుతుంది. పైగా ప్రళయం రోజున దేవుడు వారికి గొప్ప బహుమానమిచ్చి సన్మానిస్తాడు. (హదీసు నెంబరు 282-309 చూడండి). అయితే సదరు పాలకులు, ప్రభుత్వోద్యోగులు, పలుకుబడి గల సర్దారులు తమ బాధ్యతలను ఎరుగక లంచం, అవినీతి, అమానతుల గల్లంతులకు దూరంగా ఉండకుండా తమకు లభించిన అధికారాలను దుర్వినియోగం చేసి ప్రయోజనం పొందే

ప్రయత్నం చేస్తే, పాలితులపై దౌర్జన్యానికి దిగితే వారిని ముప్పుతిప్పలు పెడుతూ హింసిస్తూ ఉంటే ప్రళయం రోజున ఈ గౌరవనీయులు, ఈ వి.ఐ.పీలు అల్లాహ్ క్రోధానికి పాత్రులైపోతారు. వారికోసం అతికఠినమైన యాతన గురించిన ప్రకటన వెలువడుతుంది. అప్పుడు వారు అయ్యో అధికార హోదాలు, వాటి ఐశ్వర్యాలు నాయకత్వానికి బదులు ప్రపంచంలోనే మాకు హీనమైన పరిస్థితి ఏర్పడి ఉంటే ఎంత బాగుండునని అనుకుంటారు. కాని అలాంటి కోరికల వల్ల వారికి ఒరిగేదేమీ ఉండదు.

## ఇస్లామీయ రాజ్యసంరక్షకుని విధులు

(۲۷۹) قَالَ عَمْرُو بْنُ مُرَّةَ لِمُعَاوِيَةَ إِنِّي سَمِعْتُ رَسُولَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ مَا مِنْ إِمَامٍ يُغْلِقُ بَابَهُ دُونَ ذَوِي الْحَاجَةِ وَالْخَلَّةِ وَالْمَسْكَنَةِ إِلَّا أَغْلَقَ اللهُ أَبْوَابَ السَّمَاءِ دُونَ خَلَّتِهِ وَحَاجَتِهِ وَمَسْكَنَتِهِ فَجَعَلَ مُعَاوِيَةُ رَجُلًا عَلَى حَوَائِجِ النَّاسِ۔ (ترمذی ابواب الاحکام ابوداؤد کتاب الخراج)

279. హజ్రత్ అమ్రూ బిన్ ముర్రా(రజిఅన్), దైవప్రవక్త(స) ఇలా ప్రవచిస్తూ ఉండగా నేను విన్నానని హజ్రత్ ముఆవియా (రజిఅన్) గారితో చెప్పారు.

"ఏ పాలకుడయితే అగత్యపరులు, నిరుపేదలు, అసహాయుల విషయంలో తన ద్వారాలను మూసిఉంచుతాడో, అల్లాహ్ అతని అవసరాల విషయంలో, అతని అసహాయతవిషయంలోను ఆకాశ ద్వారాలు మూసివేస్తాడు. (ఈ మాటలు విన్న) హజ్రత్ ముఆవియా (రజిఅన్) ప్రజల అవసరాలను తీర్చడానికి, వారి బాధలను దూరంచేయడానికి ఓ వ్యక్తిని నియమించారు." *(తిర్మిజీ, అబూదావూద్)*

**సంగ్రహణం:**

ఇస్లామీయ రాజ్యపాలకుడు, అతని ప్రభుత్వాన్ని నడిపే ఉన్నతాధికారులు ప్రజలతో సంబంధాలను ఏర్పరుచుకొని ఉండడం వారి విధి. వారి సమస్యలు, కష్టాలను నేరుగా తెలుసుకుంటూ ఉండాలి. నిరుపేదలు, బలహీనులు తమ గోడును వినిపించుకోడానికి ఎలాంటి ఆటంకములను సృష్టించకూడదు. పలుకుబడిలేనివారు, సామాన్యులు కూడా

తమ అభ్యర్థనలను ఎలాంటి సంకోచం లేకుండా వారికి సమర్పించే వీలు కలిగించాలి. ఏ ద్వారపాలకుడో, ఏ పలుకుబడి గల వ్యక్తో లేదా ఏ పి.ఏ లాంటివాడో ప్రజలకు ప్రభువుకు నడుమ అడ్డుగా నిలిచే వీలులేకుండా చేయాలి. అయితే దీనికి భిన్నంగా పాలకుని దగ్గరకు తమ గోడు వినిపించే మార్గమే లేకపోతే, ప్రజలు తమ బాధలు, కష్టాలను కడతేర్చమని ఉన్నతాధికారుల వద్దకు వెళ్ళే వ్యవస్థే లేకపోతే దేవుడు ఇలాంటి నిర్దయ కలిగిన పాలకులను తన కారుణ్య ఛాయల నుండి దూరంగా గెంటివేస్తాడు వారి వేడుకోళ్ళూ మన్నించబడవు.

(۲۸۰) عَنْ مَعْقِلِ بْنِ يَسَارٍ قَالَ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
يَقُوْلُ مَا مِنْ عَبْدٍ اِسْتَرْعَاهُ اللّٰهُ رَعِيَّةً فَلَمْ يَحُطْهَا
بِنَصِيْحَةٍ اِلَّا لَمْ يَجِدْ رَائِحَةَ الْجَنَّةِ۔ (بخاری کتاب الاحکام)

280. హజ్రత్ మాకిల్ బిన్ యాసార్(రజిఅన్) దైవప్రవక్త(స) గారు ఇలా ప్రవచిస్తూ ఉండగా విన్నానని ఉల్లేఖిస్తున్నారు.

"దేవుడు ఎవరిని ప్రజల పాలకునిగా చేస్తాడో అతడు వారి బాగోగులను దృష్టిలో ఉంచుకొని వారిని సంరక్షించకపోతే ఆ పాలకుడు స్వర్గ పరిమళాన్ని ఆఘ్రాణించలేడు." (బుకారి)

**సంగ్రహణం:**

అంటే ఏ పాలకుడయితే ప్రజల బాగోగులను దృష్టిలో ఉంచుకొనేవాడో, వారిని ప్రేమించేవాడు కాలేడో అలాంటి పాలకుడు స్వర్గ పరిమళాన్ని ఆఘ్రాణించజాలడు. బాగోగులు అంటే వారి ధనమాన ప్రాణాలను సంరక్షించడం, సత్కార్యాలను ప్రోత్సహించడం, దేశాన్ని సుసంపన్నమొనరించడం, శాంతిభద్రతలను కాపాడి వారిని సుఖంగా ఉంచడం, అశ్లీలం, వ్యభిచారం, అత్యాచారం, అజ్ఞానం, అధర్మం మరియు పేదరికాలను నిర్మూలించడానికి తన శక్తినంతా వినియోగించడం అని అర్థం.

## దేశద్రోహులైన పాలకులెవరు?

(۲۸۱) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِكُلِّ غَادِرٍ لِوَاءٌ يَوْمَ
الْقِيَامَةِ يُرْفَعُ لَهٗ بِقَدْرِ غَدْرِهٖ اَلَا وَلَا غَادِرَ اَعْظَمُ غَدْرًا
مِنْ اَمِيْرِ عَامَّةٍ۔ (مسلم عن ابی سعید کتاب الجهاد والسیر)

281. "ప్రళయం రోజున ప్రతి మోసగాడైన పాలకుని పతాకం అతని ద్రోహాన్ననుసరించి ఉన్నతం చేయబడుతుంది జాగ్రత్త! ప్రభుత్వ అధికారులను ఎవరు ఎంత అధికంగా తన గుప్పెట నుంచుకుంటాడో అంతటి అవినీతిపరుడింకెవరూ ఉండరు అని తెలుసుకోండి." అని దైవప్రవక్త(స) ప్రవచించారు. (అబూ సయీద్(రజిఅన్)- ముస్లిమ్)

**సంగ్రహణం:**

ఇస్లామీయ రాజకీయ నైతికత వ్యవస్థల్లోచేసిన వాగ్దానాలను నెరవేర్చడం అతి ముఖ్యం. ప్రళయదినాన ప్రతి వ్యక్తి తాను దైవదాసుడనని చేసిన వాగ్దానాన్ని గురించి ప్రశ్నించబడతాడు. అదేకాదు ఈ ఇహలోకంలో తాను ప్రజలకు ఇచ్చినమాట ఎంత వరకు నిలబెట్టుకున్నాడన్నది కూడా అడగడం జరుగుతుంది. చేసిన వాగ్దానాన్ని భంగం చేసినవాడు, ఆ వాగ్దానాలకు వ్యతిరేకంగా వ్యవహరించినవాడి చేతికి అక్కడ 'వాగ్దాన పతాకం' అనే ఓ జెండాను ఇవ్వడం జరుగుతుంది. ఆ జెండాను చూసి అతడు ఏ మేరకు వాగ్దానాలను ఉల్లంఘించాడు అన్నది ప్రతివాడు తెలుసుకుంటాడు. ఇలా తీర్పు మైదానంలో ప్రజలముందు అతడు అతి నీచునిగా, హేయమైన వ్యక్తిగా ప్రకటించబడతాడు.

మహాప్రవక్త(స)గారి ఈ ప్రవచన సారాంశమేమంటే ప్రజలను మోసగించి, చేసిన వాగ్దానాలను కాలరాచి, అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి అనేక అసత్య ప్రకటనలు చేసి ఆ పీఠం పైకెక్కిన తరువాత వారిని మరిచిపోయిన ప్రతి నాయకుని చేతిలో వాగ్దాన భంగపు పతాకం ఉంటుంది. ఆ పతాకం ద్వారా తాను ఎంతటి మోసగాడో తెలుస్తుంది అన్నదే.

## న్యాయశీలుడైన పాలకుడు

(۲۸۲) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ اَحَبَّ النَّاسِ اِلَى اللهِ يَوْمَ الْقِيَامَةِ وَ
اَدْنَاهُمْ مِنْهُ مَجْلِسًا، اِمَامٌ عَادِلٌ وَ اَبْغَضَ النَّاسِ اِلَى اللهِ يَوْمَ الْقِيَامَةِ وَ
اَبْعَدَهُمْ مِنْهُ مَجْلِسًا اِمَامٌ جَائِرٌ۔ (ترمذی عن ابی سعید ابواب الاحکام)

282. దైవప్రవక్త(స) గారి ప్రవచనం "ప్రళయ దినాన అల్లాహ్ దృష్టిలో క్రూరుడు, అన్యాయపరుడైన పాలకుడు అతిదూరంగా ఉంటాడు. ఆయనకు ప్రియమైనవాడు న్యాయశీలుడైన పాలకుడు అతి దాపులో ఉంటాడు. ఆరోజు అల్లాహ్ దృష్టిలో అతినీచుడు దుష్టపాలకుడే."

(అబూసయీద్(రజిఅన్)- తిర్మిజీ)

**సంగ్రహణం:**

అంటే న్యాయంగా పాలించే పాలకునికి దైవసాన్నిధ్యం లభిస్తుంది. ప్రళయం రోజు ప్రపంచంలో దౌష్ట్యాన్ని రేకెత్తించి, దౌర్జన్యం, హింసల ద్వారా పరిపాలించే పాలకుడు అధోగతికి లోనవుతాడు అని అర్థం.

## ఇస్లాం రాజకీయ వ్యవస్థ

(٢٨٣) عَنْ كَعْبِ بْنِ عُجْرَةَ قَالَ قَالَ لِيْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أُعِيْذُكَ بِاللّٰهِ مِنْ إِمَارَةِ السُّفَهَاءِ قَالَ وَمَا ذَاكَ يَا رَسُوْلَ اللّٰهِ؟ قَالَ أُمَرَاءُ سَيَكُوْنُوْنَ مِنْ بَعْدِيْ مَنْ دَخَلَ عَلَيْهِمْ فَصَدَّقَهُمْ بِكَذِبِهِمْ وَأَعَانَهُمْ عَلٰى ظُلْمِهِمْ فَلَيْسُوْا مِنِّيْ وَلَسْتُ مِنْهُمْ وَلَنْ يَرِدُوْا عَلَيَّ الْحَوْضَ وَمَنْ لَمْ يَدْخُلْ عَلَيْهِمْ وَلَمْ يُصَدِّقْهُمْ بِكَذِبِهِمْ وَلَمْ يُعِنْهُمْ عَلٰى ظُلْمِهِمْ فَأُولٰئِكَ مِنِّيْ وَأَنَا مِنْهُمْ وَأُولٰئِكَ يَرِدُوْنَ عَلَيَّ الْحَوْضَ (مشكوة كتاب الامارة والقضاء بحوالہ ترمذی ونسائی)

283. దైవప్రవక్త (సఅసం) నాతో ఇలా అన్నారని హజ్రత్ కఅబ్ బిన్ ఉజ్రా ఉల్లేఖిస్తున్నారు.

"నేను నిన్ను ఉన్మాదుల పాలన (ద్వేషం) నుండి అల్లాహ్ శరణులో ఇస్తున్నాను." అనగా దైవప్రవక్తా! ఇదేమిటి అని నేనడిగాను దానికి ఆయన, (అజ్ఞానులైన) పాలకులు నా తరువాత వస్తారు. వీరి దగ్గరికి పోయేవారు, వారి అసత్యవాదాన్ని ధృవపరిచేవారు, వారి దౌర్జన్యానికి ఊతమిచ్చేవారు నా వారు కారు. నేను వాళ్ళ వాణ్ణి కాను. 'కౌసర్' కొలను వద్ద నా దగ్గరికి రాలేరు.

ఇక ఎవరయితే వారిని దర్శించరో, వారి అసత్యాన్ని ధృవపర్చరో, దౌర్జన్యంలో వారికి సహాయమందించరో వారంతా నావారు. నేనూ వారి వాడను. వారు 'కౌసర్' కొలను వద్ద కూడా నన్ను వచ్చి కలుసుకోగలరు అని సెలవిచ్చారు." (తిర్మిజి, నిసాయి)

**సంగ్రహణం:**

దౌర్జన్యపరులైన పాలకుల దౌష్ట్యాలకు మద్దతునిచ్చేవారంటే దైవప్రవక్త (సఅసం)కు అసహ్యం. ఆయన, ఈ అజ్ఞానులైన పాపాత్ములకు వంతపాడి భౌతిక సుఖాలను పొందడానికి ప్రతి అసత్యాన్ని సత్యమని ధృవీకరించేవారు, వారి దౌష్ట్యాలను మరుగుపరిచే ప్రయత్నం చేసేవారు, ఆ పాలకులు మరింత పెచ్చరిల్లడానికి సహాయపడేవారు అతి త్వరలో ఉనికిలోకి రాగలరని భవిష్యవాణి చేశారు.

(۲۸۴) عَنْ اَوْسِ بْنِ شُرَحْبِيْلَ اَنَّهٗ سَمِعَ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: مَنْ مَشٰى مَعَ ظَالِمٍ لِيُقَوِّيَهٗ وَهُوَ يَعْلَمُ اَنَّهٗ ظَالِمٌ فَقَدْ خَرَجَ مِنَ الْاِسْلَامِ-

(مشکوۃ کتاب الآداب باب الظلم)

284. హజ్రత్ అవస్ బిన్ షర్జీల్ (రజిఅన్), మహాప్రవక్త (స) ఇలా సెలవిస్తూ ఉండగా విన్నానని ఉల్లేఖించారు.

"ఫలానా పాలకుడు దుష్టపాలకుడు, దౌర్జన్యపరుడు అని తెలిసికూడా అతనికి ప్రోత్సహమిచ్చేవాడు, మద్దతునిచ్చేవాడు ముస్లిమ్ కానేరడు."

**సంగ్రహణం:**

దౌర్జన్యం చేసేవానికి సహాయపడడం, అతణ్ణి ప్రోత్సహించడం అన్నది ఓ ముస్లిం వైఖరి కానేరదు. కావాలని దుష్టుణ్ణి వెనుకేసుకురావడం, అతని దౌష్ట్యాన్ని కప్పిపుచ్చడం సరైన విషయం కాదు. నోటిద్వారా, కలం ద్వారా ఆ దౌష్ట్యాన్ని బలపరచడం కూడా ఓ ఘోరమైన నేరం. ఆ వైఖరి ఏ ముస్లిముకు ఒప్పదు అని పై హదీసు వల్ల తెలుస్తోంది.

## మోసగాడైన పాలకుడు

(۲۸۵) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَا مِنْ وَالٍ يَلِيْ رَعِيَّةً مِنَ الْمُسْلِمِيْنَ فَيَمُوْتُ وَهُوَ غَاشٌّ لَهُمْ اِلَّا حَرَّمَ اللّٰهُ عَلَيْهِ الْجَنَّةَ-

(بخاری عن معقل بن یسار کتاب الاحکام)

285. "చివరి ఘడియల వరకు మోసం దగా మరియు అవినీతితో

పాలన చేసే ముస్లిముల పాలకునిపై అల్లాహ్ స్వర్గాన్ని నిషేధించాడు" అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

**సంగ్రహణం:**

దేశానికి సంబంధించిన ధనాగారాన్ని ప్రాకృతిక వనరుల్ని తన సొంత ఆస్తిగా తలచి వాటిని దుర్వినియోగం చేసే పాలకుడు పెద్ద మోసగాడు. అలాంటి వాడు స్వర్గంలో ప్రవేశానికి అర్హుడు కాజాలడు అని ఈ హదీసు సారాంశం.

## అతి చెడ్డ వ్యక్తి

(۲۸۶) اِنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ: اَبْغَضُ النَّاسِ اِلَی اللّٰہِ ثَلَاثَۃٌ: مُلْحِدٌ فِی الْحَرَمِ، وَمُبْتَغٍ فِی الْاِسْلَامِ سُنَّۃَ الْجَاھِلِیَّۃِ وَمُطَّلِبُ دَمِ امْرِیءٍ بِغَیْرِ حَقٍّ لِیُھْرِیْقَ دَمَہٗ۔

(بخاری عن ابن عباس کتاب الدیات)

286. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "అల్లాహ్‌కు ఈ ముగ్గురు వ్యక్తులు అందరికంటే ఎక్కువ అయిష్టమైన వారు. 1) 'హర్మ్' (కాబా గృహం) పరిధుల్లో దౌర్జన్యం, పాపం చేసేవాడు. 2) అజ్ఞానకాలం నాటి మూఢాచారాలు ఇస్లాం ధర్మంలో ఉండాలని కోరుకునేవాడు. 3) రక్తపాతం సృష్టించడానికి ఒకరిని అన్యాయంగా హతమార్చే ప్రయత్నం చేసేవాడు. (ఇబ్నె అబ్బాస్ (రజిఅన్)–బుకారి)

**సంగ్రహణం:**

అల్లాహ్‌కు అతిగా అయిష్టం కావడం అంటే దుర్మార్గుల్ని గుణపాఠం గరిపే శిక్షకు గురిచేస్తాడని అర్థం.

కాబా గృహం పరిధుల్లో పాపం చేయడం అంటే పవిత్రమైన గృహం యొక్క పవిత్రతను భంగపరచడం. అది మహాపాపం, దౌర్జన్యమూను. పాపం చిన్నదైనా, పెద్దదైనా అది ప్రజా హక్కులతో ముడివడైనా ఉంటుంది లేదా దేవుని హక్కులతోనైనా సంబంధం కలిగి ఉంటుంది – అన్ని సందర్భాల్లోను అది తప్పు, నేరమూను. అయితే కాబా గృహ పరిధుల్లో ఈ పాపం తీవ్రత మరింత పెరుగుతుంది. ఉదాహరణకు అసత్య మాడడం పాపం. కాని మసీదులో కూచుని అసత్యం పలకటం మరింత పాపం. అదే కాబా గృహ

ప్రాంగణంలోనయితే దాని తీవ్రత మరింత పెరుగుతుంది. దేవుడు సాధారణ పరిస్థితిలో ఏ దౌర్జన్యాన్నైనా సహించడు. అయితే ఆ దౌర్జన్యం కాబా గృహ ప్రాంగణంలో ఒకరిపై చేసిన వాడు దేవుని కోపాగ్నికి మరింత ఆజ్యం పోస్తున్నాడన్నమాట. సాధారణ పాపం కంటే ఇతడు ప్రళయం రోజున దైవక్రోధానికి మరింత గురౌతాడు. 2. ఇస్లామీయ సమాజంలో అజ్ఞాన కాలం నాటి మూఢాచారాలు వ్యాపించడాన్ని వాటిని వ్యాపింపజేసేవాణ్ణి అల్లాహ్ ప్రళయం రోజున ఘోర శిక్షకు గురిచేస్తాడు. నేడు ముస్లిమ్ దేశాల్లో ఇస్లాం పేరున అజ్ఞాన కాలం నాటి ఆచారాల్ని, దుర్మార్గాల్ని ప్రోత్సహించి వ్యాపింప జేసే పాలకుల గతి ప్రళయం రోజున ఏమి కానున్నదో? అలాగే ముస్లిం సమాజంలో, నగ్నత్వం, అశ్లీలం, విచ్చలవిడితనం, అక్రమాల్లాంటివి సర్వసామాన్యం చేయడానికి ప్రయత్నించే సోకాల్డ్ మేధావులు ఎంతటి యాతనలకు గురికాగలరో చెప్పడానికే భయంగా ఉంది. 3. ఒకరిని అన్యాయంగా చంపించడానికి ప్రయత్నం చేసే వాడికి కూడా అల్లాహ్ న్యాయస్థానంలో కఠినమైన శిక్ష పడుతుంది. కొందరు కరుడుకట్టిన పాలకులు, పాషాణ హృదయులైన ప్రజా నాయకులు ఇతరుల్ని తమ స్వార్థం కోసం హతమార్చేందుకు ప్రయత్నం చేస్తుంటారు. వారి అక్రమాలకు అడ్డుతగిలే వారు ఈ భూమ్మీద బ్రతికి ఉండడం వారికి ఇష్టముండదు. ఈ ప్రవచన భావం ఏమిటంటే ఓ ముస్లిమును హతమార్చడానికి వ్యూహరచన చేయడం, లేదా అతడిని చంపే ప్రయత్నం చేయడం అంటే దైవక్రోధాన్ని ఆహ్వానించడమే అని. ఓ ముస్లిమ్‌ను చంపడం ఎంత గొప్ప నేరమో ఈ హదీసు ద్వారా తెలుసుకోవచ్చు.

## శిష్ట పాలకులెవరు? దుష్టపాలకులెవరు?

(٢٨٧) عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ خِيَارُ اَئِمَّتِكُمُ
الَّذِيْنَ تُحِبُّوْنَهُمْ وَيُحِبُّوْنَكُمْ وَيُصَلُّوْنَ عَلَيْكُمْ وَ
تُصَلُّوْنَ عَلَيْهِمْ ، وَشِرَارُ أَئِمَّتِكُمُ الَّذِيْنَ تُبْغِضُوْنَهُمْ
وَيُبْغِضُوْنَكُمْ وَتَلْعَنُوْنَهُمْ وَيَلْعَنُوْنَكُمْ قِيْلَ يَارَسُوْلَ
اللّٰهِ! اَفَلَا نُنَابِذُهُمْ بِالسَّيْفِ؟ فَقَالَ لَا ، مَا اَقَامُوْا فِيْكُمُ
الصَّلٰوةَ ، وَاِذَا رَاَيْتُمْ مِنْ وُلَاتِكُمْ شَيْئًا تَكْرَهُوْنَهُ
فَاكْرَهُوْا عَمَلَهُ وَلَا تَنْزِعُوْا يَدًا مِنْ طَاعَتِهِ -

(مسلم عن عوف بن مالک کتاب الامارة)

287. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: మీలో ఉత్తములైన పాలకులెవరంటే, మీకు వారంటే ఇష్టం, వారికి మీరంటే ఇష్టం. మీరు వారి క్షేమం కోసం ప్రార్థిస్తారు వారూ మీ మేలు కోసం ప్రార్థిస్తారు. అలాగే మీరు అసహ్యించుకునే వారు దుష్టపాలకులు. వారికి మీరంటే అసహ్యం. అదే విధంగా వారు మిమ్మల్ని శపిస్తుంటారు మీరూ వారిని శపిస్తుంటారు. (ఈ మాటలు విన్నవారు) అడిగారు, దైవప్రవక్తా! మరయితే మేము వారికి వ్యతిరేకంగా కత్తి కట్టాలా? అని. (సమాధానంగా) ఆయన ఇలా సెలవిచ్చారు: లేదు, వారు మీలో నమాజును స్థాపించినంతవరకు (వారిని వ్యతిరేకించకండి). మీ పాలకుల్లోని దుర్మార్గాలు చూసి వారిని మీరు అసహ్య దృష్టితో చూస్తూ ఉన్నా వారి విధేయతను కాదనకండి.

*(ఔఫ్ బిన్ మాలిక్ (రజిఅన్)–ముస్లిమ్)*

**సంగ్రహణం:**

నమాజు స్థాపన ఇస్లామీయ రాజ్యం ప్రథమ కర్తవ్యం రాజ్యపాలకుడు నమాజును స్థాపించనప్పుడు శాసన బద్ధంగా అతణ్ణి అధికారం నుండి తొలగించడం ధర్మసమ్మతం. అదేకాదు అత్యంత అవసరం కూడాను.

## నమ్రత అంటే...

(۲۸۸) قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِنَّ اللّٰہَ اَوْحٰے
اِلَیَّ اَنْ تَوَاضَعُوْا حَتّٰی لَا یَفْخَرَ اَحَدٌ عَلٰی اَحَدٍ وَلَا یَبْغِیْ
اَحَدٌ عَلٰی اَحَدٍ۔ (مسلم عن عیاض بن حمار کتاب الجنۃ)

288. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "అల్లాహ్ నాకు 'వహీ' (దైవవాణి) ద్వారా, నమ్రతను కలిగి ఉండమని, ఒకరు మరొకరిపై గర్వపడి పెత్తనం చెలాయించవద్దని, ఒకరిపై దౌర్జన్యం చేయవద్దని, ఒకరి హక్కును కొల్లగొట్టవద్దని ఆదేశించాడు."

*(అయాజ్ బిన్ హిమార్ (రజిఅన్)– ముస్లిమ్)*

**సంగ్రహణం:**

అధికారం గలవారు, రాజ్యపాలనా అధికారులు ప్రజలకు శాంతి, సౌఖ్యాలతో కూడిన జీవనం లభించేందుకు గాను అందరికంటే మిన్నగా నమ్రతను పాటించవలసి ఉంటుంది. నమ్రత అంటే తమకంటే తక్కువస్థాయి వారిని నీచంగా చూడకుండా ఉండడం. వారిపై దౌర్జన్యం చేయకుండా ఉండడం.

పాలకుల నమ్రత అంటే వారు తమ పాలితుల్లో ఏ వ్యక్తి హక్కును కొల్లగొట్టకుండా ఉండడం. వారిని అల్ప దృష్టితో చూడకుండా ఉండడం. పైగా సోదరభావంతో వారి ఎడల మెలగాలి.

'ఉలమా' (ధర్మవేత్తలు) 'మషాయక్' (మత గురువులు)కు సంబంధించిన నమ్రత ఏమిటంటే వారు ఏ ముస్లిమ్‌కు వ్యతిరేకంగా దుర్బుద్ధితో ప్రచారం చేయకుండా ఉండడం. ఒకరి గౌరవాభిమానాలకు భంగం కలిగే భాషను ఉపయోగించకుండా ఉండడం. తమను విభేదించేవారిని కించపరచకుండా ఉండడం. కాగా ప్రతి ధర్మవేత్తను, మత గురువును గౌరవించాలి. అదే కాకుండా తమ విజ్ఞానం, ధర్మపరాయణతల గురించి విర్రవీగకుండా ఉండడం. ధనవంతుల నమ్రత ఏమిటంటే, వారు ప్రజల పేదరికం వల్ల వారిని నీచంగా చూస్తూ ఉంటారు. వారిని తక్కువ దృష్టితో చూడకుండా ఉండటం.

భూస్వాముల నమ్రత ఏమిటంటే వారు రైతులు, కూలీల గౌరవంతో, వారి మాన మర్యాదలతో చెలగాటమాడకుండా ఉండడం. వారి ఆదాయం సమయానికి వారికి ముట్టజెప్పడం. తమ నిరుపేద పొరుగువారిని అస్పృశ్యులుగా భావించకుండా ఉండడం. వారితో సోదరుల్లా మెలగాలి. పారిశ్రామికవేత్తల నమ్రత ఏమిటంటే, వారు తమ కార్మికుల హృదయాలకు బాధ కలిగించకుండా ఉండడం. వారి హక్కులను నిర్ణయించి అవి సక్రమంగా వారికి అందేటట్లు చేయడం వారిని తమ సోదరులుగా భావించడం.

## ఇస్లామీయ రాజ్యంలో ముస్లిముల హక్కులు

(۲۸۹) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ صَلّٰى صَلٰوتَنَا
وَاسْتَقْبَلَ قِبْلَتَنَا وَأَكَلَ ذَبِيْحَتَنَا فَذٰلِكَ الْمُسْلِمُ الَّذِىْ
لَهٗ ذِمَّةُ اللّٰهِ وَذِمَّةُ رَسُوْلِهٖ فَلَا تُخْفِرُوا اللّٰهَ فِىْ
ذِمَّتِهٖ. (بخاری عن انس کتاب الصلوۃ)

289. మహాప్రవక్త (సఅసం) ప్రవచనం ఇలా ఉంది: "ఎవరైతే మాలాగా నమాజు చేస్తాడో, (నమాజులో) మా ఖిబ్లా (కాబా గృహం) వైపు

ముఖం త్రిప్పి నిలబడతాడో మేము జిబహ్ చేసిన జంతువు మాంసాన్ని తింటాడో అతడు (నిజమైన) ముస్లిం. అతణ్ణి అల్లాహ్, ఆయన ప్రవక్త తమ శరణులో ఉంచుకున్నారు. కాబట్టి మీరు అతనికి అన్యాయం చేసి అల్లాహ్‌తో చేసిన వాగ్దానాన్ని భంగపరచకండి. *(అనస్ (రజిఅన్)-బుకారి)*

**సంగ్రహణం:**

ఇస్లామీయ రాజ్యంలో మాలాగే అయిదు పూటలా నమాజు చేసే వాడు, నమాజులో తమ ఖిబ్లాకు అభిముఖంగా నిలబడేవాడు, మేము జిబహ్ చేసిన జంతువు మాంసం తినేవాడు ఇస్లామీయ సమాజ సభ్యుడుగా పరిగణించబడతాడు.

ఇస్లామీయ రాజ్యం అతని ధనమాన ప్రాణాల సంరక్షణా బాధ్యతను కలిగి ఉంటుంది. ఈ హదీసులో చట్టబద్ధంగా ముస్లిమ్ అయ్యేవాని మూడు లక్షణాల్ని సూచించడం జరిగింది. కాని నిజమైన ముస్లిం గుణగణాలు నైతిక విలువలు అతని నడవడికకు సంబంధించిన లక్షణాలు అనేకం ఉన్నాయి. ఇవి దివ్యఖుర్ఆన్‌లోను, హదీసుల్లోను వివరంగా చెప్పడం జరిగింది.

ఓ వ్యక్తి నిజమయిన ముస్లిమా కాదా అనే తీర్పు నిచ్చే అధికారం కేవలం అల్లాహ్‌కు మాత్రమే ఉంది. ఆయన సర్వజ్ఞాని, పరోక్ష జ్ఞానం కలిగినవాడును. ఇస్లామీయ ప్రజల హృదయాలను వెతికి అతడు ముస్లిమా కాదా అని నిర్ణయించడం ఇస్లామీయ సామ్రాజ్యం బాధ్యత కాదు. అది తన ఆదేశాల్ని చట్టాల్ని ప్రజల పౌర హక్కులకు సంబంధించి వారి బాహ్య లక్షణాలను బట్టే చూడగలదు. కారణం ఏమిటంటే సామాజిక న్యాయంలో ఒకరి అంతరంగాన్ని వెతికి నిర్ణయానికి వచ్చే అధికారం దానికి ఉండదు. లేదు కూడాను.

## ఇస్లామీయ సామ్రాజ్యం - ముస్లిమేతరులు

(۲۹۰) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنْ قَتَلَ مُعَاهِدًا
لَمْ يَرَحْ رَائِحَةَ الْجَنَّةِ وَاِنَّ رِيْحَهَا تُوْجَدُ مِنْ مَسِيْرَةِ
اَرْبَعِيْنَ عَامًا۔ (بخاری عن عبداللہ بن عمرو کتاب الجزیۃ)

290. "(జాగ్రత్త!) ఎవరైనా ఒప్పందం జరిగిన ముస్లిమేతరుడ్ని సంహరిస్తే అతడు (ప్రళయం రోజున) స్వర్గ సుగంధాన్నైనా ఆఘ్రాణించ జాలడు. స్వర్గ సుగంధం నలభై ఏళ్ళ ప్రయాణ దూరం నుండే ముక్కు పుటాలకు చేరుతుంది" అని మహాప్రవక్త (స) సెలవిచ్చారు.

*(అబ్దుల్లా బిన్ అమ్రూ (ర.అన్.) బుకారి)*

**సంగ్రహణం:**

ఇస్లామీయ ప్రభుత్వం తన మీద విశ్వాసం ప్రకటించి లేదా తాత్కాలిక ప్రాతిపదికపై తనతో శాంతి ఒప్పందం చేసుకొని తన రాజ్యంలో నివసించే ముస్లిమేతరులందరి ధన మాన ప్రాణాలను రక్షించే బాధ్యతను కలిగి ఉంటుంది.

దైవప్రవక్త (సఅసం) ఇలాంటి 'జిమ్మీ'ల (ఇస్లామీయ రాజ్య శరణులో వచ్చిన ముస్లిమేతర (ప్రజలు) సంరక్షణ, వారి ఎడల న్యాయంగా మెలిగేందుకు ఎంతో గట్టిగా తాకీదు చేశారు. ఈ హదీసులో మహాప్రవక్త (సఅసం) అంతిమ దినం వరకు అధికారం లోనికి వచ్చే ప్రతి ముస్లిం పాలకుణ్ణి, జిమ్మీగా ముస్లిమ్ రాజ్యంలో నివసించడానికి నిర్ణయిం చుకున్న వాడు లేదా శాంతి సందేశం తెచ్చిన ప్రతి ముస్లిమేతరుణ్ణి సంహరించవలదని ఆదేశించారు. ఒకవేళ మీరు అతణ్ణి సంహరిస్తే, జాగ్రత్త! ప్రళయం రోజున (స్వర్గంలో ప్రవేశించడం అటుంచి) దాని సుగంధాన్ని కూడా ఆఘ్రాణించలేరు అని హెచ్చరించడం జరిగింది.

## ఇస్లామీయ సామ్రాజ్యం - రుణగ్రస్తులైన పౌరులు

(۲۹۱) عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ اَنَا اَوْلٰى بِالْمُؤْمِنِيْنَ مِنْ اَنْفُسِهِمْ فَمَنْ مَاتَ وَعَلَيْهِ دَيْنٌ وَلَمْ يَتْرُكْ وَفَاءً فَعَلَيْنَا قَضَاءُهٗ وَمَنْ تَرَكَ مَالًا فَلِوَرَثَتِهٖ.

(بخاری عن ابی ہریرہ کتاب الفرائض)

291. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "నేను మోమిన్‌లకు (విశ్వాసులకు) వారి ప్రాణాలకంటే కూడా అత్యంత సన్నిహితుణ్ణి. రుణగ్రస్తులైన మరణించిన వారు, ఆ రుణాన్ని తీర్చడానికి ఎలాంటి ఆస్తిని కూడా వదలి పెట్టకపోతే మేము వారి రుణాన్ని తీరుస్తాం. ఇంకెవరైతే తమ వెనుక ఆస్తిని వదిలి వెళ్ళారో (వారసత్వ చట్టం ప్రకారం) అతని వారసుల్లో అది పంచడం జరుగుతుంది." (అబూ హురైరా (రజిఅన్)-బుఖారి)

**సంగ్రహణం:**

రుణం తీర్చలేని వారి రుణ భారాన్ని తీర్చడం ఇస్లామీయ రాజ్యం బాధ్యత అని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అయితే వారు మరణానికి ముందు ఎలాంటి ఆస్తి పాస్తులు

లేని వారయి ఉండాలి. చనిపోయినవాడు ఆస్తిపరుడై ఉంటే అతని రుణం (అప్పు) అతడు వదలిపెట్టి వెళ్ళిన ఆస్తి నుండి తీర్చబడుతుంది. మిగిలిన ఆస్తి జాతీయం చేయబడదు. దాన్ని షరీఅత్ నిర్ణయించిన వారసత్వ చట్టం ప్రకారం అతని వారసుల్లో పంచబడుతుంది. ప్రభుత్వం ఈ అప్పును జకాత్ నిధి నుండి దివ్యఖుర్ఆన్ 'తౌబా' అధ్యాయంలో చెప్పినట్లుగా తీర్చడం జరుగుతుంది.

## ప్రభుత్వోద్యోగుల జీతభత్యాలు

(۲۹۲) عَنِ الْمُسْتَوْرَدِ بْنِ شَدَّادٍ قَالَ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَنْ كَانَ لَنَا عَامِلًا فَلْيَكْتَسِبْ زَوْجَةً فَإِنْ لَمْ يَكُنْ لَهُ خَادِمٌ فَلْيَكْتَسِبْ خَادِمًا فَإِنْ لَمْ يَكُنْ لَهُ مَسْكَنٌ فَلْيَكْتَسِبْ مَسْكَنًا مَنِ اتَّخَذَ غَيْرَ ذٰلِكَ فَهُوَ غَالٌّ۔

(ابوداؤد کتاب الخراج بمشکوۃ کتاب الامارۃ)

292. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిస్తూ ఉండగా విన్నానని మసౌర్ ఇబ్ని షద్దాద్ (రజిఅన్) అంటారు.

"మా 'ఆమిల్' (ఇస్లామీయ ప్రభుత్వంలో పనిచేసే ఉద్యోగి) అయిన వాడు తన వివాహానికి కావలసిన ఖర్చుల్ని బైతుల్‌మాల్ (ధనాగారం) నుండి పొందొచ్చు. అతడికి నౌకరు (అటెండరు) కావలసి వచ్చినా బైతుల్ మాల్ ఆ ఖర్చును భరిస్తుంది. తనకు నివాసం కోసం ఇల్లు సమకూర్చడం కూడా ప్రభుత్వ బాధ్యతే. ఇవికాక మరేదైనా (ప్రభుత్వ ధనాగారం నుండి) పొందినట్లయితే అతడు దీన్ని కొల్లగొట్టినవాడౌతాడు." *(అబూదాఊద్)*

**సంగ్రహణం:**

అంటే ప్రభుత్వ ఉద్యోగులు వారి కాలానికి సంబంధించిన సామాజిక అవసరాల పరిపూర్తికోసం కేవలం తమ జీతభత్యాలు, వారసత్వం ద్వారా పొందే ఆస్తులతోనే సరిపుచ్చుకోవాల్సి ఉంటుంది. ఇస్లామీయ ప్రభుత్వం, దాని క్రింద పనిచేసే ఉద్యోగుల కోసం వారి జీవన భృతికి సామాజిక అవసరాలకు సరిపడే వేతన వ్యవస్థను నిర్ధారించాల్సి వుంటుంది. అప్పుడే వారు ప్రభుత్వ ఖజానా నుండి లేదా ప్రజల నుండి లంచం, గిఫ్ట్‌లు తీసుకొని అక్రమ ధనార్జనకు పాల్పడకుండా ఉండగలరు.

## ఉద్యోగులకిచ్చే కానుకలు

(۲۹۳) إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِسْتَعْمَلَ عَامِلًا فَجَاءَهُ الْعَامِلُ حِيْنَ فَرَغَ مِنْ عَمَلِهٖ، فَقَالَ يَا رَسُوْلَ اللّٰهِ هٰذَا لَكُمْ وَهٰذَا أُهْدِيَ لِيْ فَقَالَ لَهٗ أَفَلَا قَعَدْتَ فِيْ بَيْتِ أَبِيْكَ وَأُمِّكَ فَنَظَرْتَ أَيُهْدٰى لَكَ أَمْ لَا. ثُمَّ قَامَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَشِيَّةً بَعْدَ الصَّلٰوةِ فَتَشَهَّدَ وَأَثْنٰى عَلَى اللّٰهِ بِمَا هُوَ أَهْلُهٗ ثُمَّ قَالَ أَمَّا بَعْدُ فَمَا بَالُ الْعَامِلِ نَسْتَعْمِلُهٗ فَيَأْتِيْنَا فَيَقُوْلُ هٰذَا مِنْ عَمَلِكُمْ، وَهٰذَا أُهْدِيَ لِيْ أَفَلَا قَعَدَ فِيْ بَيْتِ أَبِيْهِ وَأُمِّهٖ فَنَظَرَ هَلْ يُهْدٰى لَهٗ أَمْ لَا؟ فَوَالَّذِيْ نَفْسُ مُحَمَّدٍ بِيَدِهٖ لَا يَغُلُّ أَحَدُكُمْ مِنْهَا شَيْئًا إِلَّا جَاءَ بِهٖ يَوْمَ الْقِيَامَةِ يَحْمِلُهٗ عَلٰى عُنُقِهٖ، إِنْ كَانَ بَعِيْرًا جَاءَ بِهٖ لَهٗ رُغَاءٌ، وَإِنْ كَانَتْ بَقَرَةً جَاءَ بِهَا لَهَا خُوَارٌ، وَإِنْ كَانَتْ شَاةً جَاءَ بِهٖ تَيْعَرُ، فَقَدْ بَلَّغْتُ۔

(بخاری عن ابی حمید الساعدی کتاب الایمان و النذور)

293. మహాప్రవక్త (సఅసం) (బనీ అసద్ తెగకు చెందిన అబ్దుల్లా అనే) ఒకాయనను (బనీ సులైమ్ తెగవారి నుండి) జకాత్ ధనాన్ని వసూలు చేయడానికి ఓ ఆమిల్ (రెవెన్యూ అధికారిని)ను నియమించారు. ఆయన తన పనిచేసుకొని తిరిగి వచ్చి దైవప్రవక్తా! ఇది (ఈ ధనం) మీది (ఇస్లామీయ ప్రభుత్వానికి చెందినది). ఇది (ఈ వస్తు సామాగ్రి) నాకు కానుకలుగా ముట్టాయి అని అన్నారు. దానికి మహాప్రవక్త (సఅసం) ఆయనతో 'ప్రజలు ఈ కానుకలు తెచ్చేవారేమో నీవు నీ ఇంటనే కూర్చుని చూడకపోయావా?' అని అడిగారు.

ఆ సాయంత్రం దైవప్రవక్త (సఅసం) నమాజు అయిన తరువాత నిలబడి షహాదత్ కలిమా (దైవ ఏకత్వం గురించి సాక్ష్యమిచ్చే వచనాలు) పఠించి దైవ స్తోత్రం చేసిన తరువాత ఇలా సెలవిచ్చారు:

"మా ఆమిల్ ఏ స్థితిలో ఉన్నాడు? మేము అతణ్ణి పని మీద పంపిస్తే వచ్చి ఇది (ఈ ధన సంపద) ఆమిల్‌గా వసూలు చేసినది ఇంకా ఇది (అదనంగా లభించిన వస్తు సామాగ్రి) నాకు కానుకలుగా ముట్టాయని అంటున్నాడు. ఈ కానుకలు అతనికి ఎలా లభిస్తాయో అతడు తన తల్లిదండ్రుల ఇంట కూర్చుని చూడాల్సింది. ఆ దేవుని సాక్షి ఎవరి గుప్పిట నయితే ముహమ్మద్ ప్రాణాలున్నాయో! మీలో ఎవరు సదఖా (జకాత్) సొమ్మును కొల్లగొడ్తాడో అతడు ప్రళయం రోజున తన మెడ మీద దాన్ని వేసుకొని మోసుకొస్తాడు. గుడగుడలాడే ఒంటెను అంబా అంటూ ఉండే ఆవును, మేమె అంటూ అరచే మేకను అతడు తన భుజాన్న వేసుకొని మోసుకుంటూ వస్తాడు. ఒకవేళ అతడు అందుండి దేన్ని కొల్లగొట్టినా దాన్ని అతడు దాన్ని నెత్తినేసుకుని మోసుకొస్తాడు. (ఓ అల్లాహ్!) నేను విషయాన్ని విడమర్చి చెప్పేశాను." (హుమైదుస్సాఅదీ (రజిఅన్) –బుఖారి)

**సంగ్రహణం:**

రాజ్యానికి సంబంధించిన ఆర్థిక వనరులన్నింటి ద్వారా వచ్చే ఆదాయానికి యజమానులు ప్రజలే. ప్రభుత్వ బాధ్యత కేవలం ట్రస్టీ మరియు సంరక్షించేది మాత్రమే. చిన్నా పెద్దా ఏ ప్రభుత్వోద్యోగి తన అధికారాలను దుర్వినియోగం చేసి ప్రభుత్వ ఖజానా లేదా ఆస్తులను కాజేయకుండా చూసే బాధ్యత ప్రభుత్వానిదే. అలాగే వారు చేసే అక్రమ సంపాదనకు పూనుకొని తన సొంత సొమ్మును కాజేస్తే ప్రళయ దినం నాడు అవి వారి నెత్తికెక్కి పులిలా గాండ్రిస్తాయి. అక్కడ అందరి ముందు అలాంటి అవినీతిపరులైన అధికారులు సిగ్గుతో తలదించుకోవాల్సి ఉంటుంది. ఆ తరువాత వారిని నరక కూపంలో నెట్టడం జరుగుతుంది.

పాలకులు, ప్రజల నుండి ఎలాంటి కానుకలైనా స్వీకరించడం నిషిద్ధం. కారణం, న్యాయం సరిగా పనిచేయలేకపోతుంది.

పాలకులు చేసే విదేశీ పర్యటనల్లో ఏ కానుకలైతే వారికి లభిస్తాయో అవన్నీ దేశ ధనాగారంలో జమ కావాలి. వారు వాటిని తమ సొంత సొమ్ముగా తలిచి ఉపయోగించ డానికి వీల్లేదు.

హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మలై) (బనీ ఉమయ్యాకు సంబంధించిన గొప్ప ఖలీఫా) ఇలా సెలవిచ్చారు.

“పాలకులకు లభించే కానుకలు వారి సొంత సొమ్ముకాదు. అవి జాతి యొక్క అమానత్తు. వాటిని ‘బైతుల్‌మాల్’ (ధనాగారం)లో చేర్చాలి.” (బుఖారి)

ఫరాత్ బిన్ సఅద్ ఉల్లేఖనం ప్రకారం, హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మలై)గారికి ఓసారి యాపిల్ పండు తినాలనే కోరిక కలిగింది. ఆర్థిక పరిస్థితిని ఓసారి అంచనా వేసి చూశారు. యాపిల్ కొనడానికి ఆయనకు ఒక్క దిర్హం కూడా లభించలేదు. అలాంటి పరిస్థితిలో చర్చికి సంబంధించిన కొందరు క్రైస్తవ యువకులు యాపిల్ పండ్లతో నిండిన ఓ పళ్ళెం ఆయన ముందు కానుకగా సమర్పించారు. అందులో నుండి పండును తీసి వాసన చూసి తిరిగి అందులోనే పెట్టేశారాయన. ఆ పళ్ళాన్ని తిరిగి ఆ యువకులకే ఇచ్చి వేశారు. అప్పుడు సఅద్ అది చూసి, అయ్యా! ఇలా ఎందుకు చేశారు అని అడగ్గా నాకు వాటి అవసరం లేదు అన్నారాయన. అప్పుడు సఅద్ తిరిగి దైవప్రవక్త (స) హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్), హజ్రత్ ఉమర్ (రజిఅన్) హదియా తీసుకోలేదా అని అడిగారు.

“అవును ఆ కాలంలో వారి కోసం అది హదియాయే (కానుకే). ఆ తరువాత వచ్చే పాలకుల కోసం అది లంచం అని జవాబిచ్చారు ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రజిఅన్).”

ఈ హదీసు గురించి బాగా ఆలోచిస్తే ప్రభుత్వ పాలకులకు ప్రభుత్వ అధికారులు, ఉద్యోగుల నడివడికపై గట్టి నిఘా వేసి ఉంచాలన్న విషయం ద్యోతకమవుతుంది. వారిని ఎప్పటికప్పుడు విచారిస్తూ ఉండాలన్న విషయం కూడా అవగతమవుతుంది.

## అవినీతి పరిణామం

(۲۹۴) عَنْ عَدِيِّ بْنِ عَمِيْرَةَ الْكِنْدِيِّ اَنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ يَا اَيُّهَا النَّاسُ مَنْ عُمِّلَ مِنْكُمْ لَنَا عَلٰى عَمَلٍ فَكَتَمَنَا مِنْهُ مِخْيَطًا فَمَا فَوْقَهُ فَهُوَ غَالٌّ يَأْتِيْ بِهٖ يَوْمَ الْقِيَامَةِ فَقَامَ رَجُلٌ مِنَ الْاَنْصَارِ اَسْوَدُ كَاَنِّيْ اَنْظُرُ اِلَيْهِ فَقَالَ يَا رَسُوْلَ اللهِ اَقْبِلْ عَنِّيْ عَمَلَكَ قَالَ وَمَا ذَالِكَ؟ قَالَ سَمِعْتُكَ تَقُوْلُ كَذَا وَكَذَا قَالَ وَاَنَا اَقُوْلُ ذٰلِكَ مَنِ اسْتَعْمَلْنَاهُ عَلٰى عَمَلٍ فَلْيَاْتِ بِقَلِيْلِهٖ وَكَثِيْرِهٖ فَمَا اُوْتِيَ مِنْهُ اَخَذَ وَمَا نُهِيَ عَنْهُ اِنْتَهٰى - (ابوداؤد كتاب القضاء باب فى هدايا العمال مسلم كتاب الامارة)

294. హజ్రత్ అద్దీ బిన్ అమిరా (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "మీలో ఎవరైనా మా తరఫున ఓ పదవికి నియమించబడితే అతడు ఓ సూది లేదా అంతకంటే తక్కువ విలువైన వస్తువును దాచేసుకున్నాడో అతడు 'ఖాయిన్' (అవినీతిపరుడు) లంచ గొండి, ప్రళయదినాన తాను దాచేసుకున్న వస్తువును (అల్లాహ్ న్యాయ స్థానంలోనికి) తెస్తాడు. (తాను కొల్లగొట్టిన ఆ వస్తువు గురించి ప్రశ్నిం చడం జరుగుతుంది). ఓ నల్లటి అన్సారీ వ్యక్తి నిలబడి, దైవప్రవక్తా (సఅసం)! తమరు నన్ను ఏ పదవిపై నియమించారో ఆ పదవికి రాజీనామా ఇస్తున్నాను. నా రాజీనామాను స్వీకరించండి అని ప్రాధేయ పడ్డాడు. అప్పుడు దైవప్రవక్త (సఅసం), నీవిలా ఎందుకంటున్నావు? అని అడిగారు. దానికి జవాబుగా ఆ అన్సారి, తమ ప్రసంగం విని నేను ఈ నిర్ణయానికి వచ్చాను అని బదులిచ్చాడు. మహాప్రవక్త (సఅసం) ఆ యువకుని నిర్ణయం విని తిరిగి ఇలా సెలవిచ్చారు : "(ఇప్పటికీ) నేను ఈ మాటే అంటున్నాను. మేము ఏ వ్యక్తిని ఓ పదవిపై నియమిస్తామో అతడు ప్రతి (వసూలు చేసే) వస్తువును తీసుకొని రావాలి. (బైతుల్‌మాల్‌లో జమ చేయాలి) అది ఎంత చిన్నదైనా, పెద్దదైనా, అతడికి ఇచ్చింది మాత్రమే అతడు గ్రహించాలి. ఏ వస్తువును తీసుకోవద్దు అని వారించడం జరుగుతుందో దాన్ని తీసుకోకూడదు." *(అబూ దావూద్, ముస్లిమ్)*

**సంగ్రహణం :**

ఇస్లామీయ ప్రభుత్వ గవర్నర్లు, మంత్రులు ఉన్నతాధికారులు, అధికారులు, ఉద్యోగులు ప్రభుత్వ ధనాన్ని పరిరక్షించేందుకు సాధ్యమైనంత వరకు కృషి చేయాలి. వారి పర్యవేక్షణలో డబ్బుగాని, ప్రభుత్వ సొత్తుగాని అక్రమంగా చేతులు మారితే అలాంటి అవినీతిపరులైన రెవెన్యూ అధికారులు, ఇతర ప్రభుత్వ శాఖలకు సంబంధించిన ఉద్యో గులు ప్రళయం రోజున సిగ్గుతో తలదించుకోవడమే కాకుండా నరక శిక్షకు పాత్రు లవుతారు.

(٢٩٥) عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَامَ فِيْنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ ذَاتَ يَوْمٍ فَذَكَرَ الْغُلُوْلَ فَعَظَّمَهٗ وَعَظَّمَ اَمْرَهٗ

ثُمَّ قَالَ

• لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيْءُ يَوْمَ الْقِيَامَةِ عَلَى رَقَبَتِهِ بَعِيْرٌ لَهُ رُغَاءٌ يَقُوْلُ يَا رَسُوْلَ اللّٰهِ أَغِثْنِيْ فَأَقُوْلُ، لَا أَمْلِكُ لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ.

• لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيْءُ يَوْمَ الْقِيَامَةِ عَلَى رَقَبَتِهِ فَرَسٌ لَهُ حَمْحَمَةٌ فَيَقُوْلُ يَا رَسُوْلَ اللّٰهِ أَغِثْنِيْ فَأَقُوْلُ لَا أَمْلِكُ لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ

• لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيْءُ يَوْمَ الْقِيَامَةِ عَلَى رَقَبَتِهِ شَاةٌ لَهَا ثُغَاءٌ يَقُوْلُ يَا رَسُوْلَ اللّٰهِ أَغِثْنِيْ فَأَقُوْلُ لَا أَمْلِكُ لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ.

• لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيْءُ يَوْمَ الْقِيَامَةِ عَلَى رَقَبَتِهِ نَفْسٌ لَهَا صِيَاحٌ فَيَقُوْلُ يَا رَسُوْلَ اللّٰهِ أَغِثْنِيْ فَأَقُوْلُ لَا أَمْلِكُ لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ

• لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيْءُ يَوْمَ الْقِيَامَةِ عَلَى رَقَبَتِهِ رِقَاعٌ تَخْفِقُ فَيَقُوْلُ يَا رَسُوْلَ اللّٰهِ أَغِثْنِيْ فَأَقُوْلُ لَا أَمْلِكُ لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ

• لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيْءُ يَوْمَ الْقِيَامَةِ عَلَى رَقَبَتِهِ صَامِتٌ فَيَقُوْلُ يَا رَسُوْلَ اللّٰهِ أَغِثْنِيْ فَأَقُوْلُ لَا أَمْلِكُ لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ.

(مسلم کتاب الامارة)

295. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ఇలా ఉంది : ఓ రోజు దైవప్రవక్త (సఅసం)ప్రసంగిస్తూ 'మాలె గనీమత్' (యుద్ధంలో లభించిన సొత్తు)ను దొంగిలించే సమస్యకు ఎంతో ప్రాధాన్య మిస్తు (అంటే

దాని భయంకర పరిణామాలను సూచిస్తూ) ఇలా వివరించారు :

"నేను మీలో ఏ ఒక్కరిని ప్రళయదినాన, అతని మెడపై ఓ ఒంటె గుడగుడ లాడుతూ ఉండగా చూడదలచలేదు. అలాంటి వ్యక్తి వచ్చి, దైవప్రవక్తా! నా గురించి సిఫార్సు చేయండి అని విన్నవించుకుంటే అతనితో, నేను నీపై నుండి అల్లాహ్ శిక్షను తప్పించలేను. (ఆ రోజే) ఈ విషయం గురించి నీకు అవగతం చేశాను కదా అని అంటాను.

"నేను మీలో ఏ ఒక్కడిని ప్రళయం రోజున, అతని మెడపై గుర్రం సకిలిస్తూ ఉండగా చూడదలచలేదు. అలాంటి వ్యక్తి నా వద్దకు వచ్చి ప్రవక్తా! నన్ను ఆదుకోండి అని అడిగితే, నేను నీపైన వున్న దైవశిక్షను నీపై నుండి తప్పించలేను (ఆనాడే) నీకు ఈ విషయం గురించి తెలియ జేశాను అని బదులిస్తాను.

"నేను మీలో ఏ వ్యక్తిని ప్రళయం రోజున, అతని నెత్తిపై ఓ మేక అరుస్తూ ఉండగా చూడదలచలేదు. అలాంటి శిక్ష బడ్డ వాడు నా దరికి చేరి ప్రవక్తా! అల్లాహ్ వేసిన ఈ శిక్ష నుండి నన్ను కాపాడండి అని అడిగితే, నీపై పడ్డ దైవశిక్ష నీ నుండి తొలగించే శక్తి నాకు లేదు. ఈ విషయం నీకు ఇదివరకే తెలియజేశాను కదా అని సమాధానమిస్తాను.

"నేను మీలో ఏ ఒక్కరినీ ప్రళయం రోజున అతని భుజాలపై ఓ వ్యక్తి కూర్చుని అరుస్తూ ఉండగా చూడదలచలేదు. అతడొచ్చి దైవప్రవక్తా! నాకు సహాయం చేయండి అని అడిగితే నేను దేవుడు వేసిన ఈ శిక్షను నేను నీపై తప్పించలేను అని బదులిస్తాను. ఈ విషయం ముందే నీకు అంద జేశాను గదా అని బదులిస్తాను.

"నేను ఎవ్వరినీ ప్రళయదినం రోజున వెండి బంగారాలు మోస్తూ నా వద్దకు రావడం చూడదలచలేదు. అతడొచ్చి దైవప్రవక్తా! నా గురించి సిఫార్సు చేయండి. (ఈ శిక్ష నా నుండి దూరం కావడానికి) అని అడిగితే, నేను నీ నుండి అల్లాహ్ యాతనను తప్పించలేను. నేను ప్రపంచంలోనే ఈ విషయం నీకు చేరవేశాను అని అంటాను." (ముస్లిమ్)

**సంగ్రహణం :**

"నేను మీలో ఏ ఒక్కరిని ఈ స్థితిలో చూడదలచలేదు" అని అంటే మీరు యుద్ధ ధనాన్ని దొంగిలించడం మానేయండి అని అర్థం. ఆ కాలంలో యుద్ధ ధనంలో ఉండే సాధారణ వస్తువులు ఈ హదీసులో చెప్పడం జరిగింది. ఉదాహరణకు ఒంటెలు, గుర్రాలు, మేకలు, స్త్రీలు, పిల్లలు, వస్త్రాలు వెండి బంగారాలు.

దైవప్రవక్త (సఅసం) గారి ప్రవచన సారాంశం ఏమిటంటే యోధులు విజయం చేకూరిన తరువాత అక్కడ లభించిన సొమ్ములోని ఏ వస్తువును తస్కరించవద్దు, అది ఓ సూది అయినా సరే. ఇదంతా ప్రభుత్వపరం చేయాలి. ఇలా ప్రభుత్వం ఆ వచ్చిన ధనాన్ని లెక్క ప్రకారం, దాని పర్యవేక్షణలో పంచిపెడుతుంది. ఏ ఒక్కడు దాన్ని కొల్లగొట్టినా ప్రళయం రోజున శిక్షించబడతాడు. ఈ హదీసు నుండి రెండు విషయాలను గ్రహించవచ్చు.

1. ఒకటి అల్లాహ్ మార్గంలో యుద్ధం చేసే సిపాయి దొంగతనం, అవినీతికి పాల్పడకుండా ఉండాలి. ఈ వైఖరి వల్ల ప్రళయం రోజున అతడు సిగ్గు పడాల్సి ఉంటుంది. రెండోది, దొంగతనం, అవినీతి, దోపిడి దౌర్జన్యానికి పాల్పడినవారు ప్రళయం రోజున ప్రతి పైసాకు లెక్కజెప్పాల్సి ఉంటుంది. ఏ అవినీతిపరుడు, ఏ దౌర్జన్యపరుడు కూడా తన దురాగతాల శిక్ష నుండి తప్పించుకోలేదు.

## లంచగొండి, అవినీతిపరుడైన అధికారి

(۲۹۶) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنِ اسْتَعْمَلْنَاهُ عَلٰى عَمَلٍ فَرَزَقْنَاهُ رِزْقًا فَمَا أَخَذَ بَعْدَ ذٰلِكَ فَهُوَ غُلُوْلٌ۔

(ابوداؤد عن بریدۃ کتاب الخراج)

296. మేము ప్రభుత్వ ఉద్యోగంలో చేర్చుకునే వ్యక్తికి సక్రమంగా వేతనమిస్తాము. ఆ నిర్ణీత వేతనమే కాకుండా అదనంగా మరేదైనా అతడు తనదిగా భావించి పొందితే అది అక్రమం అవుతుంది అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. *(హజ్రత్ ఖురైదా – అబూదావూద్)*

**సంగ్రహణం :**

అంటే అతను అక్రమంగా తీసుకున్న సొత్తు హరాం (నిషిద్ధం) అన్నమాట. అతడు ప్రభుత్వ ధనాగారానికి చెందిన సొమ్ము నుండి అమానతు నుండి దొంగిలించినట్లు భావించబడుతుంది.

## ధనం కాజేసినందుకు శిక్ష

(۲۹۷) عَنْ خَوْلَةَ الْاَنْصَارِيَّةِ قَالَتْ سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ اِنَّ رِجَالًا يَتَخَوَّضُوْنَ فِيْ مَالِ اللّٰهِ بِغَيْرِ حَقٍّ فَلَهُمُ النَّارُ يَوْمَ الْقِيَامَةِ۔ (بخاری کتاب فرض الخمس)

297. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిస్తూ ఉండగా నేను విన్నానని హజ్రత్ ఖౌలా (రజి.అన్హా) ఉల్లేఖిస్తున్నారు : "అల్లాహ్ దనం (బైతుల్ మాల్) నుండి అక్రమంగా ఖర్చుబెట్టే వారికోసం ప్రళయం రోజున అగ్ని సిద్ధం చేసి ఉంటుంది." (బుఖారి)

**సంగ్రహణం :**

ఇస్లామీయ రాజ్య ధనాగారం (బైతుల్ మాల్)ను రెండు కారణాల వల్ల 'అల్లాహ్ ధనం' అనడం జరిగింది. ఒకటి, నిజంగా దాని యదార్థ యజమాని అల్లాహ్యే కావడం. రెండోది ఆ ధనాన్ని ఏ ఒక్కరూ తన ఇష్టం ప్రకారం ఖర్చు పెట్టడానికి వీల్లేదు. దాన్ని ప్రజల సంక్షేమం కోసం అల్లాహ్ చూపిన మార్గాలకు అనుగుణంగా ఖర్చుపెట్టవలసి ఉంటుంది.

దాన్ని తన స్వంత ఖర్చులకు లేక ప్రదర్శనాబుద్ధితో, లేక తన దర్పం చూపడానికి ఖర్చుపెట్టే పాలనాధికారులు దానికి శిక్షగా నరకంలో ప్రవేశిస్తారు.

ఉన్నతాధికారులు, పలుకుబడిగల వారు, ముస్లిముల ఖజానా లేదా సామూహిక నిధి (తీతిదీఖి)ని దుబారాగా అనవసర కార్యకలాపాల్లో వ్యర్థం చేస్తే లేక ప్రజల నుండి వసూలు చేసిన చందాలతో తమ బొక్కసాలు నింపుకొని ఆస్తులు సమకూర్చుకుంటే వారు కూడా నరకాగ్నిలో ప్రవేశించక తప్పదు.

అలాగే ముస్లిముల కష్టార్జితాన్ని కొల్లగొట్టే మత నాయకులు, ధార్మిక సంస్థలను నడిపే పెద్దలు, సంస్థలకు సంబంధించిన ముఖ్యులు, రాజకీయ నాయకులు కూడా ప్రళయం రోజున ఈ శిక్షకు పాత్రులౌతారు.

## రెవెన్యూలో అవినీతి

(۲۹۸) عَنْ عُقْبَةَ بْنِ عَامِرٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ لَا يَدْخُلُ الْجَنَّةَ صَاحِبُ مَكْسٍ۔ (ابوداؤد کتاب الخراج)

298. 'మక్స్' (టాక్స్) వసూలుచేసేవాడు స్వర్గంలో ప్రవేశించడు" అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించారని ఉత్బా బిన్ ఆమిర్ (రజి) ఉల్లేఖించారు. (అబూ దావూద్)

**సంగ్రహణం :**

'మక్స్' అంటే విలువ తగ్గించడం. ప్రభుత్వ తహసీలు (రెవెన్యూ) అధికారులు ఉష్ర్, జకాత్, టాక్సు, రెవెన్యూ వసూలు చేసేటప్పుడు లంచం పుచ్చుకోవడంలోను, దౌర్జన్యం చేయడంలోను వెనకాడరు. వీరినే హదీసులో 'సాహిబె మక్స్' అని పేర్కొనడం జరిగింది.

లంచం పుచ్చుకొని పూర్తి టాక్సు వసూలు చేయకపోయేవారు, లంచం దొరకకపోతే అక్రమమైన టాక్సులు మోపే ఆఫీసర్లు కస్టమ్ అధికారులు, ఆదాయ, అమ్మకం పన్నుల అధికారులు వగైరా ఈ కోవకు చెందినవారే. వీరు అటు ప్రజలపై, ఇటు ప్రభుత్వంపై దౌర్జన్యం జరిపి బ్యాంకు బ్యాలెన్సులు పెంచుకుంటారు, ఆస్తుల్ని కొంటారు. ఇలాంటివారు స్వర్గంలో ప్రవేశించలేరు.

## లంచం

(٢٩٩) لَعَنَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ الرَّاشِيَ وَالْمُرْتَشِيَ

(ابوداؤد عن عبداللہ بن عمرو کتاب القضاء)

299. లంచం ఇచ్చేవారు, దాన్ని పుచ్చుకునే వారు దైవకారుణ్యానికి దూరమగుదురు గాక! అని దైవప్రవక్త (సఅసం) శపించారు.

(అబ్దుల్లా అమ్ర్ (రజి) - అబూ దావూద్)

**సంగ్రహణం :**

లానత్ అనే పదానికి అర్థం దైవ కారుణ్యానికి దూరమవడం. అంటే దైవప్రవక్త (సఅసం) లంచం ఇచ్చేవానికి, లంచం పుచ్చుకునే వానికి వ్యతిరేకంగా, తన కారుణ్యానికీ కరుణా కటాక్షాలకు దూరంగా ఉంచమని దేవుణ్ణి వేడుకున్నారన్నమాట.

దైవప్రవక్త (సఅసం) లంచం ఇవ్వడంలో మధ్యవర్తి (ఏజెంటుగా) పనిచేసేవాణ్ణి కూడా శపించారు. (ముస్నద్ అహ్మద్)

అయితే లంచం ఇవ్వకుండా తన హక్కును పొందలేని వానికి దౌర్జన్యం నుండి గట్టెక్కలేని వానికి ఈ శాపం వర్తించదు.

లంచానికి సంబంధించిన లావాదేవీలు న్యాయ తులాదండాన్ని నిలకడగా ఉంచ

లేవు. దీనిద్వారా దౌర్జన్యపరునికి ప్రోత్సాహం లభిస్తుంది. పీడితుడు అడుగంటి పోతాడు. అందుకే లంచం మార్కెట్టులో హంతకులు, దోపడిదారులు దాదాలుగా, ఛాతీ విరుచుకుని తిరుగుతుంటారు.

లంచాన్ని శపించిన ప్రవక్తకు అనుయాయులైన ముస్లిం అధికారులు అనేకమంది లంచంతో సామరస్యం చెందారు. పైగా ఆ లంచం డబ్బుతోనే హజ్ యాత్రలకు వెళుతుంటారు. ఇదీ మరీ విడ్డూరంగా లేదు!

## కొన్ని కానుకలూ వడ్డీలే

(۳۰۰) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنْ شَفَعَ لِاَخِيْهِ شَفَاعَةً فَاَهْدٰى لَهُ هَدِيَّةً فَقَبِلَهَا فَقَدْ اَتٰى بَابًا عَظِيْمًا مِّنْ اَبْوَابِ الرِّبَا۔ (ابوداؤد عن ابی امامہ کتاب البیوع)

300. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఎవరైనా తన సోదరుని గురించి సిఫారసు చేసి ఆ సిఫారసుకుగాను అతని నుండి కానుక స్వీకరిస్తే అతడు 'వడ్డీ' అనే పెద్ద ద్వారంలో ప్రవేశించినట్లే."

(అబూ ఉమామా (రజి) - అబూదావూద్)

**సంగ్రహణం :**

కొందరు తమ పలుకుబడి నుపయోగించి అగత్యపరుని గురించి సిఫారసుచేసి సహాయపడతారు. ప్రతిఫలంగా అతని నుండి నగదుగాని, మరో రూపంలోగాని కానుకను స్వీకరిస్తారు. ఇది కూడా లంచం లాంటి భయంకరమైన విషయమే. దీని తీవ్రతను దృష్టిలో పెట్టుకొని దాన్ని పెద్ద వడ్డీ ద్వారంగా పేర్కొనడం జరిగింది.

చెప్పవచ్చిందేమిటంటే, రికమండేషనుకుగాను ప్రతిఫలాన్ని పొందడం లేదా వసూలు చేయడం మహాపాపం, ధార్మికత గల అధికారి తాను ప్రజలకు సహాయం చేసి ఆ సహాయానికిగాను తను నచ్చిన పార్టీలో చేరమని చెప్పడం లేదా ఏదయినా చందా ఇవ్వమని బలవంతం పెట్టడం కూడా తప్పే.

## చట్టానికి ఎవడూ అతీతుడు కాడు

(۳۰۱) عَنْ عَائِشَةَ رَضِيَ اللّٰهُ عَنْهَا اَنَّ قُرَيْشًا اَهَمَّتْهُمُ الْمَرْاَةُ الْمَخْزُوْمِيَّةُ الَّتِىْ سَرَقَتْ فَقَالُوْا مَنْ

يُكَلِّمُ رَسُولَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَنْ يَجْتَرِئُ
عَلَيْهِ إِلَّا أُسَامَةُ، حِبُّ رَسُولِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ فَكَلَّمَ رَسُولَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ
أَتَشْفَعُ فِي حَدٍّ مِنْ حُدُودِ اللّٰهِ ثُمَّ قَامَ فَخَطَبَ، قَالَ
يَا أَيُّهَا النَّاسُ، إِنَّمَا ضَلَّ مَنْ قَبْلَكُمْ أَنَّهُمْ كَانُوا إِذَا
سَرَقَ الشَّرِيفُ تَرَكُوهُ وَإِذَا سَرَقَ الضَّعِيفُ فِيهِمْ
أَقَامُوا عَلَيْهِ الْحَدَّ وَايْمُ اللّٰهِ، لَوْ أَنَّ فَاطِمَةَ بِنْتَ
مُحَمَّدٍ سَرَقَتْ لَقَطَعَ مُحَمَّدٌ يَدَهَا۔

(بخاری کتاب الحدود، مسلم کتاب الحدود)

301. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఉల్లేఖనం : బనీ మఖ్జూమ్ తెగకు చెందిన ఓ మహిళ దొంగతనానికి పాల్పడినందుకు ఖురైషీయులు ఎంతో నొచ్చుకున్నారు. ఈ విషయమై దైవప్రవక్తతో మాట్లాడే ధైర్యం చాలక వారు ఓ నిర్ణయానికి వచ్చారు. హజ్రత్ ఉసామా (రజి) తప్ప ఆయన ముందుకు వెళ్ళగలిగే వారెవరు? దైవప్రవక్తకు ఉసామా అంటే ఇష్టం. (కాబట్టి ఆయనను దైవప్రవక్త (సఅసం) వద్దకు పంపించారు) ఉసామా (రజి) ఈ విషయమై మాట్లాడగా,

"ఏమిటీ! అల్లాహ్ విధించిన శిక్షల్ని విధించకుండా నీవు సిఫారసు చేస్తున్నావా?" అంటూ నిలబడి దైవప్రవక్త ఈ విధంగా ప్రసంగించారు:

"ప్రజలారా! మీకు పూర్వం గతించిన సమాజాలు అపమార్గం పట్టడానికి కారణం ఏమిటంటే ఓ పెద్దింటి వ్యక్తి దొంగతనానికి పాల్పడితే అతణ్ని వదిలివేసేవారు (అంటే శిక్షించేవారు కారు). ఒక బలహీనుడు దొంగతనం చేస్తే అతణ్ణి పట్టి శిక్షించేవారు. అల్లాహ్ సాక్షిగా చెబుతున్నాను! ముహమ్మద్ కుమార్తె ఫాతిమా (రజి) దొంగతనం చేసినా సరే నేనామె చేయి నరికివేసేవాణ్ణి." (బుఖారి, ముస్లిమ్)

**సంగ్రహణం :**

ఇస్లామ్‌లో దొంగతనానికి శిక్ష దొంగ ముంజేయి తీసివేయడం. ఆ దొంగ సంపన్నుడైనా నిరుపేద అయినా సరే. హిజ్రీ శకం ఎనిమిదిలో బనీ మఖ్జూమ్ వంశానికి చెందిన ఓ మర్యాదగల మహిళ ఫాతిమా బిన్తుల్ అస్వద్ నగలు దొంగిలించింది. – ఈమె మహాప్రవక్త (సఅసం) సతీమణి హజ్రత్ జైనబ్ గారి మొదటి భర్త అబు సల్మా సోదరుని కుమార్తె – ఇక ఆమె చేతిని నరకడం తప్పదేమో అని ఆ తెగవాళ్ళు బాధపడ్డారు. శిక్ష మాఫీ అవుతుందేమో, దానికి బదులు 'ఫిదియా' (పరిహారం) చెల్లించి రక్షించుకునే మార్గం ఏదైనా ఉంటుందేమో అని వారు ఆశించారు. అయితే ఈ విషయాన్ని దైవప్రవక్త (సఅసం) ఎదుట మాట్లాడే ధైర్యం ఎక్కడిది?) చివరికి వాళ్ళు హజ్రత్ ఉసామా (రజి)ను దీన్ని గురించి మాట్లాడటానికి ఎన్నుకున్నారు. ఆయన తండ్రి జైద్ బిన్ సాబిత్ (రజి) కారణంగా మహాప్రవక్తకు ఉసామా అంటే ఎంతో ఇష్టం. ఉసామాను గురించి ప్రవక్త ఇలా ప్రార్థించారు: "ఓ అల్లాహ్! ఉసామాను నేను ప్రేమిస్తున్నాను, నీవు కూడా అతణ్ణి ప్రేమించు."

చివరికి ఉసామా (రజి)ను మహాప్రవక్త (సఅసం) సన్నిధికి పంపి ఫాతిమా కోసం సిఫారసు చేయమని, ఆమె చేతిని ఖండించకుండా క్షమించి వదలిపెట్టాలని దానికి బదులు పరిహారంగా నలభై ఓకియాల బంగారం తీసుకొమ్మని చెప్పి పంపారు. హజ్రత్ ఉసామా అక్కడికి వెళ్ళి ఈ విషయాలన్నీ ఏకరువు పెట్టగా ఆయన (సఅసం) కోపంతో ఆయన్ను చీవాట్లు పెట్టగా, ఉసామా సిగ్గుపడి తన తప్పుకు మన్నింపు కోసం దైవాన్ని ప్రార్థించమని విన్నవించుకున్నారు. సాయంత్రం అవగానే దైవప్రవక్త (సఅసం) (ప్రజలనుద్దేశించి) ప్రసంగించారు. దైవస్తోత్రం తరువాత ఇలా సెలవిచ్చారు :

"గతించిన సమాజాల అపమార్గానికి కారణం (కొన్ని ఉల్లేఖనాల ప్రకారం వారి వినాశనానికి కారణం) ఏమిటంటే వారిలో పెద్ద మనుషులు దొంగతనం చేస్తే వారిని క్షమించి వదలిపెట్టేవారు, నిరుపేదలు ఆ తప్పుచేస్తే వారి చేతిని ఖండించేవారు."

ఆ తరువాత దైవప్రవక్త ఆదేశాన్ననుసరించి ఆమె చేతిని ఖండించడం జరిగింది. కారణం, ఇస్లామీయ శిక్షాస్మృతిలో దొంగతనానికి శిక్ష దొంగ చేతిని ఖండించడం మాత్రమే కాబట్టి. ఇస్లామీయ న్యాయవిధానంలో సంపన్నుడు, నిరుపేద అనే తారతమ్యం లేదు. నేరస్తుడు ఎంత గొప్ప కుటుంబానికి చెందిన వ్యక్తి అయినా, ఎంత సంపన్నుడు అయినా, పాలకులూ లేదా వారి కుమారుడు, కుమార్తె అయినా ఇస్లామీయ శిక్షాస్మృతి ప్రకారం వారు శిక్షార్హులే. నేరస్తునికి సిఫారసుగాని, అతని పలుకుబడిగాని రక్షించజాలదు.

హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) ఉల్లేఖనం ప్రకారం ఆ మహిళ శిక్షబడిన తరువాత 'తౌబా' చేశారు. బనీ సులైమ్ తెగకు చెందిన ఓ వ్యక్తిని వివాహమాడారు. అప్పుడప్పుడు తన అవసరాల నడగటానికి దైవప్రవక్త (సఅసం) ఇంటికి కూడా వచ్చేవారు.

బనీ ఇస్రాయీల్‌ని గురించి ఈ హదీసులో ప్రస్తావించిన విషయం అంటే వారి

పలుకుబడి గలవారిని చట్టానికి అతీతులుగాను, నిరుపేదలు శిక్షార్హులుగాను భావించడం ఒక్కటే బనీ ఇస్రాయీలు పతనానికి, పెడత్రోవపట్టడానికి కారణం కాదు. దీనికి తోడు మరెన్నో రుగ్మతలు ఆ జాతిలో ఉండేవి. వాటిలోని ఒక్కదాని గురించే ఇక్కడ చెప్పడం జరిగింది.

(۳۰۲) عَنْ اَبِیْ سَعِیْدِ الْخُدْرِیِّ قَالَ بَیْنَمَا رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یَقْسِمُ قَسْمًا اَقْبَلَ رَجُلٌ فَاَکَبَّ عَلَیْہِ فَطَعَنَہٗ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ بِعُرْجُوْنٍ کَانَ مَعَہٗ فَجُرِحَ بِوَجْہِہٖ فَقَالَ لَہٗ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ تَعَالَ فَاسْتَقِدْ قَالَ بَلْ عَفَوْتُ یَا رَسُوْلَ اللّٰہِ۔

(ابوداؤد کتاب الدیات، نسائی کتاب الدیات)

302. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రి (రజి) ఉల్లేఖనం : "దైవప్రవక్త (సఅసం) యుద్ధ ప్రాప్తి మా అందరికి పంచేటప్పుడు ఓ వ్యక్తి అక్కడికి రాగానే ప్రవక్త (సఅసం) పైకి వంగాడు. (తన వాటాను త్వరగా పొందే ఉద్దేశ్యంతో). మహాప్రవక్త (సఅసం) (చేతిలో వున్న) ఖర్జూరపు బెత్తంతో అతడిని వెనక్కు నెట్టగా అతని ముఖంపై గాయం అయింది. అప్పుడు కారుణ్యమూర్తి (సఅసం) అతనితో సోదరా (ఇదిగో ఈ బెత్తంతో నన్ను కొట్టి) బదులు తీర్చుకో అని చెప్పారు. ఆ వ్యక్తి ప్రవక్తా! నేను క్షమించి వేశాను అని పలికాడు. (అబూ దావూద్, నిసాయి)

**సంగ్రహణం :**

ఇస్లామీయ న్యాయవ్యవస్థ దానికి అదేసాటి. దాని చట్టం దృష్టిలో ఇస్లామీయ రాజ్య పాలకుడు, సాధారణ పౌరుడు ఇద్దరూ సమానులే. దైవప్రవక్త తాను కొట్టిన దెబ్బకు 'కిసాస్' (బదులు) తీర్చుకోమని కోరిన ఈ న్యాయం ఎలాంటిదో ప్రాక్టికల్‌గా ధృవపరిచారు.

(۳۰۳) عَنْ اَبِیْ فِرَاسٍ قَالَ خَطَبَنَا عُمَرُ بْنُ الْخَطَّابِ فَقَالَ اِنِّیْ لَمْ اَبْعَثْ عُمَّالِیْ لِیَضْرِبُوْا اَبْشَارَکُمْ وَلَا لِیَاْخُذُوْا اَمْوَالَکُمْ فَمَنْ فُعِلَ بِہٖ ذٰلِکَ فَلْیَرْفَعْہُ اِلَیَّ اُقِصُّہٗ مِنْہُ۔ قَالَ

عَمْرُو بْنُ الْعَاصِ لَوْ اَنَّ رَجُلًا اَدَّبَ بَعْضَ رَعِيَّتِهِ اَتُقِصُّهُ
مِنْهُ قَالَ اِيْ وَالَّذِيْ نَفْسِيْ بِيَدِهٖ اُقِصُّهُ وَقَدْ رَاَيْتُ رَسُوْلَ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَقَصَّ مِنْ نَفْسِهٖ- (ابوداؤد کتاب الدیات)

303. "ఓ రోజు అమీరుల్ మోమినీన్ హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) తన ప్రసంగంలో మమ్మల్ని ఉద్దేశించి ఇలా అన్నారు అని అబూ ఫరాస్ ఉల్లేఖించారు:

"మా గవర్నరులను మీ వద్దకు పంపించింది మిమ్ము హింసించ మని కాదు. అక్రమంగా మీ నుండి రెవెన్యూ వసూలు చేయమని కాదు. ఈ విషయంలో ఎవరికైనా ఏదైనా కష్టం కలిగితే నా దగ్గరకు రండి. నేనతనినుండి 'కిసాస్' ఇప్పిస్తాను. (అప్పుడు ఈజిప్ట్ గవర్నరు) హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) లేచి ఏ పాలకుడైనా క్రమశిక్షణ కొరకు ఒకరిని శిక్షిస్తే అతని నుండి కూడా కిసాస్ ఇప్పిస్తారా? అని అడిగారు. దానికి జవాబుగా హజ్రత్ ఉమర్ (రజి) అవును, ఎవరి పిడికిటనయితే నా ప్రాణులున్నాయో ఆ దేవుని సాక్షి! నేనతని నుండి కిసాస్ ఇప్పిస్తాను. నేను దైవప్రవక్త (సఅసం)ను స్వయంగా 'కిసాస్' కోసం ముందుకు రావడం చూశాను.

*(అబూ దావూద్)*

## న్యాయ పాలనా బాధ్యత

(۳۰۴) عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَنْ جُعِلَ قَاضِيًا بَيْنَ
النَّاسِ فَقَدْ ذُبِحَ بِغَيْرِ سِكِّيْنٍ- (ابوداؤد عن ابی ہریرۃ کتاب القضاء)

304. "ప్రజల నడుమ న్యాయం చేయడానికి న్యాయ నిర్ణేతగా (జడ్జీగా) నియమించబడిన వాని పరిస్థితి కరవాలం లేకుండానే మెడను నరికించుకున్న వాని పరిస్థితి లాంటిది" అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. *(అబూ హురైరా (రజి) – అబూ దావూద్)*

**సంగ్రహణం :**

న్యాయాధిపతి పదవి ఎంతో బాధ్యతాయుతమైన ప్రమాదకరమైన పదవి. లంచగొండితనం, సిఫార్సుల తుఫానుల నుండి తప్పించుకొని న్యాయంగా, ధర్మంగా నిస్పాక్షికంగా తీర్పులనిచ్చే న్యాయనిర్ణేత (జడ్జి) అల్లాహ్‌కు మిత్రుడు.

(۳۰۵) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِنَّ اللّٰهَ مَعَ الْقَاضِیْ مَالَمْ يَجُرْ فَاِذَا جَارَ تَخَلّٰى عَنْهُ وَلَزِمَهُ الشَّيْطَانُ۔

(ترمذی عن عبداللہ بن ابی اوفی ابواب الاحکام)

305. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "మెజిస్ట్రేటు (న్యాయాధిపతి) దౌర్జన్యం చేయనంతవరకు అల్లాహ్ కారుణ్యం, సహాయం అతని వెంటే ఉంటాయి. అతడు ఎవరికైనా అన్యాయం చేయబూనుకున్నప్పుడు దేవుడు తన సహాయాన్ని నిలిపివేస్తాడు. షైతాన్ అతడిని ఆవహిస్తాడు." *(అబ్దుల్లా బిన్ ఉబైఔఫీ (రజి) – తిర్మిజి)*

**సంగ్రహణం :**

న్యాయాధిపతి కావాలని తన తీర్పు ద్వారా ఒకరిపై దౌర్జన్యానికి పూనుకుంటే అతడు అల్లాహ్ రక్షణ, సహాయ సహకారాల్ని కోల్పోతాడు. అదే కాదు తాను చేసిన అన్యాయానికి అతడు నలుగురిలో సిగ్గుపడేలా కూడా చేస్తాడు దేవుడు. పరలోక శిక్ష ఉండనే ఉంది.

## ప్రథమ సూత్రం

(۳۰۶) عَنْ عَلِيٍّ، قَالَ بَعَثَنِيْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِلَى الْيَمَنِ قَاضِيًا فَقُلْتُ يَا رَسُوْلَ اللّٰهِ تُرْسِلُنِيْ وَاَنَا حَدِيْثُ السِّنِّ وَلَا عِلْمَ لِيْ بِالْقَضَاءِ فَقَالَ اِنَّ اللّٰهَ سَيَهْدِيْ قَلْبَكَ وَيُثَبِّتُ لِسَانَكَ فَاِذَا جَلَسَ بَيْنَ يَدَيْكَ الْخَصْمَانِ فَلَا تَقْضِيَنَّ حَتّٰى تَسْمَعَ مِنَ الْاٰخَرِ كَمَا سَمِعْتَ مِنَ الْاَوَّلِ فَاِنَّهٗ اَحْرٰى اَنْ يَّتَبَيَّنَ لَكَ الْقَضَاءُ قَالَ مَا شَكَكْتُ فِيْ قَضَاءٍ بَعْدُ۔

(ابوداؤد کتاب القضاء)

306. హజ్రత్ అలి (రజి) ఇలా ఉల్లేఖించారు: "మహాప్రవక్త (సఅసం) నన్ను జడ్జిగా నియమిస్తూ యమన్ దేశానికి వెళ్ళమని ఆదేశించారు. అప్పుడు నేను ఆయనకు ఇలా విన్నవించుకున్నాను. దైవప్రవక్తా! మీరు నన్ను అక్కడికి పొమ్మని ఆదేశిస్తున్నారు. అయితే నేను (ఓ అనుభవం లేని) యువకుణ్ణి. అదేవిధంగా న్యాయసూత్రాలు ఏమిటో నాకు తెలియవు. (నేనెలా తీర్పు నివ్వగలను!) అప్పుడు దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు:

"అల్లాహ్ నీ హృదయానికి మార్గం చూపించుగాక! నీ నాలుకకు బలం చేకూర్చుగాక.

ఇద్దరు వ్యక్తులు తీర్పుకోసం నీ ఎదుటకు వచ్చి కూర్చున్నప్పుడు మొదటి వ్యక్తి చెప్పింది విని అతనికే అనుకూలంగా తీర్పునివ్వబాకు. రెండో వ్యక్తి చెప్పింది కూడా పూర్తిగా విని తీర్పునివ్వు. ఈ విధానం ఎంతో సక్రమమైనది." ఆ తరువాత తీర్పుల నివ్వడంలో నాకు ఎలాంటి చిక్కులు ఎదురవలేదు.

**సంగ్రహణం :**

ఇస్లామీయ న్యాయవ్యవస్థ యొక్క ప్రాథమిక సూత్రాల్లో మొదటిది, న్యాయస్థానం కేవలం ప్రత్యర్థుల వాజ్మూలాలను ఆసాంతం విన్న తరువాతనే తీర్పు నివ్వడం. ఇద్దరి వాదనలు పూర్తిగా విన్న తరువాత న్యాయనిర్ణేత ఏ నిర్ణయానికి వస్తాడో దాన్నే తీర్పుగా చెప్పడం జరుగుతుంది. ఇదే న్యాయం. రెండో విషయం ఏమిటంటే కేసు పెట్టేవాడు తాను చెప్పిన విషయాన్ని ధృవీకరించడానికి సాక్షులను కూడా న్యాయస్థానానికి తీసుకొని రావాలి. అలాగే ప్రత్యర్థి తన వాదనను బలపర్చడానికి కూడా సాక్ష్యాధారాలను చూపెట్టాలి. వీరుభయుల వాదనలను పూర్తిగా విన్న తరువాతే న్యాయస్థానం తీర్పునిస్తుంది. ఈ న్యాయసూత్రాలను ప్రవక్త మహనీయులు ప్రపంచంలో ఇంకా న్యాయశాస్త్రం క్రమబద్ధం కాని రోజుల్లోనే క్రమబద్ధం చేసి తన సహచరులకు నేర్పించారు. అవన్నీ హదీసు గ్రంథాల్లో చిరస్థాయిగా ఇస్లామీయ న్యాయశాస్త్ర సూత్రాలుగా నిలిచిపోయాయి.

## తీర్పు ఇవ్వడం - రెండో సూత్రం

(۳۰۷) عَنْ اَبِیْ بَکْرَۃَ قَالَ سَمِعْتُ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ یَقُوْلُ لَا یَقْضِیَنَّ حَکَمٌ بَیْنَ اِثْنَیْنِ وَھُوَ غَضْبَانُ۔

(بخاری کتاب الاحکام مسلم کتاب الاقضیۃ)

307. "పాలకుడు తాను కోపంగా ఉన్న స్థితిలో ఇద్దరు వ్యక్తుల మధ్యన తీర్పును ఇవ్వకూడదు" అని దైవప్రవక్త (సఅసం) హితవు చేస్తూ ఉండగా నేను విన్నాను అని హజ్రత్ అబూబక్ర (రజి) ఉల్లేఖించారు.

(బుఖారి)

**సంగ్రహణం :**

న్యాయాధిపతి కోపంతో ఉన్నప్పుడు తీర్పును ఇవ్వడం సమంజసం కాదన్నది ఇట్టే బోధపడుతోంది. ఇది న్యాయపాలనలో పాటించవలసిన రెండో ముఖ్యమైన సూత్రం. కోపావస్థలో మానసిక స్థితి సవ్యంగా ఉండకపోవడం వల్ల సరిఅయిన నిర్ణయానికి చేరడం కష్టం. న్యాయస్థానం ఇచ్చిన తీర్పుల ప్రభావం సమాజమంతటా పడుతుంది. కాబట్టి న్యాయాధిపతి తీర్పు ఇచ్చేటప్పుడు శాంత హృదయంతో ప్రశాంత వాతావరణంలోనే ఓ నిర్ణయానికి రావలసి ఉంటుంది. అమాయకునికి శిక్ష పడకుండా, హక్కుదారుడు హక్కు కోల్పోకుండా ఉండడానికి, నేరస్తుడు ఎత్తులు వేసి తప్పించుకోకుండా నేరానికి తగిన శిక్ష అనుభవించాలంటే తీర్పు సమయంలో న్యాయాధిపతి సంయమనాన్ని, శాంతాన్నీ పాటించవలసి ఉంటుంది.

## వ్యాజ్యంలో మర్యాదలు

(۳۰۸) عَنْ اُمِّ سَلَمَۃَ رَضِیَ اللّٰہُ عَنْہُ اَنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ اِنَّمَا اَنَا بَشَرٌ وَاِنَّکُمْ تَخْتَصِمُوْنَ اِلَیَّ وَلَعَلَّ بَعْضَکُمْ اَنْ یَّکُوْنَ اَلْحَنَ بِحُجَّتِہٖ فَاَقْضِیْ نَحْوَ مَا اَسْمَعُ فَمَنْ قَضَیْتُ لَہٗ بِحَقِّ اَخِیْہِ شَیْئًا فَلَا یَاْخُذْہُ فَاِنَّمَا اَقْطَعُ لَہٗ قِطْعَۃً مِّنَ النَّارِ۔

(بخاری کتاب الاحکام)

308. ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు :

"నేను మానవమాత్రుణ్ణి. వ్యాజ్యాల తీర్పుకోసం మీరు నా దగ్గరకు వస్తారు. కొందరు ప్రత్యర్థి కంటే ఎంతో చాతుర్యంతో తమ వ్యవహారాలను నా ముందు వివరిస్తారు. వారు చెప్పే ఆధారాలను బట్టి నేను వారికి అనుకూలంగా తీర్పునిస్తే (వారు దైవానికి భయపడాలి). నేను (తప్పుడు సాక్ష్యాల ఆధారంగా) ఓ వ్యక్తిని మరో వ్యక్తి సొత్తుకు వారసునిగా చేసినట్లు (నిజంగా ఆ వ్యక్తికి ఆ సొత్తులో ఎలాంటి హక్కులేదు. కేవలం ఆ తీర్పు వల్లనే అతడు దానికి హక్కుదారుడయ్యాడు). అతడు ఆ సొత్తును గ్రహించకూడదు. ఆ తీర్పు ద్వారా నిశ్చయంగా నేను అగ్నిలో ఓ భాగాన్ని తీసి అతనికి ఇచ్చినట్లు." (బుఖారి)

**సంగ్రహణం :**

జరిగిన సంఘటన ఏమిటంటే, హజ్రత్ ఉమ్మె సల్మా (రజి.అన్హా) గారి ఇంటి ముందు ఇద్దరు వ్యక్తులు వారసత్వ విషయమై పోట్లాడుకుంటూ ఉండగా వారి గోల విని దైవప్రవక్త (సఅసం) ఇంటినుండి బయటకు వచ్చారు. వారిని ఉద్దేశించి ఆయన, నేను మానవమాత్రుడను. మీ సాక్ష్యాధారాలు విన్న తరువాతనే మీ ఇద్దరి నడుమ తీర్పు నిస్తాను. ఈ తీర్పు కేవలం సాక్ష్యాధారాలపైనే ఆధారపడి ఉంటుంది. కొందరు తమ ఆధారాలను ఎంతో చాకచక్యంతో ముందు పెట్టే సామర్థ్యం కలిగి ఉంటారు. నిజంగా వారికి ఆ ఆస్తిమీద హక్కు ఉండదు. ఒకవేళ వారి వాదనలకు ప్రభావితుడైన వారికి అనుకూలంగా తీర్పునిస్తే నా తీర్పువల్ల హరాం (నిషిద్ధమైన) ఆస్తి హలాల్ (ధర్మసమ్మతం) అవుతుందని ఊహించుకోకండి. మొత్తానికి ఏ వ్యక్తి తన వాదనాబలం చేత తనకు అనుకూలంగా తీర్పు నిచ్చేటట్లు చేస్తున్నాడో అతడు ఓ అగ్ని గ్రహిస్తున్నాడు. అంటే ఈ హరాం సొత్తు కాజేసినందువల్ల అతడు నరకంలోకి పోక తప్పదు.

న్యాయస్థానం కేవలం తన పరిధిలో ఆ కేసుకు సంబంధించిన వివరాలను సేకరించి ఆధారాల వెలుగులోనే తీర్పునిస్తుంది. ఎవరైనా న్యాయస్థానాన్ని మోసగించి తనకు అనుకూలమైన తీర్పును పొందితే అందులో న్యాయస్థానం తప్పేమీ ఉండదు. కోర్టుకు వెళ్ళే ప్రతివాదు - అతడు దౌర్జన్యం చేసినవాడైనా, దౌర్జన్యానికి గురిఅయిన వాడైనా - తాను చనిపోయిన తరువాత పరలోకంలో తిరిగి ఈ కేసు అల్లాహ్ కోర్టులో ఉంచడం జరుగుతుందని, అక్కడ, ఇక్కడి వాక్చాతుర్యం, తెలివి తేటలు, అబద్ధపు సాక్ష్యాలుగాని పనికిరావు అని తెలుసుకోవాలి.

## న్యాయశీలురైనవారు

(٣٠٩) قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِنَّ الْمُقْسِطِيْنَ عِنْدَ اللّٰهِ عَلٰى مَنَابِرَ مِنْ نُوْرٍ عَنْ يَمِيْنِ الرَّحْمٰنِ عَزَّ وَجَلَّ ــ وَكِلْتَا يَدَيْهِ يَمِيْنٌ ــ اَلَّذِيْنَ يَعْدِلُوْنَ فِيْ حُكْمِهِمْ وَاَهْلِيْهِمْ وَمَا وَلُوْا۔ (مسلم عن عبداللہ بن عمرو کتاب الامارۃ)

309. దైవప్రవక్త (సఅసం) ప్రవచనం : "న్యాయశీలురైన వారు అల్లాహ్‌కు కుడిప్రక్కన జ్యోతిర్మయమైన పీఠాలనలంకరించి ఉంటారు. వారి ప్రత్యేకత ఏమిటంటే వారు న్యాయంగా రాజ్యాన్ని ఏలుతారు. తమ అధికార పరిధిలో న్యాయం చేస్తారు. తమ భార్యాపిల్లలతో న్యాయంగా వ్యవహరిస్తారు." *(అబ్దుల్లా బిన్ అమ్రు (రజి) – ముస్లిమ్)*

**సంగ్రహణం :**

దైవానికి కుడి ఎడమలుండవు. కుడి ప్రక్కన అంటే ఆయన సన్నిహిత సన్నిధానంలో అని అర్థం. ప్రళయం రోజున కరుణామయుడైన ఆ దేవుని సన్నిధిలో జ్యోతిర్మయ పీఠాలపై న్యాయం చేసే వారికి స్థానం లభిస్తుంది. వారాయనకు అతి సమీపంలో ఉంటారు.

న్యాయపీఠంపై కూర్చుని ప్రజలకు న్యాయంగా తీర్పునిచ్చే ప్రతి అధికారి కూడా ఆ బహుమానానికి అర్హుడు.

ఇలాగే తమ అధికారాల పరిధిలో న్యాయాన్ని నెలకొలిపే ప్రభుత్వోద్యోగులు కూడా ఈ బహుమతికి అర్హులే. మరో ప్రవచనంలో ఇలా ఉంది:

ప్రపంచంలో న్యాయంగా వ్యవహరించే వారికి ప్రళయం రోజున రహ్మాన్ (కరుణామయుడు) ఎదుట ముత్యాలు పొదగబడిన పీఠాలపై స్థానం లభిస్తుంది. కారణం వారు తమ జీవితంలో న్యాయాన్ని త్యజించలేదు. (ముస్నద్ అహ్మద్)

అసలు విషయం ఏమిటంటే అద్ల్ (సంతులిత న్యాయం) అనేది అల్లాహ్ గుణగణాలలో ఒకటి. ఈ విశ్వవ్యవస్థ అంతా 'అద్ల్' సిద్ధాంతాల ఆధారంగానే నడుస్తోంది. దేవుడు, మనిషికి ఇచ్ఛానుసారం నడుచుకునే అధికారం ఇచ్చి పరీక్షకు గురిచేశాడు. అతడు తన ఇష్టం ప్రకారం న్యాయంగా వ్యవహరిస్తాడా లేక దౌర్జన్యం, జులుము, మోసం వగైరాల మార్గాలపై నడిచి న్యాయం ధర్మాల సిద్ధాంతాలను కాలరాస్తాడా అన్నదే పరీక్ష.

# న్యాయపాలన

(٣١٠) عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عُمَرَ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ مَنْ حَالَتْ شَفَاعَتُهُ دُوْنَ حَدٍّ مِنْ حُدُوْدِ اللّٰهِ فَقَدْ ضَادَّ اللّٰهَ وَمَنْ خَاصَمَ فِيْ بَاطِلٍ وَهُوَ يَعْلَمُهُ لَمْ يَزَلْ فِيْ سَخَطِ اللّٰهِ حَتّٰى يَنْزِعَ عَنْهُ وَمَنْ قَالَ فِيْ مُؤْمِنٍ مَا لَيْسَ فِيْهِ اَسْكَنَهُ اللّٰهُ رَدْغَةَ الْخَبَالِ حَتّٰى يَخْرُجَ مِمَّا قَالَ۔ (ابوداؤد كتاب القضاء)

310. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారని హ్రజత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖిస్తున్నారు:

1. "ఎవరైనా, అల్లాహ్ నిర్ణయించిన శిక్షల్లో ఏ ఒక్క శిక్షనైనా నేరస్తునికి పడకుండా సిఫారసు చేస్తే అతడు (ఆ సిఫారసు చేసిన వ్యక్తి) అల్లాహ్ ఆదేశాలను ధిక్కరించిన వాడవుతాడు."

2. అన్యాయం అని తెలిసి కూడా ఒకరితో పోట్లాట పెట్టుకున్నవాడు సతతం అల్లాహ్ క్రోధానికి పాత్రుడౌతాడు - ఆ పోట్లాటను విరమించుకుంటే తప్ప.

3. ఒక విశ్వాసిలో లేనటువంటి చెడులను అతనిపై ఆపాదించిన వానిని అల్లాహ్, నరకవాసుల చీము రక్తంతో కలిసిన అడుసులో పెడతాడు. చివరికి, నిర్ణీత నరకయాతన అనుభవించిన తరువాతనే అక్కడి నుండి బయటపడతాడు అతడు. (అబూ దావూద్)

**సంగ్రహణం :**

న్యాయస్థానం ఒకరిపై అల్లాహ్ నిర్ణయించిన శిక్షను విధిస్తే లేదా అలాంటి నేరానికి ఫలానా శిక్ష పడుతుంది అని నిశ్చయంగా తెలిస్తే అలాంటి ఏ వ్యక్తి గురించి కూడా సిఫారసు చేయకూడదు.

నేడు పలుకుబడి గలవారి సిఫారసు లేదా వారి ప్రభావం చేత అసలు నేరస్తులు శిక్షనుండి తప్పించుకుంటున్నారు. సిఫారసు చేసే వారు కూడా ఓ విధంగా నేరస్తులే.

అంతేకాదు నేరప్రవృత్తి ఇలాంటి వారి వల్లనే మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతోంది.

పోట్లాడే ప్రవృత్తి కూడా మంచిది కాదు. అనవసర విషయాలు, చెప్పుడుమాటలు ప్రాతిపదికగా ఇతరులతో కీచులాటలు పెట్టుకునేవాడు అల్లాహ్‌కు అయిష్టమైన వాడు. ఆయన క్రోధానికి పాత్రుడౌతాడు.

ఒక మోమిన్ మీద వ్యభిచారం, నీతిమాలిన పనుల వంటి నిందలు మోపడం లేదా అసత్యాలను ఆపాదించడం తీవ్రమైన నేరం. అబద్ధపు నేరాలు మోపడం లేదా వాటిని వ్యాపింపజేయడం, అపనిందలు వేయడం, సచ్ఛీలురైన వ్యక్తుల గౌరవాన్ని మంటగలిపే ప్రయత్నం చేయడం పరమపాతకం. అలాంటి వారిని దేవుడు ప్రళయం రోజున నరకంలోని చీము, రక్తం నిండిన బురద గుంటలో వేసి శిక్షిస్తాడు.

## ముర్తద్ (ధర్మభ్రష్టుని) శిక్ష

(۳۱۱) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
مَنْ بَدَّلَ دِيْنَهُ فَاقْتُلُوْهُ. (بخاری عن ابن عباس کتاب استتابۃ المرتدین)

311. "తన ధర్మాన్ని వదలివేసేవాడిని సంహరించండి" అని మహాప్రవక్త (సఅసం) ఆదేశించారు. (ఇబ్నె అబ్బాస్ (రజి) - బుఖారి)

**సంగ్రహణం :**

ఇస్లామీయ రాజ్యంలో ఇస్లాం ధర్మాన్ని విడనాడి మరోధర్మాన్ని అవలంబించే వ్యక్తిని ముర్తద్ (ధర్మభ్రష్టుడు) అంటారు. అలాంటి వాడు షరీఅత్ ప్రకారం మరణదండనకు పాత్రుడు. ఈ శిక్ష అతనికి ఇస్లామీయ ప్రభుత్వం మాత్రమే విధించగలదు.

(۳۱۲) قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يَحِلُّ دَمُ امْرِئٍ
مُسْلِمٍ يَشْهَدُ اَنْ لَّا اِلٰهَ اِلَّا اللهُ وَاَنِّيْ رَسُوْلُ اللهِ
اِلَّا بِاِحْدٰى ثَلَاثٍ: اَلنَّفْسُ بِالنَّفْسِ وَالثَّيِّبُ الزَّانِيْ
وَالْمَارِقُ مِنَ الدِّيْنِ التَّارِكُ لِلْجَمَاعَةِ.

(بخاری کتاب الدیات۔ مسلم عن عبداللہ بن مسعود کتاب القسامۃ)

312. లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్ (అల్లాహ్ తప్ప పూజకు అర్హుడు మరెవడూ లేడు, ముహమ్మద్ (సఅసం) దైవప్రవక్త) అని చాటేవాణ్ణి సంహరించడం ధర్మసమ్మతం కాదు. అయితే మూడు కారణాల వల్ల అతణ్ణి ఇస్లామీయ ప్రభుత్వం చంపడం ధర్మసమ్మతం.

1. అతడు హత్యచేసినందుకు మరణ శిక్ష విధించడం ద్వారా.

2. వివాహితులైనా వ్యభిచరించే వారికి శిక్షగా.

3. ఇస్లాం ధర్మాన్ని విడనాడి (భ్రష్టుడై) ముస్లిం సముదాయం నుండి వేరైనవాడిని. *(అబ్దుల్లా బిన్ మస్‌ఊద్ (రజి) – ముస్లిం, బుఖారి)*

**సంగ్రహణం :**

1. మానవ ప్రాణాన్ని హతమార్చడం మహాపాపం. దాన్ని అడ్డుకోవడానికి ఇస్లామీయ 'ఖిసాస్' (హత్యాపరిహారం) చట్టం ఎంతో ఉపయోగకరమైనది. ఈ చట్టాన్ని ప్రతి కాలంలోను ప్రపంచంలోని ప్రతి ధర్మం అనుసరించింది.

2. వివాహితులైన పురుషులు లేదా స్త్రీలు వ్యభిచరిస్తే ఇస్లామీయ రాజ్యవ్యవస్థలో వారికి మరణ శిక్ష విధించడం జరుగుతుంది.

3. ఇస్లామీయ రాజ్య వ్యవస్థలో, దేవుని ఏకత్వాన్ని ప్రకటించి, దైవదౌత్యాన్ని బలపరిచే వ్యక్తి ఎట్టి సందర్భంలోనూ ఇస్లాం ధర్మాన్ని విడనాడడాన్ని లేదా దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) తప్ప మరెవరినయినా ఆదర్శప్రవక్తగా ప్రకటించడానికి వీల్లేదు. ఇలాంటి అత్యాచారానికి పాల్పడే వ్యక్తికి ఇస్లామీయ ప్రభుత్వం మరణదండన విధిస్తుంది.

## ప్రగతి, పతనాలకు సంకేతాలు

(۳۱۳) قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ اِذَا کَانَتْ اُمَرَاءُکُمْ
خِیَارَکُمْ وَاَغْنِیَاءُکُمْ سُمَحَاءَکُمْ وَاُمُوْرُکُمْ شُوْرٰی
بَیْنَکُمْ فَظَھْرُ الْاَرْضِ خَیْرٌ لَّکُمْ مِنْ بَطْنِھَا وَاِذَا کَانَتْ
اُمَرَاءُکُمْ شِرَارَکُمْ وَاَغْنِیَاءُکُمْ بُخَلَاءَکُمْ وَاُمُوْرُکُمْ
اِلٰی نِسَاءِکُمْ فَبَطْنُ الْاَرْضِ خَیْرٌ لَّکُمْ مِنْ ظَھْرِھَا۔

(ترمذی عن ابی ہریرہؓ ابواب الفتن)

313. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "మీ పాలకులు సద్వర్తనులై, మీ ధనవంతులు దాతృగుణం కలవారై మీ (వ్యక్తిగత, సామూహిక) వ్యవహారాలు పరస్పర సలహా సంప్రతింపులతో నడుస్తూ ఉంటే మీ కోసం ఈ భూమి వీపు దాని కడుపు కంటే మేలైనది. (అంటే మీరు జీవించి ఉండడం మీ మరణం కంటే మేలైనది). అలాగే మీ పాలకులు దుష్టులై, మీ ధనవంతులు పిసినారులయి మీ వ్యవహారాల పగ్గం మీ స్త్రీల చేతిలోకి వస్తే మీ కోసం ఈ భూమి కడుపు దాని వీపుకంటే మేలైనది. (అంటే మీ మరణం మీ జీవితం కంటే మేలైనది).

*(అబూ హురైరా (రజి) – తిర్మిజీ)*

**సంగ్రహణం :**

అంటే, వ్యక్తిగత, సామూహిక జీవితంలో అల్లాహ్‌కు భయపడి ఆయన ఆదేశాలకు అనుగుణంగా నడిచే నిజాయితీపరులైన సత్పాలకుల చేతిలో అధికారపు పగ్గాలు ఉన్న సమాజమే మేలైన సమాజం అని అర్థం.

ధనవంతులు పుణ్యకార్యాలను ఆచరించడంలో, మంచి పనులను ప్రోత్సహించడంలో, ధర్మాన్ని వ్యాపింపజేయడంలో, నిరుపేదలు, అగత్యపరులు పేదవిద్యార్థులను ఆదుకోవడంలో, కార్మిక కర్షకుల హక్కులను నెరవేర్చడంలో విశాల హృదయంతో వ్యవహరిస్తూ సమాజంలోని సకల వ్యవహారాల్లో ఇంటి నాలుగ్గోడలు మొదలుకుని చట్టసభల వరకు పరస్పరం సలహా సంప్రతింపులతోనే కొనసాగితే అది సత్సమాజమన్నమాట.

అయితే పరిస్థితి దీనికి భిన్నంగా అయినప్పుడు అంటే దైవభీతిలేని, దేవుని ఎదుట ఒకనాడు తమ కర్మలకు జవాబు చెప్పుకోవలసి ఉంది అనే భావన లేని దుష్టులు, దుర్మార్గులయిన పాలకుల చేతిలోనికి అధికారపాశం చేరినప్పుడు, ధనవంతులు, పారిశ్రామిక వేత్తల సంపాదనలోని అధిక భాగం అశ్లీలం, నగ్నత్వం, సిగ్గుమాలిన కార్యకలాపాలకు, మత్తుపదార్థాల సేవనం, జూదం వడ్డీవ్యాపారం లాంటి రుగ్మతలకు ఖర్చు అయినట్లయితే, సదాచార వికాసానికి, ధర్మసంస్థాపనానికి వారు ఒక్క పైసా కూడా ఖర్చు పెట్టడానికి వెనకాడితే,

బలహీనులైన వారసుల వారసత్వపు వాటాలను కొల్లగొట్టే ప్రయత్నం, కర్షకుల హక్కుల్ని కాలరాసే కుట్ర జరుగుతూ ఉంటే సమాజాన్ని భౌతిక పురోభివృద్ధి ఏమాత్రం ఆదుకోజాలదు. అలాగే సామాజిక వ్యవహారాల్లో స్త్రీల జోక్యం పెరిగి సామాజిక జీవితంలోని ప్రతి చిన్నాపెద్దా వ్యవహారంలో వారి సలహాయే చెలామణి అయినప్పుడు సమాజం అధఃపాతాళానికి జారిపోవడం తథ్యం.